# ఉర్దూ సాహిత్య చరిత్ర

మూలము

డాక్టర్ ఎహతెషామ్ హుస్సేన్

అనువాదము

శ్రీ యస్. సదాశివ్, ఎం. ఎ.






ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి
తిలక్ రోడ్, హైదరాబాదు.

# ఉర్దూ సాహిత్య చరిత్ర



మూలము

డాక్టర్ ఎహతెషామ్ హుస్సేన్

అనువాదము

శ్రీ యస్. సదాశివ్, ఎం. ఎ.




ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి
తిలక్ రోడ్, హైదరాబాదు.

# తొలి పలుకు

ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి పక్షాన భారతీయ భాషల సాహిత్య చరిత్రలను వ్రాయించి కొన్ని సంపుటాలుగా ప్రకటించవలెనని నిర్ణయించనైనది. ఇందులో మొదటి సంపుటమున తమిళము, మళయాళము, కర్ణాటకము, మహారాష్ట్ర చరిత్రలు ప్రకటితమైనవి. మొదటి సంపుటమును పత్రికలు, పాఠకులు హర్షించినారు. ఈ వరుసలో ప్రకటితమగుచున్నదీ ఉర్దూ భాషా చరిత్ర.

మనదేశ భాషలలో ఉర్దూకు ప్రత్యేక స్థానము కలదు. హిందూ ముస్లింల సమైక్యమునకు చిహ్నము యీ ఉర్దూ భాష. భారత జాతీయ సమైక్య చిహ్నమే ఉర్దూ భాషా చరిత్ర యని చెప్పినచో అతిశయోక్తి కాజాలదు. ఈ భాషా వికాసానికి హిందువులు ముస్లింలు సన్నిహితముగా పని జేసినారు.

హిందీకి ఉర్దూ భాషలకు యెక్కువ వ్యత్యాసము లేదని మహాత్మాగాంధి మొదలైన దేశనాయకులు పలుమారు ప్రకటించియున్నారు. ఉర్దూసాహిత్య చరిత్రను ప్రత్యేకముగా వెలువరించ వలెనని ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి ఉర్దూ సలహా సంఘము అభిప్రాయపడినది. మొదటి సంపుటములోని సాహిత్య చరిత్రలవలె యీ ఉర్దూ సాహిత్య చరిత్ర స్వతంత్రమైన రచనకాదు. సాహిత్య అకాడమి ఉర్దూ సలహా సంఘము ఒక ప్రామాణికమైన చరిత్రను తెలుగులో పరివర్తనము చేయుట బాగుండ గలదని నిర్ణయించి, డాక్టర్ ఎహతెషామ్ హుసేన్ వ్రాసిన సాహిత్య చరిత్రను ఎన్నుకొని తెనిగింప జేయుట జరిగినది. ఈ గ్రంథము దేవనాగరి లిపిలో ప్రకటితమై సమస్త భారతీయుల ప్రశంసను పొందినది. ఈ ఉత్తమ గ్రంథమును తెలుగులోనికి తీసికొని వచ్చుట మిక్కిలి ఆవశ్యకమని అకాడమి ఉర్దూ సలహా సంఘము నిర్ణయించినది.

ఈ గ్రంథమును ఆంధ్రీకరించిన వారు శ్రీ యస్. సదాశివ్ ఎం. ఏ. గారు. వీరు ఆంధ్ర ప్రదేశ్ విద్యాశాఖలో ఉద్యోగము జేయుచున్నారు. మిక్కిలి శ్రమపడి యీ గ్రంథమును మేము కోరిన వ్యవధిలో వీరు ఆంధ్రీకరించి యిచ్చినారు. మూలమును చక్కగా అనుసరించుటే గాక, తెనుగు నుడికారమును చక్కగా కాపాడి స్వతంత్ర రచన యనిపించునట్లుగా యీ అనువాదము సాగినది. శ్రీ సదాశివ్‌గారికి సాహిత్య అకాడమి పక్షాన ధన్యవాదాలు. ఈ గ్రంథమును ప్రకటించుటలో మాకు తోడ్పడిన అంజుమన్ తరక్కీ ఉర్దూ వారికి, డాక్టర్ ఎహతెషామ్ హుసేన్ గారికి, ఆంధ్రప్రదేశ్ అంజుమన్ తరక్కీ ఉర్దూ కార్యదర్శి మౌల్వీ హబీబుర్రహమాన్‌గారికి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి పక్షాన కృతజ్ఞతానేక వందనములు.

దేవులపల్లి రామానుజరావు,
కార్యదర్శి
ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి.

హైదరాబాదు.

# విషయసూచిక

# ప్రస్తావన

హిందీలో వ్రాయబడిన ఉర్దూ సాహిత్య చరిత్రలను చదివినకొలది పలుమారు నేటి విమర్శనా పద్ధతుల కనుగుణముగా సామాజిక, సాంస్కృతిక, చారిత్రక పరిస్థితులలో సాహిత్యమును పరిశీలించుచు ఒక సంక్షిప్త సాహిత్య చరిత్ర వ్రాయ బడ వలయునను కోరిక కలిగినది. అట్టి పని జరుగుటకు ఆలస్యమైన కొలది అవ రోధములు, లోపములు ఎన్నియున్నను నేనే స్వయముగా అందుకు పూనుకొన దలచితిని. హిందీ పట్ల అభిమానము కలిగియుండుట వేరు, అందు బాధ్యతా యుతమగు ఒక గొప్ప విషయమును గుఱించి రచనచేయుట వేరు అని ఆలోచించితిని. అయినను ఈ పని ఆవశ్యకమైనది కనుక రచనకు కావలసిన రూపురేఖలు ఏర్పరించు కొంటిని. కొన్ని కమ్మలు వ్రాసినంతనే వార్ధా రాష్ట్రభాషా ప్రచారసమితి ఉర్దూ సాహిత్య చరిత్ర సంక్షేపముగా వ్రాయుటకై నన్ను నియోగించెను. సంకోచించుచునే అంగీకరించితిని. ఏమి జరుగగలదని అనుమానించితినో అదియే జరిగినది. నేను ఊహించిన ఇక్కట్టుల కంటె అధికమే ఎదురైనవి. అయినను పని మొదలుపెట్టిన తరువాత కడదాక ముగించుటయే యుక్తమని యెంచితిని. ఇక ఈ రచన ఎట్లున్నదో మీ చేతులందే ఉన్నది.

రాష్ట్రభాషా సమితి సాహిత్య నిర్మాణశాఖ వారు నన్ను విశ్వసించి అతి గూఢమును అతి సామాన్యమును కాని విధముగా మూడు వందల పుటలలో సాహిత్య చరిత్ర వ్రాయుటకై ఆదేశించిరి. దీని హద్దు లేర్పరచుటయే నాకు కష్టమయ్యెను. ఆదర్శ ప్రాయముగా చూడదగిన చరిత్ర ఎట్టిదియు నా దృష్టిలో లేకుండెను. కనుక నేను సమస్త సాహిత్యమును విశేష విమర్శనా పద్ధతుల ననుసరించి కొన్ని అధ్యాయ ములలో విభజించితిని. ఇట్లు చేయుట ఉర్దూ భాషాభివృద్ధిని అర్థము చేసికొనుటకు తోడ్పడునని నా భావము. ఈ గ్రంథములోని వస్తువు కేవలము ఉర్దూ సాహిత్య వేత్తలే ఆనందము పొందదగినట్టి ఉన్నతమైనదియు కాదు. పఠితలకు సరిగా ఉర్దూ సాహిత్య పరిచయమైనను కలిగింపలేనంతటి తేలికైనదియు కాదు. కొలది పుటలలో అధికవిజ్ఞానము నందజేయు ప్రయత్నమే చేయనైనది. ఈ మేరలో సురుచిరము, సుందరము, సరళము అయిన భాషలో అచి తూచినట్లు చరిత్ర వ్రాయుట ఎంత

దుష్కర కార్యమో తత్‌జ్ఞు లెఱుంగఁదగినదే. ఇట్టి పనిలో నే నెంతవఱకు కృత కృత్యుడనైతినో చెప్పలేను. ఈ గ్రంథము వలన విద్వాంసులకు అధికలాభము కలుగకున్నను విద్యార్థులు దీనివలన తప్పక లాభము పొందగలరు.

సాహిత్యము జీవన ప్రతిబింబమనియే ఈ గ్రంథకర్త అభిప్రాయము. దేశపు సామాజిక చైతన్యము మఱియు ఆర్థిక వికాసము ననుసరించియే భావనావధులు నియుక్తములగును. జీవితములోని లౌకికములు, భౌతికములు అగు సాధనలపై అధికారము కలిగియుండుట మఱియు లేక యుండుట అను కారణముల వలననే సంఘము వర్గ విభజితమైనది. వర్గముల నడుమ ఒకప్పుడు గుప్తముగాను, ఒకప్పుడు బాహాటముగాను ఘర్షణ జరుగుచుండును. మంచి సాహిత్యము ఎల్లపుడును జీవితములోని ఉన్నత తత్త్వములను, ఉదారనీతులను బలపరచుచుండును. కనుక ఈ చరిత్రలో సాహిత్యమును జీవనము, సంస్కృతి, రాజనీతి మఱియు ఆదర్శముల భూమిక ననుసరించి పరిశీలించుటకే ప్రయత్నింపబడినది. ఈ విధముగా ఈ సంక్షిప్త చరిత్ర విమర్శనాత్మకరచన యైనది. కాని ఇందు విస్తారముగా వ్రాయుట అసంభవము కనుక, ప్రసిద్ధ రచయితల పరిచయము మాత్రమే చేయబడినది. వారి రచనల సమీక్ష కూడ కొంత కలదు. అందందు ఉదాహరణములు కూడ ఒసగబడినవి. ఇంకను చదువదలచిన వారు కావ్య సంగ్రహములను లేక ఇతర గ్రంథములను చదువవలయును.

ఆధునికకాలపు సాహిత్య విశేషములను వివరించునపుడు నే నెదుర్కొనిన కష్టము లనేకములు. ఏలయన ఈ కాలమున వివిధ సాహిత్య ధారలు ఒకదాని నొకటి ఖండించుచు ప్రవహించుచున్నవి. కాలగమన మతివేగము. ఒకేసారి ఎన్నియో ప్రభావములు పనిచేయుచుండుటయు చూచుచున్నాము. సాహిత్య క్షేత్రము చాల విస్తృతమైనది. సంప్రదాయముల బంధనములు విడిపోవుచున్నవి. జీవనము నూత్న దిశల పురోగమించుచున్న విధముగనే సాహిత్యము కూడ నూత్న రూపములు పొందుచున్నది. కనుక పరిమితమైన ఈ గ్రంథమున ఇదంతయు వివరింప బూనుట బిందువులో నదిని ఇముడ్చుట వంటిది. అయినను ముఖ్య విషయములు ఏవియు విడిపోకుండ చూచితిని. ఈ సందర్భమున ఒక విషయమును సూచించుట అవసరము. అదేమన భారతీయ భాషా సాహిత్యము లన్నియు ఒకే దిశకు పురోగమించుచున్నవి. సాహితీపరు లందఱును తమ ప్రాచీన సంప్రదాయములను సమ్ముఖమున నుంచుకొనియు ఒకే ఆదర్శమును అవలంబించుచున్నారు. మానవ జీవితమును అధికాధిక

ముగా సంపూర్ణ మొనరించుట. అట్లు చేయుటకై ప్రయాసపడుచున్న శక్తులతో సహకరించుటయే ఆ యాదర్శము.

సాహిత్యము వివిధ శాఖలలో విభిన్న రూపములలో ప్రకటమగును. గద్యము మఱియు పద్యము రెండు గొప్ప శాఖలు. ఇవియు ఇతర రూపములలో విభజింపబడినవి. ఇవికాక వివిధ సాహిత్యాందోళనములు బయలుదేరి సాహిత్య క్షేత్రమును విస్తృత మొనర్చుచుండును. ప్రతి రూపమును ప్రతి ఆందోళనమును ఆరంభమునుండి దాని ఉన్నతి లేక పతనము వఱకు ఒక ప్రత్యేక చరిత్ర కలిగియుండును. ఒక విపుల గ్రంథమున ప్రతి దానిని వేరు వేర వర్ణించుట వలనుపడును. కాని ఈ సంక్షిప్త చరిత్రలో అది అసంభవము కనుక సంక్షేపముగా వ్రాయబడినది. ఇంకను చదువదలచిన వారికి ఉర్దూలో అనేక గ్రంథములు లభించును. ఈ చరిత్రను కేవలము పరిచయ మాత్ర మనుకొనియే చదువవలెను. ఉర్దూ సాహిత్య చరిత్రను పరిశీలనాత్మకముగా చదువదలచిన వారికై ఈ గ్రంథాంతమున అట్టి పుస్తకముల సూచిక ఈయబడినది. వానిని చదువుట లాభదాయకము.

ఈ గ్రంథ రచన చేయునప్పుడు నాకు కలిగిన పెద్ద ఇక్కట్టు భాషను గుఱించినది. గంభీర విషయ ప్రధానమగు గ్రంథము వ్రాయుటకు సరిపడునదికాదు నాకుగల సామాన్య హిందీ పరిజ్ఞానము. అందులో సరళ భాష వాడవలయు నన్నది నా అభిమతము. నేను హిందీ, ఉర్దూలను రెండు సాహిత్యములు, ఒకే భాష అని భావింతును. చారిత్రక కారణముల వలన వాని శైలియు అభివృద్ధి పరంపరలును చాల మారిపోయినవి. కనుక ఇప్పుడవి రెండు భాష లనిపించుచున్నవి. చాల మంది ఎఱుకలేనందునను, సంకుచితత్వము వలనను సాధారణముగా ఇవి రెండు భాష లనియే అనుకొనుచున్నారు. మనము మన భావములను ప్రజాసామాన్యమునకు అర్థమగు భాషలో ప్రకటించ లేకపోయినచో అది మన లోపము. ఈ లోపము నాలో కలదని అంగీకరింతును. నా భాష అందందు కఠినమైనది.

వ్రాయుట మొదలిడిన తరువాత కొన్ని పారిభాషిక పదములను ప్రయోగించుట అనివార్యమని తెలిసినది. గజల్, ఖసీదా, తజ్కిరా, షేర్ మొదలగునవి ఇట్టివి. వీనిలో కొన్ని అనువదింపబడ వచ్చును కాని, నేను అట్లు చేయుట అనవసర మనుకొంటిని. అట్లే ఉంచితిని. గ్రంథాంతమున ఇట్టి శబ్దములకు వ్యాఖ్యానము వ్రాసి అనుబంధముగా చేర్చితిని. అది ఉపయోగకరమైనది.

హిందీ పాఠకులలో (అన్యభాషల పాఠకులలోను) ఇతర భాషలను, ముఖ్యముగా ఉర్దూ భాషనుగూర్చి వివిధ ప్రకారముల అపోహలు వ్యాపించియున్నవి. ఈ గ్రంథమున వానిని దూరము చేయుటకై ఎట్టి ప్రయత్నమును చేయలేదు. ఏ రచయిత తప్పులను చూపలేదు. ఎవరి గూర్చియు సంకేతము చేయలేదు. అయినను అచటచట మాటలను శుద్ధరూపమున ప్రకటించు సందర్భమున ఆయా తప్పు లవియే సవరింపబడెను. స్వాతంత్ర్యము, జనతంత్రము గల ఈ యుగమున, సుందరమగు ఈ వైజ్ఞానిక యుగమున గూడ ఎన్నియో కష్టములు మనల నెదుర్కొనుచున్నవి. ఉదార హృదయముతో అసహ్య భావమును, సంకుచితత్వ మును విడిచి ఇతరుల దృక్పథము నర్థము చేసికొనుటకై ప్రయత్నింతుమేని మన చిక్కులు చాలవఱకు అవశ్యము తొలగిపోవును. నేనీ గ్రంథమును ఇట్టి ఆశతోనే వ్రాసినాను. సాంప్రదాయకత మఱియు గ్రుడ్డి దేశ ప్రేమకు ఆఘాతము తగుల వచ్చును. భారతదేశపు ప్రగతి శీల భాషలన్నియు దేశభక్తి మఱియు మానవతకు సంబంధించిన భావములను తమ తమ శైలిలో అతిశయింప జేసినవి. ఉర్దూ వీనిలో దేనికిని తీసిపోవునట్టిది కాదు.

ఈ పుస్తకము క్రీ. శ. 1951 వ సంవత్సరాంతముననే వ్రాయబడినది. కాని ఏదో కారణము వలన ప్రచురణకై ఈయబడలేదు. ఆపైన నేను అమెరికా, ఐరోపా ఖండములకు వెడలితిని. తిరిగి వచ్చిన తరువాత దీని ప్రచురణకై ఆలోచించితిని. అనేకులగు నా మిత్రుల సలహాల ననుసరించి ఉర్దూ భాషా సాహిత్యోన్నతికై యశేష కృషి నొనర్చుచున్న "అంజుమనె - తరక్కీ ఉర్దూ" (హిందీ) కే ఈ నా గ్రంథమును ప్రచురణార్థము ఇచ్చివైచుట యుచితమని తలచితిని. ఉర్దూ హిత సంరక్షకై దీనిని దేవనాగరలిపిలో ప్రకటించుటయు ఆవశ్యకమని నా భావము.

లఖ్నో విశ్వవిద్యాలయము.
1—11—1954.

(Sd.) సయ్యద్ ఎహతెషామ్ హుస్సేన్.

# కృతజ్ఞత

ఉర్దూ సాహిత్యములోని వివిధ ప్రక్రియలను తెలుగు వారికి పరిచయము చేయవలయునన్నది నా చిరకాల వాంఛ. కొన్ని యేండ్లుగా నొక సాహిత్యచరిత్ర వ్రాయదొడగి ఇంతలో దానిని ప్రచురించుట కాని పనియని మానినాను. డా. ఎహతెషామ్ హుస్సేన్‌గారి "ఉర్దూ సాహిత్యకా ఇతిహాస్" అను హిందీ గ్రంథము ననువదించు నవకాశము కలిగించి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు నా చిరకాల వాంఛ నొక రూపమున తీర్చినారు. వారికి నా ధన్యవాదములు.

నా అనువాద విధానమును గుఱించి కొన్నిమాటలు మనవిచేయు టవసరము. ఇందలి భాష వ్యావహారికము కాకున్నను సరళము. యడాగమ నుగామముల పట్టింపు లేదు. అర్ధానుస్వార శకటరేఫముల ఉపయోగములేదు. అర్థసౌలభ్యము కొఱకై కొన్నియెడల ఉత్వసంధిని కూడ పాటించలేదు. వ్యాకరణము సమ్మతింపని ప్రయోగములు కొన్ని భావ సుబోధకతకై స్వేచ్ఛగా జేసినాను. విద్వాంసు లాదరింతురు గాక. మూలగ్రంథమున ఎత్తి వ్రాయబడిన పద్యపాదముల ననువదింపక వదలినాను. అధస్సూచికలో వాని భావమును పొడిమాటలలోనే వివరించినాను. పద్యానువాదము సమర్థులు చేయవలసిన పని.

దూరముననున్న నాకు సరియైన పరిచయమును లేకయే ఈ విధముగా సాహిత్యసేవ చేయు నవకాశము కలిగించిన శ్రీదేవులపల్లి రామానుజరావు (ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ కార్యదర్శులు) గారి ఔదార్యమునకును నాపట్ల వారికిగల అనుగ్రహమునకు సదాకృతజ్ఞుడను. నా యెడల అవ్యాజమైన వాత్సల్యము కలిగి యున్న ప్రొ. హబీబుర్రహమాన్ గారికిని, నా అనువాదములకు తమ సమ్మతిని, ప్రోత్సాహమును ప్రసాదించిన గౌ. డా. బెజవాడ గోపాలరెడ్డిగారికిని అనేక నమస్సు లర్పించెద.

అనువాద సమయమున చిత్తు వ్రాయుటలో నాకు తోడ్పడిన మా పాఠశాల విద్యార్థులు చిరంజీవులు మోహనశాస్త్రి, రాజేశ్వరరావు, మూర్తి అమృత రావులకు నిరంతరము వాగ్దేవతానుగ్రహము కలుగు గాత మని ఆకాంక్షించెద.

ఆదిలాబాద. సదాశివ.

# మొదటి అధ్యాయము

## ఉర్దూ భాషోత్పత్తి : ప్రారంభ వికాసము

భాషాశాస్త్రజ్ఞులు పలువురు భారతదేశమును "భాషల వస్తుప్రదర్శనశాల" అని పేర్కొనిరి. 'గ్రియర్‌సన్' (Grierson) అంచనా ప్రకారము ఈ దేశమున (179) భాషలును (544) కేవల వాగ్రూప భాషలును కలవు. ఈ సంఖ్యలో చిన్న చిన్న ప్రాంతములలో ఉపయోగింపబడు భాషలును, కొందఱచే మాత్రమే మాటలాడబడుచు భాషాచరిత్రలో ప్రాముఖ్యము పొందని భాషలును చేరియున్నవి. దేశోన్నతిలో ప్రభావ సహితముగా పాల్గొనిన ఏదేని భాషయొక్క చరిత్రను వ్రాయదలచినప్పుడు ఆ భాషతో సంపర్కముగల ఇతర భాషలన్నిటిని దృష్టియందుంచుకొనవలసి యుండును.

ఉర్దూభాషా సాహిత్యముల చరిత్ర వ్రాయునపుడు ఉత్తర భారతదేశపు భాషల ఔన్నత్యవికాసములను అరయుట అవసరము. ఏలయన ఈ భాష జన్మించుటకును వికసించుటకును తోడ్పడిన సామాజిక, ఆర్థిక, రాజకీయ, చారిత్రక పరిస్థితులే సాధారణముగా ఇతర భాషలు జన్మించుటకును, వికసించుటకును తోడ్పడినవి. ఒక విధముగా చూచినచో ఉర్దూభాషాచరిత్ర వేయేండ్ల భారతదేశ చరిత్రయే. ఈ వేయేండ్లలో భారతదేశ సమాజము ఎట్టి ఉన్నతిని అవనతిని పొందినదో దాని ప్రభావము ఇంచుమించు అన్ని భాషలపైనను పడినది. చారిత్రకములు, సాంస్కృతికములు నగు పరిస్థితులే ఒక భాషను ముందునకు నడిపి వేఱొక భాషాప్రవాహమును అరికట్టినవి. అట్లగుట వలన పదియవ శతాబ్దాంతముననే నేడు "ఉర్దూ" అను పేర పిలువబడు భాష భారతీయములగు ఆర్యభాషల నడుమ జన్మించుటకు తగిన చారిత్రక పరిస్థితులు సమకూడినవి. ఈ భాష ఎట్లు రూపొందినది? ఎట్లు వికసించినది? దీని నొక క్రొత్త భాష అని ఏ దృష్టితో అనుచున్నాము? భారతదేశ సంస్కృతిలో దీనికి ఎట్టి స్థానము కలదు? అను ఈ విషయములే ఇప్పుడు చూడవలసియున్నవి. ఈ భాషోత్పత్తికి సంబంధించిన విస్తార వర్ణనకాకున్న సంక్షిప్త వర్ణనయైనను దీని సాహిత్య సంప్రదాయములను గ్రహించుటలో తోడ్పడ గలదు.

భారత దేశచరిత్రను పరిశీలించినచో ధార్మిక జీవనము లేదా రాజకీయ జీవనములో ఒక ఆందోళన సంభవించినప్పుడే ఇచటి భాషలలో ప్రబలమగు

పరివర్తనము కలుగుచుండునను విషయము విశదమగును. ఆర్యభాషలు ఈ దేశమున ప్రవేశించుటకు ముందు ద్రావిడభాషా సంస్కృతులు మహోన్నత దశలో నుండెను. అందు ఆస్ట్రిక్ (AUSTRIC) మఱియు ఇతర జాతుల పలుకుబళ్ళను సభ్యతలును కాననగును. ద్రావిడ సంస్కృతి పూర్వ సంస్కృతుల నన్నిటిని తనలో నిముడ్చుకొనెను. దానికి వెలుపల నున్నది అంతగా లెక్కింప దగినదికాదు. ఆర్యులు వచ్చినంత వారి భాషలు ఉత్తర దేశమునను మధ్య భారత దేశమునను గల ప్రాక్తన భాషల స్థానము నాక్రమించెను. ఉత్తర భారత దేశమునుండి "మహెంజోదారో" మఱియు "హరప్పా"ల సభ్యతకు మూలకందమైన భాష లుప్తమైపోవుట ఒక విప్లవాత్మక విశేషము. ఆర్యుల ధార్మిక భావములును సాంస్కృతిక భావములును ద్రావిడుల భావములకు విభిన్నములగుటచే వారు ద్రావిడులతో సంపూర్ణముగా కలిసిపోలేక పోవుటయే ఇందుకు ముఖ్యకారణము. ద్రావిడులు ఆర్య సంస్కృతినుండి చాల చాల గ్రహించినప్పటికిని ఆరంభమున వారు వైదొలగియే ఉండిరి. ద్రావిడ భాషలును సంస్కృతియు ఆర్య భాషా సంస్కృతులపై తమ ప్రభావము చూపలేదని దీని భావము కాదు. ఆ ప్రభావము ఎంత మాత్రము అనునదే చర్చింపదగినది. కాని అట్టి మనోరంజకమగు చర్చ చేయుటకు ఇది సమయముకాదు.

భారతీయభాషా చరిత్రలో ఆర్యుల ఆగమనము వలన మొదటి ప్రముఖ పరివర్తనము సంభవించెను. వీరి ఆగమనానంతరము వైదిక సంస్కృతి మహత్వ ప్రాప్తినొందెను. ఆర్యజాతి హిందూదేశపు సమాజమును వర్ణములలో విభజించెను. అగ్రవర్ణముల వారి భాషకును నిమ్నజాతుల వారు మాటలాడు భాషకును అత్యంతమగు అంతరము ఏర్పడు విధముగా ఈ విభజన జరిగెను. ప్రాచీన సంస్కృత నాటకములలో బ్రాహ్మణులు, రాజులు, వారి మంత్రులు సంస్కృతము మాటలాడగా నిమ్నవర్గము వారును స్త్రీలును ప్రాకృతము మాటలాడునట్లు ప్రదర్శింపబడినది. దీని వలన సంస్కృతముతో పాటు ప్రాకృత భాషయు వ్యవహారమున ఉండెనను సంగతి తెలియును. బ్రాహ్మణసభ్యత ధార్మిక బంధనములలో పడి అభ్యున్నతి నందిన కొలది, భాషను పవిత్రము చేయు తలంపున దానికి వ్యాకరణము శుద్ధోచ్చారణము అను నిబంధనలు అంట గట్టిన కొలది నిమ్న వర్గీయులు దానికి దూరమయిరి. సంస్కృతము నేటికిని మహత్వపూర్ణమగు భారతీయ సాంస్కృతిక భాషయే. జైన బౌద్ధ మతములు జన్మించినప్పుడు సంస్కృతముతో పాటు ప్రాకృతమును అభివృద్ధి చెంది వ్యాపించు అవకాశము కలిగెను. అది భారతీయ భాషా చరిత్రమున రెండవ

ప్రముఖ పరివర్తనము. అదియే భాషలకు సంబంధించిన రెండవ యుగమనియు అనబడును. అప్పుడు సంస్కృత భాషకు గొప్ప ఆఘాతము సంభవించెను.

ధర్మమనగా విశేష సంస్కారముల సంగ్రమని భావించిన బ్రాహ్మణుల అధికారమునకు విరుద్ధముగా ఆర్య ధర్మాంతర్భాగమున అనలెత్తినవే జైన బౌద్ధ ధర్మములు. ధార్మిక రంగమున బౌద్ధ ధర్మము ఒక మహత్తర పరివర్తనమే కాని ఆర్య సంస్కృతియొక్క సామూహిక వికాసమున అదొక క్రొత్త పంథా కాజాలదు. నిమ్న వర్గీయులకు బౌద్ధధర్మము వలన గొప్ప ప్రేరణ లభించెననుటలో సందేహములేదు. అయినను బ్రాహ్మణ ప్రతిష్ఠావలంబితమగు వర్ణవ్యవస్థయొక్క ఆధారము అమాంతము కూలిపోలేదు. ఇతర విషయములను విడిచి భాషా దృష్టితో మనము ఈ ధార్మిక పరివర్తనా ప్రవాహజనితమగు మహాందోళనమునుగూర్చి ఆలోచింపవలయును. బుద్ధుడు తన ధర్మ ప్రచారము ప్రాంతీయ భాషలలో ప్రారంభించెను. అందలి జీవితో ద్దేశములను గమనించి అనేకులు ఆ ధర్మమును స్వీకరించిరి. అప్పుడు వైదిక సంస్కృతిని సంస్కృత భాషను బాగుగా ఎఱిగిన అతని ప్రముఖ శిష్యులు కొందఱు బౌద్ధ ధర్మములను పవిత్రమును సభ్యమును అగు సంస్కృత భాషలో సంగ్రహింప దగిన సమయము ఆసన్నమయినదని అతనికి సూచించిరి. కాని గౌతముడు అందులకు అంగీకరింపడయ్యెను. ఈ సందర్భమున డాక్టర్ సునీతి కుమార్ చటర్జీ వ్రాసిన వాక్యములు స్మృతియందుంచుకొన దగినవి :—

"............But Buddha refused and gave his great Charter to all the languages of man. He recommended that man should study his words, "each in his own language". This gave great impetus to the literary employment of the spoken languages and it was indeed a movement of revolutionery character for the freedom of spirit, the full implication of which was not wholly grasped nor taken advantage of at the time".

( — *Indo-Aryan and Hindi : by Dr. S. K. Chatterji—1942* )

ఇట్లు ప్రాకృత భాషలు అభివృద్ధిగాంచు అవకాశము కలిగెను. భారతీయ భాషల ఈ రెండవ పరివర్తనము క్రీ. పూ. 600 న ప్రారంభమయ్యెను. ఈ యుగమున భారతదేశము నందలి వివిధ ప్రాంతములలో పాలీ, మాగధీ, అర్ధమాగధి,

శౌరసేనీ మఱియు ఇతర భాషలు ప్రేళ్లు తన్ని వ్యాపించ దొడగెను. ఈ రెండవ యుగము సమాప్తము కాకపూర్వమే ప్రాకృతములో సంస్కృత సమశబ్దములు తగ్గి వాని స్థానమున తద్భవశబ్దములు విలసిల్లెను. ఇది ఆర్య భాషలలో మరల కొంత పరివర్తనమే. భాషాశాస్త్రవేత్తలు దీనిని 'అపభ్రంశ యుగ' మందురు. అపభ్రంశ మనగా పరిణామ కాలమున రూపుమారిన భాషా స్వరూపము. అపభ్రంశ పదములు ఎనమిదవ శతాబ్దిలోనే ఉద్భవించినవి. భారతీయమగు ధార్మిక సభ్యత అస్తవ్యస్తమై కేంద్రశక్తి చెదరి చిన్నచిన్న రాజ్యములలో విభక్తమైనప్పుడు భాషలును తత్ప్రభావము పొందినట్లు తోచును. ఆ వఱకు బౌద్ధమత ప్రచారము సన్నగిల్లెను. బ్రాహ్మణులు తమ దార్శనిక తర్కములను పునఃప్రతిష్ఠితములుగా చేయసాగిరి. భాషాతత్త్వవేత్తలు అపభ్రంశమును భారతీయములగు ఆర్య భాషల రెండవ యుగమును మఱియు మూడవ (లేదా ఆధునిక) యుగమును కలుపు కొలికి యనిరి. అపభ్రంశముల పరంపర పదునాల్గవ శతాబ్దము వఱకు సాగినను క్రీ. శ. 1000 నుండియే ఆధునిక భాషల వికాసము ప్రారంభమైనది. ఉర్దూ భాషా సాహిత్యముల చరిత్ర వ్రాయునప్పుడు ఈ యుగమునే దృష్టియందుంచు కొనవలసియుండును.

భారతదేశపు వర్తమానార్య భాషలు అపభ్రంశముల నుండి రూపొందినవని భాషాశాస్త్రవేత్తలు తలంతురు. ఈ పర్యాయము కలిగిన పరివర్తనము సామాజికముగా చారిత్రకముగా మహత్పరివర్తనమే. ఇంతవఱకు కలిగిన భాషా సంబంధములగు రెండు ప్రముఖ పరివర్తనముల వలెనే ఈ ఆందోళనము క్రీ. శ. 1,000 వ సంవత్సర ప్రాంతమున అసంఖ్యాకులగు ముసల్మానులు భారతదేశమునకు వచ్చినంత ప్రారంభమయ్యెను. చాల పూర్వకాలమునుండి అరబ్బులు ఈ దేశమునకు వచ్చుచు పోవుచుండిరి. పదవ శతాబ్దాంతమున వారి రాక చారిత్రక సామాజిక ప్రాముఖ్యము కలది. ముసల్మానులు ఇచటికి రాకున్నను భాషలలో పరివర్తనము జరిగెడిదే కాని, దాని రూపు వేరు విధముగా నుండెడిది. ముసల్మానుల రాక వలన భాషాపరివర్తనము ఉద్ధృతమయ్యెను. వారు మాటలాడు భాషలు ఇచటి భాషలను స్వాభావికముగా ప్రభావితము చేసెను. ఈ పరిస్థితిని బాగుగా గ్రహించుటకు ఇచటి సామాజిక జీవనమును సమగ్రముగా గ్రహించుట అవసరము.

హిందూదేశీయులును బయటినుండి వచ్చిన ముసల్మానులును పరస్పరము కలిసి పోయిన విధముగా రెండు రాష్ట్రములకు లేదా రెండు జాతులకు సంబంధించిన వారు కలిసి పోయినప్పుడు నానా ప్రకారముల పరస్పరము ప్రభావితులగుదురు.

ఆ ప్రభావము వేరుపఱచుటకును సంపూర్ణముగా గ్రహించుటకును వీలు కానిది. వారి వారి రాజకీయ, సామాజిక, ఆర్థిక భావములను వేర్వేరుగను సంయుక్తముగను పరిశీలించుట వలన ఎన్నియో క్లిష్ట సమస్యలు విడిపోవును. మానవుల సామాజిక వ్యవహారములే భాషను జన్మింపజేయునవి. ఆ వ్యవహారములు మారినప్పుడు భాష లోను మార్పు వచ్చును. పెద్దకాలమునుండి ఎట్టి మహత్తర సంఘటనకు లోనుకాని భారత సామాజిక జీవనము ముసల్మానుల రాక వలన క్రొత్తబాట త్రొక్కెను. భాష సామాజిక సాంస్కృతిక జీవన విశ్లేషణ చేయుచు తన వికాస మర్మమును తానే వెల్లడించుకొనును. భాష నిర్జన ప్రదేశమున జన్మింపజాలదు - పెంపొందజాలదు. పూర్వము భారతదేశమున ప్రచారములోనున్న పెక్కు భాషలలో వారి రాక వలన గొప్ప పరివర్తనము కలిగెను. సంగీతము, చిత్రలేఖనము భక్తి మొదలగు వానిలోను ఇట్టి పరివర్తనమే కలిగెను. అది సహజము.

ఐదవ శతాబ్దినుండి ఏడవ శతాబ్ది వఱకు అరబు వర్తకులు మలబారు తీరమునకు వచ్చుచుండిరి. కాని వారి భాష యొక్క ప్రభావము అచటి భాషలపై అంతగా పడలేదు. ఎనమిదవ శతాబ్దారంభమున అరబు ముసల్మానులు సింధూ ప్రాంతమునకు వచ్చిరి. వారును భారతీయ భాషలపై తమ గుఱుతు నిలుప లేక పోయిరి. వీరి తరువాత పదవ శతాబ్దాంతమున ఈరాను (పర్షియా) నుండి వచ్చిన ముసల్మానుల రాక మాత్రము చారిత్రకముగా ప్రాముఖ్యము కలది. రెండు వందల యేండ్లనుండి ఈరానులో నివసించుచున్న ముసల్మానుల సాంస్కృతిక దృక్పథములు నానా ప్రకారములవి. వారిది సామీ (SEMITIC) ధర్మమే. కాని సభ్యతలో 'జోరో-ఆస్ట్రియన్' (ZORO-ASTRIAN) బౌద్ధ, క్రైస్తవ తత్త్వములు గోచరించును. వారిలో అత్యధిక సంఖ్యాకుల భాష పారసీ. అది స్వయముగా ప్రభావవంతమగు ఒక ఆర్య భాష. భారతీయ భాషల వికాస వృత్తాంతమును, ముఖ్యముగా పంజాబు మఱియు మధ్యభారత భాషలకు సంబంధించిన దానిని చదువునప్పుడు పైన ఉల్లేఖింప బడిన అంశములను స్మృతి పథమున ఉంచుకోవలెను. నూత్నములగు హిందూస్థానీ భాషలు ఏ యుగమున వికసించినవో అపుడే సభ్యతలు సమైక్యత చెందినవి. భాషలను సామాజిక రూపమున అధ్యయనము చేయగోరువారు భారతదేశపు సామాజిక పరివర్తనములను, చారిత్రక సంఘటనలను తప్పక పరిశీలించ వలయును.

హర్షవర్ధనుని అనంతరము భారతదేశము చిన్న చిన్న రాజ్యములలో విభక్తమయ్యెను. రాజకీయ సమైక్యతకు అనుకూల పరిస్థితులను ఊహించుటకైనను

వీలుకాని కాలమది. అప్పుడు అనగా క్రీ. శ. 1,000 వ సంవత్సరమున మొహమ్మదీయులు పంజాబులోని అధిక భాగమును ఆక్రమించుకొనిరి. మొహమ్మదుగోరి తన అధికారము నెలకొల్పు వఱకు మహమూదు గజినవీ అచట పరిపాలనము చేసెను. గోరీ కాలమున రాజ్యపు సరిహద్దు పంజాబును దాటి మధ్య భారతము వఱకు వ్యాపించెను. అతని మరణానంతరము అనగా క్రీ. శ. 1206 వ సంవత్సరమున బానిస వంశీయులు తమ రాజ్యము స్థాపించుకొనిరి. ఆ కాలమున మధ్య ఆశియాలో చెంగీజుఖానుని అలజడులకు జడిసి అనేకులు ఈరానీలు భారతదేశమునకు వలస వచ్చిరి. తరువాత ఖిల్జీ రాజ్యము స్థాపింపబడెను. దాని సరిహద్దులు పడమట బంగాళము వఱకును దక్షిణమున కన్యాకుమారి వఱకును వ్యాపించెను. మలిక్కాఫూర్ విజయయాత్రల వలన ఉత్తర దక్షిణములు ఏకమై బాహ్యారూపమున దేశమంతయు ఒక కేంద్ర ప్రభుత్వము క్రింద సంఘటితమయ్యెను. తుగ్గకుల కాలమున మఱచిపోరాని ఒక సంఘటన జరిగెను. మొహమ్మద్ తుగ్లకు దిల్లీనుండి తన రాజధానిని దేవగిరికి మార్చెను. దిల్లీ వాసులందఱను దేవగిరికి తరలించెను. ఆ యాలోచన సరియైనది కాదని ఒక సంవత్సరములోనే మరల తిరిగి పోవునట్లు ఆదేశించెను. అనేకులు తిరిగి వెళ్ళ లేక దక్షిణములోనే స్థిరపడిపోయిరి. ముందు ముందు ఉర్దూ భాషోత్పత్తిని దాని ప్రారంభ వికాసమును సమీక్షించునప్పుడు ఈ సంఘటనయొక్క మహత్వము బోధపడును. దిల్లీ కేంద్ర రాజధానిగా ఎన్నియో రాజవంశముల రాజులు పాలించిరి. సైనికులు, ప్రభుత్వాధికారులు ఇటు అటు పర్యటించుచుండిరి. తుదకు పదునారవ శతాబ్దమున మొగలులు వచ్చిరి. కేంద్ర ప్రభుత్వము దుర్బలమైనంతనే స్వతంత్రించిన రాజ్యము లన్నియు మొగలుల స్వాధీనమయ్యెను. మరల ఒకసారి సబలమగు శాసనము నెలకొనెను. అక్బర్, జహంగీర్ మఱియు షాజహానుల కాలమున జీవన విభాగములన్నిటిలో అసాధారణమగు ఉన్నతి కలిగెను. మొగలు రాజ్య పతన కాలమున మరాఠులును సిఖ్ఖులును బలవంతులైరి. అందఱను మించి ఈస్టిండియా కంపెనీ ఉచ్ఛదశ నందసాగెను.

ఈ చారిత్రక భూమిక వలన ఉర్దూభాషా సాహిత్యముల ఉత్పత్తి చక్కగా బోధపడును. పంజాబులోని గజనవీ ప్రభువుల (175) సంవత్సరముల పరిపాలనలో సాంస్కృతిక ఆదాన ప్రదానములు బాగుగా జరిగెను. మహమూద్ గజినవీలో ఎన్ని లోపములున్నను అతడు విద్యాభిమానము కలవాడు. భారత దేశముతోడి తన సంబంధమును ప్రకటించు కొనుటకుగాను అతడు తన రాజ ముద్రలో కొన్ని

సంస్కృతాక్షరములకు తావొసగెను. బేరూనీ [1] ఆనాటి ప్రసిద్ధ విద్వాంసుడు. భారతీయ ధర్మశాస్త్రము, గణితము, మఱియు సామాజిక సమస్యలను అభిమానించిన ఆ విద్వాంసుడు ఈ కలయికకు సర్వోత్తమస్మృతి చిహ్న ప్రాయుడు. ఆ కాలమున అనేక సంస్కృత గ్రంథములు ఫారసీలోను అరబ్బీలోను అనువదింపబడినట్లు అతడు తెల్పెను. ఆ యుగపు ఫారసీ మహాకవుల రచనలలోను ఒండు రెండు భారతీయభాషల శబ్దములు కాన్పించును. 'ఖ్వాజా మసూద్ సాద్ సల్మాన్' అను నతడు హిందీభాషకు ఆదికవి యని చరిత్రజ్ఞులందఱును అంగీకరించిరి. అతడు తన హిందీ కావ్యసంగ్రహమును సిద్ధపఱచుకొనెను. క్రీ. శ. 1066 వ సంవత్సర ప్రాంతమున ఫారసీ మఱియు అరబీభాషలలో కవిత్వము వ్రాసెను. అతడు లాహోర్ నివాసి. అతని హిందీ కావ్యసంగ్రహమును అమీర్ ఖుస్రూ మఱియు మొహ్మాద్ 'ఔఫీ' పేర్కొని ప్రశంసించిరి. కాని అది నేడు అలభ్యము. హిందూ మహ్మదీయుల సమైక్యత వ్యర్థమైపోక దివ్య రూపమున ప్రకట మగుచుండెననియే దీని సారాంశము. రాజస్థానపు కవులగు 'నరపతి నల్హనుడు'ను 'చంద్ బర్దాయీ'యును ఫారసీ అరబీ శబ్దములను ఉపయోగించిరి. ఢిల్లీనగరము ముసల్మానుల రాజధానియైనంత, ఈ సమైక్యతయొక్క అవశ్యకత ఇతోధికమైనందున, భాషా సమైక్యతయొక్క కేంద్రము పంజాబునుండి ఢిల్లీకి మారి అచటి భాషలను మిశ్రితము చేసెను.

ఒక దేశము ఇంకొక దేశమును జయించినప్పుడు తన భాషను ఆ దేశముపై బలవంతముగా రుద్దక ఆవశ్యక శబ్దములు కొన్ని ఆ భాషలో చేర్చి స్వయముగా ఆ దేశ భాషనే మాటలాడుననను విషయము భాషాభిజ్ఞులు గుఱుతింప దగినది. ఇచటికి వచ్చిన ముసల్మానులు తుర్కీ, అరబీ, ఫారసీ మఱియు ఇతర మధ్య ఆశియా భాషలను మాటలాడు వారే అయినను ఇచటి సాహిత్యావసరమునను సాంస్కృతి కావసరమునను ఫారసీనే ఉపయోగించిరి. ఇచటికి వచ్చినప్పుడు వారికి రూపము మారినను మూలము మారని ఆర్య భాషలతోనే అవసరము కలిగెను. హిందువుల యొక్కయు ముసల్మానులయొక్కయు ధార్మిక భావములు భిన్నమైనవే. అయినను రాజ సింహాసనాధిష్ఠితులగు ముసల్మాను ప్రభువులు ముసల్మానులగుట కంటె అధికముగా ప్రభువులగు భావమునే కలిగియుండిరి. వారు తమ రాజ్యస్థాపనకును విస్తృతికిని కేవలము హిందువులతోనేకాక ముసల్మానులతోను యుద్ధములుచేయవలసిన వారై

1. అబూరెహాన్ బేరూనీ (క్రీ. శ. 970-1038) గొప్ప విద్వాంసుడు. భారత దేశమును గూర్చిన అతని గ్రంథము "కితాబుల్ - హింద్" సుప్రసిద్ధమైనది.

రనుట త్రోసిపై వరాని సత్యము. చరిత్ర చదివిన వారందఱు గజనవీల నాటినుండి మొగలుల చివరికాలము వఱకు ఇట్లే జరిగి యుండుటను అంగీకరింప గలరు. ముసల్మాను ప్రభువులు ప్రపంచములోని ఇతర ప్రభువులవలె వైభవోపేతముగ రాజ్య పాలనము చేయుటయే తమ కర్తవ్యమని భావించువారు. వారు సామ్రాజ్య వాదుల శ్రేణికి రాజస సంప్రదాయమునకు సంబంధించిన వారగుట తదనుగుణ ముగా నిరాటంకముగా రాజ్యమేలుటయే తమ లక్ష్యమని తలంచువారు. సామాజికము లును తదితరములును అగు ఆటంకములు తొలగించుకొనునంతలోనే ధార్మికములగు ఆటంకములను తొలగించుకొన గలవారు. ముసల్మాను ప్రభువులు ఇచటి వారే అయి పోయిరి. ఇచటి మట్టిలో జన్మించి, ఇచటి నేలపై పవళించి ఇచటి వారిలో కలిసి పోవ కాంక్షించిరి. ఇచటి ఆచార వ్యవహారములను చాల వఱకు స్వీకరించి భారతీయ జీవనములోనే ఆనందము పొంద సాగిరి. వారు ఇచటి నుండి ఏమి గ్రహించిరో ఇచటి సంస్కృతికి ఏమి యిచ్చిరో దానిని వివరించుటకు ఇది అదనుగాదు.

కలహములు, ఆక్రమణలు, సంగ్రామములు ఉత్పన్నము చేసిన అసహ్యా భావలహరి ఉవ్వెత్తుగా లేచెను. అంత హిందూ–ముసల్మానుల హృదయములలో సౌహార్ద్ర ప్రేమల ప్రవాహములు వెడలి కళలు, మతము మొదలగు సమస్త విష యములను తమలో చేర్చికొని ఇరుతెగల వారి భావములను, ఆలోచనలను, కల్పన లను పరస్పరము సమీపస్థము లొనర్చెను. భక్తిని ఒక లోక ప్రియమైనది గాను ఆనాటి సమస్యల దృష్టిలో ప్రగతి శీలాందోళనముగాను రూపొందించుటలో హిందూ భక్తుల వలెనే ముసల్మాను భక్తులును తోడ్పడిరి. ఆచారవిచారముల అవధులిట్లు సమీపస్థములైనప్పుడు సంయుక్త సామాజిక జీవన చిహ్నమగు ఒక భాషోత్పత్తిని సంభావించుట సత్య దూరము కాదు. అట్టి సామాజిక జీవన వికాసమునకు ఆ భాష వికసించి ఉన్నతి చెందుట ఆవశ్యకము.

వర్తమానార్య భాషలన్నియు క్రీ. శ. 1,000 ప్రాంతముననే రూపొందిన వని భాషా శాస్త్రజ్ఞులందఱును భావించుచున్నారు. అవన్నియు, ముఖ్యముగా మధ్య భారతము మఱియు పంజాబునకు సంబంధించిన భాషలు రూపొందుటకు ఫారసీ భాషయు పరస్పర సంపర్కమును చాల తోడ్పడినవనియు వారు తలంచు చున్నారు. ప్రాకృత భాషల రెండవ యుగాంతమున అపభ్రంశ వ్యవహారము ప్రారంభమై శౌరసేనీ ప్రాకృత క్షేత్రమున శౌరసేనీ అపభ్రంశమే మాటలాడ బడుచుండెనను సంగతిపైన తెలిసికొనియున్నాము. దాని క్షేత్రము పంజాబు, ఢిల్లీ మఱియు ఉత్తర ప్రదేశపు పశ్చిమ భాగములలో వ్యాపించియుండె ననవచ్చును. ముసల్మానులు మొట్ట

మొదలు పంజాబులో నివసించినందున అచటి భాషనే ఉపయోగించియుందురు. అచటనే ఫారసీ, అరబీ మఱియు భారతీయ భాషలు తొలుదొల్త సమ్మేళనము చెందియుండును. నేడు ఖ్వాజా మసూద్ సాద్ సల్మాన్ హిందీ రచనలు లభించియున్న ఆనాటి సమ్మేళన విధానమును గుఱ్ఱించ గలిగి యుందుము. సుమారు (250) సంవత్సరములు గడచిన తరువాత దిల్లీలో అమీర్ ఖుస్రూ జన్మించెను. సూఫీ మహాత్ములు కొందఱు భారతీయ భాషలలో భక్తి ప్రేమల సందేశము విన్పించిరి. అందలి కొన్ని భాగములు ప్రాచీన గ్రంథములలో ఇప్పటికిని లభించును. శాస్త్రీయముగా ఉర్దూ భాష జన్మ వృత్తాంతము వ్రాయదలచినచో శౌరసేనీ ప్రాకృత క్షేత్రమున ఉత్పన్నములై ఆధునికములగు ఆర్య భాషలలో తరసి అధ్యయనము చేయవలసి యుండును. పంజాబు మఱియు దిల్లీ ఉర్దూ జన్మస్థానములు. దిల్లీ ఉత్తర భారత దేశపు మధ్య భాగమున, శౌరసేనీ ప్రాకృతము నుండి పుట్టిన అనేక భాషలు కలియు కూడలిలో ఉన్నది. ఈ భాషలు వేరయినను వాని ఆధారమొక్కటే. దిల్లీకి పశ్చిమమున పంజాబీభాషాక్షేత్రము, ఆగ్నేయమున బ్రజభాష, ఒక వైపు 'హరియానీ' మఱియు 'బాఁగురూ' భాషలు, రెండవ వైపు 'ఖడీబోలీ' ఉండెను. రెండు మూడు వందల యేండ్ల వఱకు ఈ భాషలలో చెప్పుకోదగిన సాహిత్యము జన్మింప లేదు కాని ఇవి దృఢపడినవి. ఆ పైన కృష్ణభక్తి ప్రభావమున కవులు తమ కళా ప్రదర్శనముచేయ సాగిరి. రాజస్థానీలోను తత్సంబంధ వాగ్రూప భాషలలోను కొంత కొంత సాహిత్యము సృష్టింపబడుచుండెను. కాని 'ఖడీబోలీ' కేవలము వ్యవహార భాషగానే నిలిచిపోయెను. పఠన పాఠనముల యందు అభిరుచిగల ఉన్నతశ్రేణికి చెందినవారు ఫారసీ ద్వారముననే వ్యవహారములు జరుపుకొనుచుండుట దీనికి ముఖ్య కారణము. కేంద్రములో ఇట్లగుట సహజమే. లాక్షణిక (Classical) భాషలు ఎప్పుడును ప్రాకృత భాషల అభివృద్ధిని ఆటంక పఱచుచుండును. ఫారసీ అస్తిత్వము వలన దిల్లీ పరిసరములనున్న భాషలకు ఇట్టి గతియే పట్టినది. అయినను దిల్లీ వీధులలో మాటలాడబడు 'ఖడీబోలీ' భాషలో రాజకీయ సమైక్యతకు ఆవశ్యకమగు అరబీ ఫారసీ పదముల ప్రవేశము కలిగెను. ఇట్లు పరివర్తనము చెందిన 'ఖడీబోలీ' నుండి 'హిందూస్థానీ' అనబడు భాష ఏర్పడెను. ఈ హిందూస్థానీయొక్క సాహిత్యరూపములు రెండు విధములైనవి. ఒకటి అరబీ ఫారసీ పదముల ఆధిక్యము గలిగి ఫారసీ లిపిలో వ్రాయబడు ఉర్దూ. రెండవది సంస్కృత శబ్దములు అధికముగా గలిగి దేవనాగరి లిపిలో వ్రాయబడు హిందీ. ఖడీబోలీయొక్క ఈ ఆకృతి తొలుత ఉర్దూ రూపముననే వికసించినదను సంగతి మఱవరానిది. హిందూస్థానీ భాషను సాహిత్యమునకై ఉపయోగింప దలచినవారు

ఉర్దూనే స్వీకరించిరను విషయమును మఱవరానిది. దీనివలన శౌరసేనీ అపభ్రంశ ములనుండి వికాసము పొందిన భాషలలో ఉర్దూ ఒకటని సిద్ధాంతీకరింపబడినది. కనుకనే ఉర్దూ, హరియానీ మఱియు పంజాబీ భాషల వ్యాకరణములో అంతగా భేదము లేదు. ఎందఱో విద్వాంసులు భాషా విజ్ఞానమునకు సంబంధించిన ఈ సిద్ధాంత మును అర్థము చేసుకొనుటలో ఎంతటి పొరపాటు చేసిరో ముందు ముందు తెలిసికో గలము.

క్రీ. శ. 1,000. తరువాత భారతదేశమున ఎన్నియో నూతన భాషలు కనుపించును. ఈ దేశమున జన్మించి ఇచటి ప్రజలలో ఏకమైన మొహమ్మదీయుల మాతృభాష ఫారసీ కాజాలదని రెండు వందల సంవత్సరములు గడచిన తరువాత మనము సులువుగా గ్రహించగలము. అయినను మత సంబంధములగు కారణముల వలనను సాంస్కృతిక కారణముల వలనను ఫారసీ అరబీ శబ్దముల ప్రయోగము అనివార్యమయి యుండును. వారు ఏ క్షేత్రమున నివసించిన అచటి భాషనే వాడుచుండి యుందురు. నిజమునకు భాష ఎట్టి మతమునకు సంబంధించినది కాదు. సామాజికము లగు అవసరములే దానిని ప్రచలితము చేయును. భారతదేశములోని వివిధ భాషల చరిత్రను తిలకింతుమేని భాషోపయోగ విషయమున హిందూ మహమ్మదీయుల తారతమ్యము లేకుండెనని తెలియును. ముసల్మానులు బ్రజభాషలోను అవధీలోను హిందువులవలెనే రచనలుచేసిరి. ఈ సందర్భమున 'కుతుబన్', రస్‌ఖాన్, జాయెసీ మఱియు రహీముల పేర్లు తులసీదాసు, సూరదాసు మఱియు మీరాబాయీల పేర్లవలె సమానాదరముతో గ్రహింపబడును. ఉర్దూ సాహిత్య చరిత్రను ఈ దృష్టితోనే చదువ వలెను. లేనిచో దాని సాంస్కృతిక మహత్త్వము గోచరము కాదు.

ఉర్దూ భాషోత్పత్తిని గూర్చి హిందీ రచయితలు అనేకులు అతి ప్రామా దికములగు అభిప్రాయములు వెలిబుచ్చినారు. ఉర్దూ రచయితలును పెద్ద పెద్ద పొర పాట్లే చేసినారు. వానిని ఇచట పరిశీలించుట కాని సమాలోచించుట కాని వలను కాదు–ఈ మాత్రము తెల్పుట ఆవశ్యకము. ఉర్దూ విదేశీ భాషకాదు ; అది సింధులో జన్మింప లేదు. దక్షిణ భారతదేశము [1] లోను జన్మింపలేదు. పంజాబీ [2] నుండి కాని,

---

1. ఇప్పుడిట్టి భావము నెవరును వెల్లడించుట లేదు. 15, 20 సంవత్సరములకు పూర్వము అనేక రచయిత లీ భావమునే వెల్లడించుచుండిరి.

2. చూడుడు. "పంజాబ్‌మే ఉర్దూ," అను గ్రంథము. రచయిత : మహమూద్‌షీరానీ.

బ్రిజ భాష[1] నుండి కాని పుట్టినది కాదు. పైన చెప్పబడినట్లు దిల్లీ నలువైపుల మాటలాడబడు భాషలలో ఫారసీ అరబీ పదములు కలియుట వలన, 'ఖడీబోలీ' అనబడు పశ్చిమ హిందీ భాషలో రూపు గ్రహించుట వలన ఒక క్రొత్తభాష వికసించెను. తొలుదొల్త దానిపై పంజాబీ ప్రభావము అధికముగా ఉండును. రాను రాను 'ఖడీ బోలీ'యే ఉర్దూ రూపమున వికసించెను.[2]

ఉర్దూ సాహిత్యపు ప్రారంభ చిహ్నమును పరిశోధించుటకు ముందు ప్రాచీన చరిత్రలో అది ఏ యే పేర్లతో పిలువబడుచుండెనో తెలిసికొనుట అవసరము. ఏలయన దీని ప్రభావము సాహిత్యచరిత్రపై పడును. ప్రారంభమున ఫారసీలో భారతదేశ చరిత్ర వ్రాసిన వారును, యాత్రార్థము ఈ దేశమునకువచ్చి తమయాత్రా విశేషములు వ్రాసికొనిన వారును సాధారణముగా ఇచటి భాషను "జబానె-హిందీ", "హిందీ" లేదా "హిందుయీ" అనియే పేర్కొనిరి. వీరు పంజాబు గుజరాతు మఱియు ఉత్తర భారతమున మాత్రమే పర్యటించిన వారు. కనుక అచటి భాషల కొఱకే పై శబ్దములు వాడియుందురు. అమీర్ ఖుస్రూ భారతీయ భాషలను వర్ణించు సందర్భమున "హిందీ" మఱియు "హిందుయీ" కాక "జబానె-దహిలీ" అని కూడ వ్రాసెను. మొహమ్మద్ తుగ్లకు మఱియు ఫీరోజు తుగ్లకుల రాజ్యకాలమున వ్రాయబడినచరిత్ర గ్రంథములలో ఉత్తర భారతపు వ్యావహారిక భాష "హిందుయీ" అనియే పేర్కొనబడెను. పదునాల్గు, పదునేనవ శతాబ్దములలో దక్షిణ భారతములోని భాష "జబానె-హిందూస్థాన్" "హిందీ" లేదా "హిందూస్థానీ" అనియే వ్యవహరింపబడెను. అప్పుడప్పుడు దానినే "దకనీ" లేదా "దఖనీ" అనియు అనుచుండిరి. 16వ శతాబ్దిలో 'అబుల్ ఫజల్' తన సుప్రసిద్ధ రచన "ఆయీనె-అక్బరీ" అను గ్రంథమున అన్ని ప్రాంతముల భాషలను వర్ణించు సందర్భమున "హిందుయీ" శబ్దమునే ప్రయోగించెను. గుజరాతులో "హిందీ" "హిందుయీ" మఱియు "గుజరీ" అను వ్యవహారములుండెను. దరిదాపుల 18వ శతాబ్దముదాక ఈ భాషను ఉర్దూ అని సంబోధించినట్లు లేదు. దానిని "రేఖ్తా" లేదా "హిందీ" అనియే కవులును వాకొనిరి.

1. చూ. "ఆబె-హయాత్", రచయిత: మోలానా మొహమ్మద్ హుస్సేన్ ఆజాద్.

2. ఈ విషయమును గూర్చి చాల వ్రాయబడినది. ఏ తద్గ్రంథ కర్తయు "హిందూస్థానీ లిసానియాత్ కాఖాకా" అను పుస్తకము వ్రాసెను.

"రేఖ్తా" అనగా వివిధ రాగ సమ్మేళనమును సూచించు సంగీత పారిభాషిక పదము. ఈ పదమును అధికముగా పద్యము కొఱకే వాడిరి. గద్యమును హిందీ అనియే అనిరి. అట్లే వ్రాసిరి. ఈ విధముగా ఉర్దూకు కల పేర్లు ఎన్నియో లభించును. అందు కొన్ని ప్రత్యేక ప్రాంతమున వ్యవహారములో నుండినవి. కొన్ని ప్రత్యేక కాలమున నుండినవి. మొగలులు ఔన్నత్యదశలో ఉన్న కాలము మహాలు (అంతఃపురము) మఱియు సైన్యమునకు సంబంధించిన బాజారులుండెను. అచట కలగా పులగముగా నున్న భాషమాటలాడబడుచుండెను. దానినే "జబానె- ఉర్దూ" లేక "జబానె-ఉర్దూయె-మొఅల్లా" అని వ్యవహరించుచుండిరి. 19 వ శతాబ్దాంతమున "ఉర్దూ" అను శబ్దము భాషార్థమున వాడబడెను. ఆ సమయమునుండియే ఐరోపీయ రచయితలు దానిని "హిందూస్థానీ" అనిరి.[1]

12 వ శతాబ్దమున ఖ్వాజామసూద్ హిందీలో వ్రాసిన కావ్యసంకలనము నేడు అలభ్యమని ఈవఱకే సూచింపబడినది. ఇంక ముందునకు చూచిన సూఫీ ఫకీరులు 12 మఱియు 13 వ శతాబ్దములలో ప్రచారము చేయుచు కాన్పింతురు. వారు సామాన్య జనులతో ఫారసీ అరబ్బీలలో కాక అందఱకు అర్థమగు ఏదో ఒక భాషలో మాటలాడుచుండిరను విషయము నిస్సంశయముగా అంగీకరింప వచ్చును. మతము మఱియు భక్తికి సంబంధించిన గూఢ విచారములను గంభీర భావములను సరళశైలిలో ప్రబోధించుటకు అనువైనట్టి సుసంస్కృతమగు భాష సిద్ధమై లేకుండెననుటయు నిర్వివాదము కనుక వారు మార్గాంతరము లేక వ్యవహార భాషలలో ఎన్నియో అరబీ ఫారసీ పదములను కలుపవలసిన వారై యుందురు. అట్టి అనేక వాక్యములును కవితలును లభించుచున్నవి. వాని వలన అప్పుడే రూపొందుచున్న ఉర్దూ యొక్క స్వరూపమును ఊహింప వచ్చును. ఈ సందర్భమున మొట్టమొదట పేర్కొనదగినవాడు 'బాబాఫరీద్ శకర్‌గంజ్' అతనివని చెప్పబడు దోహాలలో ఎన్నియో అతనివి కావని భాషాతత్త్వ వేత్తలు వాదింతురు. అయినను ప్రాచీన గ్రంథములలో అతని పద్యములును అతనిని గూర్చిన ఉదంతములు ఎన్నోని లభించును. ఈ విధముగనే షేఖ్‌హమీదుద్దీన్ నాగోరీ (నిర్యాణము క్రీ. శ. 1274) షేఖ్‌షర్ఫుద్దీన్‌బూ అలీ ఖలందర్ (ని. క్రీ. శ. 1323) అమీర్ ఖుస్రూ (ని. క్రీ. శ. 1324) షేఖ్‌సిరాజుద్దీన్ (ని. క్రీ. శ. 1356) షేఖ్ షర్ఫుద్దీన్ మనేరీ (ని. క్రీ. శ.

1. ఈ గ్రంథమున భ్రాంతి కలుగకుండుటకై "ఉర్దూ" అను శబ్దమే ఉపయోగింతుము.

1370) మఖ్దూమ్ అష్రఫ్ జహాంగీర్ (ని. క్రీ. శ. 1355) షేఖ్ అబ్దుల్ హక్ రోదోల్వీ (ని. క్రీ.శ. 1433) హజ్రత్‌గేసూదరాజ్ (ని. క్రీ. శ. 1421) సయ్యద్ మొహమ్మద్ జోన్పూరీ (ని. క్రీ. శ. 1504) షేఖ్‌బవుద్దీన్ బాజన్ (ని. క్రీ. శ. 1506) షాహ హాతిమ్ అల్వీ (ని. క్రీ. శ. 1646) మొదలగు వారి 'పదములు' మఱియు దోహరాల వలన 13 వ శతాబ్దమునుండి ఫారసీ అరబీ శబ్దముల సమ్మే శనముచేసి సూఫీ ఫకీరులు ప్రచారార్థము ఉపయోగించునట్టిదియు, జన సామాన్యము నకు అర్థమగు నట్టిదియు అగు ఒక భాష రూపొందు చుండెనని తెలియును.

పైన పేర్కొన బడిన వారిలో సాహిత్యేతిహాస దృష్టితో 'అమీర్ ఖుస్రూ' మఱియు 'గేసూదరాజ్[1]' ముఖ్యులు. అమీర్ ఖుస్రూ ఫారసీ మహాకవి. ఈరాన్‌లోను భారతదేశములోను సమాన గౌరవాదరములకు పాత్రమైన అతని అనేక రచనలు లభ్యములు. అతని రచనలలో ఇచటి పండుగలు, పంటలు పుష్ప ఫలజాతులు మొదలగు వాని వర్ణన కలదు. ఇచటి వాతావరణ సౌందర్యము మఱియు జీవితము యొక్క వివిధ రూపముల ప్రశంస కలదు. ఇచటి సంగీత కళలో అతడు నిపుణుడే కాక స్వయముగా అందు కొంత చేర్చెను. అతడు ఏక కాలమున అమీ రును ఫకీరుకూడను. రాజదర్బారులలో ప్రవేశము కలవాడు. అట్లే సామాన్య జనుల సమీపవర్తి. కనుక అతడు ఫారసీలోనే కాక ప్రజావాణిలో ఎన్నియో కవితలు, దోహాలు, పొడుపు సమస్యలు, ముకరణీలు రచించెను. అతనివని చెప్ప బడు రచనలన్నియు అతనివి కావనుటలో సందియము లేదు. కాని అతనివిగా తోచిన వానినెల్ల అధ్యయనము చేసినచో, అతడు ఖడీబోలీ, బ్రజ భాషలను మఱియు ఆ రెంటి మిశ్రమమును వాడినట్లు బోధపడును. గీతముల కొఱకు సాధారణముగా బ్రజభాషనే ఉపయోగించెను. అతని పేర "ఖాలిఖ్‌బారీ" అను ఒక పద్యమాలిక కలదు. అది అతని కృతియా కాదా అను విషయమున విద్వాంసులకు అభిప్రాయ భేదము కలదు. ఇపుడు ఉపలబ్ధమగు "ఖాలిఖ్‌బారీ" లో తరువాత చాల భాగము ప్రక్షిప్తమగుట వలన ఖుస్రూ రచన అందేయెందో లీనమై యున్నదనుట వాస్తవము. 'ఖాలిఖ్‌బారీ' లో ప్రచా రమునందున్న అరబీ ఫారసీ శబ్దముల హిందీ పర్యాయపదములు పద్యరూపమున కూర్చబడినవి. మధ్య ఆశియాలోని చెంగిజ్‌ఖాన్ మఱియు తాతారీ దోపిడిగాళ్ల అలజడులకు వెఱచి ఎందఱో ఈరానీ (పర్షియా) విద్వాంసులును వర్తకులును భారత

1. గేసూదరాజ్‌ను గూర్చి రెండవ అధ్యాయమున ఉల్లేఖింపబడును.

దేశమునకు వచ్చి స్థిరనివాసము లేర్పఱచుకొనిరి. ఇచటి శబ్దజాలమును, నానుళ్లను పలుకుబళ్లను గ్రహించుట వారికి ఆవశ్యకమై యుండును. అట్టివారి సౌలభ్యము కొఱకు 'అమీర్ ఖుస్రూ' ఇట్టి పద్యాత్మక శబ్దకోశమును సంతరించియుండుననుటలో ఆశ్చర్యములేదు. ఖాలిఖ్ బారీ అమీర్ ఖుస్రూ రచన కాదని గట్టిగా చెప్పలేము.

ఖుస్రూ కవితల ఉదాహరణలు కొన్ని :—

గోరీ సోవై సేజ్ పర్ - ఔర్ ముఖ్ పర్ డారే కేస్
చల్ ఖుస్రూ ఘర్ ఆప్నే - రైన్ భయీ సబ్ దేస్.

* * * * *

"జబ్ యార్ దేఖానయన్ భర్ - దిల్ కీ గయీ చింత ఉతర్
ఐసా నహీ కోయీ అజబ్ - రాఖే ఉసే సమ్ఝాయెకర్,
తూతో హమారా యార్ హై - తుఝ్ పర్ హమారా ప్యార్ హై
తుఝ్ దోస్తీ బిస్యార్ హై - ఇక్ షబ్ మిలో తుమ్ ఆయెకర్,
ఖుస్రూ కహే బాతేఁ గజబ్ - దిల్మేన లావే కుఛ్ అజబ్
ఖుద్రత్ ఖుదాకీ హై అజబ్ - జబ్ జీల్ దియా గిల్ లాయెకర్. 2

* * * * *

జెహాలె మిస్కీఁ మకున్ తగాఫుల్ -
దురాయె నైనా బనాయె బతియాఁ
కి, తాబె హిజ్రాఁ నదారమ్, ఐజాఁ -
నలీహ్యే కాహే లగాయె ఛతియాఁ

1. సుందరి ముఖము మీద శిరోజములు కప్పికొని శయ్యపై నిదురించుచున్నది.
ఖుస్రూ ! దేశమంతట రాత్రి వ్యాపించినది. ఇక ఇంటికి పద.

2 ప్రియతమను చూచినంత మదిలోని దిగులు తొలగిపోయినది. ఆమెను అనునయించి నిలుపగల మహనీయుడెవడును లేడు. నీవు నా ప్రియతమవు. నీ యెడ నా ప్రేమకలదు. నీ తోడి నా చెలిమి అత్యంతము. ఒక రాత్రమున వచ్చి కలియుము. ఖుస్రూ మాటలు వింతయయినవి, మనసులో ఆశ్చర్యపడవలదు. మృత్తికలో ప్రాణము పోసిన భగవత్సృష్టి విచిత్రమైనది.

షబానె హిజ్రాఁ దరాజ్ చూఁ జు -
లోఁ-రోజె వస్లత్ చుఁ ఉమ్రెకోతాః
సఖీ ! పియాకో జోమైనా దేఖాఁ -
తోకైసె కాటూఁ అంధేరీ రతియాఁ
చుఁ షమయె సోజాఁ, చుఁ జఱ్ఱ హైరాఁ -
జెమెహరెఅఁ మహాబగష్తమ్ ఆఖిర్-
ననీంద్ నైనాఁ, న అంగ్ చైనాఁ, -
నఆప్ ఆవేఁ, నభేజే పతియాఁ. 3

*　　*　　*　　*　　*

అమీర్ ఖుస్రూ పొడుపు పద్యములును భాషా శాస్త్ర దృష్టితో ప్రాముఖ్యము కలవే. కొన్ని చూడుడు:—

1. బాలా థాజబ్ మఁకో భాయా.
బడా హువా కుఛ్ కామ్ న ఆయా.
ఖుస్రూ క హ దియా ఉస్కా నాఁవ్.
బూఝై నహీంతో ఛోడో గాంవ్. (దీపము)

*　　*　　*　　*　　*

---

3. ముఖము త్రిప్పికొని అనవసరపు మాటలాడి ఈ దీనుని స్థితిని అలక్ష్యము చేయకుము- ఓ ప్రియా ! విరహబాధ సహింపలేను. -నన్నేల కౌగిలించుకొనవు ? విరహనిశి నీ శిరోజ ములవలె దీర్ఘమైనది. సంయోగ దివసము జీవితము వలె లఘువైనది. సఖీ ! ప్రియుని చూడనిదే ఈ చీకటి రేయి నెట్లు గడుపుదును ? ఆ చంద్రుని ప్రేమలో జ్వలించి తుదకు దీపశిఖవలె కాలుచు కణమువలె సంభ్రమోద్విగ్ననైయుంటిని, కనులకు నిద్రరాదు. తనువునకు నెమ్మదిలేదు- తానురాడు- పత్రమైనను పంపడు.

1. బాల్యమున అది మనోహరమైనది. పెఱిగిన పిదప ఎందుకును పనికిరాలేదు. (ఖుస్రూ అన్నాడు) దానిపేరు ఊహించుడు - లేదా ఊరు విడిచి పొండు. (దీపము)

2. ఏక్ థాల్ మోతీసే భరా,
సబ్‌కే సర్ పర్ ఔంథా ధరా,
చారోం ఓర్ వో థాల్ ఫిరై,
మోతీ ఉస్‌సే ఏక్ న గిరై. (ఆకాశము)

* * * * *

ఖుస్రూ రచించిన గ్రంథములెన్నియో నిశ్చయముగా చెప్పలేము. కాని దిల్లీ పరిసరములలో మాటలాడబడు భాషలోనే కవిత్వము వ్రాసెనని చెప్పవచ్చును. అతడు ఒక ఫారసీ పద్యమున ఇట్లనెను :—

''చు మన్ తూతియే హిందమ్, అర్ రాస్త్ పుర్సీ
జెమన్ హిందు యీ పుర్స్, తానగ్జ్ గోయమ్''

(వాస్తవముగా నేను భారతీయ శుకమను - నన్నేదయిన అడుగదలిచిన 'హిందుయీ' లో అడుగుడు. అందు మధురముగా మాటలాడ గలను.)

అమీర్ ఖుస్రూ ఏ భాషను 'హిందుయీ' అని పేర్కొనెనో నిజమునకు దానినుండియే హిందీ భాషా చరిత్ర ప్రారంభింప వచ్చును. భాషకు ఏ మతమును ఉండదనియు అది కేవలము సామాజిక జీవనాధారమున నిర్మితమగుననియు పైన చదివియున్నాము. వివిధ భాషలు మాటలాడు వారు ఒకరి కొకరు దగ్గఱగా వచ్చినప్పుడు శబ్దముల ఆదాన ప్రదానము ఆవశ్యకమగును. చంద్ బర్దాయీ తన 'పృథ్వీరాజ్ రాసో' లో ఫారసీ అరబీ శబ్దము లుపయోగించినట్లే ఫారసీ కవులు తమ కావ్యములలో ఇచటి శబ్దములుపయోగించిరి. చంద్ బర్దాయీ ఉపయోగించిన శబ్దములను గూర్చి వితర్కించినచో అందలి అధిక శబ్దములు సామాజిక మహత్వము కలవనియే స్పష్టమగును.

ఖిల్జీలు మఱియు తుగ్లకుల యుగమే అమీర్ ఖుస్రూ యుగము. ఫిరోజ్ తుగ్లకు కాలమున ఫారసీలో వ్రాయబడిన చరిత్ర గ్రంథములందు ఠగ్, లౌండీ,

---

2. ముత్యములతో నిండిన ఒక పళ్లెరము,
అందఱ తలలపైన బోర్లించి ఉన్నది,
ఆ పళ్లెరము నాల్గు వైపుల తిరుగుచున్నను
అందుండి ఒక ముత్యమైనను రాలదు. (ఆకాశము)

తల్, ఢోలక్, మండీ, చౌధరి, రాజ్, ఘడియాల్, చూనా, ఈ మొదలగు తీయ భాషల శబ్దములెన్నియో గ్రహింపబడినవి. ఇది కాక తత్కాలీన చరిత్రల ఏ ఆనాటి పాఠశాలలో చదివించబడు ఫారసీ పుస్తకముల అర్థములు భారతీయ లలోనే చెప్పబడుచుండెననుట విశదము – మఱియు హిందూ–మొహమ్మదీయుల యిక వలన భారతదేశపు నవీనార్యభాషలు ప్రభావితములగు చుండెననియు, స్థానీ, బుందేలీ, బ్రజ, అవధీ మొదలగు భాషలతోపాటు ఉర్దూభాషయు భారత ములోను సమాజమునందును వ్రేళ్లుచాచి వ్యాపించుచుండెననియు తెలియును. భాష ఉత్తరమున తయారగుచున్నను అచటి సాహిత్యమున ఉపయుక్తము కాకుం . కాని దక్షిణమున సాహిత్యప్రక్రియలందిది ఉపయోగపడుచుండెను. ఈ విష ము రెండవ అధ్యాయమున విస్తరించబడును.

ఈ భాష ఇంత త్వరితగతిని అభివృద్ధిచెందుటకు కారణ మేమన, 'ఢిల్లీ ్యములో అన్ని ప్రాంతముల వారును హిందువులును ముసల్మానులును ఉండిరి. ఒకచోటనుండి ఇంకొక చోటికి వచ్చుచు పోవుచుండిరి. వారిలో అధిక సంఖ్యా రాజభాషయగు ఫారసీని, అనేకుల ధార్మిక భాషయగు సంస్కృతమును ఎఱుగని . కనుక వారు పరస్పరము మాటలాడుకొనుటకు మాధ్యమికమగు భాషగా ఢిల్లీ రములలో వ్యవహరింపబడు భాషలో అక్కడక్కడ అరబీ, ఫారసీ, సంస్కృత ములను కలుపుకొని తయారు చేసిరి. ఢిల్లీ రాజధానియగుట వలన అచ్చటి భాష బోలీ తప్ప తదన్యము కాకుండెను. దానిపై పంజాబీ, హరియానీ మఱియు భాషల ప్రభావము పడుటయు అనివార్యమే అయ్యెను. ముందుముందు దాక్షిణాత్య సాహిత్య వృత్తాంతమును చదువు సందర్భమున ఆ ప్రభావమును పరిశీలింప న అవసరము కల్గును.

ఉర్దూ నిర్మితమై వ్యాపించుటకు రెండవ కారణమేమన ముసల్మాను వులు గ్రామ్యజీవనము మఱియు భూమి శిస్తునకు సంబంధించిన నియమావళిని రణముగా ఉన్నట్లే ఉంచిరి. కొన్ని క్రొత్త పన్నులు పెంచిరి. కాని దాని వలన ల ఆర్థిక స్థితిలో అంతటి పరివర్తనము కలుగలేదు. దీని భావమేమన శాసన ంధములు నెలకొల్పుటలోను, శిస్తు వసూలు చేయుటలోను వారు గ్రామ ముఖ్యు ఆధారపడవలసిన వారయిరి. ఇట్టి గ్రామ ముఖ్యులు మఱియు స్థానికోద్యోగులు సీని ప్రాంతీయ భాషలతో కలుపు కొలికి వలె ఉండిరి. వారు ఒకప్పుడు ఫారసీ భాషిక పదములను ఉపయోగించుచు వేఱొకప్పుడు ప్రాంతీయ భాషలను ఉపయో

గించుటకు వెనుకాడకుండిరి. ఈ విధముగా ఒక క్రొత్త భాష ఆవశ్యకముల ననుసరించి అన్యభాషా పదములను కలుపుకొని శక్తివంతమును విస్తృతమును అగుటకు తగిన సదుపాయము లన్నియు సమకూడెను.

ఉర్దూ సాహిత్య పరిశీలనార్థము దక్షిణమునకును, గుజరాతు వైపునకును వెడలుటకు ముందు భారతదేశపు నవీనార్య భాషలను ఒకింత తిలకించుట లాభకరము. ఉర్దూక్షేత్రమునకు సమీపమునగల పంజాబీలో చాలకాలము వఱకు కొన్ని లోకోక్తులు, దోహాలు తప్ప ఎట్టి సాహిత్యమును లభించదు. హరియానీ పరిస్థితియు అట్టిదే. రాజస్థానీ భాషయందు రాజపుత్ర రాజుల ఆస్థానములలో చాల సాహిత్యము ప్రోగుపడెను. కాని ఇతర భాషల ఉన్నతిని అనుసరించి చూచినచో అదియు సామాన్యమే. బ్రజ భాష 16, 17 వ శతాబ్దులలో అత్యంతాభివృద్ధి చెందెను. తత్సాహిత్యపరంపరలు 20 వ శతాబ్దివఱకు కవులను ప్రభావితులుగా చేసినవి. బుందేలీలో ప్రబంధ కావ్యము లెన్నియో లభించును కాని దాని కాలనిర్ణయములో అభిప్రాయ భేదములు కలవు. అవధీ కూడ బ్రజ భాషవలెనే 15, 16 వ శతాబ్దులలో అసాధారణమగు ప్రగతి వహించెను. బంగాళీ, ఒరియా భాషలలో అప్పటినుండియే సాహిత్యము లభించును. మరాఠీలో 13, 14 వ శతాబ్దులలోనే భక్తకవులు ప్రభావ సంపన్నమగు కావ్యభాండారమును సేకరించిరి. ఈ రీతి పదునొకండవ శతాబ్దమున ఉద్భవించిన ఆధునికార్య భాషలలో ముసల్మానులు వచ్చి ఎన్నియో శతాబ్దముల వఱకు నివసించిన అనంతరమే సాహిత్యము జన్మింప మొదలిడెనని తెలియును. వారి రచనలును ఇచటి అనేక భాషలలోలభించును. వారు పారసీలోనే కాక అనేక ప్రాంతీయ భాషలలో రచనలు చేయుచుండిరి. ధార్మిక కారణముల వలనను సాంస్కృతిక కారణముల వలనను వారు అరబ్బీ పారసీ భాషలను అభ్యసించు వారు – అయినను అందఱకు అది అసాధ్యము కాకుండెను.

ఈ వాద వివాదము లన్నిటి వలన తెలియునదేమనగా ఉర్దూ అను పేర నిర్మాణము పొందుచున్న నూత్న భాష పారసీ లేదా ఉత్తర భారతములోని ఏదేని ఒక భాషలో హార్దికభావములను సాహిత్యరూపమున ప్రకటించు వఱకును లోకులను తనవైపు ఆకర్షించుకొనలేకపోయెను – దక్షిణదేశపు పరిస్థితి వేరు. ఇపుడు ఆ క్షేత్రమున జరిగిన ఉర్దూ సాహిత్య వికాశమును తెలిసికొందము.



# రెండవ అధ్యాయము

## దక్షిణ భారతదేశమున ఉర్దూ సాహిత్యము

చారిత్రక దృష్టితో జూచిన దక్షిణ భారతదేశము ఉత్తరదేశమున కంటె భిన్నము. దక్షిదేశము కొంతకాలము నడుమ నడుమ ఉత్తర దేశమునకు లోబడినను అవకాశము చిక్కగనే స్వతంత్రించుచుండెను. ఉర్దూసాహిత్య చరిత్రను చదువు వారు ఈ చారిత్రక విశేషమును గమనింప వలసియుండును.

ఉత్తర దక్షిణ దేశములలోగల విభిన్నత కారణమున ఈ రెండు భాగములు చిరకాలమునుండి వేరు వేరయి యుండెననుట సరికాదు. దక్షిణమున ఆర్యమత వ్యాప్తి తరువాత బౌద్ధమత వ్యాప్తియు ఉత్తరమునుండియే జరిగినది. ఆరవ శతాబ్దమునను ఏడవ శతాబ్దమునను దక్షిణమున స్థాపింపబడిన రాజ్యములు ఉత్తర దేశమునకు చెందినవే. ప్రసిద్ధులగు చాళుక్యులు ఉత్తరమునుండి వచ్చిరి. యాదవులు అట్టివారే. కనుక ముసల్మానుల రాకకు పూర్వమే ఉత్తర దేశభాలు దక్కను ప్రజలకుపరిచితములు అను విషయము స్పష్టము. ఆధునికములగు ఆర్యభాషల యుగము ప్రారంభమైనంతనే ముసల్మానులు ఉత్తర దక్షిణ దేశములలో వ్యాపించిరి. ఈ రెండు భాగములకు గల పూర్వ సంబంధము నూత్న రూపమున బలపడెను.

ముసల్మాను పాదుషాలలో అల్లాయుద్దీన్ ఖిల్జీసైన్యము తొలుదొల్త దక్షిణ దేశమునకు వచ్చెను. ఢిల్లీ రాజ్యపు సరిహద్దులు దక్షిణమున చాల దూరము వఱకు వ్యాపించెను. అది పదమూడవ శతాబ్దము. ముసల్మాను సైనికులు, ఉద్యోగులు, వృత్తిపరులు ఉత్తర దేశమునుండి ఇంకను సంపూర్ణముగా రూపొందని ఆ కలగాపులగము భాషనే దక్షిణమునకు దిగుమతిచేసిరి. మహారాష్ట్ర మొకటి (అచట ఒక ఆర్యభాష వ్యవహరింపబడుచుండెను) తక్క తక్కిన దక్షిణదేశమంతటను ద్రవిడ భాషలు వ్యవహారములో నుండెనను సంగతి సర్వవిదితము. ప్రాచీనములగు ఆ భాషలలో సాహిత్యసంపదయు ఉండెను. ఈ భాషలు ఆర్యభాషలకు చాల భిన్నమైనవి. వాని సంపర్కము వలన ఒక క్రొత్తభాష జన్మించుటకు అవకాశమే లేకుండెను. కనుక దక్కనులో నివసించిన ఔత్తరాహులగు సైనికులు, ఉద్యోగులు, వారి పరివారము, వ్యాపారస్థులు, సూఫీలు, ఫక్కీరులు తమ అవసరములకై ఏ దేని ఒక ద్రవిడ భాషనో లేక తమవెంట తెచ్చిన మిశ్రమ భాషనో మాటలాడ వలసిన

చూడలేని వారు బుద్ధి పూర్వకముగా చేయబడినదిగా భావింతురు. నిజమేమన రచయితలు ఎట్టిసాహిత్య సంప్రదాయములచే ప్రేరితులగుచుందురో వాని ప్రభావము భాష పైనను సాహిత్యరూపముల పైనను పడుచుండును.

ఉర్దూ విషయమునను అదియే జరిగెను. భాషవ్యావహారిక పరిధినుండి వెడలి సాహిత్యక్షేత్రమున ప్రవేశించినంతనే ప్రచలితములగు సాహిత్యములను దృష్టియందుంచు కొనవలసి వచ్చెను. ఇట్లే భాషలో పరివర్తనము కలుగును. కొన్ని శబ్దములు తొలగిపోవును. కొన్నిటి రూపుమారును. కొన్నిటి అర్థమే మారిపోవును. ఇట్లు మారుచున్న అవస్థలో ఆ యా శబ్దములు ఇతర భాషలనుండి గ్రహింపబడును. కొన్ని నూత్నముగా సృష్టింపబడును. కనుకనే దక్కనీ ఉర్దూలోను నేటి ఉర్దూలోను చాల భేదములు కాన్పించును. ఆనాటి ఉర్దూ వ్యావహారిక భాషకు దూరమైనదే అయినప్పటికి సన్నిహితమైనదే. కనుక అందులో సాహిత్య దృష్టితో ఉన్నత శ్రేణికి చెందిన రచనలు లభింపకున్నను భాషా విజ్ఞానము నరయగోరు వారికి దాని పరిశీలనము లాభదాయకమే అగును.

దాక్షిణాత్య ఉర్దూ సాహిత్య చరిత్ర ప్రారంభించునప్పుడు మొట్టమొదట స్మరింపదగిన వ్యక్తి "ఖాజా బందా నవాజ్ గేసూదరాజ్". అతడు "ఖాజా నసీరుద్దీన్ చిరాగ్ దహిలీ" గారి ముఖ్యశిష్యుడు మఱియు "ఖలీఫా."[1] నసీరుద్దీన్ దిల్లీలోని ప్రసిద్ధ సూఫీ ఫకీరగు "నిజాముద్దీన్ఔల్యా" గారి ఖలీఫా. "గేసూదరాజ్" శిష్యులు, అనుయాయులు ఉత్తర దేశమున అసంఖ్యాకులు. అయినను అతడు తన ఉద్దేశ్యములను ప్రచారము చేయుటకై క్రీ. శ. 1412వ సంవత్సర ప్రాంతమున గుల్బర్గా (గోల్కొండ) కు వచ్చి అచటనే స్థిరపడెను. అతడు మహావిద్వాంసుడు – ఫారసీ, అరబీ భాషలలో అతని అనేక రచనలు సుప్రసిద్ధములు. దక్కనులోను అతనికి విశేషగౌరవము జరిగెను. శిష్యుల సంఖ్య అనుదినము పెఱిగెను. తన అనుయాయుల కొఱకు, సామాన్య ప్రజల కొఱకును తన ఉద్దేశ్యములు హిందీ భాషలోనే ప్రకటించుచుండెను. వారి సౌలభ్యము కొఱకు వారి భాషలో అతడు కొన్ని రచనలు చేసెను. కాని హిందీ, ఉర్దూ లేదా దకనీ (దక్షిణీ) భాషలో అతని రచన లెన్ని కలవో నిశ్చయముగా చెప్పుటకు వీలులేదు. "మేరాజుల్-ఆషిఖీన్" అను పేరగల చిన్న పుస్తకమొకటి అతని ఉర్దూ రచనగా నేటికిని భావింపబడుచున్నది. ఇదియే ఉర్దూలోని

1. ముఖ్య శిష్యుడున్ను, ఉత్తరాధికారియగు పీఠాధిపతి.

మొదటి గద్యరచన. ఇందలి భాష శుద్ధమగు ఖడీబోలి కాదు - అందు పంజాబీ మఱియు బ్రజభాషల ఛాయలు కలవు. సయ్యద్ గేసూదరాజ్ క్రీ. శ. 1421 లో నిర్యాణము చెందెను. కనుక ఈ ఉర్దూ 15 వ శతాబ్దారంభపు ఉర్దూ అనవచ్చును. ఈ చిన్న పుస్తకములోని విషయము మతమునకు భక్తికి సంబంధించిన గూఢజ్ఞానము. కనుక ఇందు అరబీ ఫారసీ పదములు విరివిగా ఉపయుక్తములైనవి - ఆధ్యాత్మిక విషయమగుట ఇందలి శైలి జటిలము. దీనిని అర్థము చేసికొనుట సులభముకాదు. ఉదాహరణము :—

"నబీకహే తహఖీక్‌కే దర్మియాఁతే సత్తరహ హజార్ పర్దే
ఉజ్యాలే కే, హౌర్ అంధ్యారేకే, అగర్ ఉస్మేంతే ఏక్
పర్దా ఉఠ్‌జాయ్ తో ఉస్కీ ఆంచ్ సే మై జలూఁ. 1

ఉర్దూ గద్య పద్య రచనలు మఱికొన్ని అతనివిగా చెప్పబడు చున్నవి. కాని విశ్వసనీయముగా చెప్పలేము. గేసూదరాజ్ పరివారములోని ఎందఱో వ్యక్తులు అట్టి భాషలోనే అట్టి రచనలు అనేకము చేసియుండుట గమనింప దగినది. వారిని మఱియు అన్యరచయితలను గూర్చి సంక్షేపముగా వ్రాయబడును.

గేసూదరాజ్ మనుమడు "అబ్దుల్లా హుసేనీ" ఒక సువిఖ్యాత సూఫీ పురుషుడు. అతడు "నిషాతుల్-ఇష్క్" అను నొక ప్రసిద్ధ గ్రంథము ననువదించెను. ఆ కాలపువాడే అగు "నిజామీ" అను కవి "కదమ్‌రావ్ పదమ్" పేర ఒక మస్నవీ వ్రాసెను. ఈ విధముగా ఉర్దూ సాహిత్యము ప్రారంభమైనది కాని దాని వాస్తవికోన్నతి బీజాపూర్ మఱియు గోల్కొండ రాజ్యముల ఉన్నతితోపాటు జరిగినది. ఈ యుగముననే ఉత్తర దేశమున మలిక్ 'మొహమ్మద్ జాయెసీ,' కబీర్, తులసీదాసు మఱియు సూరదాసులు ప్రకాశమానులై యుండిరి. వారిది అవధీ మఱియు బ్రజభాష- ఖడీబోలీ కొన్ని చారిత్రక కారణముల వలన తన స్థానమును వీడి దక్షిణాపథమున క్రొత్త స్థానము పొందుచుండెను.

దక్షిణమున వికాసము పొందుచున్న సాహిత్యమునందు, దానిలో ద్యోతమానమగు సంస్కృతియందు ప్రగాఢమగు భారతీయత కనిపించును. అచటి కవుల

1. "సత్యపరిశోధనకు నడుమ పదునేడువేల చీకటి తెరలును, వెలుగు తెరలును కలవు. అందులోనుండి ఒక తెర తొలగునేని దాని జ్వాలచే "నేను" కాలిపోదును" అని నబీ (ప్రవక్త) పలెకెను.

రచనలు ప్రాంతీయ భావసంపదతో నిండియున్నవి. తన కేంద్రస్థానమునుండి అంతటి దూరప్రాంతమున ఉర్దూ భాష ఇట్టి అభివృద్ధి పొందుటకు ఎన్నియో కారణములు తోచును. అన్నిటికంటె ముఖ్యకారణము దక్షిణ దేశ ప్రభువులు దిల్లీకి దూరమున తమ స్వతంత్ర, స్వాధీన రాజ్యస్థాపన కొఱకే కాక కళా కౌశలములలో, సాహిత్యములో ఆచార వ్యవహారములలో, ఇతర జీవితరంగములలో, తమ ప్రత్యేకతను నిలుపుకొనుటకై ఉత్సుకత గలిగియుండుటయే అనిపించును. అందులకై వారు సామాన్య జీవనమును సమీపించిరి. దక్షిణ రాజ్యాల రాజులు భారత దేశపు బయటి జాతులకు సంబంధించిన వారనుటలో సందేహము లేదు. అయినను వారు హిందువులతో వివాహాది సంబంధముల మూలమున స్నేహసూత్రమును బలపఱచుటకొఱకై అక్బరు కంటె ముందే అభిలషించిరి. ఇదియేకాక ఈ రాజపరివారములు చిరకాలమునుండి ఇచటనే నివసించుట వలన ఇచటి ఆచార వ్యవహారములతో సంప్రదాయములతో సంపూర్ణపరిచయము కలిగియుండిరి. ఇంకొక సంగతి; నిరంకుశ పరిపాలనలో ప్రభువుల ఇష్టముపైననే సమస్తము ఆధారపడియుండును. వారెట్టి కళా కౌశలములను అభిమానింతురో ప్రజలలో వాని ప్రచారమే జరుగును. వారి వ్యక్తిగతములగు వాంఛలే రాజదర్బారుతో సంబంధము కలవారికిని, కవులకును వాంఛలమగును. దక్షిణాత్య ప్రభువులనేకులు ఉర్దూ, తెలుగు మఱియు బ్రజ భాషలలో రచనలు చేయుట గర్వకారణమని భావించిరి. దాని పరిణామరూపమున కవులును భారతీయ భాషలలోనే తమ భావములు ప్రకటించుకొనిరి. చరిత్రజ్ఞు లింకొక కారణము చెప్పుదురు. భారతదేశముపై వాయువ్య దిశనుండి జరిగిన ఆక్రమణముల ప్రభావము దక్షిణము వఱకు వచ్చునంతలో ఆరిపోవుచుండెను. కనుక దక్కనులో కళా కౌశలములను అభివృద్ధిపఱచుకొను అవకాశము అధికముగా కలిగెను. అచటి రచయితలు కళావేత్తలు పర్షియా ప్రభావమును తప్పించుకొనిరి. వారు తమ పరికరములనే ఉపయోగించి తమ భాషలోనే రచనలు చేసిరి. ఈ విధముగా దిల్లీకి దూరముగా ఉండుటవలన, రాచకార్యాలు హిందూస్థానీ భాషలో నడచుట వలన, హిందూ ముసల్మానుల ఐక్యతవలన, శాంతి నెలకొనియుండుట వలన, సూఫీ ఫకీరుల ఉనికి వలన, ఇంకెన్నియో ఇతర కారణముల వలన దక్కనులో ఉర్దూ అభివృద్ధిచెందుటకు మంచి అవకాశము కలిగెను.

బహమనీ రాజ్యము విచ్ఛిన్నమైనంత క్రీ. శ. 1490 లో ఆదిల్‌షాహీ వంశము బీజాపురములో స్వరాజ్యము స్థాపించుకొనెను. ఆ వంశమున ఎనమండుగురు

...దుషా లయిరి. వారిలో అధికులు యోగ్యులై విద్వజ్జనుల సహవాసమున ...నందము పొందు చుండిరి. అంత వఱకు సూఫీ ఫకీరుల యుగము అంతరించలేదు. ...నాటి వారిలో మొట్ట మొదట స్మరింప దగినవాడు తన యోగ్యత మఱియు భక్తి ...లన "షమ్సుల్–ఉష్షాఖ్" (భాగవత సూర్యుడు) అనబరగిన "షాహమీరాన్‌జీ" ...తడు క్రీ. శ. 1496 వఱకు జీవించెను. తన జీవిత కాలమున ఉర్దూలో ఎన్నియో ...చనలు చేసెను. అవి చదువుట వలన ఆనాటి భాషా సంబంధమున బహు మూల్యమగు ...నము లభించును. అతని రచనలన్నియు సూఫీమత సిద్ధాంతములను సంప్రదాయ ...ములను తెల్పునవి. అతడు తన రచనలన్నియు అరబీ ఫారసీ భాషలు రానివారి ...ఱకు ఉద్దేశింప బడినవని తెల్పెను. తన భాష 'హిందీ' అనెను. అతని రచనలలో ...షహాదతుల్–హాఖీఖత్" "ఖుష్–నామా" మఱియు "షరహే–మర్గూబుల్–ఖులూబ్" ...నునవి మహిమాన్వితములు. చివరిది గద్యరచన, అందును సూఫీ మతపు గూఢ ...నము కలదు–ఉదాహరణ కొఱకు.

తూ ఖాదిర్ కర్ సబ్ జగ్ సబ్‌కో రోజీ దేవేఁ
తూ సభోంకా దానా బీనా సబ్ జగ్ తుఝ్‌కో సేవేఁ
ఏకన్ మాటీమూల్ దేవే, ఏకన్ మాటీ బాజ్
కేతోఁ భీక్ మంగావేఁ కేతో దేవే రాజ్
కేతోఁ పాట్ పీతాంబర్ దేతా కేతోఁ సర్కీలా యా
కేతోఁ ఊపర్ ధూప్ తలావే కేతోఁ ఊపర్ ఛాయా
కేతే జ్ఞాన భగత్ బైరాగి, కేతే మూర్ఖ్ గఁవార్
ఏక్ జిన, ఏక్ మానస్ కీతా, ఏక్ పురుష్, ఎక్‌నార్ 1

---

నీవు సర్వశక్తిమంతుడవు. అందఱకు ఆహారము నొసగు వాడవు. నీవు సర్వజ్ఞుడవు. జగమంతయు నిన్నే సేవించును. ఒకరికి ఏమియు ఈయవు. ఒకరికి చాల ఇచ్చెదవు. (ఇది తోచలేదు) ఒకరిని బిచ్చమెత్తించెదవు. ఒకరికి రాజ్యమిత్తువు. ఒకరికి పీతాంబరముల నిత్తువు–ఒకరిని వస్త్రహీనులుగానే ఉంచుదువు. కొందరి నెత్తిపై ఎండ గాయింతువు. కొందఱకు నీడ నిత్తువు, కొందరిని జ్ఞానులుగా, భక్తులుగా విరాగులుగా చేతువు– కొందఱను అజ్ఞానులుగా మూర్ఖులుగా చేతువు– కొందఱను 'జిను'ల చేసితివి (ఇదొకదేవయోని విశేషము) కొందఱను మనుష్యుల జేసితివి. కొందఱను పురుషులుగా మఱి కొందఱను స్త్రీలుగా చేతివి.

అతని కవితలో కేవల ప్రేమ, భక్తి, ధార్మిక భావములు కలవు. అంతే కాక సాహిత్య దృష్టితోను ప్రాముఖ్యముగల రచనలు కూడ చేసినాడు.

మీరాంజీపుత్రుడు "షాహబురహానుద్దీన్ జానమ్" కూడ గొప్ప సూఫీగా గణుతికెక్కెను. అతడు క్రీ. శ. 1852 ప్రాంతమున సమాధిపొందెను. తనభాషను "దకనీ" అని పేర్కొనెను. అతని రచనలన్నియు కవిత్వరూపమున లంభించును. అన్నియు సూఫీమత సంబంధములు. అతని కవిత్వములో చాల భాగము ఐరోపా మఱియు హైదరాబాదలోని పుస్తకాలయములలో కలవు. అతని భాష సరళము. విషయము గంభీరమైనను కావ్యత్వసౌందర్య సహితము. అతని గ్రంథములలో "సుఖ్‌సహేలా" "వసీయతుల్-హాదీ" మఱియు "ఇర్షాద్‌నామా" ప్రసిద్ధములు. ఉదాహరణ కొఱకు ఈ పద్యములు చూడుడు:—

యే రూప్ ప్రగట్ ఆప్ ఛిపాయా, కోయీనా పాయా అంత్
మాయా మోహ్‌మే సబ్ జగ్‌బాంధ్యా క్యోంకర్ సూఝే పంత్ 2

బాజ్ ఆకహేం అప్నీ బూఝ్
మాలూమ్ నహి ఉస్కి సూఝ్
ఏక్ జమా సబ్ పక్షియా బార్
జోంకే బీచ్‌తే నికల్యా ఝాడ్
కాటా ఛాంటా, ఫల్ ఔర్ ఫూల్
షాఖ్ బర్గ్ సబ్ దేఖ్ ఉసూల్
న ఇస్ ఖాలిఖ్ మఖ్లూఖ్ కోయ్
జైసా తైసా సమ్ఝా హోయ్ 3

"అమీనుద్దీన్ ఆలా" షాహబురహాన్ కుమారుడు. మఱియు తదనంతర పీఠాధిపతి. అతడును తన పూర్వీకుల మార్గము ననుసరించి 'సూఫీతత్త్వ సంబంధములగు రచనలు చేసెను. క్రీ. శ. 1675 లో అతడు మరణించెను. అతని రచనలు గద్యములలోను పద్యములోను కలవు. అతడు తన

2. నీ రూపమును గుప్తపఱచితివి, ఎవరికిని అంతము దొఱకదు. మాయామోహములతో అందఱను బంధించితివి. ఎవరికిని దారి దొఱకదు.

3.

కి తాతలకంటె గొప్ప కవియని అతని రచనలు తెలుపును. అతని గద్య రచన పద్యరచనలవలె మహనీయమైనవి. "మొహబ్బత్-నామా" మఱియు "రమూ -సాలికీన్" అనునవి అతని ప్రసిద్ధ గ్రంథములు. ఈ సందర్భమున గమనింప న విషయమేమన పూర్వ రచయితల పేరుతో లభించు రచనలన్నియు వారివే ఖండితముగా చెప్పలేము. నేటి వరకు జరిగిన పరిశోధనలను అనుసరించియే మాటలు చెప్పబడినవి. వారి రచనలను, భాషను భావములను గురించి ఉర్దూ ిత్య చరిత్ర సవిస్తారముగా వ్రాయవలసిన అవకాశము కలిగినచో విపులముగా ంపబడును.

ఆదిల్‌షాహి పాదుషాలు స్వయముగా ఉర్దూలో లేఖన, పఠనములు ువారని ఇదివరకే తెలుప బడినది. వారిలో ఇబ్రాహీం ఆదిల్‌షాహ (1580- ) అందఱికంటె ప్రసిద్ధుడు. అతడు దక్షిణ భాషాసాహిత్యములను అభిమానించు కాక భారతీయ సంగీత కళలో నిపుణుడు. అతడు భారతీయములగు రాగములను రముగకొని "నవరస్" అనుపేర ఒక కావ్యము వ్రాసెను. దాని విశిష్టత యేమన సంగీత శాస్త్రదృష్టితో అసమానమగు గ్రంథమేకాక ఉత్కృష్ట రచన కూడ. హీం దక్కనీ ఉర్దూను విడిచి బ్రజభాషను ఉపయోగించెను. ఈ గ్రంథము మదలచి అతడు ఉత్తర భారత విద్వాంసులను పిలిపించి వారివలన బ్రజభాష ఆ తరువాత రచన చేసెనందురు. అతని భాషలో అందందు అరబీ, ఫారసీ, ములు కలిసి యుండుటచే అది ఉత్తరదేశపు బ్రజ భాషకంటె విభిన్నము. గ్రంథము 16. వ శతాబ్దాంతము లేదా 17 వ శతాబ్దారంభమున వ్రాయబడి ుడును. దీని చేతి వ్రాత ప్రతులు అనేకములు హైద్రాబాదు గ్రంథాలయ లో సురక్షితములు. అది ప్రకటించబడిన తరువాత దానిని గూర్చి ఎంతైన మవచ్చును. "నవరస్" ఉపోద్ఘాతమును సుప్రసిద్ధ ఫారసీకవి "జహూరీ" చెను. అది నేడు "సేహ-నస్ర్" అను పేర ఫారసీలోని 'క్లాసికల్' గ్రంథము లెక్కింపబడుచున్నది. ఇబ్రాహీం దర్బారులో రాచకార్యము లన్నియు ఉర్దూలో పచుండెను. ఎందరో కవులు అతని దర్బారుతో సంబంధము కలిగి యుండిరి. హీం తరువాత మొహమ్మద్ ఆదిల్‌షా సింహాసన మెక్కెను. అతడును అతని పత్నియు కవిజనాభిమానము కలవారు. కవులనేకులు వారిని ఆశ్రయించిరి. అట్టి లో "రుస్తుమీ" "మలిక్-ఖుష్‌నూద్" మరియు "దౌలత్ షాహ" అను వారు శీయులు.

"రుస్తుమీ" ఫారసీ, ఉర్దూ ఉభయ భాషలలో కవిత్వము వ్రాసెను. ఇప్పుడు "ఖావర్నామా" అను ఒక దీర్ఘకవిత మాత్రమే లభించును. ఇది (24) వేల పాదములుగల ప్రబంధము. దీని నతడు (18) నెలలలో వ్రాసెను. వాస్తవమునకు ఇదొక ఫారసీ కావ్యానువాదమే అయినను స్వంతరచనయే అనునట్లు సుందరముగా అనువదించెను. ఈ రచన మొహమ్మద్ అదిల్‌షాహ ధర్మపత్ని కోరికపై చేయబడినది. రచనా కాలము క్రీ. శ. 1649 వ సంవత్సరము. భాష సరళము, శైలి మనోహరము. ఇట్లే "మలిక్-ఖుష్‌నూద్" తన "హష్త్ బిహిష్త్" అను మస్నవీవలన ప్రఖ్యాతుడు. ఇది "అమీరు ఖుస్రూ" వ్రాసిన ఒక ఫారసీ కావ్యానుసరణ. ఇందలి భాష అంత సరళముకాదు.

క్రీ. శ. 1656 లో రెండవ అలీ ఆదిల్‌షాహ సింహాసనాసీనుడయ్యెను. అతడు స్వయముగా కవి. అతని కాలమున బీజాపూరులోని సర్వోత్తమ కవి యగు "నుస్రతీ" సుప్రతిష్ఠితుడయి యుండెను. నుస్రతీ మహాకవియే. కాని అతనినిగూర్చి ఇంతవరకు ఎట్టి వివరములును తెలియవు. అతనిపేరు మొహమ్మద్ నుస్రత్ అనియు అతడొక బ్రాహ్మణ కుటుంబమునకు చెందినవాడనియు అందురు. కాని అది వాస్తవ మనిపించదు. ఏలయన నుస్రతీ తన కవిత్వములో గుల్బర్గా నివాసియగు సుప్రసిద్ధ సూఫీ గేసూదరాజ్‌ను స్తుతించుచు తన వంశము తరతరములనుండి అతని నామ స్తవము చేయుచున్నదని తెల్పెను. అతని వంశము పూర్వమున బ్రాహ్మణ కుటుంబముతో సంబంధము కలిగియుండిన నుండవచ్చును.

"నుస్రతీ" మూడు గ్రంథములు రచించెను. మూడును మస్నవీలు. అందు "గుల్షనె-ఇష్క్" మఱియు "అలీనామా" అను రెండు చాల ప్రసిద్ధములు. అతని మూడవ గ్రంథమగు "తారీఖె-సికందరీ" మొన్న మొన్ననే జాడపడినది. "గుల్షనె-హింద్" లో "మనోహర్" మఱియు "మధుమాలతు"ల ప్రేమగాథ వర్ణితము - ఈ ప్రేమగాథ దక్షిణదేశమున చాల వ్యాప్తికలిగి లోకప్రియమై యుండెను. దానిని ఎందరో ఫారసీ కవులు ఫారసీలో వ్రాసిరి. అయినను నుస్రతీ కొన్ని క్రొత్త విషయములు చేర్చి ఆ రచనను స్వంతమొనరించుకొనెను. ఈ మస్నవీ ఈరానులోని క్లాసికల్ మస్నవీల శైలిలో వ్రాయబడినది. అతని రెండవ కవిత మొదటిదానికంటె సుందరము - ఉత్తమము. "అలీనామా" అను ఈ గ్రంథమున రెండవ అలీ ఆదిల్‌షా జీవితగాథ అతి విస్తారముగా వర్ణింపబడినది. దీనిని చదువునప్పుడు "పృథ్వీరాజ్ రాసో" మఱియు అట్టివేయగు అన్యరచనలవైపు ధ్యాసపోవును- ఏలయన "నుస్రతీ" ఈ దీర్ఘమగు కవితలో "చంద్రబర్దాయీ" వలె తన పాదుషా జీవితమునకు

సంబంధించిన సమస్త విషయములను చాల సుందరముగా, ఉల్లాసముగా చిత్రించెను. ఆ సమయమున దక్షిణదేశమున శక్తి సంపాదించుటకై మొగలులు, మరాఠులు, ఆదిల్‌షాహీలు, ఖుతుబ్‌షాహీలు ఎడతెరపి లేకుండ పరస్పరము పోరాడు చుండిరి. "అలీనామా" లో ఈ సంఘర్షన సజీవముగా సుందరముగా చిత్రింపబడినది – దాని వలన ఇంకొక విషయము తెలియును. రాజ్యమును సురక్షితముగా ఉంచుకొనుటకై ప్రజలను మతము పేర సంఘటిత పఱచుటకు మారుగా స్థానిక సౌకర్యముల ననుసరించి మైత్రి సంపాదించుకొనబడుచుండెను. "నుస్రతీ" కావ్యము ఉర్దూ మహా కావ్యములలో ఒకటి. దానికి సాహిత్య గౌరవమేకాక చారిత్రిక ప్రాముఖ్యమును కలదు. ఉచ్ఛ్రేణికి చెందిన ఈ కావ్యము దకనీ భాషలో ఉన్నందునను, ఇంతవఱకు ప్రకాశితము కానందునను దీనికి దొఱక వలసిన స్థానము దొఱకలేదు. "నుస్రతీ" సన్నివేశములను అసాధారణ ప్రతిభతో చిత్రించును. ముఖ్యముగా యుద్ధమును, యుద్ధరంగమును వర్ణించునప్పుడు అతని శక్తి వర్ణనాతీత మనిపించును. అతని మూడవ రచన "తారీఖె–సికందరీ" క్రీ. శ. 1687 లో బీజాపూర్ వినాశము వలననో లేక అతని మృత్యువు వలననో అసమగ్రముగా ఉండిపోయినది. "నుస్రతీ" కి శృంగార వీరరసములు రెంటిపై సమానాధికారముండెను. ఔరంగజేబు బీజాపూర్‌ను జయించిన పిదప "నుస్రతీ" కి "మలికుష్షోఅరా" అను బిరుదు ప్రదానము చేసెనందురు. కాని అది నిజ మనిపించదు. ఎందుకనగా అతడు క్రీ. శ. 1684 లోనే మరణించెను. అతని భాష సరళమే. అయినను అందు అరబీ, ఫారసీ పదములు అధికముగా కలవు. ఇతర కవుల వలెనే అతడును తన భాష "హిందీ" యనియే తెల్పెను. ఉదాహరణ కొఱకు 'మనోహర్ మధుమాలతి' లోని కొన్ని పంక్తులు :—

ఉధర్ సాథ్ థీ మాఁ కె మధుమాలతీ
ఇధర్ మాఁకె సంగాత్ చంపావతీ
బొహత్ దిన్‌కో జిస్ వఖ్త్ బిఛడే మిలే
ఏకర్ ఏక్ లగాయే చంగుల్ కర్ గలే
ఉనోఁ క్యాఁ సఖియాఁ చంకీ సౌ సాత్ థీఁ
ఇనోఁకే కనేఖీ ఉసీ ఘాత్ థీఁ [1]

1. అటు మధుమాలతి తల్లివెంట నుండెను, ఇటు తల్లివెంట చంపావతి ఉండెను, చాలకాలము తరువాత వియోగము పొందిన వారు కలిసికొనుట వలన ఆలింగనము చేసికొనిరి. ఆమె వెంట నూర్గురు చెలికత్తెలుండిరి. ఈమె వెంట అట్లే ఉండిరి.

"నుస్రతీ" ఖసీదాలు, గజలులుకూడ వ్రాసెను. సాహిత్యవేత్తలనేకులు అతనినే ప్రథమ ఖసీదా రచయితగా భావించిరి. కాని అతని గొప్పతనమంతయు పైన ఉల్లేఖింపబడిన రచనల వలననే -

బీజాపూర్‌లోని సుప్రసిద్ధ కవులలో "హాష్మీ" ఒకడు. అతని గూర్చి ఏ విషయమును తెలియదు. అతడు రెండు కనులచే గ్రుడ్డివాడనియు అతనికి చాల గౌరవాదరములు కలుగుచుండెననియు అందురు. అతడు క్రీ. శ. 1697 లో మరణించెను. అతని సుప్రసిద్ధ రచన "యూసుఫ్-జులేఖా"- అందు పన్నెండు వేల పద్య పాదములు కలవు. ఈ మస్నవీ ఒక ఫారసీ రచనకు అనుసరణ. "హాష్మీ" మంచి కవి - అతని భాష సరళము - శైలి సుందరము. అతడు హిందీ కవులవలె తన పెక్కు కావ్యములలో స్త్రీలు పురుషులపట్ల ప్రకటించు ప్రేమభావములు ప్రకటించెనని కొందఱందురు. కాని ఆలోచించి చూచినచో అతడు హిందీ కవులను అనుసరించ లేదని తెలియును. ప్రేమ గాథలలో స్త్రీ పాత్రలచే ఏదేని పలికించు సందర్భమున అతని భాష స్వాభావికసారళ్యమును మాధుర్యమును పొందును- కొందఱు విమర్శకులు అతడు "రేఖ్తీ" (చూడుడుపరిశిష్టము) కి జన్మదాత అనిరి. కాని అదియు భ్రాంతియే.

ఇచట కొందఱు సుప్రసిద్ధ కవులను గూర్చియే వ్రాయబడినది. బీజాపూర్ రాజ్యములోను రాజదర్బారులోను అనేక కవులుండిరి. వారి రచనలు భారత దేశపు గ్రంథాలయములలో, ఐరోపా గ్రంథాలయములలో లభించును.

బీజాపూర్‌లో వలెనే ఉర్దూ సాహిత్యము గోల్కొండలోను చాల ఉన్నతి చెందెను. ఎందఱో కవులు అచట చేరిరి. గోల్కొండ ఖుతుబ్షాహీ వంశము క్రీ. శ. 1508 లో స్వతంత్ర రాజ్యస్థాపన చేసికొనెను. అచటి ప్రభువు లనేకులు దానిని బలవంతమును ప్రగతిశీలమును అగు రాజ్యముగా రూపొందించుటకై చాల కృషిసల్పిరి. 16 వ శతాబ్దాంతమున ఇచట ఉర్దూసాహిత్యవికాసమునకు మంచి అవకాశము కలిగెను- ఈ రాజ్యమును పాలించిన ఎనమండుగురు పాదుషాలలో చివరి నలుగురు స్వయముగా మహాకవులే కాక కవి జన పోషకులు - గోల్కొండ ఐదవ పాదుషా యగు మొహమ్మద్ ఖులీ ఖుతుబ్షా క్రీ. శ. 1580 లో సింహాసనస్థుడయ్యెను - అతడొక ఉర్దూ మహా కవి - ఖులీ ఖుతుబ్షా సుమారు ఒక లక్ష పద్యములు చెప్పెనందురు. అందు అధికము దకనీ భాషలో కొన్ని ఫార్శసీలో కొన్ని తెలుగులోను కలవు - అతని తల్లి తెలుగుదేశ వాసిని - కనుక అతడు తెలుగుతో మంచి పరిచయము

ంగులో "తురక్‌మాణ్" అను ఉపనామముతో కవిత చెప్పెను. కాని
కని తెలుగు కవితనుగూర్చి ఇంతకుమించి తెలియదు. ఉర్దూలో అతడు
ు కావ్యసంగ్రహపు హస్తలిఖిత ప్రతులెన్నియో భారతదేశ గ్రంథాల
ఐరోపా గ్రంథాలయములలోను కలవు - కొన్ని దినముల క్రిందట
గ్రహము హైదరాబాదునుండి ప్రకాశితమైనది.

మ్మద్ ఖులీ ఒక గొప్ప యోధుడే కాక గొప్ప రచయిత.
అతడాదికవి. అతడు భారతీయ జీవనమును సమగ్రముగా గ్రహించి
నిశ్చయముగా చెప్ప వచ్చును - అతనికి ముసల్మానుల ఉత్సవములు
ురాతు అనగా ఎంతటి ప్రేమయో హిందువుల వసంతోత్సవము,
నాటి మనోరంజన కార్యక్రమములలో హృదయ పూర్వకముగా
మక్కువ పడును. అతని కవితలో ప్రాంతీయత, దేశీయత
ంటి ధార్మిక విచారము, ఉనికి, ఆచార వ్యవహారములు మఱియు
అతని కవితలో ప్రస్ఫుట రీతితో ఉల్లేఖింప బడినవి. అతడు తన
ంరాంధ్ర ప్రశంశాత్మక కృతులెన్నియో రచించెను. వారి తను వర్ణన
హిందీకవులను సంస్కృత కవులను తలపించును. అతడు సింహాసన
ందు యౌవనావస్థలో "భాగ్యమతి" యను నొక యువతిని ప్రేమించె
ిసన మధిష్ఠించిన పిదప అతడామెను వివాహమాడెను. ఆమెకు
ల్" అను నామకరణము చేసి ఆమెపేర "హైదరాబాద్" అను
ంచెను. అతని కవితలో "భాగ్యమతి" యెడగల ప్రేమ చాల
ర్ణింప బడెను - అతని జీవితములోని ముఖ్యాంశము లన్నియు
ింప బడినవి. అతని రచనలలోని ఫలపుష్పముల వర్ణన ఆచార
ు్రతములుచూడగా దక్షిణభారతదేశమున హిందూ-మొహమ్మదీయుల
ంటి ఆకర్షణీయముగా సమైక్యత పొందుచుండెనో తెలియును -
సామాన్యప్రజలే కాక పాదుషాకూడ ప్రభావితు డగుచుండెననియు

ష్షా గజలు, ఖసీదా, మస్నవీ, మర్సియా మొదలగు అన్ని
వ్రాసెను. అతని కవితా వస్తువ వివిధము. ఆధునిక కవులవలె
ిషయముల గూర్చి కవిత వ్రాసెను. హిందూస్థానీ భావములను
ములతో శృంగారించి కవిత చెప్పుటలో అతడు నైపుణ్యము

కలవాడు. అతని విషయములు ఆలోచనా పద్ధతులు దేశీయము లయినట్లే అతని భాషయు హిందూస్థానీయే. హిందూస్థానీ అనగా హిందీయును ఉర్దూయును – అతడు ఉత్తరదేశపు హిందీ కవుల కావ్యములను అధ్యయనము చేసియుండునని నిర్ధరించి చెప్పలేము. కాని అతని హిందీ అలంకారములను చూచి వానినెఱిగినవాడేయని తలంచ వచ్చును– అతనికాలము దరిదాపుల తులసీదాసు, మీరాబాయి, మఱియు సూరదాసుల కాలమే. ఉర్దూ భాషలోని ఈ ప్రథమ మహాకవి రచనలు ప్రాకృతిక సౌందర్య విలసితములు – అతని భాష సరళము – భావిసాహిత్య రూపురేఖలను గ్రహించుటకై దాని అధ్యయనము లాభదాయకము –

ఉదాహరణ కొఱకు కొన్ని పద్యములు :—

పియా వాజ్ ప్యాలా పియా జాయెనా
పియా వాజ్ ఎక్‌తిల్ జియా జాయెనా
నహీ ఇష్క్ జిస్కో బడాకోర్ హై
కధీ ఉస్‌నే మిల్ బైసియా జాయెనా
"ఖుతుబ్షహ !" నదేముఝ్ దివానేకో పంద్
దివానే కొ కుఛ్‌పంద్ దియా జాయెనా. 1

* * * *

హై ఇష్క్ హర్ ఎక్ ఘాత్ హర్‌ఎక్ దిల్‌మె పియారా
ముఝ్ ఇష్క్ పియారే కా అహైజీవ్ కా ఆ – ధారా
బిన్‌సైర్ తుమన్ సారీ కలియాం సూఖ్ రహీహైం
టుక్ ఆకె కరోగష్త్ చమన్‌జీ ఉఠే సారా. 2

* * * *

1. ప్రియురాలు లేనిదే పానపాత్రలోని మద్యము త్రాగరాదు. ప్రియురాలు లేనిదే ఒక క్షణము జీవింపరాదు.
ప్రేమ లేనివాడు అంధుడు, అట్టివానితో కలిసి యెన్నడును కూర్చుండ రాదు.
ఖుతుబ్షా : నావంటి ఉన్మత్తునకు ఉపదేశింపకుము. ఉన్మత్తునకు ఉపదేశ మీయరాదు.
2. సమస్త హృదయాలలో సమస్త విధముల ప్రేమకలదు, నాకు జీవనాధారమే ప్రేమ. నీవు విహరింప నందున మొగ్గలన్నియు వాడిపోయినవి. ఒకసారి వచ్చి విహరింపుము. ఉద్యాన వనమంతయు జీవితమగును.

రఖ్ ఏక్‌హై పర్ ఏక్‌కా ధన్ లాఖ్ చమన్‌హై
లఖ్ జోత్‌హై హర్‌ఠార్ వలే ఏక్ రతన్‌హై
కిన్ ఠార్‌మే దిస్తానహీ హర్‌ఠార్‌హై భర్‌పూర్
దేఖన్ కొ సకత్ కాం ఉసే బన్ ఏక్ నయన్‌హై
ముర్ఝ్ ఇష్క్ గిరీ ఆగ్ కా ఎక్ చింగీహై సూరజ్
ఇస్ ఆగ్ కే షోలేకా ధుంవాం సాత్ గగన్‌హై 3

* * * *

గోలకొండలో మొహమ్మద్ ఖులీ వంశమున చివరి ముగ్గురు పాదుషాలును మంచి కవులు. అతని అన్న కొడుకు మొహమ్మద్ ఖుతుబ్షాహ గొప్పకవి. కవి జనాశ్రయుడు. అతని కావ్యసంగ్రహము లభించినది. అతడును తన పిన తండ్రి వలె అన్ని ప్రకారముల కవితలు వ్రాయగలిగియుండెను. అతని భాషలోను సారళ్యము, ప్రవాహము కలవు. కవిత రసాత్మకము, దేశీయము, ఉపమాద్యాలంకారమయము. అతని ఉపనామము "జిల్లుల్లాహ్". ఎందరో మహాకవులు అతని ఆ స్థానమున శోభాయమానులు. అతడు క్రీ. శ. 1611లో సింహాసన మెక్కి క్రీ. శ. 1624 లో మరణించెను.

మొహమ్మద్ ఖుతుబ్షా తరువాత అతని కొడుకు అబ్దుల్లా ఖుతుబ్షా సింహాసన మెక్కెను. అతని కావ్యసంగ్రహము లభ్యము. అతని కవితలు అతని పూర్వుల కవితలవలె గొప్పవి కావు. కాని అతని ఆశ్రయమున ఖుతుబ్షాహీ కవులనబడు వారు అనేకులు వర్ధిల్లిరి. అతని ఆ స్థాన కవులలో "గౌవసీ", "ఖుత్బీ" "ఇబ్నె-నిషాతీ" "తబాయీ" "జునైదీ" మఱియు "అమీన్" అను వారు ముఖ్యులు. ఈ వంశపు చివరి పాదుషా అబుల్ హసన్ తానాషా. అతని కాలమంతయు మొగలు సేనలతో యుద్ధము చేయుటలోనే గడచినది. క్రీ. శ. 1686 లో ఔరంగజేబు చేత గోలకొండ

---

3. రక్షకుడొక్కడు. ఒక్కని సంపత్తి లక్ష ఉద్యానములు. అన్ని దిశల లక్ష జ్యోతులున్నవి. కాని రత్నమొక్కటే. ఏ వైపు కన్పించదు? అన్ని వైపుల నిండి యున్నాడు. ఈయొక్క కన్ను అతని నేమి చూడ గలదు? నా ప్రేమా నలము నుండి రాలిన యొక రవ్వయే సూర్యుడు. ఈ యగ్నినుండి వెడలిన పొగయే ఏడు ఆకసములు.

పతనము జరిగినది. తానాషా కూడ కవియే. కాని అతని కావ్యసంగ్రహము లభించలేదు. అతని అంతిమ జీవితము కారాగారములో గడుచుటయే దీనికి కారణము కావచ్చును.

పై వివరముల వలన గోలకొండలో ఉర్దూ కవిత చాల ఉన్నతి నందె నని తెలియును. పాదుషాలు స్వయముగా ఉర్దూలో వ్రాయువారు. ఉర్దూలో వ్రాయు వారిని ఆదరించు వారు. వారి కాలమున గద్యపద్యాద్యనేక సాహిత్యశాఖలు అభివృద్ధి చెందినవి. ఉర్దూ సాహిత్యమునకు సంబంధించిన చిన్నపాటి చరిత్రలోనైనను ఉచ్చ స్థానము పొంద దగినట్టి రచనలు కూడ కొన్ని ఆనాడు వెలసినవి.

మొహమ్మద్ ఖులీఖుతుబ్షా కాలమున అందఱకంటె మహాకవి "వజీ" అను నతడు. పాదుషా యౌవన కాలమునాటి ప్రేమ గాథను "వజీ" "ఖుతుబ్ ముష్తరీ" అను పేర రచించినందున అతనిని తన ఆస్థాన మహా కవిగా సన్మానించి పాదుషా అతనితో మైత్రి నెఱపెనని యందురు. "ఖుతుబ్ ముష్తరీ" ఒక మనోహర మగు మస్నవీ. నాయకుడు ఖులీఖుతుబ్‌షాహ. శృంగార రసాత్మకమగు ఈ ప్రణయ గాథ "వజీ" కల్పన. ఈ కథ పాదుషా జీవితము నుండె సంగ్రహింపబడినదనుట సరికాదు కాని "వజీ" తన పాదుషా పరాక్రమము, ఔదార్యము, దాతృత్వము, ప్రణయ పాండితిని ఈ కాల్పనిక కథ చాటున లీలగా స్ఫురింపజేసెను. దక్షిణము లోని మహద్రచనలలో ఇది గణణీయము. కథ దక్షిణ దేశము మఱియు బంగాళ దేశముల మధ్య తిరుగును. ఆనాటి కథ లన్నిటిలో వలె ఇందును అభూత కల్పనలు అసంభవ విషయములు అనేకములు. "వజీ" భాష సరళము కాదు. ఫారసీ అరబీ పదములును, సంస్కృత తత్సమ, తద్భవ శబ్దములును విరివిగా ఉన్నవి. అంతియే కాక "వజీ" అతి నిరంకుశముగా ఫారసీ, అరబీ, సంస్కృత శబ్దములను ఉర్దూ వ్యాకరణ సూత్రముల ననుసరించి ప్రయోగించెను. "ఖుతుబ్ ముష్తరి" ప్రకాశితమైనది. దానిని భాషాదృష్టితో చదివినను లాభదాయకమగును. ఉదాహరణ కొఱకు కొన్ని పంక్తులు:—

ఛిపీ రాత్ ఉజాలా హువా దీస్ కా
లగాజగ్ కరన్ సేవ్ పరమేస్ కా
జో ఆయా ఝులక్తా సూరజ్ టూట్‌కర్

ఖుతుబ్షాహీ యుగపు మూడవ మహాకవి, "ఇబిన్నిషాతీ". అతని ప్రసిద్ధ మస్నవీ "ఫూల్‌బన్" ఉర్దూ సాహిత్యనిధిలో ఒక వెలలేని రత్నము. "గార్సా-ద-తాసీ" మఱి కొందఱు పురాతన రచయితలు అతడు "తూతీనామా" అను నొక కావ్యమును కూడ వ్రాసినట్లు అభిప్రాయపడిరి. కాని అది వారి భ్రాంతియే. ఇట్లే "ఫూల్‌బన్"ను గూర్చియు కొన్ని భ్రాంతి మూలకములగు అభిప్రాయములు వెల్లడించిరి. ఇప్పుడు "ఫూల్‌బన్" ప్రకాశితమైనది. దానిని చదువుట వలన సరియైన సంగతులు తెలియును. "ఇబిన్నిషాతీ" ఫారసీ భాషలో పండితుడు. కావ్య శాస్త్ర ప్రవీణుడు. "ఫూల్‌బన్" ప్రారంభమున అతడు ఆత్మ ప్రశంసయు కావ్య ప్రశంసయు చేయుచు తాను గద్యములోను అనేక రచనలు చేసినట్లు తెలిపెను. అవేవియు నేడు దొఱకవు. అతనికి భాషమీద పదప్రయోగము మీద సంపూర్ణాధికారము కలిగియుండెను. అతడు మనోభావములను చిత్రించుటలోను, సామాజిక పరిస్థితులను వర్ణించుటలోను సిద్ధహస్తుడు. "ఫూల్‌బన్" భారతీయ వాతావరణముగల ఒక ప్రేమగాధ. ఆనాటి సామాజిక పరిస్థితులను, ఆచార వ్యవహారములను కనులకు కట్టినట్లు చిత్రించెను.

పైన వ్రాయబడినట్లు రాజాస్థానముల సంరక్షణ వలన బీజాపూర్, గోలకొండలలో ఎందఱో కవులు జన్మించిరి. ఇచట వారి పేర్లు ఉల్లేఖింపలేము. ఆనాటి ఖడీబోలీ సాహిత్య రూపమగు దక్కనీ ఉర్దూ భారతీయ భాషల ఖజానాలను చాల సమృద్ధముచేసెను. అందు పారసీ సాహిత్య ప్రభావముండెననుట నిస్సందేహము. కాని మొగలాయి యుగమున ఉత్తర భారత దేశమున వెలువడిన దేశీయ భావలహరి దక్షిణదేశమున సాహిత్యరూపము నందెననుట స్పష్టము - ఇదికాక ఒక వైపు ప్రేమ మార్గానుయాయులగు భక్తకవులు "ఇస్లామ్-తసవ్వుఫ్"ను వస్తువగా గ్రహించి గద్య పద్య రచనలు చేయుచుండ, రెండవ వైపు ఇమామ్ హుస్సేన్ పట్ల భక్తికల వారు కర్బలా దుర్ఘటనయొక్క శోకమయ గాథలను మర్సియాలలో రచించుచుండిరి - ఇతర మత విషయక రచనలును సృష్టింపబడుచుండెను. ఈ సంక్షిప్తచరిత్రలో వాని అన్నిటి వర్ణన సాధ్యముకాదు - భారతీయజీవితమును, సమాజ స్థితిని వర్ణించిన కవితలకును, రచనలకును కొదువలేదు. భారతదేశపు ప్రాచీన గాథల ననుసరించియు కొన్ని రచనలు వెలువడినవి. అట్టి వానిలో "మనోహర్-మధుమాలతీ," "పద్మావత్" "చంద్రబదన్-ఔర్-మాహెయార్" మఱియు "తూతీనామా" చదువదగిన గ్రంథములు - క్లుప్తముగా చెప్పవలెనన్న ఆనాటి కవితలో ప్రాంతీయత అధికము. అరబీ,

ఫారసీ పదప్రయోగము స్వల్పము. కవిత రాజదర్బారుల ప్రభావముకలది. అయినను కవులు పాదుషాల ప్రశంసలు చేయవలసినవారు కారు. తద్వ్యతిరేకముగా వారిలో పలువురు మతము మఱియు భక్తి మూలమున కలిగిన స్వాతంత్ర్యభావములు కలవారు. ఆనాటి రచనలు చాలవఱకు నేటి సాహిత్య దృష్టితో విలువ కలవి కావనుటలో సందేహములేదు. కాని పైన పేర్కొనబడిన కావ్యములు మాత్రము చారిత్రక మహత్వమే కాక సాహిత్య గౌరవమును కలవి.

17 వ శతాబ్దము ముగియక మునుపే ఉర్దూభాష గుజరాత్, ఆర్కాట్, మద్రాసు మఱియు మైసూరులలోని కొన్ని ప్రాంతములలో వ్యాపించెను. ఉత్తర భారతమున అది వ్యవహారభాషగా అత్యంతాభివృద్ధి చెందుచుండెను. కాని అందు సాహిత్యము చాల స్వల్పమే ఉత్పన్న మయ్యెను. దక్షిణ దేశమున వెలువడిన సాహిత్యధార, ఇచట స్థాపింపబడిన సంప్రదాయములు బీజాపూర్ మఱియు గోల్కొండ రాజ్యములు మొగలాయి రాజ్యములు కలిసిపోయిన తరువాత కూడ విచ్ఛిన్నములు కాలేదు - ఏలయన సాహిత్యము కేవలము రాజదర్బారులకు సంబంధించినది కాదు - అది ప్రజా జీవితమునకు సన్నిహితమైనది. కనుక క్రీ. శ. 1687 తరువాత దక్షిణ కవులు ఈ సంప్రదాయములనే స్వచ్ఛందముగా ప్రావాహికముగా వికసింపజేసిరి. క్రీ. శ. 1724 న హైదరాబాదలో నూతనముగా ఆసిఫియా రాజ్యము స్థాపితమయ్యెను. ఈ నడిమికాలమున దక్షిణ దేశములో ఎందఱో రత్నములవంటి రచయితలు వెలుగొందిరి. వారిలో 'వలీ' 'బహరీ' మఱియు "సిరాజ్" అను వారు ప్రథమశ్రేణి కవులలో లెక్కింపబడుదురు. వారు కాక "వజ్దీ", "వలీవైలోరీ", "దావూద్" "ఉజ్లత్" మఱియు "అజీజ్" అనువారును ప్రఖ్యాతులే. మొదటి ముగ్గురి కావ్యసంగ్రహములు ప్రకాశితములు. వానిపై సమీక్షలు వ్రాయబడినవి. విమర్శనాత్మక రచనలు వెలువడుచున్నవి. కనుక ఆ కవులను గూర్చి విపులముగా వ్రాయుట అవసరము. ఏలయన వారిలో "వలీ" చారిత్రక మహత్వమును గల దొడ్డ కవి.

"వలీ" ఉర్దూ కవితకు "ఆదమ్" (కవిబ్రహ్మ) అనబడును. చారిత్రక దృష్టితో "వలీ" ని ప్రథమకవియనుట సరికాదు - కాని అతడు దక్షిణదేశపు మహాకవి యనియు అతడు వెలిగించిన జ్యోతివలననే ఉత్తర దేశమున కవితా దీపములు వెలిగెననియు అనుట యథార్థమగును - కొంతకాలము క్రిందటివఱకు "వలీ"ని గూర్చి

అంధేరా జో థా సోగయా న్హాట్‌కర్
సూరజ్ యూం హై రంగ్ ఆస్మానీ మనే
కి ఖిలియా కమల్ ఫూల్ పానీ మనే. 1

* * * *

"వఝీ" గద్యములో "సబ్‌రస్" అను పేర ఒక గొప్ప గ్రంథము వ్రాసెను. అందు సూఫీతత్త్వపు గూఢ భావములు ప్రతీకలు– దీనిని గుఱించి ముందు వ్రాయబడును. సారాంశ మేమన "వఝీ" ఆ యుగపు మహాకవి. మహారచయిత. అతనికి గద్య పద్యములు రెంటిపై సంపూర్ణాధికారము కలిగియుండెను. "వఝీ" జీవిత విశేషములు ఇంతవఱకు ఏమియు తెలియవు. కాని ''ఖుతుబ్ ముష్తరి" క్రీ. శ. 1608 లోను ''సబ్‌రస్'' క్రీ. శ. 1635 లోను రచింపబడినట్లు తెలియును.

ఈ యుగపు రెండవ మహాకవి "గౌవసీ"– ఖుతుబ్షాహీ రాజ్యము అతనికి "మలికుష్షొఅరా" (కవిరాజు) అను బిరుదమిచ్చెను. అతని విషయమింకేదియు తెలియదు. అతని ప్రసిద్ధరచనలు "సైఫుల్ ముల్క్–వ–బదియుజ్జమా" మఱియు "తూతీనామా" అనునవి. ఈ రెంటిలో అతడు అందందు తన్ను గూర్చి కొంత కొంత వ్రాసికొనెను. కాని దాని వలన అతని జీవిత చరిత్ర స్పష్టము కాదు. అతడు ఆరంభమున చాల కష్టజీవనము గడపి ఆస్థాన కవియై గౌరవ ప్రతిష్ఠలు పొంది ఆ యుగపు కవులందఱను మించిన మహాకవిగా లెక్కింపబడుచుండెనని తెలియును. "సైఫుల్ముల్క్" క్రీ. శ. 1624 లోను "తూతీనామా" క్రీ. శ. 1631 లోను వ్రాయబడినవి. మొదటి మస్నవీ ఇతివృత్తము 'అలీఫ్ లైలా' (అరేబియన్ నైట్స్) నుండి గ్రహింపబడిన ఒక ప్రేమకథ. రెండవది "హితోపదేశపు" ఫారసీ అనువాదమునకు అనుసరణ. "గౌవసీ" తన కావ్యములలో ఆత్మస్తుతి చేసికొనినాడు. కాని అది అనుచితము కాదు. వాస్తవముగా అతని కావ్యములు రసభావోదంచితములై సుందరములై సురుచిరములై యున్నవి. అతని భాషలో అరబీ ఫారసీ శబ్దములు చాలతక్కువగా నున్నవి. శైలి సరళము. ప్రవాహము కలది. "సైఫుల్ముల్క్" ప్రకాశితమైనది. కాని "తూతీనామా" ఇంకను అముద్రితము.

---

1. రాత్రి దాగుకొనినది. ప్రభాత కాంతి పర్విడినది. ప్రపంచము పరమేశ్వరుని స్తుతించుచున్నది. ప్రకాశమానుడగు సూర్యుడు త్వరిత గతి వచ్చినంతనే అంధకారము పలాయనమై పోయినది. ఆకాసములో సూర్యుడు నీటిలో కమలము వికసించి నట్లున్నాడు.

ఖుతుబ్షాహీ యుగపు మూడవ మహాకవి, "ఇబిన్నిషాతీ". అతని ప్రసిద్ధ మస్నవీ "ఫూల్‌బన్" ఉర్దూ సాహిత్యనిధిలో ఒక వెలలేని రత్నము. "గార్సా-ద-తాసీ" మఱి కొందఱు పురాతన రచయితలు అతడు "తూతీనామా" అను నొక కావ్యమును కూడ వ్రాసినట్లు అభిప్రాయపడిరి. కాని అది వారి భ్రాంతియే. ఇట్లే "ఫూల్‌బన్"ను గూర్చియు కొన్ని భ్రాంతి మూలకములగు అభిప్రాయము:లు వెల్లడించిరి. ఇప్పుడు "ఫూల్‌బన్" ప్రకాశితమైనది. దానిని చదువుట వలన సరియైన సంగతులు తెలియును. "ఇబిన్నిషాతీ" ఫారసీ భాషలో పండితుడు. కావ్య శాస్త్ర ప్రవీణుడు. "ఫూల్‌బన్" ప్రారంభమున అతడు ఆత్మ ప్రశంసయు కావ్య ప్రశంసయు చేయుచు తాను గద్యములోను అనేక రచనలు చేసినట్లు తెలిపెను. అవేవియు నేడు దొఱకవు. అతనికి భాషమీద పదప్రయోగము మీద సంపూర్ణాధికారము కలిగియుండెను. అతడు మనోభావములను చిత్రించుటలోను, సామాజిక పరిస్థితులను వర్ణించుటలోను సిద్ధహస్తుడు. "ఫూల్‌బన్" భారతీయ వాతావరణముగల ఒక ప్రేమగాధ. ఆనాటి సామాజిక పరిస్థితులను, ఆచార వ్యవహారములను కనులకు కట్టినట్లు చిత్రించెను.

పైన వ్రాయబడినట్లు రాజాస్థానముల సంరక్షణ వలన బీజాపూర్, గోలకొండలలో ఎందరో కవులు జన్మించిరి. ఇచట వారి పేర్లు ఉల్లేఖింపలేము. ఆనాటి ఖడీబోలీ సాహిత్య రూపమగు దక్కనీ ఉర్దూ భారతీయ భాషల ఖజానాలను చాల సమృద్ధముచేసెను. అందు పారసీ సాహిత్య ప్రభావముండెననుట నిస్సందేహము. కాని మొగలాయి యుగమున ఉత్తర భారత దేశమున వెలువడిన దేశీయ భావలహరి దక్షిణదేశమున సాహిత్యరూపము నందెననుట స్పష్టము - ఇదికాక ఒక వైపు ప్రేమ మార్గానుయాయులగు భక్తకవులు "ఇస్లామ్-తసవ్వుఫ్"ను వస్తువగా గ్రహించి గద్య పద్య రచనలు చేయుచుండ, రెండవ వైపు ఇమామ్ హుస్సేన్ పట్ల భక్తికల వారు కర్బలా దుర్ఘటనయొక్క శోకమయ గాథలను మర్సియాలలో రచించుచుండిరి - ఇతర మత విషయక రచనలును సృష్టింపబడుచుండెను. ఈ సంక్షిప్త చరిత్రలో వాని అన్నిటి వర్ణన సాధ్యముకాదు - భారతీయజీవితమును, సమాజ స్థితిని వర్ణించిన కవితలకును, రచనలకును కొదువలేదు. భారతదేశపు ప్రాచీన గాథల ననుసరించియు కొన్ని రచనలు వెలువడినవి. అట్టి వానిలో "మనోహర్-మధుమాలతీ," "పద్మావత్" "చంద్రబదన్-ఔర్-మాహెయార్" మఱియు "తూతీనామా" చదువదగిన గ్రంథములు - క్లుప్తముగా చెప్పవలెనన్న ఆనాటి కవితలో ప్రాంతీయత అధికము. అరబీ,

ఫారసీ పదప్రయోగము స్వల్పము. కవిత రాజదర్బారుల ప్రభావముకలది. అయినను కవులు పాదుషాల ప్రశంసలు చేయవలసినవారు కారు. తద్వ్యతిరేకముగా వారిలో పలువురు మతము మఱియు భక్తి మూలమున కలిగిన స్వాతంత్ర్యభావములు కలవారు. ఆనాటి రచనలు చాలవఱకు నేటి సాహిత్య దృష్టితో విలువ కలవి కావనుటలో సందేహములేదు. కాని పైన పేర్కొనబడిన కావ్యములు మాత్రము చారిత్రక మహత్వమే కాక సాహిత్య గౌరవమును కలవి.

17 వ శతాబ్దము ముగియక మునుపే ఉర్దూభాష గుజరాత్, ఆర్కాట్, మద్రాసు మఱియు మైసూరులలోని కొన్ని ప్రాంతములలో వ్యాపించెను. ఉత్తర భారతమున అది వ్యవహారభాషగా అత్యంతాభివృద్ధి చెందుచుండెను. కాని అందు సాహిత్యము చాల స్వల్పమే ఉత్పన్న మయ్యెను. దక్షిణ దేశమున వెలువడిన సాహిత్యధార, ఇచట స్థాపింపబడిన సంప్రదాయములు బీజాపూర్ మఱియు గోల్కొండ రాజ్యములు మొగలాయి రాజ్యములు కలిసిపోయిన తరువాత కూడ విచ్ఛిన్నములు కాలేదు – ఏలయన సాహిత్యము కేవలము రాజదర్బారులకు సంబంధించినది కాదు – అది ప్రజా జీవితమునకు సన్నిహితమైనది. కనుక క్రీ. శ. 1687 తరువాత దక్షిణ కవులు ఈ సంప్రదాయములనే స్వచ్ఛందముగా ప్రావాహికముగా వికసింపజేసిరి. క్రీ. శ. 1724 న హైదరాబాదలో నూతనముగా ఆసిఫియా రాజ్యము స్థాపితమయ్యెను. ఈ నడిమికాలమున దక్షిణ దేశములో ఎందఱో రత్నములవంటి రచయితలు వెలుగొందిరి. వారిలో 'వలీ' 'బహరీ' మఱియు "సిరాజ్" అను వారు ప్రథమశ్రేణి కవులలో లెక్కింపబడుదురు. వారు కాక "వజ్దీ", "వలీవైలోరీ", "దావూద్" "ఉజ్లత్" మఱియు "అజీజ్" అనువారును ప్రఖ్యాతులే. మొదటి ముగ్గురి కావ్యసంగ్రహములు ప్రకాశితములు. వానిపై సమీక్షలు వ్రాయబడినవి. విమర్శనాత్మక రచనలు వెలువడుచున్నవి. కనుక ఆ కవులను గూర్చి విపులముగా వ్రాయుట అవసరము. ఏలయన వారిలో "వలీ" చారిత్రక మహత్వమును గల దొడ్డ కవి.

"వలీ" ఉర్దూ కవితకు "ఆదమ్" (కవిబ్రహ్మ) అనబడును. చారిత్రక దృష్టితో "వలీ" ని ప్రథమకవియనుట సరికాదు – కాని అతడు దక్షిణదేశపు మహాకవి యనియు అతడు వెలిగించిన జ్యోతివలననే ఉత్తర దేశమున కవితా దీపములు వెలిగెననియు అనుట యథార్థమగును – కొంతకాలము క్రిందటివఱకు "వలీ"ని గూర్చి

అంతగా తెలియదు. ఇప్పుడు చాల విషయసేకరణ జరిగినది. అతని జన్మస్థానము, అతని మరణమునుగూర్చి నిర్ధరించి చెప్పదగిన కొన్ని సంగతులు తెలిసినవి.

"వలీ" పేరు వలీమొహమ్మదు. విద్యను విజ్ఞానమును సంపాదింప వలయునను అభిలాషతో అతడు తన జన్మస్థానమగు అహమదాబాదను విడిచి ఔరంగాబాద, సూరత్ మఱియు దిల్లీనగరములు పర్యటించెను. అచట కవులను, సూఫీలను, జ్ఞానులను దర్శించి తన అభిలాష నెరవేర్చుకొనుటకు ప్రయత్నించెను. అతనికి "తసవ్వుఫ్" (సూఫీ తత్త్వము) తో హార్దికానుబంధము కలిగి యుండెను. ఆ అనుబంధము అతని కవితలలోను గోచరించును. అతడు దిల్లీలో అచటి ప్రఖ్యాత సూఫీ కవియగు సాదుల్లా "గుల్షన్"ను దర్శించెను. వలీ దిల్లీకి ఎన్ని తడవలు వెళ్ళెనో సరిగా తెలియదు. అతడు అహమదాబాదలో క్రీ. శ. 1707న మరణించెను.

"వలీ" కావ్యసంగ్రహము పలుతడవలు ప్రకాశితమైనది. సుప్రసిద్ధ ఫ్రెంచి విద్వాంసుడగు "గార్స-ద-తసా" కూడ అతని కావ్యసంగ్రహమును ఫ్రెంచి పీఠికతో ప్రచురించు కొనెను. "వలీ" గజల్ మస్నవీ, ఖసీదా మొదలగు సర్వవిధముల కవితలు వ్రాసెను. అతని కవిత అతని కంటె ముందే దిల్లీ చేరెననియు, అచటి వీధులలో, బాజారులలో ప్రచారము పొందుచుండెననియు అందురు. అనగా ఉత్తర దక్షిణదేశములలో సాహిత్య సంబంధ మేర్పడెను. దిల్లీ కవులకు "వలీ" కవితలు నవీనములు, అనుపమములు. అతడు దిల్లీ చేరగనే ఘనమైన స్వాగతము జరిగెను. అప్పటి దిల్లీకవులలో అధికులు ఫారసీలోనే వ్రాయువారు. కవితా సుందరికి వ్యావహారికభాష అను సామాన్యపుటుడుపులు తొడుగుట అవమానమని భావించువారు. "వలీ" కవిత చూడగనే తాము మాటలాడు భాషలో కవిత చెప్పుటయు మనోహర ప్రక్రియయే అని తెలిసెను. అందు కృత కృత్యులగు విశ్వాసమును కలిగెను.

"వలీ" గజలులలో చాల వఱకు ప్రేమ భావములే వివిధ రీతులలో ప్రకటింపబడినవి. ఈ ప్రేమ వ్యాపకమై సూఫీతత్త్వపు ప్రేమ రూపము దాల్చెను. ఉర్దూ కవితలో ఆది నుండియు సూఫీభావములు ప్రచారమగుచునే ఉన్నవి. "వలీ" ఆ భావములను సుందరముగా, ప్రోత్సాహముగా శక్తివంతంగా ప్రకటించెను. గజలులలో సాధారణ మనోభావములను స్వీయభావములవలెనే వెల్లడించ వచ్చును. సూఫీ మతము ఆంతరంగిక భావములను ఆధ్యాత్మిక భావములతో ముడి వెట్టును.

నుక "వలీ" గజలులలో గూఢతతో పాటు ప్రేమించు వాని వాస్తవిక కల్పనలు 'ననగును. "వలీ" కవితలపై ఫారసీ కవుల ప్రభావ మధికము. అతని భావములును 'ల చోట్ల వారి భావములను పోలియుండును. అయినను అతని కవితలోని వాస్తవికత లన ఆ భావములు అడిగి తెచ్చుకొనిన వనిపించవు.

ముఖ్యముగా ఆలోచించ వలసిన విషయము "వలీ" భాష. తొలి 'ళ్ళలో అతని భాష దకనీ ఉర్దూ కావ్య సంప్రదాయములకు సంబంధించినది. తడు దక్షిణమునుండి భారతదేశపు ఇతర భాగములకు వెళ్ళినాడు. ఉర్దూ భాషకు ంద్రమగు ఢిల్లీకిని వెళ్ళినాడు. కనుక అతని భాష మార్పుచెందినది. ఈ మార్పునకు ంకెన్నియో కారణములు ఉండియుండును. "వలీ" అహమదాబాదలోను ఔరంగా ాదలోను నివసించెను. ఔరంగాబాద చాల కాలమునుండి ఢిల్లీతో సంబంధము కలిగి యుండెను. అచటి భాష ఢిల్లీభాషా ప్రభావము కలది. ఇదియే గాక దక్షిణ దేశము ల్లీ రాజ్యమున కలిసిపోయి నందున రెండు దేశములలో రాక పోకలును సాగు ంండెను. కనుక అతని తరువాతి కాలపు కవితలో 'ఖడీబోలీ' ఛాయలు కాన్పిం ను. క్రీ. శ. 1700 సంవత్సరమున అతడు ఢిల్లీలోని షాహ "గుల్షన్"ను కలిసి పప్పుడు అతడు ఫారసీ విషయములను భావములను ఉర్దూలో అనువదించుటకై దేశించెనని చెప్పుదురు. "వలీ" అతని ఆ దేశము ననుసరించి ఫారసీనుండి అధిక ాభము పొంది యుండును. అతడు సరళములును శుద్ధములును అగు పదములు ప్రయోగించునప్పుడు అతని భాష వ్యావహారికమునకు సమీపమైయుండును. ఉదాహరణ కొఱకు ఈ పద్యపాదములు చూడుడు;

జిసే ఇష్క్‌కా తీర్ కారీ లగే
ఉసే జిందగీ క్యోం న భారీ లగే-
నహోవే ఉసే జగ్‌మే హర్‌గిజ్ ఖరార్
జిసే ఇష్క్‌కీ బేఖరారీ లగే-
''వలీ'' కో కహే తూ అగర్ ఏక్ బచన్
రఖీ బోంకె దిల్‌కో కటారీ లగే. 1

1. ఎవరికి ప్రేమ బాణము గాఢముగా నాటుకొనునో వారికి జీవితము భారమెందుకు కాకుండును? ప్రేమ వలని వ్యాకులపాటు కలిగిన వారికి ప్రపంచములో మనస్తిమితము కలుగదు. 'వలీ'తో నీ వొకసారి మాటాడుదువేని పగవారి గుండెలకు కత్తి పెట్టువలె ఉండును.

సజన్ తుమ్‌ముఖ్‌సేతీ ఖోలో నఖాబ్ ఆహిస్తా ఆహిస్తా
కీ జ్యోఁగుల్ సే నికల్తాహై గులాబ్ ఆహిస్తా ఆహిస్తా
హజారాఁ లాఖ్ ఖూబాఁ మే సజన్‌మేరా చలే యూఁకర్
సితారోమ్మే చలే జ్యూఁ మా హతాబ్ ఆహిస్తా ఆహిస్తా
సలోనే సాఁవరే పీతమ్ తేరే మోతీకి ఝల్కాఁ నే
కియా అఖదే సురయ్యాకో ఖరాబ్ ఆహిస్తా ఆహిస్తా. 2

పారసీ మిశ్రితమగు ఉర్దూ కవిత మచ్చుతునక :—

హుస్న్‌కా మస్నద్ నషీఁ వో దిల్బరే ముమ్తాజ్‌హై
దిల్బరోంకా హుస్న్ జిస్ మస్నద్ కా పా అందాజ్‌హై
గైరెహైరత్ హై ఖబర్ ఉస్ ఆయినా-రూకీ కిసే
రాజ్‌కే పర్దేమే జిస్కీ ఖాముషీ ఆవాజ్‌హై
యాద్‌సే ఉస్ రష్కే-గుల్జారే-ఇరమ్ కే ఐ "వలీ"
రంగ్ కో మేరే సదా జ్యోఁ బూయె-గుల్ పర్వాజ్‌హై 3

---

2. ప్రేయసీ! గులాబిపూవు నుండి మెల్లమెల్లగా (పన్నీరు) అత్తరువు వెడలినట్లు నీ ముఖముపైనుండి మెల్లమెల్లగా తెర తొలగించుము.
వేల లక్షల సంఖ్యలో గల సుందరులలో నా ప్రియురాలు చుక్కలలో చంద్రుడు నడచునట్లు మెల్లమెల్లగా నడచును.
శ్యామ వర్ణముగల సుందరీ! (ఇట సుందరా! అనిన కృష్ణునివైపు సంకేత పఱచుట యగును. ఇట్లనుట ఉర్దూకవులకు సంప్రదాయము కూడను)
నీరదన కాంతి చుక్కల సమూహమును (అఖదె సురయ్యా అనగా కృత్తికా నక్షత్రమందురు) అవమాన పఱచును.

3. ఆ సర్వోత్తమ సుందరి సౌందర్య పీఠమున ఆసీనురాలు. ప్రియురాండ్ర సౌందర్యము ముందు కాళ్లు తుడుచుకొను గద్దెవంటిది. దర్పణము వంటి వదనముగల ఆమెను విభ్రాంతి తప్ప గ్రహించువ దెవరు? రహస్యమను తెరచాటున ఆమె మౌనమే శబ్దము
"ఇరమ్" ఉద్యానము (ఇది స్వర్గములోని ఉద్యానవనము. మననందనము వంటిది) సైతము అసూయ పడునట్టి ఆమెను స్మరించుట వలన పుష్పములోని సౌరభము నా వర్ణము ఎల్లపుడు ఎగిరి పోవుచుండును.

పైన చెప్పబడినట్లు "వలీ" ఉర్దూ భాషలోని ప్రథమ కవులలో లెక్కింపబడును. అతని కావ్యరచన కంటె అతడు ఉత్తర దేశపు భాషపై కలిగించిన ప్రభావము గొప్పది – దాని వర్ణనము ముందు చేయబడును.

ఖాజీమహమూదు "బహరీ" ఈ యుగపు రెండవ మహాకవి. అతడు గొప్ప సూఫీ కవి. సూఫీ తత్త్వ రహస్య విషయముగల అతని "మణాలగణా" అను మస్నవీ పలు తడవలు ప్రకాశిత మైనది. అతని గజలులసంగ్రహము కొన్నినాళ్ల క్రిందట లభించినది. అదియు ప్రకాశిత మైనది. "బహరీ" బీజాపురము నందలి ఒక గ్రామవాసి. బీజాపుర రాజ్యము మొగలాయి వారి స్వాధీనమైన పిదప అతడు హైదరాబాదునకు వెళ్లెను. అతని భాష ప్రాచీనులగు దకనీ కవుల భాషయే. "మణాలగణా" పలుతడవలు ప్రకాశిత మగుటయే దానిపై గల ప్రజాభిమానమును స్పష్ట పఱచును. అందు సూఫీ తత్త్వమునకు సంబంధించిన జటిలములు, గూఢములు అగు భావములు కలవు. అవి సులభముగా బోధపడునవి కావు. అందువలన "బహరీ" స్వయముగా పారసీలో వ్యాఖ్యానము వ్రాసెను. అతని శిష్యుడొకడు ఆ వ్యాఖ్యానమును "అర్థమణాలగణా" అనుపేర వచనమున వ్రాసెను. "బహరీ" భాష సరళము – నిరాడంబరము. ఉదాహరణ కొఱకు కొన్ని పద్య పాదములు:—

* * * *

సూర్ తుర్ఝ ముఖ్ మిసాల్నై సచ్హై
లాల్ తుర్ఝ లబ్‌సే లాల్నై సచ్హై
ధన్ తేరే మద్ మతే నయన్ కే నిమన్
పుర్తగాలీ కలాల్నై సచ్హై
అబ్ ఖుషామద్ తూ బస్‌కర్ ఐ ''బహరీ''.
తుర్ఝపర్ ఉస్కా ఖ్యాల్ నై సచ్హై. 1

* * * *

1. సూర్యుడు నీముఖమునకు సమానుడు కాడు. ఇది సత్యము. కెంపులు నీ పెదవుల కంటె ఎఱ్ఱనివి కావు. ఇది సత్యము. నీ మదిరాక్షులవలె 'బుడుతకీచు' సారాయి వర్తకుడు ధన్యుడు కాడు– ఇది సత్యము.
బహరీ ! ఇక స్తోత్ర పాఠము కట్టిపెట్టుము. ఆమెకు నీపై శ్రద్ధలేదు. ఇది సత్యము.

"సిరాజ్" ఔరంగాబాద, ఈ యుగపు మూడవ మహాకవి. అతని జన్మ స్థానము ఔరంగబాద. బాల్యము నుండియు అతడు సౌందర్యో పాసకుడు – యౌవ్వనము రాకముందే అతనికి ఉన్మాదావస్థ కలిగెను – ఆ యవస్థలో ఏడేండ్లుండి ఆపైన సూఫీ ఫక్కీరుల సహవాసమున గడపెను. ఉన్మాదావస్థలో నుండగా ఆతడు ఫారసీ రచనలు అనేకము చేసెను. కాని అవి నష్టమైనవి. అందలి కొంత భాగము మాత్రము ప్రకాశితమయిన అతని కావ్య సంగ్రహమున చేరినది.

ఉర్దూ సూఫీ కవులలో "సిరాజ్" ఉన్నత స్థానము గల కవి. అతని జీవితమునకును కవితలకును గాఢమగు సంబంధము కన్పించును. రెంటిలోను తన్మయత ఆవేశము గోచరించును. అతని కావ్యసంగ్రహమున అన్నిరకముల కవితలు కలవు. కాని అతని గజలులు మఱియు "బోస్తానె–ఖ్యాల్" అను మస్నవీ అతని ప్రసిద్ధికి కారణములు.

"బోస్తానె–ఖ్యాల్" క్రీ. శ. 1747 లో వ్రాయబడినది. అదొక బృహద్రచన. అందు (1160) పద్యపాదములున్నవి. దానినతడు కేవలము రెండు దినములలో వ్రాసెను. ఇది స్వీయకథ వంటిది. శైలి సరళ సుందరము – ప్రేమించిన ఒక కవి జీవితమును ఇంతవాస్తవికముగా ఇంతసుందరముగా సామాన్యకవి యెవడును వ్రాయ జాలడు – భావనల ప్రవాహము, అనుభూతులయాదార్ఢ్యము వలన ఈ మస్నవీ ఉర్దూలోని గొప్ప రచనలలో లెక్కింప బడుచున్నది. "సిరాజ్" గజలులు చాల సుందరములు – మనోజ్ఞములు. ప్రభావ సహితములు. గజలు రచనలో అతడు "వలీ"ని అనుకరించెను. తన కవితలలో పలుతావుల "వలీ" పేరు సగౌరవముగా స్మరించెను. "సిరాజ్" భాష దకనీ భాషకంటె ఉత్తరభాషచేతనే అధికముగా ప్రభావితము – అతని మిత్రులును శిష్యులును అతనికి కవిగానే కాక భక్తుడుగా చిరకీర్తి సాధించుటకై అతని సమాధిని కట్టించిరి. అది నేటికిని ఔరంగాబాదలో కలదు.

ఉదాహరణ కొఱకు కొన్ని పద్య పాదములు:—

సబ్ జగత్ ఢూండ్ ఫిరా పియుకొన పాయా హర్‌గిజ్
దిల్ కె గోషేమే మకాంథా ముఝే మాలూమ్ నథా 1

* * * *

1. ప్రపంచ మంతట వెదకితిని ఎంతకును ప్రియుడు దొఱక లేదు. నా హృదయపు మూలలోనే అతని నివాసము. ఆ సంగతి నాకు తెలియలేదు.

ఖబరే-తహయ్యురే-ఇష్క్ సున్ న జునూఁ రహా, నపరీ రహీ
నతో తూరహా, నతో మైరహా, జోరహీసో బేఖబరీ రహీ
చలీసిమై గైబుసే వో హవాకి చమన్ సురూర్ కాజల్ గయా
మగర్ ఏక్ షాఖె-నెహాలె -గమ్, జిసెదిల్ కహో సొహరీ రహీ 2

* * * *

ముద్దత్‌సే గుమ్‌హు వాదిలే - బేగానా ఐ"సిరాజ్"
షాయద్ కీ జాలగా హై కిసీ ఆష్నాకె హాథ్. 3

ఈ కాలమునాటికి ఉత్తర భారతదేశమున ఉర్దూ కవిత చాల ప్రచారము పొందినది. ముందునకు వెళ్లుటకు ముందు దక్షిణదేశపు సాహిత్యకోశము నొకసారి చూడవలెను. 15 వ శతాబ్దమునుండి 18 వ శతాబ్దము వఱకు దక్షిణపు ఉర్దూ చాల మట్టుకు ఉత్తరభారతమునుండి స్వతంత్రమైయుండియే ఉన్నతిగాంచెను. ఆరంభమున ఉత్తరమునుండి మహారాష్ట్రమునకు ద్రావిడభాషలకు నడుమచేరిన ఆ భాషను సూఫీ కవులే స్వీకరించిరి. కాని కొలదికాలములోనే ఆ భాష ఇట ప్రేళ్లుతన్ని వ్యాపించెను. అన్ని అవసరములు దాని ద్వారమున తీరుచుండెను - అది అధికముగా ముసల్మానుల భాషయే అనుటలో సందేహములేదు - కాని కళాకౌశలములందును ఇతర సాంస్కృతిక విభాగములందును ప్రారంభమయిన హిందూ ముస్లిమ్ సమైక్యతకు ప్రతీకగా నిలిచిన ఒక భారతీయ భాష అనుట సమంజసము.

ఇచట ఇంకొక సంగతి తెల్పుట అవసరము. ''వలీ'' ఉర్దూభాష ముఖమును భారత దేశమునుండి మరలించి ఈరాను (పర్షియా) వైపు త్రిప్పె ననియు అతని వలన దకనీ ఉర్దూలో గల భారతీయత నశించెననియు ఆరోపణము చేతురు - కాని ఉత్తర భారతదేశపు భాషల అభివృద్ధి కారణములను ఎఱుగనట్టివారే ఇట్లు ఆరోపింపగలరు. మొగలురాజ్య పతనము ప్రారంభమయిన నాటినుండియే "అవధీ" భాషయు

2. ప్రేమ చకితమైన సంగతివిని నంతనే ఉన్మాదము లేకుండ పోయినది. దివ్యాంగన పోయినది. నీవులేవు. నేను లేను. ఇక మిగిలిన దొకటి ఆత్మ విస్మృతియే.
ఆనందమను తోటను శుష్కింప జేయునట్టి గాలి ఆకసము వైపు నుండి వీచెను. శోక వృక్షపు కొమ్మ దానినే హృదయ మందురు. అదొకటి మాత్రము పచ్చగానే ఉన్నది.

3. సిరాజ్ : చాలకాలము నుండి ఆత్మీయము కాని నా హృదయము ఎచటనో పోయినది. ఎవరేని ఆత్మీయుని చేతికి దొఱకియుండును.

"బ్రజ" భాషయు సాహిత్యరూపమున అభివృద్ధిచెందుట ఉడిగెను–అప్పుడు ఏ"కబీరు" జాయెసీ, రహీము, సూరదాసు, మీరాబాయి, తులసీదాసు జన్మింపలేదు. రెండవ కారణమేమన హిందూ విద్వాంసులైనను ముసల్మాను విద్వాంసులైనను సామ్రాజ్య కాలపు గౌరవమును దృష్టియందిడుకొని ఫారసీ భాషనే అభిమానించిరి. పరస్పర వ్యవహారముల కొఱకు ప్రాంతీయ భాషలను ఉపయోగించిరి. వారికి తమ భాషలలో సాహిత్యశక్తి కలదను విషయమే తెలియకుండెను–"వలీ" దిల్లీచేరి ప్రగతిచెందుచున్న ఆ భాషను చూచెను. అది దకనీ ఉర్దూకు సమానమే అనిపించినను అంతకంటె భిన్నము. కనుక అతడు తన భావములను ప్రకటించుటకై ఆ భాషనే స్వీకరించెను. అతడు ఉత్తరదేశపు కవులకు తమ భాషలో కావ్యరచన చేయు సాహసము కలిగించి దానికి ప్రతిఫలముగా అంతకంటె సుందరమును, ప్రగతి శీలమును అగు భాషను దక్షిణదేశమునకు కొనిపోయెనని అనవచ్చును – ఇందులో వింతలేదు. రెండును ఒకే భాషయొక్క రెండు రూపములు – అతడు ఒకదాని సహాయమున ఇంకొక దానిని ప్రతిభావంతముగా ప్రబలముగా చేయదలచెను – ఉత్తర దక్షిణ భారతములను కలుప దలచెను– అతడు ప్రయత్నపూర్వకముగా తన భాషను ఫారసీ మిశ్రితముచేయలేదు. దకనీ ఉర్దూను దాని జన్మస్థానపు ఉర్దూకు సన్నిహిత మొనర్చు ప్రయత్నముచేసెను. ఉత్తర దేశముతో సంపర్కము లేనందున దకనీ ఉర్దూ ప్రవాహము అరికట్టబడి యుండెను. రెంటి ప్రవాహములు మరల కలిసికొని సమాన ఛాయాలో ప్రవహింప సాగెను.



## మూడవ అధ్యాయము

# 18 వ శతాబ్దిలో దిల్లీ

ఉర్దూ భాష దిల్లీ పరిసరప్రాంతముల జన్మించియు చాలకాలము వఱకు అచట సాహిత్య రూపమున వికాసము పొందకుండుట ఆశ్చర్యము. చుట్టముచూపుగా దక్షిణమునకు వెళ్ళి అట అత్యంతాభివృద్ధిచెందెను. ఇందుకు కొన్ని కారణములు పూర్వపు అధ్యాయములలో సూచింపబడినవి. సంక్షిప్తమగు ఈ గ్రంథమున అంతకంటె విపులముగా తెల్పుట అసంభవము. ఉత్తరభారతమున ఈ భాష వ్యావహారిక భాషగా దినదినాభివృద్ధి చెందుచుండెను. సాంస్కృతిక రంగమున ఫారసీ ప్రాబల్యమధికమగుటవలన ఈ వ్యావహారిక భాషకు కావ్యత్వ మొసగుపట్ల విద్వజ్జనులు సంకోచించుచుండిరి. సామ్రాజ్యవాదము ప్రబలియున్న కాలమున ఉచ్చవర్గీయుల ఆమోదము పొందిన భాషముందు అన్యభాషలు అతి సామాన్యములును అల్పములునుగా తోచును. కనుక చాలకాలము వఱకు వ్యావహారిక భాష, కావ్యభాష రెండును వేరు వేరుగా నడచినవి. కళాకౌశలములకు సంబంధించిన ఇతర క్షేత్రములలో పరస్పరసమ్మేళనము వలన నూత్న శైలులు రూపొందుచున్న కాలమున భావ ప్రకటనకు ముఖ్యసాధనమగు భాష ఈ విధముగా ఉండిపోవుటకు వేరు కారణము లేముండును ?

పూర్వ పరిస్థితులను విడిచి, మొగలాయి వారి నాటి సామాజిక వ్యవస్థను పరిశీలింతుమేని అనేక కారణముల వలన ఆనాడు ఫారసీ యొకటే ప్రాధాన్యము పొందుటకు అవకాశముండెనను సంగతి తెలియును. ప్రతికూల పరిస్థితుల వలన దుర్బలమగుచున్న రాజ్యముతోపాటు ఫారసీ భాషయు తన ప్రభావమును కోల్పోవుచుండెను. హిందూస్థానీ మాతృభాషగా కలవారును ఫారసీలో వ్రాయుట, చదువుటయే సభ్యతా లక్షణమని భావించు విచిత్ర వ్యవస్థ అది. కళలతో విద్యతో సంబంధముగల ఉచ్చశ్రేణి ప్రజల సామాజిక సాంస్కృతిక సంప్రదాయములు ఫారసీలోనే వికసితములగుచుండెను. హిందూస్థానపు భాష ఉర్దూరూపమున మధ్యతరగతి ప్రజలలోను సామాన్య ప్రజలలోను ప్రచలితమగు చుండెను. ఒక స్వల్పాధారము, ఒక చిన్న సూచన లభించినచో భాష కలచోట సాహిత్యము జన్మించుట సహజము. "వలీ" దక్కనీ రాక వలన ఆధారము మఱియు సూచన లభించెను. వ్యావహారిక భాషలో కోమలభావ ప్రకటన కాజాలదను భ్రాంతి కవుల హృదయములనుండి విడిపోయెను.

17 వ శతాబ్దిలో ఉత్తరమున కొందరు ఉర్దూ కవులు ఉన్నట్లు తెలియును. కాని వారంత ప్రఖ్యాతులు కారు. వారిలో జాఫర్ "జటెల్లీ", "అటల్", "అఫ్జల్" మరియు ఇతరులు కొందరు కొంత కొంత కావ్య సృష్టి చేసిరి. కాని నిజమునకు 18 వ శతాబ్దముననే సాహిత్య సృష్టి ప్రారంభమైనదనవచ్చును. "వలీ" దిల్లీకి వచ్చునాటికి ఉత్తరమున ఉర్దూ భాషలో కావ్యరచనచేయు ప్రసిద్ధ కవులెవరునులేరు. క్రీ. శ. 1720 ప్రాంతమున ఫారసీలో కావ్యరచన చేయు దిల్లీ కవులు కొందరు ఉర్దూలోను వ్రాయసాగిరి. "ఫిత్రత్". "ఉమ్మీద్", "బేదిల్", "నదీమ్" మరియు "ఆర్జూ" అనువారు ఫారసీ కవులు, విద్వాంసులు – వారు ఒకటి రెండు పద్యములు అప్పుడప్పుడు ఉర్దూలోను రచించిరి. అందరలో "ఆర్జూ" సుప్రసిద్ధుడు. అతని అజమాయిషీలో అనేకులు ఉర్దూ పద్యము లల్లిరి. కాని ఆనాటి వారి పద్యములు ఒక చరణము ఉర్దూ దయిన రెండవ చరణము ఫారసీది. అప్పుడప్పుడు ఒకే చరణమున సగము ఫారసీ, సగము ఉర్దూ. కొన్నియెడల భావమంతయు ఫారసీది. నిర్దుష్టమగు ఉర్దూ రచన 18 వ శతాబ్దారంభము నుండి లభ్యమగును. ఆనాటి రాజకీయ వ్యవహారముల భాష ఫారసీ. కవుల భాష ప్రజావాణియగు హిందూస్థానీ. ఉన్నత శ్రేణికి చెందిన వారింకను ఫారసీ మహిమనే గుర్తించుచున్నను ప్రజాసామాన్యమున హిందూస్థానీ వ్రేళ్లు తన్ని వ్యాపింపసాగెను. దిల్లీ కావ్యరంగమున జరిగిన పరివర్తనములివి. తొలుత ఫారసీ కవులు ఒకటి అర ఉర్దూ చరణములుకల ఫారసీ పద్యము లల్లిరి. తరువాత కవిత అంతయు ఫారసీలోనే సాగెను. ఆపైన ఫారసీని విడిచి అచ్చము ఉర్దూలోనే కావ్యరచన చేయబడెను. ఆ కవులు పొందిన శిక్షణయంతయు ఫారసీలోనే. వారి ఆత్మలలో ఫారసీ కవిత ఇరవుకొనినది. వారి సమ్ముఖమున ఫారసీ ఉదాహరణలే ఉండెను. ఫారసీ సాహిత్యవేత్తలు చూపిన మార్గముపైననే వారు నడువగలిగి యుండిరి. వారు తమ కావ్యరచన కొఱకు స్వీకరించిన వస్తువులన్నియు అధికముగా ఫారసీలోనే ప్రచలితములు. వీటన్నిటి చారిత్రక సామాజిక కారణములు స్పష్టములు. కనుక వాని విశదీకరణ అనవసరము.

క్రీ. శ. 1719 లో సింహాసనమెక్కిన మొహమ్మద్‌షా బాదుషా కాలమే ఉత్తర భారత దేశమున కావ్య సాహిత్య ప్రారంభకాలమని ఉర్దూ సాహిత్య వేత్తలు నిర్ణయించిరి. మొహమ్మద్‌షా కవిత లభించినది. కాని అతని రచనలెన్నియో నిశ్చయముగా తెలియదు – ప్రపంచము మారినది. అక్బర్, జహంగీర్ మఱియు షాహజహానుల కాలమున అబుల్ ఫజల్, ఫైజీ, ఉర్ఫీ, నజీరీ, సాయెబ్, ఖుద్సీ మఱియు

'కలీము' లను కవులు ఆస్థానశోభ నతిశయింపజేసినవారు. ఇప్పుడు ఉర్దూ కవుల కాలము – వారిలో కొందఱు ఆస్థానమునకు సంబంధించినవారు. కొందఱు బయటి వారు. ప్రారంభమున ఉర్దూ కవిత దిల్లీ రాజదర్బారుతో అంతగా సంబంధము కలిగి లేకుండెను. కాని అది సామ్రాజ్యకాల పతనదశ అను సంగతి మఱవరాదు. ఏది లేకున్నను సాహిత్యమును కళలును పాదుషాల, అమీరుల హస్తగతములై యుండెను. మొహమ్మద్‌షా రాజ్యకాలమున జరిగిన రెండు గొప్ప సంఘటనలలో ఒకటి నాదిర్‌షా ఆక్రమణము. రెండవది ఉర్దూ కవిత దిల్లీలో స్థిరపడుట. ఈ రెండు సంఘటనలు మొగలాయిరాజ్య క్షీణతను సూచించును. రాజ్యము ప్రబలమైయుండిన నాదిర్షా దిల్లీని కొల్లగొట్టియుండడు. ప్రజాసామాన్యపు వ్యావహారిక భాష ముఖ్యభాషయై రూపొంది యుండదు. ఈ యుగపు కవులనబడువారు "ఫాయెజ్", "ఆబ్రూ", "నాజీ", "హాతిమ్", "యక్రంగ్", "మజ్హర్‌జాఁజానాఁ", "మజ్నూఁ", "ఫోగాఁ", "తాబా" మొదలగు అనేకులు. వారు "వలీ"కి సమకాలికులు. లేదా కొంత ఇటీవలివారు. ఉర్దూ సాహిత్య చరిత్రలో వీరందరు ఉన్నత స్థానముకలవారు. వీరి భాష సరళమగు హిందూస్థానీ. వీరు ఫారసీ విద్వాంసులగుట ఆ భాషతో లాభము పొందిరి. కాని వీరి భావనలలో భారతీయతయే నిండియుండెను. ఇచటి కవితలో ప్రయోగింపబడు భాషను ఆ కాలమున "రేఖ్తా" అనిరి. రేఖ్తా అనగా కలగా పులగముగానున్న, రాలి పోయిన, పడిపోయిన, సున్నపు గచ్చువలె గట్టిపడిన, అను అర్థములు కలవు. ఈ శబ్దము వలన ఇదొక మిశ్రిత భాషయని తెలియును.

పైన పేర్కొనబడిన కవుల గుఱించి ఇంతవఱకు చాల విషయములు సరిగా తెలియవు. ఆ కాలమున వ్రాయబడిన కవుల చరిత్రల (తజ్కిరాలు) లో కవుల జీవిత విశేషములంతగా రచింపబడక సామాన్య పరిచయమీయబడును. కనుక ఎన్ని తజ్కిరాలు చూచినను వారి జీవిత చరిత్ర సమగ్రముగా లభింపదు. కొందరిని గూర్చి నేటి పరిశోధకులు చాల విషయములు సంగ్రహించిరి. వారి కవితలను కూడ సంపాదించిరి. కాని ఇంకను చేయవలసిన పని చాల మిగిలియున్నది. ఆ కవుల సంక్షిప్త వర్ణనయే ఇట చేయబడును. ఒకటి రెండు పద్యపాదములు ఉదహరింపబడును. దాని వలన ఆ కాలమున దిల్లీలోని ఉర్దూ కవిత్వ స్వరూపమెట్టిదియో బోధపడును.

షాహముబారక్ "ఆబ్రూ" పేరు నజముద్దీన్. ఉపనామము "ఆబ్రూ". అతడు గ్వాలియార్‌లోని ఒక ప్రసిద్ధ సూఫీ సంతానము – "ఆర్జూ" శిష్యుడు. అతడు

క్రీ. శ. 1750 ప్రాంతమున మరణించెను. అతడు తన కావ్యసంగ్రహమును తయారు చేసికొనెను. కాని అది నష్టమైనది. ఇప్పుడతని కవిత "తజ్కిరా"లలో ఎత్తి వ్రాయబడినంత వఱకే లభ్యము. అతడొక 'మస్నవీ'ని కూడ రచించెను. అందు సర్వాంగ వర్ణన రూపమున ప్రియురాలి సౌందర్యము, కాంతి, వేష భూషలను వర్ణించెను. అలంకార ప్రయోగముపై అభిలాష అధికము కనుక అతని కవిత అప్పుడప్పుడు నీరసమనిపించును. అయినను అతని పద్యపాదములలో దిల్లీ వ్యావహారిక భాషలోని కమ్మదనము చలి చూడదగును.

ఉదాహరణ:—

ఫిర్తేథే దష్త్ దష్త్ దివానే కిధర్ గయే
వో ఆషిఖ్ కే హాయె జమానే కిధర్ గయే. 1

* * * *

అఫ్సోస్ హై కి ముఝ్కొ వో యార్ భూల్ జావే
వో షోఖ్, వో మొహబ్బత్, వో ప్యార్ భూల్ జావే. 2

* * * *

ఖౌల్ "ఆబ్రూ" కాథా కి న జావూంగ ఉస్ గలీ
హోకర్కె బేఖరార్ దేఖా ఆజ్ ఫిర్ గయా. 3

* * * *

ఉఠ్ చేత్ క్యోం జునూఁ సతీ ఖాతిర్ నిచంత్ కీ
ఆయీ బహార్ తుఝ్కొ ఖబర్ హై బసంత్ కీ 4

* * * *

1. అడవులలో దిరుగు పిచ్చివారేమైరి? ప్రేమించుకొను ఆ కాలము ఎటుపోయెను?

2. ఆ ప్రియుడు నన్ను, ఆ వాంఛను, ప్రేమను, ప్రీతిని మఱచి పోవుట విచారకరము.

3. "ఆబ్రూ" ఆ వీధిలోనికిక వెళ్లననెను. కాని నేడు వికలుడై మరల వెళ్లినాడు చూడుడు.

4. లెమ్ము. ఉన్మాదముచే మనస్సును స్మరింతువేల? వసంత వచ్చినది. తెలియునా?

సయ్యద్ అహ్మద్ షాకిర్ "నాజీ" నవాబు అమీర్‌ఖాఁ దగ్గఱ సిపాయిగా పనిచేయుచుండెను. అతడు హాస్యప్రియుడు. తన వినోద భాషణములచే ఏడ్చువారిని నవ్వించు చుండెను. కాని తానెప్పుడును నవ్వువాడు కాడట. క్రీ. శ. 1754 లో యౌవనమునందే మరణించెను. అతడు నాదిర్‌షాహ ఆక్రమణమును దిల్లీ వినాశమును తన కనులతో చూచెను. ఆ దృశ్యమును ఒక శోకమయమగు కవితారూపమున చిత్రించెను. అతని కావ్యసంగ్రహ మిప్పుడు దొఱకదు. దిల్లీ వినాశమును గూర్చిన ఆ చారిత్రక కవితయు పూర్తిగా దొఱకలేదు. అతని శైలి ఆనాటిదే. అలంకార ప్రయోగ మధికము - గజలులే ఎక్కువగా వ్రాసెను.

కొన్ని పాదము లివి :—

ఆజ్‌తో నాజీ సజఁ సే కర్‌తూ అప్నా అర్జె హాల్
మర్నె జీనేకా నకర్ బస్వాస్ హోనీ హైసో హై 1

* * * *

నమ్కీఁ - హుస్న్ దేఖ్‌కర్ పీకా
రంగ్ గుల్‌కా ముఝే లగా ఫీకా 2

* * * *

కియా ఫర్దా కవాదా సరోఖద్‌నే
ఖయామత్‌కా జొదిఁ సున్తేథే కబ్‌హై 3

* * ” *

ఈ యుగపు సుప్రసిద్ధ కవులలో "షాహహాతిమ్" గొప్పవాడు. ఎందుకనగా అతడు మహాకవియే కాక ఎందరో మహాకవులకు గురువు. చిరకాలము జీవించినవాడగుట వలన భాషలో కల్గుచుండిన పరివర్తన లెన్నిటితోనో పరిచయము కలవాడు. తన కావ్యరచన మారుచున్నభాష కనుగుణముగా చేసెను. అతని పేరు 'షేఖ్

1. నేడు ప్రియురాలికి ఆత్మనివేదన చేసికొనుము. చావు బ్రదుకుల గూర్చి అనుమానింపకుము. అగునదేదో అగును.

2. ప్రియురాలి లావణ్యము చూచినంత గులాబి పుష్పము వివర్ణ మనిపించినది.

3. ప్రియురాలు రేపటి కొఱకు వాగ్దానము చేసినది - కల్పాంతమందురే అదెప్పుడు కలుగును?

జహూరుద్దీన్.' క్రీ. శ. 1699 లో దిల్లీనగరమున జన్మించెను. బాల్యముననే కవితా రచన కుపక్రమించెను. అప్పుడు దిల్లీలో 'వలీ దక్కనీ' ప్రభావము వ్యాపించి యుండెను. హాతిమ్ కూడ ఆ పద్ధతినే అవలంబించి కృతకృత్యుడయ్యెను. పూర్వ పద్ధతిలో వ్రాసిన కవితలన్నిటిని సంగ్రహ (దీవాన్) రూపమున సిద్ధపఱచుకొనెను. కొంత కాలమైన తరువాత కవితాశైలిమారగనే తానును శైలి మార్చుకొని పరిశుద్ధభాషలో భావప్రధానమగు కవితలు వ్రాయసాగెను. తన పూర్వ సంగ్రహము నుండి కొన్ని కవితలు, క్రొత్త రచనలనుండి కొన్ని కలిపి "దీవాన్ జాదా" అను పేర క్రొత్త సంకలనము తయారుచేసెను. దీని పీఠికలో భాషను గూర్చియు కవితాశైలిని గూర్చియు తన అభిప్రాయములు తెల్పెను. ఈ పీఠిక వలన పరివర్తనము చెందుచున్న ఆ కాలపు అభిరుచులు, అప్పటి పరిస్థితులు తెలిసికొనుటకు వీలు కలదు; కనుక విమర్శనాదృష్టితో ఇది బహుమూల్యము. హాతిమ్ క్రీ. శ. 1781 లోనో లేక 1792 లోనో అస్తమించెను. అతని కవితా వస్తువలు ఆనాటి యితర కవులకువలె ప్రేమ, మఱియు సూఫీతత్త్వమే. తన కావ్యసంగ్రహము చివరి పుటలలో తన శిష్యుల నామావళి తెల్పెను. అందు అందఱి కంటె సుప్రసిద్ధనామము మీర్జారఫీ "సౌదా"ది. అతని గూర్చి ముందు ముందు తెల్పబడును. "హాతిమ్" ఫారసీ కవితలును వ్రాసెను. కాని ఉర్దూ కవిగానే ప్రఖ్యాతుడు. అతని కావ్య సంగ్రహము ప్రకాశితము కాలేదు. ఉదాహరణ కొఱకు కొన్ని పద్యపాదములు:—

జిస్కొ దేఖా సొయహాఁ దుష్మనె జాఁహై అప్నా
దిల్కొ జానేథే హమ్ అప్నా సొ కహాఁ హై అప్నా 1

*  *  *  *

ఖుప్ గయీ హై దిల్‌మె 'హాతిమ్' కే తెరీ బాంకీ నిగాహ్
చల్తె చల్తే టుక్ బతాతా జాతెరా క్యా నామ్ హై 2

*  *  *  *

1. ఎవరిని చూచినను మన ప్రాణ శత్రువులే. హృదయము మన దను కొంటిమి. కాని అది మనదెందు కయినది ?

2. నీ కడకంటి చూపు "హాతిమ్" హృదయమున నాటినది. పోవుచున్నావు సరే. నీ పేరు చెప్పి వెళ్లుము.

జిందగీ దర్దే సర్ హువీ "హాతిమ్"
కబ్ మిలేగా ముఝే పియా మేరా 3

*   *   *   *

పీరీమె హాతిమ్ అబ్‌న జవానీకి యాద్ కర్
సూఖే దరఖ్త్ భీ కహీం హోతేహైం ఫిర్ హరే 4

*   *   *   *

మిర్జామజ్హార్ జాన్ జానాం గొప్ప విద్వాంసుడు. సూఫీ తత్త్వ వేత్త. అతని కవితలు ఉర్దూలో కడుకొలది. అయినను అతని కీర్తి అశేషము. అతని ఉర్దూ కవితలు కొన్ని ఆయాతజ్కిరా (కవుల చరిత్ర)లలో ఉదాహృతములు. భాషను సంస్కరించుటకును, శబ్దార్థములను అయోమయము చేయునట్టి అలంకార వ్యామోహమును తగ్గించుటకును, "మజ్హార్" కృషిచేసెను. ఫారసీ విద్వాంసుడగుట వలన అతని కవితలో ఫారసీ పదము లధికము. క్రీ. శ. 1791 ప్రాంతమున 80 ఏండ్ల వయముగల అతని నెవరో హత్యచేసిరి. ఆనాటి ఉర్దూ కవులనేకులు అతని శిష్యులు. వారిలో "యఖీన్" ప్రసిద్ధుడు. అతని పద్యపాదములు కొన్ని:—

చలీజబ్ గుల్‌కె హాథోంసే లుటాకర్ కార్వాం అప్నా
నఛోడా హాయె బుల్బుల్‌నే చమన్ మే కుఛ్ నిషాం అప్నా
యె హస్రత్ రహగయీ క్యా క్యా మజేసే జిందగీ కర్తే
అగర్ హోతా చమన్ అప్నా, గుల్ అప్నా, బాగ్బాం అప్నా 1

*   *   *   *

3. జీవితమొక తలనొప్పి అయినది. ప్రియుడు నాకెపుడు లభించునో ?

4. వృద్ధాప్యమున యౌవనమును స్మరింపకుము. ఎండిపోయిన చెట్లు మరల పచ్చపడునా ?

1. 'బుల్బులి' తన సర్వస్వమును పుష్పముచే కోల్పోనది. తోటలో తన స్మృతి చిహ్నమేదియు నిలుపుకొనలేదు.

తోట, పుష్పము, తోటమాలి ఇవన్నియు మనస్వంతమే అయినచో ఎంతటి ఆనందదాయక మగు జీవితము గడపు చుంటిమో అను వాంఛ మిగిలి పోయినది.

హమ్ గిరఫ్తారోంకో అబ్ క్యా కామ్‌హై గుల్షన్‌సే లేక్
జీ నికల్ జాతాహై జబ్ సున్తేహైం ఆతీహై బహార్ 2

ఈ కాలములో మజ్రూం, ఫొగాం, యక్రంగ్ మొదలగు ప్రసిద్ధ కవులనేకు లుండిరి. ఈ సంక్షిప్త చరిత్రలో వారి పేర్లు మాత్రమే స్మరింపగలము.

కొన్ని నాళ్ళ క్రిందట ఉత్తర దేశములోని ఇంకొక పురాతన కవిని గూర్చి కొన్ని విషయములు తెలిసినవి. అతని పేరు సదరుద్దీన్, మొహమ్మద్. ఉప నామము "ఫాయజ్". అతడు దిల్లీ ఆస్థానమునందు ఉన్నతోద్యోగి-గొప్ప విద్వాంసుడు - శ్రీమంతుడు. ఫారసీలో అతని రచన లనేకము. ప్రొఫెసర్ మసూద్ హసన్ రిజ్వీ అతని ఉర్దూకావ్య సంగ్రహమును అమూల్యమగు పీఠికతో టీకా సహితముగ ప్రచురించెను. ఉర్దూలో కావ్యసంగ్రహము తయారు చేసికొనిన మొట్ట మొదటి కవి యితడే అని ప్రొఫెసరుగారు అభిప్రాయ పడినారు. "ఫాయజ్" కావ్య సంగ్రహము వలన ఆనాటి కవితా రీతులు, భావములు మాత్రమే కాక చారిత్రక విషయములు అప్పటి సమస్యలును తెలియును. అతడన్ని రకముల కవితలు వ్రాసినాడు. ఆ కవితలలో సౌందర్యము, మన స్తత్వ పరిశీలనము కలవు. అంతియేకాక దేశీయతయు విశేషము. అతడు హిందువుల పర్వములను ఉత్సవములను అతి సుందరముగా వర్ణించెను. అలంకారములు హిందీశాస్త్రసమ్మతములు. ఆనాటి సాంస్కృతిక, సామాజిక జీవన చిత్రములతని కవితలో చూడముచ్చటగా నున్నవి. దిల్లీలోని ఒక ప్రదేశము నిట్లు వర్ణించెను:—

హై 'ఇందర్' కి మానో సభా జల్వాగర్
కి హర్ నార్ దిస్తీ హై రంభాసొం వర్
కమర్ పర్ జో పడ్తే హై సబ్ మూయె-సర్
ఉనా బీచ్ మిల్ జాతా మూయే-కమర్
లజాతీహైం జూం అప్సరా జీకో ఛల్ -
కీ దేఖ్ ఉన్కో పానీమె దిల్ జాయె జల్

2 బంధితులమగు మాకు తోటతో నేమిపని ? కాని వసంతము వచ్చిన దని వినినంత ప్రాణములు పోయినట్లనిపించును.

హర్ ఎక్ నార్ సూరజ్ సి శోభా ధరే
ఖడీహో సురజ్ కీ తపస్యా కరే 1

ఒక గజలులోని కొన్ని చరణములు చూడుడు :—

గాలీ తేరీ ముఝ్ దిల్కో ప్యారీ లగే
దువా మేరీ తుఝ్ మన్మే భారీ లగే-
నహీ తుఝ్ స ఔర్ షోఖ్ ఐ మన్హార
తెరీ బాత్ దిల్కో న్యారీ లగే
భఁవాఁ తేరీ షష్మీర్ జుల్ఫాఁ కమంద్
పలక్ తేరీ జైసే కటారీ లగే. 2

* * * *

ఈ విధముగ ఉత్తర భారత దేశమున దిల్లీ సాహిత్య కేంద్రమైనది. క్రమ క్రమముగా దక్షిణమున సాహిత్యకాంతి సన్నగిల్లినది. మొగలాయి రాజ్యము త్వరిత గతి పతనము చెందుచుండెను. రాజకీయముగా ప్రభావహీనమగు చుండెను. అయినను దానిదొక మహనీయమగు పరంపర కనుక ఇంకను సజీవమై యుండదగిన యోగ్యత కలిగియుండెను. మొహమ్మదుషా పాదుషా కాలమున ఆస్థానము కుతంత్రజ్ఞుల కూడలి యయ్యెను. పాదుషా తన శక్తిని అమీరుల పరము చేసి తాను భోగలాలసతలో జీవనము గడుపుచుండెను. తన బాధ్యతల నన్నిటిని విస్మరించెను. దిల్లీనగరము శోభాయమానమైయుండెను. ఉన్నతాధికారులు దూరదూరములనుండివచ్చి పాదుషాతో

1. ఇంద్రుని సభ శోభాయమానమై యున్నట్లున్నది. ప్రతి స్త్రీయు రంభకంటె అందకత్తె. నడుముపై శిరోజములు పడినప్పుడు శిరోజమువంటి నడుమందే యెందో లుప్తమై పోయినది. వారు అప్సరసలవలె హృదయమును బాధింతురు. వారిని నీటిలోచూడగా హృదయము దహించి పోవును. ప్రతి స్త్రీ సూర్యునివంటి శోభ కలది. నిల్చుండి సూర్యుని గూర్చి తపస్సు చేయుచున్నట్లున్నది.

2. నీ తిట్లు నా మదికి ఇంపయినవి. నా శుభాకాంక్షలు నీ కొఱకు అనేకములు. ఓ మనోహరీ ! నీ వంటివారెవ్వరును లేరు. నీ సంగతి నా హృదయమునకు ఆనందప్రదము. నీ కనుబొమలు ఖడ్గములు. కురులు త్రాటి నిచ్చెనలు-ఱెప్పలు కటార్లు అనదగినవి.

విలాస కాలక్షేపము చేయుచుండిరి. అమీరుల అంతఃకలహములు మఱియు నూత్న శక్తుల విజృంభణము కారణముగా అన్యదేశీయుడగు నాదిర్షా దిల్లీపై ఎత్తివచ్చుటకు అవకాశము కలిగెను. క్రీ. శ. 1739 లో అతడు పంజాబును పాదాక్రాంతము చేసి దిల్లీ ద్వారమున వచ్చి నిలిచెను. మొగలాయి పాదుషా అతనిని ఎదిరించలేకపోయెను. దిల్లీ నగరము రక్తసిక్తమయ్యెను. చరిత్రకారులు, కవులు అనేకులు ఆ వినాశమును భీభత్సముగా చిత్రించిరి. నాదిర్షా దిల్లీ సంపత్తినంతటిని కొల్లగొని వెళ్ళెను. ఈ నష్టము త్వరలోనే పూడినది. కాని రాజ్యమును వివిధ భాగములలో విభక్తము కాకుండ కాపాడుకొనుట పాదుషాకు సాధ్యము కాలేదు. అదియే కొలది నాళ్లలో ప్రమాదకరమయ్యెను.

ఆనాటి భారత దేశపు సాంస్కృతిక సామాజిక జీవనమును పరిశీలింతుమేని చిత్రకళ కాని నిర్మాణకళ కాని యెట్టి ఉన్నతిని పొందకుండెనని తెలియును. ఏ భాషలోను తులసీదాసు, జాయెసీ, సూరదాసు మఱియు కబీరులు జన్మింపలేదు. ఉన్నతశ్రేణి వారి వ్యావహారిక, సాంస్కృతిక భాషయగు ఫారసీ ఈ దేశమున శుష్కించుచుండెను. కనుక సామాజిక చైతన్యప్రభావము వలన ఉర్దూ అభివృద్ధి చెందుచుండెను. కాని అందులోను పురోగమించుచున్న రాష్ట్రము మఱియు ప్రగతి గాంచుచున్న ప్రజానీకమునకు సంబంధించిన భాషలో ఉండదగిన శక్తిలేకుండెను. సామ్రాజ్య వ్యవస్థలో సాహిత్యము రాజపోషణపై ఆధారపడియుండును. మొగలాయి రాజ్యము ఉర్దూ సాహిత్యప్రగతిలో ఎట్టి సహాయమును చేయలేనంత దుర్బలమయ్యెను. ఆట్లయినను సాహిత్యప్రవాహము, కళలప్రవాహము శుష్కింపలేదు. మొహమ్మద్‌షా ఆస్థానమున భారతదేశ సంగీత కళ జీవము పొందుచుండెను. ఎట్టి సాహాయ్యము, లేకున్నను ఉర్దూ సాహిత్యము ప్రజలలో వ్యాపించుచుండెను.

ఆ కాలమున సిక్కులు, జాటులు, మహారాష్ట్రులు ప్రబలులగుచుండిరి. దూరస్థములగు మొగాలాయి రాజ్యప్రాంతములు అన్యాక్రాంతము లగుచుండెను. ఈస్టిండియా కంపెనీ సదాహరిత లత వలె దేశమంతట వ్యాపించుచుండెను. ఐక్యత లేనందున వాయువ్య భాగము ఏ సమయముననైన విదేశీయుల ఆక్రమణకు గుఱియగు అవకాశముండెను. నాదిర్‌షా దండయాత్ర తరువాత పదేండ్లకు అహమద్‌షా అబ్దాలీ భారత దేశముపై ఎత్తివచ్చెను. పెద్దపెద్ద జాగీర్దారులందరును ప్రభుత్వము వడయుటకై తమతమ ముఠాలు ఏర్పఱచుకొనిరి. పాదుషాలు వారిచేతులలో కీలుబొమ్మలు. ఈ యన్నిటి పరిణామరూపమున దేశపు ఆర్థిక స్థితి చెడిపోయెను. రాజదర్బారుల

దమన నీతికి రాజకీయోద్యోగుల దోపిళ్లకు ప్రజలు విహ్వాలు లగుచుండిరి. షాహ ఆలం (1759 - 1806) సింహాసనస్థుడగు నప్పటికి ఈస్టిండియా కంపెనీ మఱియు మహారాష్ట్రులు శక్తిసంపన్నులై యుండిరి. జాటులు ఆగ్రా పరిసరములలో దోపిళ్ళు చేయుచు భీతిగొలుపుచుండిరి. రోహిల ఖండములోని రోహిలా-పఠానులు ప్రబలు లగుచుండిరి. పాదుషా వివశుడై ఆంగ్లకంపెనీ శరణుజొచ్చెను. 'దీవానీ' హక్కు-లన్నియు వారి పరముచేసి అలహాబాదలో భరణము పొందుచు నిలిచెను. పదేండ్ల తరువాత షాహఆలమ్ మహారాష్ట్రుల సహాయమున మరల దిల్లీ సింహాసన మధిష్ఠించెను. రోహిలా పఠానులు దర్బారులో ప్రవేశించి పాదుషా కనులూడబెఱికి అతనిని చెఱసాలలో బెట్టిరి. దిల్లీ ఒక విధముగా మహారాష్ట్రుల స్వాధీనమై యుండగా, పాదుషా తన ప్రభుత్వకాలమును సమాప్తము చేయక మునుపే, క్రీ. శ. 1804 లో "లార్డ్ లేక్" దిల్లీపై తన ఆధిపత్యము సాగించెను. ఇట్లు మొగలు పాదుషా దిల్లీలో నామమాత్రుడు. వాస్తవికాధికారులు ఆంగ్లేయులు.

ఇచటినుండి దిల్లీకథ ఇంకను క్లిష్టరూపము పొందును. కాని పైన చెప్పబడిన పరిస్థితులవలన ఉత్తరభారతమున ఉర్దూసాహిత్యము జన్మించి అభివృద్ధి చెందిన ఉదంతము తెలియును. ఆర్థిక, రాజకీయ పరిస్థితుల ప్రభావము జీవనముపై ఎట్లు పడునో దానిని వర్ణింప నవసరములేదు. మొగలు రాజ్యము ఆరిపోవుచున్న దీపమువలె రాత్రిచివరి అంధకారముతో పోరాడుచుండెను. కాని అచట ఎట్టిప్రకాశమును కలిగింప దగినశక్తి దానికి లేకుండెను. ఈ కాలపు మహాకవులందఱ రచనలలో దిల్లీయొక్క ఈ పరివర్తిత పరిస్థితుల చిత్రణము చూడవచ్చును. ప్రజల ఆర్థికస్థితి హీనదశనందిన ఆ కాలమున పాదుషా భుజములు దుర్బలములు. అజ్ఞాతమగు భయమువలన జీవితమే తుచ్ఛమనిపించు చుండెను. నైతిక పతనమును ఆరంభమయ్యెను. కొంతకాలము క్రిందట ఏమియు లేకున్నను మతముపై గాఢవిశ్వాసముండుట వలన ప్రజలు జీవిత సమస్యలను సహించుకొనుచుండిరి. ఇప్పుడొక విధమగు అవిశ్వాసము నిరాశ ఉద్భవించి జీవితమును తత్త్వహీన మొనర్చెను. శతాబ్దాలనుండి భారతవర్షములో వచ్చుచున్న వర్ణవ్యవస్థలో నెట్టి గొప్ప పరివర్తనమును కలుగ లేదనుటలో సందేహములేదు. ఉత్పాదన ప్రణాళిక మారలేదు. గ్రామ్యజీవనములోని సామూహిక ఘనిష్ఠత దుర్బలమయ్యెను. ఏవిధమైన వైజ్ఞానిక జ్ఞానము లేనందున ఉత్పాదనా సాధనములలోను జీవిత విధానములలోను పురోగమనమునకు అసమర్థమగు మాంద్యము ఏర్పడెను. పాదుషాలు బలహీనులు - భోగలాలసులు. వారి జాగీర్దారులును అట్టివారే. సైన్యము

కడ యుద్ధసాధనములు లేవు – సాహసములేదు – అనుశాసమునులేదు – సైనికులకు సరిగా జీతము దొఱకెడిదికాదు – కనుక వారు ప్రజలను బాధించి తమ పొట్టనింపుకొనుచుండిరి. లుప్తమై పోవుచున్న సమాజములో నాశనమగుచున్న రాజ్యములో ఏయే సెబ్బరలు జన్మించుటకు అవకాశముండెనో అవన్నియు ఆనాటి భారత దేశమున ఉండెను. అన్నిటికిమించి జాగీర్దారీ వ్యవస్థ నిర్జీవమగు చుండెను. రాజ్యములన్నియు తమతమ పరంపరల తోడ్పాటుతోనే జీవించియుండెను. గొప్ప విప్లవమును లేవదీయుటకు సమర్థమైన ప్రజాశక్తి నిద్రాణమై యుండెను. ఏలయన చిరకాలపు వివశత ప్రజలను పరాస్తము చేసి వైచెను. ఇంతవఱకు ప్రజలలో తమ పరిస్థితులను మార్చుకొన దగిన చైతన్యము కలుగకుండెను. జాగీర్దారీవ్యవస్థ పతనము చెందుచున్న ఈ యుగము రెండు మూడేండ్లదికాదు. కొన్ని శతాబ్దములు సాగినది. ఈ నడిమి కాలమున ఏ విధమగు ఔద్యోగిక వికాసము కలుగకున్నను వ్యాపారము వలన మధ్యమ వర్గమున లెక్కింప దగినవారు కొందఱు అచటచట జన్మించిరి.

18 వ శతాబ్దమున భారత దేశములోని పలుతావులలో ఆంగ్లకంపెనీ బల పడినదను సంగతి మఱువరానిది. దాని ప్రభావము బంగాళము, మద్రాసు మఱియు బొంబాయిలపై పడుచుండెను. ఉర్దూసాహిత్యమును ఈ ప్రభావము స్వీకరించెను. కాని హిందూ ముసల్మానుల సభ్యతలు ప్రాచీనములును సుదృఢములును అగుటవలన ఈ క్రొత్త భావములు అంత త్వరగా ఉన్నతి చెందలేదు. ఉత్పాదనా సాధనములలో కలిగిన పరివర్తనము సాంస్కృతిక రంగమున ప్రకటమగుట అనివార్యమే– ఆ పరివర్తనము సమానస్థాయిలో జరుగక పోవచ్చును. సారస్వత నియమము లొకసారి రూపొంది తమమార్గము తామే నిర్మించుకొనును కనుక, వానిలో సాధారణముగా త్వరితగతి పరివర్తనము జరుగదు. ఇవికాక ఆర్థికసాధనములును సమానగతి నడచుచుండెను. కనుక సాహిత్యమున ఏ విధమగు నవీనత కలుగు అవకాశమే లేకుండెను. సారాంశమేమన ఆ కాలమున నుద్భవించిన ఉర్దూసాహిత్యములో జీవన చిత్రములు, సమస్యల వ్యాఖ్యానములుకలవు కాని జీవితమును పురోగమింపజేయు శక్తిలోపించినది. దీనికొక కారణమేమన ఆనాటి కవులు ప్రజా సామాన్యముతో సన్నిహిత సంబంధము కలవారు కారు. వారు అధికముగా పట్టణములలో నివసించువారు కనుక ప్రజలకు వ్యాకులపాటు కలిగించుచున్న పరిస్థితుల పరిచయము లేనివారు. అనగా ఆనాటి ఉర్దూ కవిత జీవితముతో ఎట్టి సంబంధము లేనిదనికాని కేవలము కల్పనలు, మఱియు స్వప్నములమీదనే ఆధారపడినదనికాని తాత్పర్యముకాదు. ఆనాటి కవులు బుద్ధిపూర్వ

కముగా పక్షపాతముతో కొందఱ జీవిత సంఘర్షణమును పరిశీలించువారు కారని అభి ప్రాయము. వర్గములలో విభజింపబడిన సమాజములోని మానవుడు ఏదో ఒక వర్గము నకు సంబంధించియుండి తన అలోచనలను ఆ వర్గమునుండియే రూపొందించుకొనుట తప్పనిసరి. వర్గవిభజన స్పష్టరూపమున లేనప్పుడు, ఉత్పాదనా సాధనములు అనాగ రక రూపమున ఉన్నప్పుడు, ప్రతి కవియు సంపూర్ణముగా తన వర్గప్రచారకుడు కాజాలడు. ఈ కాలమున కొందఱు కవులు మానవ జీవితసౌందర్యమును మానవతా గౌరవమును యథార్థముగా వర్ణించిన వారున్నారు. వారినేవిధముగను ఉచ్చవర్గీయుల భావములను మాత్రమే ప్రచారము చేయువారనుటకు వీలులేదు.

18 వ శతాబ్దిలోని కవులను రచయితలను ఈ దృష్టితోనే చూడవలయును. ఇద్దరు ముగ్గురిని గూర్చి పైన వ్రాయబడినది. ఉర్దూ సాహిత్యమును ఆకాశము నంటునట్లుద్ధరించిన ఇంక కొందరిని గూర్చి ముందు ముందు వ్రాయబడును. వారిని గూర్చి సంక్షేప రూపమున వ్రాయుటకు ముందు ఉత్తర భారత దేశపు ఉర్దూ సాహిత్య విశేషములను తెల్పుటవసరము. ఆనాడు గద్య రచన వికాసము పొంద లేదు. పద్యములలోను "గజలు"లు మాత్రమే ప్రజాదరణ పొందినవి. "మస్నవీ"లు, "మర్సియా"లు మఱియు ఇతర రచనలు వ్రాయబడుచుండెను. కాని ఆ రచనలు విరివిగా వ్రాయబడునవి కావు. కవులు రాజదర్బారులకు సంబంధించి లేకుండిరి. కనుక ఆనాటి "ఖసీదా"లును లేవు: కవితా వస్తువలు ప్రేమ, భక్తి, నీతి మొద లగునవియే. పర్షియా సంస్కృతి మఱియు ఫారసీ భాషల ప్రభావము పడుచున్నను దక్కనీభాషా ప్రభావమును బ్రజభాషా ప్రభావమును స్పష్టముగా కాన్పించును. ఆనాటి కవులకు యమకము, శ్లేష ప్రియమైన అలంకారములు. కొందరు ఈ అలం కార వ్యామోహము హిందీ నుండి వచ్చినదందురు. మరికొందరు భారతదేశమున ఫారసీ సాహిత్యము పతనదశ చెందినప్పుడు ఫారసీ కవిత కేవలము పదముల గారడీ అయిపోయెను. అందువలన కవులు అలంకారములను ఆశ్రయించెరందురు. వ్యాకరణమును కావ్య శాస్త్రమును అంతగా పాటింపబడకుండెను. షాహ "హాతిమ్" మఱియు మీర్జామజ్హర్ ఆ విషయము వైపు సూచన చేసినారు. తరువాతి కవులు ఈ పునాదుల మీదనే విశాల భవనము నిర్మించిరి. ఉర్దూ కావ్య సాహిత్యము ఆకారమునందును, అంతరంగమునందును రచనాత్మక సౌందర్యము పెంపు చేసికొని చాల పురోగమించెను.

ఈ యుగమున గల కవులు వందలు. కాని ఇచట ''ఫుగాఁ'', ''తాబాఁ'', ''దర్ద్'' ''సౌదా'' ''సోజ్'', ''మీర్'', ''ఖాయమ్'' మఱియు ''యఖీన్'' మొదలగు సర్వోత్తమకవుల కొందఱ గూర్చియే వ్రాయబడును. కాలమొక అవిరళ సూత్రము. కనుక సాహిత్య చరిత్రను ఒక యుగమునుండి ఇంకొక యుగమున కేమాత్రము సంబంధము లేకుండ విభజించుటకు వీలుకాదు. కొందఱ వృద్ధాప్యము కొందఱు కవుల యౌవనము. ఒకప్పుడు తెగల రచయితలును ఒకే యుగమున లెక్కింప బడుదురు. ఇంకొకప్పుడు వారి వయము ననుసరించియే యుగ విభజన జరుగును. కనుక ముందు ముందు ఇతర కవుల వర్ణన వచ్చునేని కావ్యశైలిలో గొప్పమార్పు ఏదో జరిగినదని భావింపవలదు. కాలక్రమ దృష్టిలో సౌలభ్యము కొఱకే కవులను యుగములలో విభజించుట జరిగినది.

పైన చెప్పబడినట్లు ''షాహఆలమ్'' కాలమున దిల్లీపై ఎన్నియో ఆపదలు సంభవించినవి. పాదుషా ''ఈస్టిండియా కంపెనీ'' వారి ఖైదీయై సుమారు పది సంవత్సరములు అలాహాబాదలో ఉండెను. దీని పరిణామ రూపమున కళాసాహిత్య క్షేత్రములలో నైరాశ్యము ఆవరించినది. అచట ఆదర సత్కారములు చేయువారు లేనందున కవులు ఇతర రాజ దర్బారుల వైపు బయలుదేరిరి. అందఱిలో మొట్ట మొదట తన ఇల్లు విడిచి ''అవధ్'' మఱియు ''అజీమాబాద'' (పట్నా) దర్బారుల నాశ్రయించిన కవి ''ఫుగాఁ'' అందురు. అతని పేరు అష్రఫలీఖాన్. అతడు ''నదీమ్'' శిష్యుడు. అహ్మద్‌షా బాదుషా దాది కొడుకు. హాస పరిహాసములతని వృత్తి. దిల్లీలో ఆశ్రయమీయ దగిన వారు లేనందున అవద్‌నవాబు షుజావుద్దౌలా దర్బాలో ప్రవేశించెను. అచటి నుండి ''పట్నాకు'' వెళ్ళెను. క్రీ. శ. 1772 లో అతడు మరణించెను. పట్నాలో మహారాజాషితాబ్‌రాయ్ అతనిని చాల సన్మానించి తనను విడిచి ఎచటికిని వెడలకుండ చేసెను. అతని భాష చాల పరిశుద్ధము, సరళము మఱియు మధురము. అతని ఉర్దూ కావ్యసంగ్రహ మొకటి ఫారసీ కావ్య సంగ్రహ మొకటి లభించినవి. ఉర్దూ సంగ్రహము ఈ నడుమనే తొలి ప్రచురణ పొందినది.

కొన్ని పద్య పాదములు:—

జబ్తై దిల్‌తో సియా నహీ జాతా
బిన్ సియే భీ రహా నహీ జాతా
ఐ "ఫొగాఁ!" దేఖ్నా సమఝ్ లేనా
దేకె దిల్ ఫిర్ లియా నహీ జాతా 1

ఉస్‌కే విసాలో-హిజ్ర్ మే యూఁహీ గుజర్ గయా
దేఖాతో హన్స్ దియా జొనదేఖా తో రో దియా 2

"తాబాఁ" అను ఉపనామముగల 'మీర్ అబ్దుల్ హై' దిల్లీ నివాసి. అతడు అత్యంత సుందరుడు. పాదుషా స్వయముగా అతని సౌందర్యమును తిలకించుటకై అతడు కూర్చుండు మార్గమున వెడలెనట. "తాబాఁ" తన కాలపు మహాకవులలో ఒకడు. మద్యపాన మధికముగా చేయువాడు. ఆకారణముననే యువావస్థలో మరణించెను. అతని కావ్య సంగ్రహము ప్రకాశితము. అతని భాష సరళము, సరసము. గజలులకు కావలసిన కోమల భావము లతని కవితలో కలవు. అతనిని గూర్చి మీర్ తఖీమీర్ ఇట్లభిప్రాయపడెను "అతని (తాబాఁ) విషయములు పరిమితమైనవి. అయినను వానిని చాల చమత్కారముగా రచించును." ఈ అభిప్రాయము సమంజసమైనది. అతడు అన్ని ప్రకారముల కవితలు వ్రాసెను. కాని అతని గజలులు ఉర్దూ సాహిత్య చరిత్రలో ప్రత్యేకస్థానము పొంద దగినవి. ఉదాహరణ కొఱకు ఈ క్రింది చరణములు—

నహీ కోయీ దోస్త్ అప్నా, యార్ అప్నా, మెహర్బాఁ అప్నా
సునావూఁ కిస్కో గమ్ అప్నా, అలమ్ అప్నా, బయాఁ అప్నా
న తాఖత్ హై ఇషారేకీ, నకహనేకీ, నసున్‌నేకీ
కహూఁ క్యా మైఁ షునూఁ క్యా మైఁ బతావూఁ క్యా బయాఁ అప్నా

1. ఎదద గాయము కుట్టుకోరాదు. కుట్టుకోకుండ ఉండరాదు. ఫోగాఁ! చూడుము. ఆలోచించుము హృదయమును అర్పించి మరల తీసికొనరాదు.

2 ఆమె సంయోగ వియోగములలో ఇట్లే గడచెను.
ఆమె చూచెనేని నవ్వితిమి. చూడకున్న ఏడ్చితిమి.

బొహత్ సోచాకె ఆవే యార్ యా ఇస్ దిల్‌కో సబ్రాయే
నయార్ ఆయా, నసబ్ ఆయా, దియామైజీ నిదాం అప్నా 1

సౌదేమె గుజరీ హై క్యాఖూబ్ తరహా తాబాం
దో చార్ ఘడీ రోనా దో చార్ ఘడీ బాతేం 2

ఉర్దూ గజలును గజలు (ప్రియురాంద్రతోడి రహస్య సంభాషణము)గా రూపొందించిన కవులలో "దర్ద్", "సౌదా", "మీర్" అను ముప్వురు సర్వ శ్రేష్ఠులు. వీరందఱు సమకాలీన జీవనములోని వ్యాకులతను, ఉద్విగ్నతను సుంద రముగా చిత్రించిరి. ఆనాటి సామాజిక, ఆర్థిక సమస్యలను చర్చించుట తమ కర్త వ్యమని భావించిన కవులు కారు వీరు. ఆనాటి వాతావరణమును ఆత్మకథ యను కొనునట్లును అదియే జగత్కథ అనుకొనునట్లును తమ కవితలో పరామర్శించిరి. చారిత్రక సంఘటనలను సూచింపకుండ సామాన్య భావములను ప్రదర్శించిరి. గజలు రచనలో సమకాలీన పరిస్థితులనుల్లేఖించు అవకాశము వారికి లేకుండెను. కాని వారి కవిత్వమును గంభీరదృష్టితో పరిశీలింతుమేని వారు జీవితమును యథార్థ రూపమున చిత్రించిరని తెలియకపోదు. ఇచట వారి కవితా విశ్లేషణము జరుగదు. కాని వారి మహత్వమునకు కారణములగు విశిష్టతలను గూర్చి తెలుపబడును. 18 వ శతాబ్దమునందు దిల్లీలోను భారతదేశమంతటను సామ్రాజ్యముల పతనము వలన ఏర్పడిన పరిస్థితుల ప్రతిబింబములు ఈ మహాకవుల కావ్యములలో విస్పష్ట ముగ చూడవచ్చును.

ప్రఖ్యాత సూఫీ కవియగు ఖాజామీర్ 'దర్ద్' క్రీ. శ. 1721 లో దిల్లీయందు జన్మించెను. అతడొక ప్రతిష్ఠిత మతాచార్య పరంపరకు చెందినవాడు. అతని తండ్రి

1. నాకు మిత్రుడు, ప్రియుడు, అనుగ్రహము కలవాడు ఎవడును లేడు. ఎవరికి నా బాధను, విచారమును నా మాటలలో వినిపింతును. సంకేతము చేయుటకును, మాటలాడుటకును, వినుటకును నాకు శక్తి లేదు. నేనేమి మాటలాడుదును. ఏమివిందును. ఏమిచెప్పుదును ప్రియుడైన రావలయును లేదా ఈ హృదయమునకు ఊరటయైన లభించవలయునని చాల అభిలషించితిని - ప్రియుడు రాలేదు. ఊరట కల్గలేదు. నామనస్తిమితము పోయినది.

2 ఉన్మాదములో కాలము చక్కగా గడచును. రెండు మూడు గడియలేడ్చుట. రెండు మూడు గడియలు మాటలాడుట.

ఖాజామొహమ్మద్ నాసిర్ ''అందలీబ్'' పేరుగ్గల సూఫీకవి. "దరద్" బాల్యము నుండియే సూఫీ సంప్రదాయము నవలంబించెను. సరస్వతీ సముఖమున తలవంచెను. అతడు గొప్పవిద్వాంసుడు. ప్రతిభాశాలి. సూఫీ తత్త్వచర్చ అతని అహోరాత్రముల కాలక్షేపము. ఫారసీలో "తసవ్వుఫ్" ను గూర్చి ఎన్నియో గ్రంథములు వ్రాసెను. అతడు సంగీత శాస్త్రప్రవీణుడు. కవితారచనలో నిపుణుడు. ఢిల్లీ పాడువడుచున్నపుడు ఎందరు కవులు దానిని విడిచివెళ్ళినను "దరద్" విడువలేదు. అతని కావ్యసంగ్రహము పరిమాణమున చిన్నది. అందు ఉర్దూ పద్యములును ఫారసీ పద్యములును కలవు. అతడు క్రీ. శ. 1785 లో ఢిల్లీయందే మరణించెను.

అతని కవితలన్నియు ''గజలులు''— వానిలో నిగూఢమగు సూఫీ తత్త్వము సరళసుందర భాషలో ప్రస్తుతము. అతని ఉపనామము "దరద్" (వ్యథ). కనుక తదనుకూలముగా అతని కవితలో వ్యథాకలితములు, కరుణాజనకములు అగు భావములు కలవు. అతని భాషలో మార్దవము, సౌకుమార్యము మఱియు ఆవేగము కలవు. మహాకవి మీర్ తరువాత దరద్ కవితలోనే తిన్నని, తీయని ఢిల్లీ వ్యావహారిక భాష చూడనగును. ఆనాటి కవులందఱును అతనిని ఉత్తమ కవిగా అంగీకరించిరి. కేవలము కవియేకాక మహాభక్తుడును, సూఫీ–ఫకీరును అగుటవలన వేలాది జనులతనికి సన్నిహితులై గౌరవించుచుండిరి. అతడెన్నడు రాజదర్బారులకు వెళ్లలేదు. అయినను అతడు నివసించు "ఖాన్ఖాహ్" (ఆశ్రమము) రాజదర్బారు పరిరక్షణలోనే ఉండెను. మీర్ మొహమ్మద్ "అసర్" అతని తమ్ముడు; మఱియు శిష్యుడు. అతడును మహా కవుల శ్రేణికి చెందినవాడు. ''అసర్'' కావ్యసంగ్రహము ప్రకాశితము. "ఖాబో–ఖయాల్" అను అతని మస్నవీ కూడ ప్రసిద్ధము. అతని కావ్యశైలి "దర్ద్" శైలిని పోలియుండును— "దరద్" కావ్యసంగ్రహము చిన్నది. అతని గజలు లన్నియు చిన్నచిన్న చరణములవి. అయినను అవన్నియు ప్రభావసహితములు. మౌలానా మొహమ్మద్ హుస్సేన్ "ఆజాద్" చెప్పినట్లు "దరద్" తలవారుల పదును సూదులలో నింపెను.

జగ్‌మె ఆకర్ ఇధర్ ఉధర్ దేఖా
వహీ ఆయా నజర్ జిధర్ దేఖా
జాన్‌సే హో గయే బదన్ ఖాలీ
జిస్ తరఫ్ తూనే ఆంఖ్ భర్ దేఖా

నాల, ఫిర్యాద్, ఆహ్, ఔర్ జారీ
ఆప్‌సే హో సకా సోకర్ దేఖా
ఉన్ లబోన్నేనకీ మసీ హోయీ
హమ్‌నె సౌసౌ తరహాసే మర్ దేఖా 1

తూ బిన్ కహే ఘర్‌సే కల్ గయాథా
అప్నా భీతో జీ నికల్ గయాథా
అబ్ దిల్కో సంభాల్నా హై ముష్కిల్
అగ్లే దినోఁ కుఛ్ సంభల్ గయాథా
మై సామ్నేసే జో ముస్కురాయా
హోంట్ ఉస్కా భీ "దర్ద్" హిల్ గయాథా 2

*　　*　　*　　*

అహాలే జమానే ఆగే భీథే ఔర్ జమానథా
పర్ అబ్ జో కుఛ్ హై యేతో కిసీనే సునానథా 3

వో దిన్ కిధర్ గయే కి హమేఁ భీ ఫరాగ్ థా
యానీ కభూతో హమ్‌మేభీ దిల్ థా దిమాగ్ థా
గుజ్‌రా హుఁ జిస్ ఖరాబేమే కహ్తేహైఁ వాఁకే లోగ్
హై కోయీ దిన్‌కీ బాత్ యేఘర్‌థా, యే బాగ్ థా 4

1. ప్రపంచమున అడుగిడి ఇటునటు చూచితిని, ఎటు చూచినను అతడే కన్పించెను- నీవేదెస చూతువో ఆ వైపువారు నిర్జీవులు. నాచే నయినట్లు ఏడ్చి, వ్యథపడి, నిట్టూర్చి మొఱపెట్టు కొంటిని· అనేకవిధముల మరణించిచూచితిని. ఆమె పెదవులు స్వాస్థ్యము కలిగింపవయ్యెను.
2. నిన్న నీవు ఇంటినుండి చెప్పకుండ వెడలి పోతివి. నాప్రాణమే లేచిపోయినది. ఇప్పుడు హృదయమును స్తిమిత పఱచుటే అసాధ్యము. వెనుక కొంత స్తిమిత పడుచుండెడిది. ఎదుటనిల్చి నేను మందహాసము చేసినంతనే ఆమె పెదవులు కదిలెను.
3. పూర్వమున కాలముండెను. ప్రజలుండిరి. కాని నేడేదికలదో ఇదెవరును విన్నది కాదు.
4. మాకు గూడ నిశ్చింతగల కాలమెటు వెళ్లినదో - ఒకప్పుడు మాలోను హృదయముండెను. బుద్ధియుండెను. పాడఱిన ప్రదేశమునుండి వెళ్ళితిని. అచటివారు "కొన్ని దినముల క్రిందట ఇదిగో అచట ఇల్లుండెను. ఇట తోట ఉండెను" అనుచుండిరి.

చివరి మూడు చరణములలో దిల్లీ వినాశమును మఱియు నిస్సారమైన జీవితమును ఎంత హృద్యముగా వర్ణించినాడో చూడుడు. సమసిపోవుచున్న సభ్యత తన వ్యథను ప్రకటించుచు అవిజ్ఞాతమగు భవిష్యత్తును గూర్చి నిరాశ పొందుచున్న దృశ్యము ఈ కవితల వలన మన కనులఁ గ్రేలును.

ఆ కాలపు మహాకవులలో మిర్జామొహమ్మద్ రఫీ "సౌదా" ఒకడు. అతడు క్రీ. శ. 1713లో జన్మించెను. అతని తండ్రి ఈరాను నుండి వ్యాపారార్థము భారత దేశము వచ్చి ఇచటనే స్థిరపడెను. సౌదా స్వభావము ధనికులకు తగినది. అతడు హాస పరిహాస ప్రియుడు. రాజ దర్బారులో ప్రవేశము కలవాడు. అమీరులు, జాగీర్దారులు అతని మిత్రులు. అతడు షాహ "హాతిమ్" శిష్యుడందురు. కాని ఆనాటి మహాకవులందఱ వలనను లాభము పొందినవాడే అనిపించును. అహ్మద్ షా ద్దురానీ దండయాత్రల వలనను మహారాష్ట్రుల ఆక్రమణము వలనను దిల్లీ పాడు వడినంత అతడు ఫరూఖాబాద నవాబగు మెహర్బాన్ఖాన్ "రింద్"ను ఆశ్రయించెను. క్రీ. శ. 1785 లో అయోధ్యరాజధానియగు ఫైజాబాదా చేరెను. నవాబు షుజావుద్దౌలా అతని నాహ్వానించెనని కొందఱందురు. ఆసఫొద్దౌలా తన రాజధానిని లఖ్నోకు మార్చినప్పుడు "సౌదా" లఖ్నోకు వెళ్లెను. అతని జీవితము లఖ్నోలో సుఖ సంతోషాలతో గడచెను. అవధ్ ప్రభుత్వమతనికి రూ. 6,000 వార్షికము ఏర్పాటు చేసెను. క్రీ. శ. 1795లో అతడు లఖ్నోలోనే మరణించెను.

"సౌదా" రాకవలన లఖ్నోసాహిత్యమున నూత్నతరంగము లేచెను. ఆసఫొద్దౌలా స్వయముగా మంచికవి. లఖ్నోలో పెద్దపెద్ద కవి సమ్మేళనములు జరుగు చుండెను. నవాబులును అమీరులును పాల్గొనుచుండిరి. నలువైపుల కళాసాహిత్య ప్రచారము ముమ్మఱముగా సాగుచుండెను. కవులు పరస్పరము స్పర్థకలవారగుట సాహిత్యమనుదినము అభివృద్ధి చెందుచుండెను. "సౌదా" రాజదర్బారుతో సంబంధము కలవాడు కనుక అధికముగా ఖసీదాలే వ్రాసెను. కొన్ని ఖసీదాలు మతప్రవక్తల ప్రశంసలో కొన్ని నవాబుల ప్రశంసలోకలవు. ఉర్దూఖసీదా రచయితలలో "సౌదా" అగ్రగణ్యుడు. ఫారసీ సంప్రదాయముల ననుసరించి అప్పటికింక అభివృద్ధి చెందని ఉర్దూభాషలో లలితములును ఉన్నతములును అగు భావములను అతి నిపుణతతో సుందరముగా వర్ణించెను. ఖసీదాలేకాక గజలులు, మస్నవీలు, రుబాయీలు

వాసొఖ్తాలు, మర్సియాలు మఱియు హజోలును రచించెను. ఫారసీ కావ్య సంగ్రహ మొకటి తయారుచేసెను. కొన్ని గద్యరచలును చేసెను. కాని అవి నేడు అలభ్యములు.

''సౌదా'' ఖసీదాలు వ్రాయుటలోనే సుప్రసిద్ధుడు. అతని గజలులు ఖసీదాల స్థాయినందుకో లేవు. ఈ సంగతి ఆనాడే అందఱు అంగీకరించిరి. అతడు కూడ ఈ విషయమును ఒకచో ఇట్లు వెల్లడించెను.

లోగ్ కహ్తే హైఁకె సౌదాక ఖసీదా హై ఖూబ్

ఉన్కీ ఖిద్మత్ మెలియే మై యె గజల్ జాతాహూఁ 1

ఈ విషయమును నేడును అందఱు అంగీకరింతురు. ఉర్దూ సాహిత్య చరిత్రలో అతడు సర్వోత్తమ ఖసీదా రచయిత. అతని గజలులును మంచివే కాని అవి ప్రౌఢరచనలు. సమకాలికులగు ఇతర "గజలులు" కవుల రచనలలోగల రసభావములతని గజలులలో లేవు. గజలులలోను అతని భాష ఫారసీ మిశ్రమము. అతి ప్రౌఢము– అతని భాషలో గజలులకు కావలసిన సారళ్యము, లాలిత్యములేవు, ఖసీదాల తరువాత అతని రచన హజోలలో పరిణతి చెందినది. ఖసీదా రచనలో అతని లేఖిని పుష్పవృష్టి కురియించెను. అట్లే హజోరచనలో అది విషలిప్తమై అగ్నిజ్వాలలు విరజిమ్మెను. అతని హజోలు అధికముగా వ్యక్తిగతమైనవి. వానిలో ఆనాటి పతన దశ, సామాజిక స్థితి చాల భావసహితముగా వర్ణితము. ఆ కవితల వలన ఆనాటి చిత్రములు కనులు ముందు వ్రేలుటయే కాక నశించిపోవుచున్న సామ్రాజ్య వ్యవస్థతో సంబంధముగల జనుల హృదయాలలోని శోకానుభూతియు విదితమగును. సౌదా కవిత వలన ముసల్మానుల జీవితము మఱియు వారి ఆచార వ్యవహారములు విస్పష్టముగా తెలియనగును. ఇట్టి మూడు రచనలు చాల ప్రఖ్యాతములు– ఒకటి ఒక బలహీనమగు గుఱ్ఱమును ప్రతీకగాగొని ఆ యుగపు దౌర్బల్యమును వర్ణించినది. రెండవది పాదుషా మొదలుకొని సామాన్య ప్రజ వఱకు గల లోపముల నుల్లేఖించినది– కొన్నిచోట్ల హాస్యము చాటున అశ్రువులు తొణికిసలాడును. మఱికొన్ని చోట్ల వ్యంగాత్మకముగా జీవనప్రాబల్యము వర్ణితము. ఎట్టి కవిత వ్రాసినను "సౌదా"

---

1. లోకులు సౌదాఖసీదాలే గొప్పవందురు – వారి సన్నిధానమున ఈ గజలు సమర్పించెదను.

దానికొక మహనీయత ఆపాదించి మహాకవియయ్యెను. అతని మర్సియాలును ఆ కాలమున అద్వితీయములే.

"సౌదా" కాలమునాటికి ఉర్దూలో దకనీ భాషాప్రభావము తగ్గి ఫారసీ పద ప్రయోగ మధికమయ్యెను. ఖసీదాల భాష యెప్పుడును ప్రౌఢమే. కనుక "సౌదా" ఫారసీని విశేషముగా ఉపయోగించెను. అతడు హిందీలోని సుందర పదజాలమును, హిందీభావములను భారతీయములగు ధార్మిక, ఐతిహాసిక విషయములను కూడ తన కవితలో చేర్చుకొనెను. అర్జునుడు, కృష్ణుడు, ఇంద్రుడు మొదలగు మహాపురుషుల ప్రసక్తి అతని కవితలో ఎడనెడ కన్పించును. ఫారసీ హిందీ శబ్దముల సమాసముల వలన ఆనాటి భాష ఎట్లు వృద్ధిచెందుచుండెనో తెలియును. ఫారసీ కవిత చదివినచో "సౌదా" కేవలము కవియేకాక గొప్ప విద్వాంసుడనియు విజ్ఞానియనియు తెలియును. అతని కవితవలన ఆనాటి జీవితసమస్యలెన్నియో అవగాహన మగును. ఇచట అతని ఖసీదాలనుండి మర్సియాలనుండి లేక హజోలనుండి ఉదాహరణలిచ్చుట కష్టము.

గజలులనుండి కొన్ని మచ్చుముక్కలు :—

జోమజ్కూర్ ఉస్‌సె కర్తాహై కోయీ గమ్‌ఖార్ రోనేకా
తొ కహెతా హైకి చుప్‌రహ, హై ఉసే ఆ జార్ రోనేకా

మై అప్నే హాల్‌పర్ హఁస్తాహూఁ వర్నాహర్ ఘడీ జాలిమ్
మొహబ్బత్‌మే తేరీ సామాఁ కియా తయ్యార్ రోనేకా
కభూమై బాత్ భీ రోయే నహీకీ ఉస్‌సే పర్ ఉనే
న పూఛా యూఁ సబబ్ క్యాహై తేరే హర్ బార్ రోనేకా 1

1. నా బాధపట్ల సానుభూతి కలవారెవరేని ఆమెతో నా ఏడ్పునుగురించి చెప్పినచో "ఊరుకుండుము. అతనికి ఏడ్పురోగమే కలదు." అనును. నేను నా స్థితిపై నవ్వెదను కాని ఓ క్రూరురాలా : నీ ప్రేమలో అడుగడుగున ఏడ్వవలసిన అవసరమే- ఆమెతో నేనెప్పుడు ఏడ్పులేక మాటలాడలేదు- అయినను నా యేడ్పునకు కారణమేమని ఒకసారైనను అడుగదు.

జబ్ నజర్ ఉస్కీ ఆన్ పడ్తీ హై
జిందగీ తబ్ ధ్యాన్ పడ్తీ హై
ఏక్ కే మూహ్ సే జిస్ ఘడీ నిక్లే
ఫిర్ తో సౌకీ జబాన్ పడ్తీ హై
లేకిన్ ఇత్నా కహే కోయీ ముఝ్‌సే
కభూ ఉస్కేభీ కాన్ పడ్తీహై 2

*    *    *    *

మై హాల్ కహూఁ కిస్‌సే తేరే అహద్‌మే అప్నా
రోతే హై కహీఁ దిల్కో కహీఁ జీకీ పడీహై 3

*    *    *    *

జిస్ రోజ్ కిసీ ఔర్ పె బేదాద్ కరోగే
యే యాద్ రహే హమ్‌కో బొహత్ యాద్ కరోగే 4

ఈ యుగపు ప్రసిద్ధ కవులలో ఇంకొకడు "సోజ్" అతని పేరు సయ్యద్ మొహమ్మద్ మీర్. తొలుత అతడు "మీర్" అను ఉపనామమే గ్రహించెను. కాని మీర్ తకీ "మీర్" పేరు కావ్యరంగమున వ్యాపించుట వలన తన ఉపనామము మార్చుకొని "సోజ్" అనునది గ్రహించెను. ఢిల్లీలో సామాన్య జీవనము గడుపు చుండెను. ఢిల్లీ వినాశనము తరువాత ఫరుఖాబాదకు వెళ్ళెను. అచటినుండి లఖ్నోకు

---

2. ఆమె చూపు నాపైపడగనే జీవితముపై ధ్యాస పోవును - ఒకరి నోటినుండి వెడలి నంతనే (మాట) నూరుగురి నోటపడును. అయినను ఎప్పుడేని ఆమె చెవిలో కూడ పడినదా! ఈ సంగతి ఎవరైన చెప్పుడు?

3. నా పరిస్థితి యెవరితో చెప్పికొందును. నీ హయములో ప్రాణము పోవుననియో, హృదయము పోవుననియో ఏడ్తును.

4. ఏనాడేని ఇతరు లెవరిపైనను ధార్ష్ట్యము చూపుదువేని ఆనాడు మమ్ము చాల జ్ఞాపకము చేసి కొగలవు. ఇది జ్ఞాపకముంచుకొమ్ము.

వెళ్ళెను. అటనుండి ముర్షిదాబాదకును వెళ్ళి ఫలితమేమియు లేనందున తిర్గి లఖ్నో చేరుకొనెను. ఈసారి నవాబు ఆసఫొద్దౌలా అతనిని గురువుగా నియమించుకొనెను. కాని కొలదికాలముననే అనగా క్రీ. శ. 1798లో మరణించెను. అతడు కవితలోనే కాక గుఱ్ఱపుస్వారి, శస్త్రవిద్య, విలువిద్యలలో నిపుణుడు. సంగీతవిద్యలో ప్రవేశము కలవాడు. వీణావాదనలో నేర్పరి. అతని కావ్యసంగ్రహము అధిక సంఖ్యలో గజలులు గల చిన్న గ్రంథము – అతని భాష అతి సరళము, వ్యావహారికమునకు సన్నిహితమగుట మధురము– గజలు కొఱకు కావలసిన రసవంతమగు సరళభాష, భావనాశక్తి అతని స్వాధీనము.

ఉదాహరణకొఱకు కొన్ని చరణములు :—

లేఫిరామై కహాఁ కహాఁ దిల్కో–
నలగా, లేగయా జహాఁ దిల్కో– 1

జబ్ తలక్ ఆంఖేఁ ఖుల్ థీఁ దుఃఖ్ పె దుఃఖ్ దేఖాకియే
ముంద్ గయీ జబ్ ఆంఖ్ యాఁ తబ్ "సోజ్" సబ్ ఆనంద్ హై–2

రాత్ కో నీంద్ హైన దిన్ కో చైన్
ఐసే జీనేసె ఐ ఖుదా ! గుజ్రా 3

కహెతా న థామై ఐదిల్ ఇస్ కామ్ సే తూ బాజ్ ఆ
దేఖా మజా న తూనే నాదాన్ ఆష్కీ కా 4

ఈ యుగమున అగ్రగణ్యుడగు కవి మీర్ తఖీ "మీర్"– అతడు ఫారసీ భాషలో తన స్వీయచరిత్ర వ్రాసికొనెను. అది "జిక్రె–మీర్" అను పేర ప్రకాశితము.

---

1. నా హృదయము నెందెందో తీసుక వెళ్ళితిని. ఎచటను దానికి స్తిమితము కలుగలేదు.
2. కన్నులు తెరచియున్నంత వఱకు దుఃఖములపై దుఃఖములే చూచితిమి. కనులు మూతలు పడినంత అంతయు ఆనందమే.
3. రాత్రి నిదురలేదు. పగలు సౌఖ్యములేదు - దేవుడా ! ఇట్టి జీవితమిక చాలును.
4. ఓ అమాయిక హృదయమా ! నీకు ప్రేమ రుచి తెలియదు. ఈ పని విరమించు కొమ్మని నేనన లేదా !

అందు జీవిత విశేషములేకాక ఆనాటి రాజకీయ, సామాజిక విషయము లనేకములు వర్ణితములు. అతడు అక్బరాబాద (ఆగ్రా) లోని యొక శిష్టకుటుంబమున క్రీ. శ. 1725లో జన్మించెను. అతని తండ్రి ఒక సుప్రసిద్ధుడగు సూఫీ ఫక్కీరు– బాల్యము నుండియు "మీర్" సూఫీలు మఱియు జ్ఞానుల సాహచర్యమున సరళ జీవితము గడపుటకు అలవాటుపడెను. పదియేండ్ల ప్రాయమునాటికి పితృహీనుడయ్యెను. సవతి తల్లి కొడుకులు కష్టపెట్టుటవలన ఆగ్రా విడిచి ఢిల్లీ చేరుకొని సవతి తల్లి సోదరుడగు ఖాఁ "ఆర్జూ" యింట నివసించెను. ఖాఁ "ఆర్జూ" తన కాలమున గొప్ప విద్వత్కవి– అనేక కవులకు గురువు– కనుక "మీర్" కూడ కవితా రచనలో అతని వలన లాభము పొందియుండవచ్చును. కాని ఈ మాట నిశ్చయముగా చెప్ప రాదు. ఏలయన అతనికిని ఆ మామకును మంచిమాట లేకుండెను– ఢిల్లీ చేరి "మీర్" ఎందఱో అమీరుల యిండ్లలో పనులు చేసెను. ఒకచోట పిల్లలకు చదువు చెప్పుట ఇంకొకచోట ఏదో యొక పనిచేయుట మొదలగునవి– కాని ఈ కాలమున అతనికి మనస్థిమితము లభించలేదు. ఢిల్లీ జీవితమెంత దుఃఖమయమో అతని జీవితమును అట్టిదే. ఎవరేని పతనావస్థలోనున్న ఆనాటి సమాజమును, దాని గాఢమగు వ్యధను చూడదలచినచో ఆనాటి చరిత్రలలోకాదు మీర్ కావ్యములలో స్పష్టముగాచూడవచ్చును.

అతడే ఒకచోట ఇట్లనెను.

బర్హమీ హాల్‌కీ హై సారీ మేరే దీవాఁ మేఁ
సైర్ కర్ తూభీ యే మజ్మూ– అ పరీషానీకా 1

ఢిల్లీ పరిస్థితి దినదినము దిగజారిపోవుచుండెను. కవులందఱు అటనుండి వెడలిపోవుచుండిరి. "సౌదా" "సోజ్" మఱియు కొందఱితరులు లఖ్నో చేరిరి. "మీర్" కూడ క్రీ. శ. 1782 లో లఖ్నో చేరెను. నవాబు ఆసఫొద్దౌలా నెలకు రూ. 300. వేతనము నియమించెను. "మీర్" హృదయము అతి సున్నితము. ఆత్మాభిమానమును, ఆత్మగౌరవమును కాపాడుకొనుటకొఱకు ఆపదలు సహించుట అతని స్వభావము. అట్లగుట నవాబుతో అతని సంబంధము నిలువలేదు. దర్బారునకు రాకపోకలు నిలిచిపోయెను. అయినను ఆసఫొద్దౌలా అతని వేతనము నిలిపివేయలేదు.

1 నా కావ్య సంగ్రహమున నా హృదయవ్యాకులత అంతయు కలదు – నీవును ఈ వ్యథా సమూహము నవలోకింపుము.

మీర్ క్రీ. శ. 1810 లో లఖ్నోయందే మరణించెను. అతని రచనలలో ఆరు కావ్య సంగ్రహములేకాక ఎన్నియో ఫారసీ పుస్తకములును కలవు. "జిక్రె-మీర్" అతని ఆత్మకథ- "నికాతుష్షో-అరా" అనునది ఉర్దూకవుల చరిత్ర. "ఫైజె-మీర్" అనునది సూఫీల కథలు కొన్నికల గ్రంథము. అది అతని కుమారుని శిక్షణార్థము వ్రాయబడెను. ఈ రచనలన్నియు ఫారసీలో కలవు. ఇవి సాహిత్య గౌరవమును చారిత్రక మూల్యమును కలవి. ఇంతేకాక ఒక ఫారసీ కావ్యసంగ్రహమును ఒక మర్సియాల సంకలనమును కలవు.

మీర్ జీవితమంతయు శోకమయము. కనుక అతడు నష్టప్రాయమగు దిల్లీకి సజీవ ప్రతీక. సూఫీయగు అతని తండ్రి అతనికి ప్రపంచములో ప్రేమను మించినది ఏదియులేదనియు, ప్రేమవలననే విశ్వవాహిని ప్రవహించుచున్నదనియు బోధించెను. సంతుష్టిని అలవఱచి మానవ శ్రేష్ఠతను ఎఱుకపఱచెను. తండ్రిచేసిన ఈ బోధనలన్నియు అతనిలో కరుడుగట్టుకొని పోయెను. అన్నివైపుల దుఃఖమే అలముకొన్నప్పుడు, భారతదేశము అత్యంత దుర్దశకు పాలయినప్పుడు "మీర్" వ్యక్తిత్వములో అద్భుతమగు శీఘ్రియు సౌందర్యమును నెలకొనెను. ఎవరిముందేని చేయి చాచుట మానవజాతి అవమానమనియే భావించుచుండెను. భగవదనుగ్రహమును సైతము స్వీకరించుటకు ఇచ్ఛగించువాడు కాడు. అంతియేకాక అతని భగ్నప్రేమ కారణమున అతడు చెప్పినదంతయు స్వీయ కథవలె అడుగడుగున అనుమానపడుట కెడమిచ్చును. జీవిత శోభలన్నియు అణగారిన ఒక ప్రపంచమును తన యెదలో పదిలపరచుకొనెను. అందలి తోటలలోని పూలన్నియు వాడిపోవుటకే పూయును- అతని బహిః ప్రపంచమును అట్టిదే. మొగలురాజ్యము మరల కోలుకొను ఆశ లేకుండ పతనము చెందుచుండెను. ఈ పతన కాలపు చిత్రములతని కవితలో సజీవ శైలిలో హృదయ విదారకముగా రచియింపబడినవి. అచటచట ఆకాలపు సంఘటనలు స్పష్టముగా సూచింపబడినవి. కాని అధికముగా సామ్రాజ్యవ్యవస్థ పతనము చెందుటకు పరిణామ రూపమున ఏర్పడిన వాతావరణమే చిత్రింపబడినది.

నేటివఱకు "మీర్" గజలు రచనలో సర్వాధికుడు - అతని పద్యములు బాణములవలె హృదయమున దూసికొని పోవును. సామాన్యము సరళము అగు వ్యావహారిక భాషలో అంతటి రసము, అంతటి తీపి, అంతటి విషము, అంతటి చేదు హార్దికభావములను అట్టి కోమల ఫక్కిలో వెలువరచుట, జంఝూమారుతమువంటి

భావావేశము - ఇవన్నియు అతని కవితను ఒక చమత్కారముగా రూపొందించినవి. గజలులే కాక మస్నవీలు మొదలగు ఇతర రచనలు చేసినప్పటికిని అతడు గజలుల సామ్రాట్టుగానే ప్రఖ్యాతుడు. అతని గజలుల చరణములు కొన్ని ఉదాహరణమునకు:-

హస్తీ అప్నీ హబాబ్ కీ సీ హై
యె నుమాయిష్ సురాబ్ కీ సీ హై
నాజుకీ ఉస్కే లబ్ కి క్యా కహియే
పంఖడీ ఏక్ గులాబ్ కీ సీ హై
బార్ బార్ ఉస్కే దర్ పె జాతా హూఁ
హాలత్ ఎక్ ఇజ్తెరాబ్ కీ సీ హై
"మీర్" ఉఞ నీమ్ బాజ్ ఆంఖోమ్మే
సారీ మస్తే షరాబ్ కీ సీ హై 1

* * * *

దిల్ వో నగర్ నహీకి ఫిర్ ఆబాద్ హో సకే
పఛ్తా వో గె సునోహో యె బస్తీ ఉజాడ్ కే 2

"మీర్" కె దీనో- మజ్హబ్ కో క్యా పూఛ్తే హోతుమ్ ఉఞనేతో
ఖష్కా ఖీంచా, దైర్ మే బైఠా, కబకా తరక్ ఇస్లామ్ కియా 1

* * * *

---

1. మన అస్తిత్వము బుద్బుదము వంటిది. ఈ ప్రదర్శన మంతయు మృగతృష్ణ వంటిది - ఆమె యధరపు కోమలత నేమని వర్ణింతును. అదొక గులాబి పూరేకు. మాటిమాటికి ఆమె ముంగిటికి వెళ్ళుచున్నాను. హృదస్థితి అతి వ్యాకులము - ఆమె అరమోడ్పు కనులలో మద్యమునకు వలె మాదకత కలదు.

2. హృదయము పాడాటి మరల పొందునట్టి నగరముకాదు. దానిని పాడుపఱతువేని చాల పశ్చాత్తాప పడగలవు. వినుము-

1. "మీర్" మతమును గూర్చి యేమి ప్రశ్నింతువు? అతడు తిలకము దిద్ది, మందిరములో నాసీనుడై ఏనాడో తన మతమును (ఇస్లామును) విడిచెను.

ఫకీరాన ఆయే సదాకర్ చలే
మియాఁ ఖుష్ రహో హమ్ దువాకర్ చలే
జో తుమ్ బిన్ న జీనే కీ కహ్తేథే హమ్
సొ ఉస్ అహద్ కో అబ్ వఫా కర్ చలే 2

*        *        *        *

నమిల్ "మీర్" అబ్‌కే అమీరోన్సే తూ
హువే హైఁ ఫకీర్ ఉన్కీ దౌలత్ సే హమ్ 3

*        *        *        *

ఇబ్తెదాయే ఇష్క్ హై రోతాహై క్యా
ఆగె ఆగే దేఖియే హోతా హై క్యా 4

*        *        *        *

ఖామత్ ఖమీదా, రంగ్ షికిస్తా, బదన్ నజార్
తేరా తో "మీర్" గమ్‌మే అజబ్ హాల్ హో గయా 5

ఈ సమయమున ఇంకొక విషయమును సూచించుట అవసరము. అదేమన రాజకీయములు సంస్కృతిపైనను భాషపైనను ధర్మము అను ముద్రవైచు వరకును హిందూ ముసల్మానులందఱును ఉర్దూలో రచనలు చేయుచు, కవిసమ్మేళనములలో సమానగౌరవము పొందుచుండిరి. ఉర్దూ భాషాసాహిత్య నిర్మాణములోను వికాసములోను అన్నిమతముల వారును అన్నివర్ణముల వారును పాల్గొనుచుండిరి. ఈ యుగగమున ఆనందరామ్ "ముఖ్లిస్," టేక్‌చంద్ "బహార్," బ్రిందావన్ "రాఖిమ్,"

2. ఫకీరులవలె వచ్చి సంబోధించి వెళ్ళితిమి. మీరు సంతోషముగా ఉండుడు. మేము దీవించి వెళ్ళితిమి. నీవు లేకున్న జీవించమని అనుచుంటిమి. ఆ శపథమును నెరవేర్చి వెళ్ళితిమి.

3. "మీర్ !" ఇక ధనికులతో కలియకుము- వారి ధనముతోనే మనము ఫకీరుల మైతిమి.

4. ఇది ప్రణయారంభము. ఇప్పుడే ఏడ్తువేల ? ఏమగునో ముందుముందు చూడుము-

5. వంగిన నిలువు, వాడినవర్ణము, జర్ఝరితమగు తనువు కలిగి ప్రేమలో నీ పరిస్థితియే విచిత్రమైనది !

భికారీలాల్ "అజీజ్," మహతాబ్‌రాయ్ "తాబా౯," బాల్‌ముకుంద్ "హుజూర్," మంగళసేన్ ఉల్ఫత్, సియాల్ కోటీమల్ "వారుస్తా" బ్రిందావన్‌లాల్ "ఖుష్గో," ఖూబ్‌చంద్ "జకా", రాయ్‌సరబ్ సుఖ్ "దీవానా" మొదలగువారు ఫారసీ విద్వాంసు లయినను అప్పుడప్పుడు ఉర్దూ కవిత వ్రాయుచు "ఉస్తాదు"లనదగి యుండిరి. వీరిలో అనేకులు రచించిన కవితలు, శబ్దకోశములు, ఇతర రచనలు చాల ప్రాముఖ్యము కలవి. ముఖ్లిస్, బహార్, ఖుష్గో మఱియు వారుస్తా అనువారు ఈరానీ విద్వాంసుల సమఉజ్జీలు. సరబ్‌సుఖ్ దీవానా చాలకాలము పట్నాలో నివసించెను. అతడు ఫారసీ, ఉర్దూ రెండు భాషలలో మహాకవి. అతని ఉర్దూ కావ్యసంగ్రహ మొకటి, ఫారసీవి నాలుగు ఉన్నట్లు తెలియును. మీర్ హైదరలీ "హైరా౯" మఱియు జాఫరలీ "హస్రత్" అను ప్రసిద్ధ ఉర్దూ కవులిరువురు అతని శిష్యులు. గజలు రచనలో నవీనత కూర్చినవాడు "హస్రత్" అతని శైలిని అతని ప్రఖ్యాత శిష్యుడగు ''జుర్-అత్'' లఖ్నోలో చాల ప్రకాశింపజేసెను. ఈ విషయము ముందటి అధ్యాయములలో తెల్పబడును. 18వ శతాబ్దాంతమున మఱియు 19వ శతాబారంభమున పట్నా అవధ్ మఱియు హైదరాబాదలలో ఇట్టి విద్వాంసులే ఫారసీలోనే కాక ఉర్దూలోను రచనలు చేసిరి. ఈ పరంపర నేటివఱకు సాగుచున్నది. ఈ అధ్యాయమున 18వ శతాబ్దపు ఢిల్లీకవుల పేర్లు మాత్రమే ఉల్లేఖింపబడినవి. విశేషాంశములు తెలియగోరువారు ఆనాటి చరిత్రలు, కావ్యసంగ్రహములు, కవిజీవితములను చూడ వలయును. ప్రాచీన కవులలో ''మీర్,'' ''ముస్హఫీ'' మఱియు ''మీర్‌హసన్''లు తమ తమ కవిజీవితాలలో వీరిపేర్లు చాల గౌరవభావముతో ప్రస్తావించిరి.

ఈ యుగము "దర్ద్," "సౌదా", మఱియు "మీర్" వంటి మహాకవులను జన్మింపజేసినందుననే మహత్తరమైనది కాదు. ఉర్దూసాహిత్యము సంపూర్ణముగా జీవనమున వ్రేళ్లుపారి వ్యాపించినది. నష్టప్రాయమగు ఆనాటి సంస్కృతిని మహాకవులు తమ రచనలలో చిత్రించి చారిత్రక మహత్వము కలిగించిరి. ఈ కవులు పతనకాలపు నైరాశ్యమునకు, తిక్తతకు ప్రతీకప్రాయులే అయినను మానవజాతి గౌరవమును అభిమానమును వీరి కవితలలో గోచరించును. జీవితములో సమస్తము ఓడిపోయియు వారు జీవిత సౌందర్యము నన్వేషించిరి. 18వ శతాబ్దము భారతదేశమున వింత వింత సమస్యలను ఉత్పన్నము చేసెను. కాని పైన పేర్కొనబడిన కవులు ఈ సమస్యలకు పరిచితులుకారు. సామ్రాజ్యవ్యవస్థ సమాప్తి చెందుచున్నదనియు,

దాని గర్భమునుండి ఒక నూత్న జీవనము పొడము చున్నదనియు వారెఱుగరు. పర్షియా మఱియు భారతదేశముల సభ్యతల కలయికచే ఉత్పన్నమైన జీవనము నశించు చుండెను. కాని నష్టపడుచున్న దాని శోభలో ఒకవింత సౌందర్యముండెను. రోగగ్రస్థమగు శరీర సౌందర్యమును అప్పుడప్పుడు ఆకర్షణీయమై యుండును. "మీర్" మఱియు "దరద్"ల కవిత్వమునుగూర్చి ఈ మాటే అనవచ్చును. ఈ కవులు భారతదేశమున జన్మించిరి. కనుక ఇచటి ఆంతరంగిక సమస్యలును బహిరంగ సమస్యలును వీరికి తెలిసినవే. హోలీ, దీపావళి, నీలాటిరేవు, స్నానము, మాలకరి యోగిని మొదలగునవన్నియు వారి కవితావస్తువలైనవి. అయినను వారికి సరియైన త్రోవ చూపగల సామాజిక చైతన్యము లేకుండెను. వారు నాస్తికులుకారు. కాని వారి భావ స్వాతంత్ర్యము వారిని మతపక్షపాతమునకును, సంప్రదాయ వ్యామోహమునకు గురికానీయలేదు. మతము, ధర్మము అనగా వారి దృష్టిలో ఆంతరంగిక పవిత్రత మఱియు మానవప్రేమ. ఈ భావము వారికి "ఛాయావాదము" వలన లభించినది. వారికవితలలో ఆధ్యాత్మిక గంభీరత కంటె భావుకత హెచ్చు. సారంశమేమన వారు అప్రయత్నముగా తాము చూచుటయేకాక స్వయముగా అనుభవించిన సమస్తములగు మంచి చెడ్డలను వ్యాఖ్యానించిరి.



## నాలుగవ అధ్యాయము

# అవధ్ మఱియు ఉర్దూ సాహిత్యము

వెనుకటి అధ్యాయమున ఢిల్లీ పాడువడుచుండ అచటి కవులు ఇటునటు వెడలిపోయిరని తెల్పబడినది. ఢిల్లీ సాహిత్య కేంద్రమేకాక రాజకీయముగను ప్రముఖ స్థానము. దాని సామాజిక వ్యవస్థ విచ్ఛిన్నమైనంతట ఎన్నియో రాజ్యము లేర్పడి ఆ పైన సాహిత్యకేంద్రములైనవి. అవధ్, ఫరుఖాబాద, టాండా, అజీమాబాద, ముర్షిదాబాద మఱియు రామపూర్‌లలో రాజదర్బారులు వెలసినవి. అందు కొన్ని స్వల్పకాలమే వెలిగి ఆరిపోయినవి. కొన్ని చారిత్రకముగా, సాంస్కృతికముగా ప్రతిష్ఠగాంచినవి. క్రీ. శ. 1724 సంవత్సర ప్రాంతమున అవధ్ రాజ్య స్థాపన జరిగినది. సిరాజుద్దౌలా కాలమున దానికి గొప్ప ప్రాముఖ్యము కల్గినది. ప్రారంభమున అవధ్‌నవాబు వజీరులు ఫైజాబాదను తమ ముఖ్యపట్టణముగా చేసికొనిరి. పదవికి వారు ఢిల్లీ మొగలు చక్రవర్తుల వజీరులు. అయినను వాస్తవముగా స్వాధీనులు. షుజావుద్దౌలా క్రీ. శ. 1754 నుండి క్రీ. శ. 1775 వఱకు రాజ్యపాలనము చేసెను. ప్లాసీ, పానిపట్టు మఱియు బక్సారు యుద్ధములలో పాల్గొని అతడు భారత చరిత్రలో అవధ్ కొక ప్రత్యేక స్థానము సమకూర్చెను. ఫైజాబాదను ఢిల్లీవలె రూపొందింపజేయుటకై కవులను కళావేత్తలను పిలిపించి వారికట స్థిరనివాసము లేర్పాటుచేసెను. నవాబు ఆసఫొద్దౌలా (క్రీ. శ. 1775-1797) అవధ్ ఉన్నతికి మూలపురుషుడు. అతనిలో తండ్రికిగల కార్యాలోచన, వీరత్వము లేకుండెను. కాని ఒక విశాల సామ్రాజ్యమును సుందరముగా, లోకప్రియకరముగా శృంగారించు యోగ్యత ఉండెను. అతడు ఈస్టిండియా కంపెనీ ఒత్తిడివలనను మరికొన్ని కారణముల వలనను ఫైజాబాద నుండి తన రాజధానిని లఖ్నోకు మార్చి అచట మహోన్నత భవనములను ఉద్యానవాటికలను వెలయించెను. ఆసఫొద్దౌలా తరువాత అతని తమ్ముడు సాదతలీఖాన్ సింహాసనమెక్కి పదునారు వత్సరములు రాజ్యమేలెను. అతని తరువాత 'గాజియుద్దీన్' నవాబయ్యెను. అతడు కంపెనీ సహాయమున నూరేండ్ల నుండి నామ మాత్రముగా ఢిల్లీతోగల సంబంధమును త్రెంచుకొని పాదుషాపదవి పొందెను. ఈ రాజ్యము క్రీ. శ. 1856 వఱకు సాగెను.

చివరి పాదుషాయగు వాజిదలీషాను కలకత్తాలో ఖైదుచేసి ఇంగ్లీషువారీ రాజ్యమును లోబరచుకొనిరి.

ఇచట అవధ్‌చరిత్ర వ్రాయుట ఉద్దేశ్యముకాదు. చిన్న యెత్తున స్థాపింపబడిన ఒక రాజ్యము పెద్ద సాహిత్య కేంద్రముగా రూపొందింది. కొన్ని చారిత్రక కారణముల వలన ఉర్దూ సాహిత్య మొక వినూత్న శైలిలో వికసించుటకు మూలస్థానమైన ఉదంతము తెల్పుటయే లక్ష్యము. షుజావుద్దౌలా తాను కవి కాకున్నను పత్రములు వ్రాసి వ్రాసి కవుల నాహ్వానించి, ఆదరించి తన ఆస్థాన శోభ ఇనుమిక్కిలి చేసి కొనెను. దిల్లీలో నిరుద్యోగులైయున్న కవులందరును ఈ క్రొత్త రాజ్యమువైపు ఆకర్షింపబడిరి. ఆసఫొద్దౌలా స్వయముగా మహాకవి. అతని కావ్య సంగ్రహము చదువదగినది. దిల్లీలోని ప్రసిద్ధకవి 'మీర్‌సూజ్' అతని గురువు. గాజియుద్దీన్ హైదర్, నాసిరొద్దీన్ హైదర్ మఱియు వాజిదలీషాహలును కవిత వ్రాసిరి. వాజిదలీషా ఉర్దూ ఫారసీ భాషలలో గద్య పద్య రూపమున సుమారు వంద పుస్తకములు వ్రాసెను.

దిల్లీ కవులు రాకపూర్వము అవధ్‌లో ఉర్దూభాష ఎట్టి పరిస్థితిలో ఉండెనో సరిగా చెప్పలేము. షుజావుద్దౌలా కాలమున దిల్లీ నుండి వచ్చిన మహాకవులు సౌదా, సూజ్, ఫుగాన్, జాహిక్ మొదలగు వారు ఇచట అపరిచితులు కారు. ఇచట కవి సమ్మేళనములలో వారికి సన్మానములు జరుగుచుండెను. అయినను వీరికి పూర్వ మచట సాహిత్యము స్పష్టరూపమున లేకుండెననుట గ్రహింపవలసిన విషయము. ఆసఫొద్దౌలా కాలమున అన్ని విధముల కళాకౌశలమును, సాహిత్యమును ఉన్నతి చెందెను. అతడు స్వయముగా కవి సమ్మేళనములలో పాల్గొనుచుండెను. ప్రజల ఉత్సవములలో పాల్గొనుచు దేశములోని కళాకౌశలములను ప్రోత్సహించుచుండెను. అతడు హోలీలో వసంతమాడు దృశ్యమును మీర్ సుందరముగా చిత్రించినాడు. దిల్లీనుండి వచ్చిన కవులలో అధికులు తమ జీవితమును చాల వఱకు అచటనే గడపిన వారగుట, ఇచటి జీవితమున త్వరగా కలిసిపోలేక పోయిరి. 19వ శతాబ్ది ప్రారంభమున అవధ్ దర్బారు సంపూర్ణముగా స్థాపితమయ్యెను. ప్రజాజీవన మొక క్రొత్త రూపము చెందెను. ఈ కాలమున వచ్చిన కవులు ఇచటి జీవితము వలన ప్రభావితులై ఇచటి సాహిత్యమును ప్రభావితము చేసిరి. ఇట్టి వారిలో ముస్హఫీ, జుర్-అత్, మీర్‌హసన్, మఱియు ఇన్షాలు ప్రముఖులు-ఉర్దూ సాహిత్యమును

గూర్చి వ్రాయబడిన ఏ చిన్నపాటి చరిత్ర గ్రంథములోనైనను దిల్లీ, లఖ్నో సాహిత్య కేంద్రముల విభిన్నత వర్ణింపబడును. ఈ సాహిత్య కేంద్రముల గూర్చి ముందు ముందు తెల్పబడును. నిజమునకు శైలిలో భేదమున్నను ఆలోచనలో మాత్రము భేదము లేకుండెను.

అవధ్ సాహిత్య కేంద్రమయినంత దిల్లీ సాహిత్య క్షేత్రము చల్లవడినదని భావింపరాదు. దిల్లీ కవులే కొన్నినాళ్ళ కొఱకు లక్నో చేరుటవలన అచట కలిగిన కవితా ప్రచారము ముందర దిల్లీ శోభ తగ్గిపోయెను. దిల్లీలోని సుప్రసిద్ధ కవులలో ఒకడగు 'జాహిక్' ఫైజాబాదచేరెను. అతడును సౌదాయును పరస్పరము గొప్ప సాహిత్యసమరము చేసిరి. భాషావిషయికముగా జాహిక్ మతమును అందఱును అంగీకరింతురు. అతని కొడుకు మీర్ హసన్ తండ్రిని మించిన కీర్తి సంపాదించెను. అతని పూర్తిపేరు 'మీర్ గులామ్‌హసన్'. అతడు క్రీ. శ. 1739లో జన్మించి 1783లో మరణించెను. తండ్రితోపాటు చాలకాలము ఫైజాబాదలో నివసించి రాజధాని లఖ్నోకు మారగా తానును లఖ్నోచేరి అచటనే మరణించెను. మీర్ హసన్ ఫారసీలోను విద్వాంసుడు. ఫారసీ భాషలో ఉర్దూ కవుల చరిత్ర వ్రాసెను–అది చారిత్రక దృష్టి ననుసరించియు విమర్శనా పద్ధతి ననుసరించియు ప్రాముఖ్యము కలది. అతని కావ్య సంకలన మింతవఱకు ప్రకాశితము కాలేదు. కాని సుప్రసిద్ధము లగు మస్నవీలును, గజేలుల సంగ్రహమును పలుసార్లు ప్రకాశితములైనవి. అతనికి 'మస్నవీ సహరుల్బయాన్' వలన అమరకీర్తి లభించినది. దానినే అప్పుడప్పుడు 'మస్నవీ మీర్ హసన్' అనియు 'బేనజీర్ జో బదర్ మునీర్ కీ కహానీ' అనియు పిలుతురు. అతని ఇంకొక మస్నవీ 'గుల్జారె ఇరమ్' కూడ ప్రసిద్ధము. అందు మనోహర శైలిలో ఫైజాబాద స్తుతియు లఖ్నో నిందయు చేయుచు తన యాత్రా వివరణమును తెల్పినాడు. అతడు గొప్ప మస్నవీ రచయితగా పేరొందుటకు 'సహరుల్బయానే' కారణము. అందు రాజకుమారుడు బేనజీర్ మఱియు రాజ కుమారి బదరెమునీర్ ప్రేమగాథ వర్ణితము. ఈ కథ క్రొత్తదికాదు కాని మీర్ హసన్ స్వకపోల కల్పనలచే దీనికి మెఱుగు పెట్టెను. ఈ మస్నవీ వలన ఆనాటి జీవిత విధానము స్పష్టమగును. జన్మదినోత్సవములు, వివాహములు మఱియు నిట్టి అనేక సందర్భములను కనులకు కట్టినట్లు వర్ణించినాడు కవి. ప్రకృతి, మనుష్యజాతి, సభ్యత మొదలగునవియు సుందరశైలిలో వర్ణింపబడినవి. ఈ మస్నవీలో అలౌకిక

జీవితము అధికముగా వర్ణింపబడినను దాని చాటున ఆనాటి సభ్యతను సూచించు వాస్తవికతయు కలదు. ఉర్దూ సాహిత్యమున శ్రేష్ఠతర రచనయగు ఈ మస్నవీని మీర్ హసన్ చాలకాలము వ్యయపరచి రచించెను. ఈ రచనపై అతడును గర్వానుభూతి చెందెను. ఇవియేకాక అతడు మర్సియాలును, ఖసీదాలును వ్రాసెను. కాని అందు కృతకృత్యుడు కాలేదు. మస్నవీల తరువాత పేర్కొనదగినవి అతని గజలులు. మీర్ గజలులలోవలెనే మీర్ హసన్ గజలులలో వేదన, తీయదనము మఱియు సరళత గోచరించును. అతని భాష వ్యావహారికమునకు సమీపము. సరళము. మస్నవీల నుండి ఉదాహరణము లిచ్చుట కష్టము.

ఈ క్రింది గజలుల ఉదాహరణము వలన అతని శైలి బోధపడును.

తూరహా దిల్‌మె దిల్‌రహా తుఝ్‌మే
తిస్ పెతేరా మిలాప్ హోన సకా 1

హంస్నా ఔర్ బోల్నాతో ఏక్ తరఫ్ -
సామ్నే ఉస్కె మైతో రో నసకా 2

దిల్ గమ్‌సె తెరే లగా గయేహమ్
కిస్ ఆగ్‌సె ఘర్ జలాగయే హమ్

ఖోయా గయా ఉస్మె గౌదిల్ అప్నా
పర్ యార్ తుఝే తౌపాగయే హమ్ 3

బస్‌గయా జబ్‌సె యార్ ఆంఖోమ్మే
తబ్‌సే ఫూల్ బహార్ ఆంఖోమ్మే 4

---

1. నీవు హృదయమున నుంటివి. హృదయము నీలో నుండెను. నీవే నీతో కలిసికొనలేక పోయితివి.

2. ఆమె ముందు నవ్వుట, మాటాడుట అటుంచి నేను ఏడ్వనులేకపోతిని.

3. హృదయమును నీ బాధతో ముడి వెట్టితిని. ఇంటికి ఎట్టి అగ్ని తగిలించితిని. అందు హృదయము లుప్తమైపోయినది. కాని మిత్రుడా! నిన్ను పొందినాను.

4. మిత్రుడు కనులలో వసించినప్పటినుండి, కనులలో వసంతము వికసించినది.

గుల్ హువే జాతేహైఁ చిరాగ్ కి తరహ్
హమ్‌కుటుక్ జల్ద్ ఆఁకర్ దేఖో 5

షేక్ ఖలందర్ బక్ష్ 'జురత్' కూడ దిల్లీ నుండి ఫైజాబాదకు వెళ్ళిన కవి. అతడు దిల్లీ కవియగు 'హస్రత్' శిష్యుడు. హస్రత్ కవితలోని అశ్లీల శృంగారము నతడభివృద్ధి పఱచెను. అప్పుడు లఖ్నోలో మీర్జా సులేమాఁ షిక్వా దర్బారు సారస్వత పీఠమై యుండెను. సులేమాఁ షిక్వా చక్రవర్తియగు షాహ ఆలం కొడుకు. ఆసఫొద్దౌలా కాలమున లఖ్నో చేరినవాడు. అతడు స్వయముగా కవి. కవిజన పోషకుడు. దిల్లీ నుండి వెళ్ళిన కవులు తొలుత అతనినే ఆశ్రయించుచుండిరి. లఖ్నోచేరి 'జరత్' అతని ఆస్థానమున చేరెను. అతడుగ్రుడ్డివాడు. సంగీతములోను, సితారువాదనలోను, జ్యోతిషమునందును నిపుణుడు_సులేమాఁ షిక్వా దర్బారులో ప్రథమస్థానము పొందుటకై జురత్, ఇన్షా మఱియు ముస్హఫీలు పరస్పరము పోట్లాడుకొనుచుండిరి. జురత్ క్రీ. శ. 1810లో మరణించెను.

జురత్ విద్వాంసుడు కాదు. కాని భాషాప్రయోగ విషయమున నేర్పరి. అతని ప్రేమభావములు అశ్లీలములు. ఈ అశ్లీల ప్రేమభావ ప్రకటనమే లఖ్నోలోని విశిష్టశైలి యయ్యెను. అతని కావ్య సంగ్రహమున గజలులే అధికమైనను మస్నవీ మొదలగు ఇతర ఛందము లనేకములు కలవు. అతని గజలు లన్నిట భావము లోకరీతివే. అవి శృంగార రసప్రధానములు. ఐనను సుందరములు.
ఉదాహరణలివి:—

బాత్‌హీ అవ్వల్ తొ వో కర్తానహీ ముఝ్‌సే కభీ
ఔర్‌జో బోలేభి కుచ్‌ముఃసేతో షర్మాయా హువా
హై ఖలఖ్‌సే దిల్‌కియే హాలత్ మెరీ అబ్‌తోకిమై
చార్‌సూఁ ఫిర్తాహూఁ అప్నే ఘర్‌మె ఘబ్రాయాహువా 1

5. దీపమువలె ఆరిపోవుచున్నాను. ఒకసారి నను వేగవచ్చి చూడుము-

1. నాతో మొదలే ఏ మాటయు పలుకదు- ఏదేని నోట పలుకునేని అతి లజ్జతో- దుఃఖము వలన హృదయ స్థితి యెట్లున్నదని నా యింటిలో నేనే నలువైపున భీతచిత్తుడనై తిరుగుదును.

లగ్‌జా గలేసే తాబ్ అబ్ ఐనాజ్‌నీఁ నహీ
హై హై ఖుదాకె వాస్తే మత్‌కర్ నహీఁ నహీఁ 2

* * * *

పరీ సా జొముఖ్డా దిఖాకర్ చలే
ముఝే తుమ్ దివానా బనాకర్ చలే 3

* * * *

ఆయే జొమెరే పాస్‌తో ముఃఫేర్‌కె బైఠే
యే ఆజ్ నయా ఆప్నే దస్తూర్ నికాలా 4

మొగల్ రాజకుమారుడగు సులేమాన్‌షిక్వా దర్బారులో "ఇన్షా" అను మఱియొక సుప్రసిద్ధ కవి యుండెను. అతనిపేరు "ఇన్షావుల్లాఖాఁ"–ఢిల్లీ నివాసియే. కాని ఢిల్లీ పాడుపడిన తరువాత తండ్రితో "ముర్షిదాబాదకు" వెళ్ళెను. అచటనే అతని బాల్యమును యౌవనమును గడచెను. అతని ముర్షిదాబాద నివాసమునకు సాధారణముగా చరిత్రకారు లంతటి ప్రాముఖ్యము నీయరు. 18వ శతాబ్దిలోని బెంగాల్ ఢిల్లీకి భిన్నమైనది. ఆంగ్లభాష మరియు ఆంగ్ల సభ్యతల ప్రభావము వలన అచట నవజాగృతి కలుగుచుండెను. ఇన్షా గొప్ప విద్వాంసుడు. తీవ్రబుద్ధి కలవాడు. అనేక భాష లెఱిగినవాడు. జీవితమును క్రీడారంగముగా భావించి అందుత్సాహముతో దుముకుటకు ఎల్లప్పుడు నుద్యుక్తుడు. షాహఆలం కాలమున అతడు ఢిల్లీచేరి సన్మానితుడయ్యెను. కాని ఆస్థాన మప్పటికే స్మశానతుల్యమైనది. చక్రవర్తి కనులు గోల్పోయినాడు. ఇన్షా తన హాస్యప్రసంగముల వలన అచటి వాతావరణమును సహన యోగ్యముగా జేయజూచెను. అది సాధ్యపడలేదు. నలువైపుల నలముకొనిన అంధకారము విడిపోలేదు. కవులు పరస్పర ద్వేషము కలవారై కలహించుచుండిరి. అతడేదో ఒక పక్షమున జేరుచుండెను. కలహములు ముదిరి భరింపరాని స్థితి యేర్పడగా ఢిల్లీని విడిచి లఖ్నో చేరెను. అచట ఇన్షా, సులేమాఁ, షికోహ్

2. ఓ కోమలీ! ఇక సహించలేను. కౌగిలించుకొనుము. దేవుని కొఱకు వలదు వలదని అనకుము.

3. దేవకన్యవలె ముఖము చూపి వెళ్ళినది. నన్నున్మత్తునిచేసి వెళ్ళినది.

4. దరసకు వచ్చి ముఖము త్రిప్పికూర్చుంటివి. నేడీ క్రొత్తపద్ధతి యేమి?

ఆస్థానమున ప్రవేశించెను. "జుర్-అత్" "మస్హఫీ" మరియు నితర కవులు కొంద అచట పేరుగలవారు. ఇన్షా ఎవరికిని తీసిపోవువాడుకాడు. అతని ఆగమనము వలన కావ్యరచ నూత్నవికాసము పొందెను. కవి సమ్మేళనములలో మత్సరము పెరిగెను. పరిహాసములు, వ్యంగ్యభాషణములు, అవహేళనలు, నిందలు ముదిరెను. ఈ విష యము లన్నియు ఆనాటి గ్రంథములలో ఉల్లేఖింపబడినవి. కవితలో కృత్రిమత్వము, వెలికితనము స్థానము పొందుట శోచనీయము. లఖ్నోలోని భోగలాలసత ఆనాటి కవితలో ప్రతిబింబించెను.

వచ్చిన కొన్నినాళ్ళలోనే ఇన్షా తన కవిత వలన, చతురోక్తుల వలన ఆస్థాన మునకు ఆయువుపట్టయ్యెను. కావ్యరంగమున ఉత్తమకవిగా గణుతికెక్కెను. లఖ్నో నవాబు సాదతలీఖాన్ - తన నేర్పువలన ఇన్షా అతనికిని ఆంతరంగిక మిత్రు డయ్యెను. ఆనాడే కవికిని లభింపని గౌరవాదరములు పొంది నవాబు నహోరాత్రము లనుసరించెను. అయినను శ్రుతిమించిన అతని హాస్యమపుడు నవాబుకుకూడ వెగటని పించుచుండెను. పరిణామ రూపమున విముఖత పెరిగెను. ఇతర కవులును ఇన్షా ఉన్నతిని సహింపని అధికారులును ఎగద్రోసిరి. యువకుడగు పుత్రుడు ఆ కాలము ననే మరణించెను. చివరికి ఉన్మాదావస్థసిద్ధించెను. జీవితమంతయు ఎంత నవ్వించెనో అంత్యకాలమున అంత దుఃఖించెను. ఈ స్థితిలోనే క్రీ. శ. 1817 వ సంవత్సరమున మరణించెను.

ఇన్షా కావ్యసంగ్రహము ప్రకాశితము. అందతని రచన లన్నియు చేరలేదు. అతడు తుర్కీ, పిష్తూ, పంజాబీ, మార్వాడీ, కాశ్మీరీ, హిందీ మొదలగు భాషల పరిచయము కలవాడు. ఆంగ్లపదము లచటచట ప్రయోగించెను. ఈ సంగ్రహము నను వివిధ రీతుల కవితలు కలవు. కొన్ని అంతకుముందు ఉర్దూలో లేనివి. మచ్చు నకు బిందువులు లేని అక్షరముల రచన.[1] ఉర్దూలో బిందువులు లేని అక్షరములు కడుకొలది. అట్టి అక్షరములలోనే అతడు సుదీర్ఘములగు గద్య పద్య రచనలు చేసినాడు. ఇవికాక "రేఖ్తీ" అనబడు స్త్రీల భాషలో కొన్ని రచనలు చేసెను. ఈ భాషను గూర్చి ముందు వచ్చును. ఇన్షా కొన్ని ఫారసీ రచనలును చేసెను. మహా కావ్యమునకు కావలసిన గంభీరత, హార్దికావేదన అతని కవితలోలేవు. కనుక అతని

1. ఉర్దూ భాషలోని అక్షరముల పైన లేక క్రింద ఒకటి, లేక రెండు కొన్నిచోట్ల మూడు బిందువులుండును. ఉదా: బే (ب) పే (پ) తే (ت) సె (ث)

గజలులు తేలిక రచనలు_ఖసీదాలలోను మస్నవీలలోను భావగాంభీర్యము శూన్యము. అతడు మహాకవి యనుటలో సందేహము లేదు. అతని భావములలో, శైలిలో నవీనత లేకపోలేదు. కాని అతని రచనలు అతని విద్వత్తకు, విజ్ఞానమునకు అనురూపములు కావు. కొందఱు విమర్శకు లభిప్రాయపడినట్లు అతడు కవిత చెప్పకుండినచో అతని విజ్ఞానమట్టి దుస్థితిపాలు కాకుండెడిది. ఆస్థానకవి కాకుండినచో అతని కవిత అంత నష్టడక పోవునది.

"దర్యాయెలతాఫత్" అనునది ఇన్షా రచనలలో మహత్తరమైనది. భాషాశాస్త్రము, కావ్యశాస్త్రము, వ్యాకరణము మొదలగు అనేక విషయములు చర్చింపబడిన ఆ గ్రంథమును చదువుట వలన ఇన్షా విజ్ఞానాదికము బోధపడును. ఆనాటి ఉర్దూ భాషా స్వరూపము, వివిధ వర్గముల ప్రజలలో దాని వ్యవహారము, అప్పటి సామాజిక పరిస్థితులలో అది వికాసము పొందిన విధానమును గూర్చి అతడు ప్రతిభావంతమైన చర్చచేసినాడు. అది ఫారసీ వచన రచన. ఉదాహరణముగా ఉర్దూ గద్య పద్యములందు సంకలితములు. రెండవ గొప్ప గద్యరచన "రానీకేతకీ ఔర్ కువర్ ఉదయభానూకీ కహానీ" ఈ గ్రంథము ఉర్దూలోను హిందీలోను ప్రకాశితము. దీనిని గూర్చి ముందు ముందు వ్రాయబడును. వివిధ రీతులదగు ఇన్షా కవితనుండి ఉదాహరణము లిచ్చుట సంభవము కాదు. గజలుల నుండి కొన్ని ఉదాహరణము లీయబడును. అతని గజలులలో సుప్రసిద్ధమగు గజలిది. ఇది చివరి కాలపు రచన.

కమర్ బాంధే హువే - చల్నేకు యాఁ సబ్ యార్ బైఠేహైఁ
బొహత్ ఆగేగయే, బాఖీ జోహైఁ తయ్యార్ బైఠేహైఁ
నఛేడ్ అయ్ నిక్హతే - బాదే బహారీ రాహ్‌లగ్ అప్నీ
తుఝే అఠ్‌ఖేలియాఁ సూఝీహైఁ హమ్ బేజార్ బైఠేహైఁ
తసవ్వుర్ అర్ష్‌పర్‌హై ఔర్ సర్‌హై పాయె సాఖీసర్
గరజ్ కుఛ్ ఔర్ ధున్‌మే ఇస్ ఘడీ మైఖార్ బైఠేహైఁ
యే అప్నీ చాల్‌హై ఉఫ్తాద్‌గీసే అబ్‌కె పహరోఁ తక్
నజర్ ఆయా జహాఁపర్ సాయయే - దీవార్ బైఠేహైఁ

భలా గర్దిష్ ఫలక్‌కీ చైన్ దేతీహై కిసే ఇన్షా
గనీమత్ హైకెహం సూరత్ యహాఁ దోచార్ బైఠేహై 1

* * " *

ఝిడ్కీ సహీ, అదా సహీ, చీఁ-బర్-జబీఁ సహీ
సబ్ కుఛ్ సహీ, పర్ ఏక్ నహీంకీ నహీ సహీ 2

* * * *

యేజోమహంత్ బైఠేహైఁ రాధాకె కుండ్ పర్
ఔతార్ బన్‌కే గిర్తేహైఁ పరియోంకె ఝుండ్‌పర్ 3

* * * *

లేకె మై ఓఢూఁ, బిఛావూఁ, యాలపేటూఁ క్యాకరూఁ
రూఖీ సూఖీ ఔర్ ఫీకీ మెహర్బానీ ఆప్కీ 4

* * * *

---

1. మిత్రులందరును వెడలిపోవుటకు సన్నద్ధులైయున్నారు. అనేకులు ముందు సాగిపోయిరి. మిగిలినవారు సిద్ధముగానున్నారు.

ఓ వసంతపవన సౌరభమా : మా జోలికి రాకుము (కవ్వింపకుము).

నీకు విలాసము దోచినది. మేము వేసారియున్నాము.

చిత్తము స్వర్గమున శిరము 'సాఖీ' పదములపై నిలిపి మద్యపానరతులు ఏదో వేరొక ధ్యానలోనే ఉన్నారు. కాళ్ల తొట్రుపడుటవలన కనిపించిన గోడ నీడలో గంటల రతబడి కూర్చుండి పోయినాము.

ఆకాశభ్రమణము ఎవరికి శాంతికల్గించును ? సమబుద్ధులము నలుగుర మొకచో కూర్చుండ గలిగినాము. ఇదియే చాలును.

2. చీదరింపు సహించితిని - విలాసము సహించితిని - కోప ప్రకటన సహించితిని - కాని 'లేదు' అనునదొకటి మాత్రము సహించనైతిని.

3. "రాధాకుండము" పై గూర్చున్న మహంతు అప్సరసల గుంపుపై అవతారమూర్తివలె పడును.

4. నిస్సారము నీరసము అయిన నీ అనుగ్రహమును కప్పుకొందునా ? పఱచుకొందునా ? చుట్టుకొందునా ?

లగీహై మేహ కీ ఝడీ బాగ్‌మే చలో ఝూలేఁ
కీ ఝూల్నేకా మజా భీ ఇసీ బహార్ మేహై 5

ఇన్షా మిత్రులలో నొక్కడగు సాదత్‌యార్‌ఖాఁ "రంగీఁ" దిల్లీలో సైనికోద్యోగి. అతనికి ప్రయాణములనిన ఇష్టము. పెద్ద పెద్ద అమీరులు మఱియు నవాబుల దర్బారులలో అతడు ఆదరణీయుడు. ఉద్యోగము విడచి గుఱ్ఱముల వ్యాపారము నవలంబించి అనేక ప్రదేశములు పర్యటించెను. లఖ్నోకు వెళ్ళినప్పుడు ఇన్షా సహవాసమున నుండువాడు. అతని స్వభావము అతని ఉపనామము వలెనే విలాస లాలసము - విలాసయుతమగు జీవితము గడుపుకొను అవకాశము కలవాడగుటచే అతడు కావ్య నిర్మాణముననే కాలమధికము గడపెను. అతడు హాస్యప్రియుడు. భావములో గంభీరతలేదు కాని, అతని రచన లనేకములు-ఫారసీలోను చాల రచనలు కలవు. క్రీ. శ. 1834 ప్రాంతమున మరణించెను. నాల్గు కావ్య సంగ్రహములు, అనేకములగు మస్నవీలు మఱియు "మజ్లిసె-రంగీఁ" అను నొక గ్రంథము అతని రచనలలో పేర్కొనదగినవి. చివర పేర్కొనబడిన గ్రంథమున కవులను, కవిసమ్మేళనములను, సాహిత్య సభలను గుఱించి వ్రాసినాడు. ఈ గ్రంథము ఆనాటి సంఘ జీవనమును వ్యక్తపఱచును. రంగీఁ కావ్య సంగ్రహములు నాల్గును ఒకేసారి ప్రకాశితములైనవి - వానిలో వివిధ ప్రకారముల కవితలు కలవు. గజలులు విశిష్టమైనవి కావు. ఉర్దూ సాహిత్య చరిత్రలో అతని కీర్తికి కారణము స్త్రీల భాషలో స్త్రీల సమస్యలను కావ్య వస్తువుగా గొని చర్చించుటయే. ఇట్టి శైలికి తానే ఆద్యుడయినట్లు చెప్పికొనెను. దానికి "రేఖ్తీ" అను పేరు పెట్టెను. ఇన్షాను గుఱించి వ్రాసినప్పుడే "రేఖ్తీ" ప్రస్తావింపబడినది. ఈ శైలికి ఆద్యుడు రంగీనో లేక ఇన్షాయేనో నిశ్చయించి చెప్పలేము. ఇన్షా మాత్రము తన పేరుతో రంగీఁ పేరును కలిపి చెప్పినాడు, కొందఱు దక్కనీ కవి యగు "హాష్మీ" బీజాపూరీ, అను నతడు మొట్టమొదట రేఖ్తీ నుపయోగించెనని తలంతురు. కాని అది సరికాదు. రేఖ్తీ అనగా స్త్రీల భాష మాత్రమే కాక అందు స్త్రీల సమస్యలు, కుటుంబ జీవనములో వారు పొందుచున్న వేదన, ఆటంకములు మొదలగునవి వర్ణింపబడును. వారి కాముక వ్యవహారములును అప్పుడప్పుడు అశ్లీలముగా, అసభ్యముగా రచింపబడును.

---

5. వర్షము గురియు చున్నది. తోటలో ఊయల లూగుదము పద. ఊయల లూగుటకు ఈ వసంతమే ఆనందదాయి.

ఉర్దూ సాహిత్య వేత్తల దృష్టిలో రేఖ్తీకి ఎట్టి స్థానమును లేదు. ఏలయన ఇందు విశిష్ట నైతిక సిద్ధాంతములకు మారుగా జుగుప్సాకరములగు అంశము లుండును. నాశము చెందుచున్న సామ్రాజ్యసమాజమున స్త్రీలకెట్టి స్థానమును ఉండదు. వారి సుఖదుఃఖములను గుర్తించు వారుండరు. వారి జీవితమంతయు పురుషుల కను సన్నల నడచును. కాని గంభీర దృష్టితో ఆలోచించినచో అట్టి స్థితిలో స్త్రీల హృదయములందు గొప్ప తుఫానులు చెలరేగి యుండు ననిపించును. వారి మానసిక భావములను పురుషులు అలక్ష్యము చేసియుందురు. అవధ్‌లోని విలాస పూర్ణమగు సమాజమున ఇన్షా మఱియు రంగీఁ వంటి కవులు స్త్రీలపై శ్రద్ధచూపి వారి పరిస్థితులను వర్ణించిరి. అదియొక చారిత్రక పరిణామము—అయినను ఈ కవులు ఉన్నతాదర్శములు కలవారు కారు. స్త్రీ జనోద్ధరణకు పూనుకొనినవారును కారు—వారి జీవితమును పై పై చూపుల జూచి చిత్రించుటలో కృతకృత్యులైరి. సాహిత్యమున గల ఒక లోటు తీరినది. కాని వారి కవిత అశ్లీలత కారణమున సాహిత్య గౌరవము పొందలేదు. అది కేవలము దురాచారములను మఱియు వాసనలనే ప్రచారము చేయుచున్నట్లనిపించును. కాని ఆనాటి జీవనములోనే అట్టి భ్రష్టాచారముండెను. అందుల కెవరేమి చేతురు? స్త్రీ జీవిత సమస్యల నంతవఱ కెవరును ప్రస్తావింపనందున అవి స్పృశింపదగినవి కావని మాత్రమనుకో రాదు. రంగీఁ స్త్రీ జీవిత పరిచయము కలవాడు. కనుక తన కావ్యవస్తువుగా దానినే గ్రహించెను.

ఉదాహరణ కొఱకు అతని పద్యపాదములు కొన్ని:—

చలో చల్‌కర్ ఖుతుబ్ సాహెబ్ మే ఝూలేఁ డాల్‌కర్ ఝూలా
దుగానా మేఁ బరస్తాహై, మహీనా హైయె సావఁకా 1

కోయీ పీస్‌కర్ ఖూబ్‌సీ లాల్ మిర్చేఁ
తెరే దోనోఁ దీదోమ్మే భర్ జాయేఁ అతూఁ 2

1. సఖీ: ఇది శ్రావణమాసము - వర్షము కురియుచున్నది. "ఖుతుబ్ సాహెబ్"పై ఊయలలు కట్టి ఊగుదము పద.

2. దాసీ: ఎవరేని ఈ రెండు కనులలో చాల ఎఱ్ఱమిరపకాయలు పొడుము చేసి నింపిన బాగుండును.

నన్హేసె కలేజేకో క్యా ఇష్క్ హువా లోగోఁ
కుఛ్ ఇఁ దినో రహ్తాహై దిల్గీర్ మేరే ఘూఘూ 3

* * * *

జో తేరే పాస్‌సే ఆతాహై మై పూఛూఁ యహీ
క్యోంజీ కుఛ్ జిక్ర్ హమారాభివహాఁ రహ్తాహై 4

ఈ యుగపు సుప్రసిద్ధ కవులలో "ముస్హఫీ" ఒకడు. అతనిపేరు గులామ్ హమ్దానీ. 'అమ్రోహా' వాస్తవ్యుడు. దిల్లీలో యౌవన కాలము గడపెను. ఆనాటి దిల్లీ సాహిత్య సదనము. ముస్హఫీ కవిసమ్మేళనములలో పాల్గొనుచు సాహిత్య జీవనమున భాగస్థుడయ్యెను. ఉద్యోగాన్వేషణలో చాల చోట్లు తిరిగి, చివరికి లఖ్నో చేరి, అచట మీర్జా సులేమాఁషికోహ్ ఆస్థానమున ఉద్యోగి యయ్యెను. అచట ఇన్షాకును ఇతనికి సాహిత్యస్పర్ధ లేర్పడెను. ప్రారంభించిన వారెవరో చెప్పలేము కాని, ఆస్థానమున పలుకుబడి హెచ్చించుకొనుటకై కవులందఱు పరస్పరము కలహించుచునే ఉండిరి. ఈ కలహములు పెరిగి పెరిగి అశ్లీలముగా, జుగుప్సాకరముగా తయారయ్యెను. ఒకరి నొకరు అవమానించుటకు నిందించుటకు అన్ని విధముల ప్రయత్నించుచుండిరి. వీరు లఖ్నోలోని ప్రసిద్ధకవులు కనుక ప్రజలును ఈ కలహములలో పాల్గొనుచు ఆనందము పొందుచుండిరి. ఇదంతయు ఉర్దూ సాహిత్య చరిత్రలన్నిటిలో వర్ణితము. ఆ వర్ణనలలో సత్యాసత్యములు విడదీయరాని విధముగా కలిసిపోయినవి. కవిత్వమును రచ్చకెక్కించి నీచతకు దిగద్రోయుట సమంజసమైన పని మాత్రము కాదు. కాని ఆనాటి సాంఘిక వ్యవస్థ, భోగలాలసత ఇట్టి అసామంజస్యమునకు కారణభూతములైనవి. దీని ఫలితమేమన "ఇన్షా", "ముస్హఫీ" మఱియు నితరులగు ఆనాటి కవులు, వెనుకటి సౌదా, మీర్, దరదులవలె నేటి మన హృదయములలో గౌరవభావములు కల్గింపలేరు. దోషమంతయు రాజదర్బారులదే. కాని కవులైనను ఇంక కొంత సహనమును, గాంభీర్యమును కలిగియుండిన బాగుండెడిది. క్రీ. శ. 1824 లో ముస్హఫీ మరణించెను. అతని శిష్యులనేకులు. వారు గురువునకు అశేష ఖ్యాతి సంపాదించి పెట్టిరి.

---

3. ప్రజలారా! నా దాయి ఈ దినములలో కొంత వ్యధ కలిగియున్నది. దీని చిన్న మనస్సున ఎట్టి ప్రేమ కలిగినదో-

4. నీ దగ్గఱినుండి ఎవరు వచ్చినను అచట నా ప్రస్తావన ఏమైన వచ్చునా అని అడుగుచుందును.

ముస్హఫీ కావ్య సంగ్రహములు ఎనమిది (8) లభ్యములు. అందేదియు ప్రకాశితము కాలేదు. గజలులే అధికముగా వ్రాసినను కొన్ని ఖసీదాలును, మస్నవీలును వ్రాసినాడు. అతడు ఫారసీలోను మూడు గ్రంథములు వ్రాసినాడు. అందొకటి ఫారసీ కవుల చరిత్ర ఒకటి ఉర్దూ కవుల చరిత్ర – అవి సాహిత్య గౌరవము కల గ్రంథములు – వానిలో సాహిత్య సమీక్షయే కాక సంస్కృతి, సంఘజీవనమును గూర్చియు ఉల్లేఖించినాడు. అతని ఫారసీ గ్రంథములు "అఖదె – సురయ్యా", "తజ్కిరయే – హిందీ" మఱియు "రియాజుల్ – పుసహా" అను పేర్లు కలవి – వీనిలో అతడు తన జీవిత విశేషములును చాలవఱకు వ్రాసికొనినాడు. అతడు రెండు ఫారసీ కావ్య సంగ్రహములు తయారు చేసినట్లు తెలుపును. కాని అవి అలభ్యములు.

ముస్హఫీ ఉర్దూలోని శ్రేష్ఠ కవులలో లెక్కింపబడును. అతని గజలులలో భావుకత, సరళత మఱియు కళానిపుణత కాన్పించును. అతని దోష మొక్కటియే. సాధారణముగా ఫారసీ, ఉర్దూ మహాకవుల ననుకరించుటకు ప్రయత్నించెను. అతని కొక ప్రత్యేక శైలి అబ్బలేదు. అతని కవితలో మీర్, సౌదా, జుర్ – అత్, ఇన్షా మొదలగు వారి రీతులు కన్పించును. అయినను అతడెప్పటికిని ఉర్దూ మహాకవుల లోనే స్థానము పొందగినవాడు.

ఉదాహరణకు కొన్ని పద్యపాదములు:–

సోతేహీ హమ్ రహ గయే అఫ్సోస్ హాయ్
ఖాఫిలా యారోంకా సఫర్ కర్ గయా
ఖిస్సా కహూఁ క్యా దిలే బీమార్ కా
ఇష్ఖ్‌కీ తప్ థీ న బచా మర్ గయా 1

తెరే కూచే హర్ బహానే ముఝే దిన్‌సే రాత్‌కర్నా
కభీ ఇస్‌సే బాత్‌కర్‌నా, కభీ ఉస్‌సే బాత్ కర్నా 2

1. అక్కటా ! మేము నిదురించుచునే ఉంటిమి. మిత్రులగుంపు సాగిపోయినది. రోగగ్రస్తమగు హృదయగాథ నేమని చెప్పుదును. ప్రేమ జ్వరము వలన కోలుకోలేక మరణించినది.

2. నీ వీథిలో ఒకప్పుడితనితో మాటలాడుచు దినమును రాత్రిచేయుట యేనా పని.

మై ఏతెమాద్ కరూఁ కిస్కీ అష్నాయీపర్
కోయీ కిసీక జమానేమె అష్నా థీహై 1

*　　*　　*　　*

క్యా జాంతేథె హమ్‌కి ఖఫా హోగ బాగ్బాఁ
గుల్షఁమె లేగయీథీ నసీమె - సహర్ హమే 2

*　　*　　*　　*

జో సైర్ కర్నీ కర్లే కి జబ్ ఖిజాఁ ఆయీ
న గుల్ రహే గ చమఁమే నఖార్ రహరేగా
యహీహై లూట్‌తో దస్తే - జునూఁకె హాథోన్సే
న ఏక్ మేరె గరీబాఁ మే తార్ రహరేగా 3

*　　*　　*　　*

ఇంతవఱకు పేర్కొనబడిన కవులు తమ జీవితమును చాల కాలము ఇతరత్ర డపి చివరికాలమున లఖ్నోలో స్థిరపడినవారు. ఉర్దూ సాహిత్య చరిత్రకారులు రిని దిల్లీ వారుగాను లఖ్నోవారుగాను లెక్కింతురు. వీరి శైలి దిల్లీ కేంద్రమున ంటె కొంత భిన్నము. అయినను వీరు లఖ్నో కేంద్ర కవులును కారు. వీరి కావ్య చనా మార్గము నవీనము. పైన పేర్కొనబడిన వారే కాక ఇంక అనేకులగు ల్లీ కవులు లఖ్నోవారయిరి. లఖ్నోలో స్వతస్సిద్ధమైన శైలి లేకుండెను. ఈ వులే ఒక నూత్న సామాజిక స్థితిని, ఒక నూత్న వాతావరణమును సృష్టించినందున ఖ్నో కేంద్రములో కొంత నూత్నమగు విశిష్టత యేర్పడెను. ఈ నూత్న విశిష్టతనే వ్పుడప్పుడు "లఖ్నో స్కూల్" అని వ్యవహరింతురు.

---

. నేనెవరి మైత్రిని విశ్వసింతును. ఈ కాలమున ఎవరికెవరు మిత్రులు.

. ఉదయ పవనము మమ్ము తోటలోనికి కొనిపోయినది. తోటమాలి కోపించునని మే మెఱుగము.

తోటలో విహరింపదలచిన విహరింపుడు - ఆకురాలు కాలము వచ్చెనేని పూలు నిలువవు. ముండ్లు మిగులవు- ఉన్మత్తత దోపిడి యిదియే- నా 'చొక్కా కాలరు' లో ఒక దారమైనను నిలువలేదు.

'దిల్లీ, లఖ్నో కేంద్రముల కావ్యరచనలోగల ముఖ్యమైన అంతర మేమి?' అను విషయమున చాల చర్చలు జరిగినవి. చాలమంది లేఖకులు ఈ రెంటికి అన్ని విధాల భిన్నత్వమే కలదని అనాలోచితముగా వాదింతురు. సామ్రాజ్య వ్యవస్థ పతన దశ దిల్లీలో ఉన్నట్లే కొంచెము తేడాలో లఖ్నోలో ఉండెను. జీవితపు మూల సిద్ధాంతములు రెండుచోట్ల ఒకే రకమైనవి. సాహిత్య, చారిత్రక, దార్శనిక సంప్రదాయము లొకచోట యెట్టి ఆదరము పొందుచుండెనో ఇంకొక చోట అట్లే పొందుచుండెను. ఆర్థిక స్థితి, వర్గవ్యవస్థ ఒకే విధముగ ఉండెను. ఈ సమానతను భిన్నత్వ వాదు లాలోచింపరు. కవితలో భిన్నత్వ ముండెననుట అసంభవము. కవిత జీవితమునకు సంబంధించి యుండును. జీవితపు మూల సిద్ధాంతములలోనే అంతరము లేనప్పుడు కవితలోను ఉండదు. లఖ్నో శైలిలో, ఆలోచనా విధానములో కొంత నవీనత ఉండెను-కాని ఆ నవీనతను కలిగించిన కారణములు సాహిత్యధారనే త్రిప్పివేయ గలంతటి గొప్పవి కావు.

శతాబ్దముల తరబడి ఔన్నత్యమును, ప్రతిభను పొందియున్న మొగలాయి రాజ్యము క్షయరోగివలె మెల్ల మెల్లగా మరణోన్ముఖమగు చుండెను. దానిని పునరుజ్జీవింప జేయదగిన శక్తి యెద్దియు లేకుండెను. కనుక అచటి కవుల ఎడద లోతుల నుండి నిరాశాభావములు వెలువడుచుండెను. లఖ్నో మాటవేరు. ఇచటి రాజ్యము క్రొత్తగా స్థాపింపబడినది. అది బాహ్యరూపమున అభివృద్ధి ముఖమైయుండెను. దిల్లీలో కంటె ఇచట శాంతికూడ అధికము. ప్రజల ఆర్థికస్థితి మంచిదే. ఇచటి కవులును కళావేత్తలును చరిత్రగతి తెలియనివారు. దిల్లీ నశించుటకు కారణమైన చీడయే లఖ్నోకును పట్టినదని వారెఱుగరు. కనుక వారు పట్టపగటి సూర్య కాంతిలో పరవశులై బాహ్య సౌందర్యము నారాధింపసాగిరి. తమ కవితకు హార్దిక భావములను ప్రకటించుటకు ఆవశ్యకమగు సౌందర్యమును కూర్చజాలక పోయిరి. ఇదియుగాక లఖ్నోలో జరిగినట్లు కవుల సన్మానమును సంరక్షణయు దిల్లీలో లేకుండెను. అందువలన వారు ఇచటి జీవితములో కలిసిపోయి సమస్యలను సూక్ష్మ దృష్టితో చూచుట స్వాభావికము. కాని ఈ దృష్టి కృతకము; గంభీరతర విషయములను సైతము పైపైచూపు చూచునదే అనుటలో సందేహము లేదు. ఆనాటి సాహిత్యము మీద దీని ప్రభావము చూడనగును. ఇంకొక విషయమును గూడ సూచించుట అవసరము. లఖ్నో పాదుషాలు "షియాలు". వారి ఆచార వ్యవహారములు, మత విశ్వాసములు ఇతర ముసల్మానులకు భిన్నములు. వారు ముసల్మానుల

"నబీ" (పైగంబరు) అతని పుత్రిక, (ఫాతిమా) అతని అల్లుడు (హజ్రత్ అలీ) మఱియు ఇద్దఱు మనుమలు హసన్ హుసేన్‌లను అధికముగా ప్రేమింతురు. వారి జయంతి వర్థంతులను చాల ఉత్సాహముగా పటాటోపముగా జరుపుకొందురు. ప్రత్యేకించి ఇమామ్ హుస్సేన్ వీరమరణము నొందిన శోకమయగాథను స్మరించుచు ఏడాదికి కొన్ని నెలలు దుఃఖింతురు. ఆ పెద్దల ఆదర్శముల ననుసరించి నైతిక బలము పొందుటకు ప్రయత్నింతురు. ఈ మతదృష్టి కనుగుణముగా "మర్సియా", "నోహ్" "సలామ్" మొదలగు సాహిత్య రూపము లెన్నియో వికాసము పొందినవి.

పైన పేర్కొనబడిన విషయములన్నియు సాహిత్యము నొక క్రొత్తబాట త్రొక్కించుటకు కారణములైనవి. ఈ నవీనత ప్రకటించుటలో భాషాభేదము చాల తోడ్పడినది. ఈ భాషాభేదమును గూర్చియు విద్వాంసులు అధిక చర్చలు చేసినారు. లఖ్నోలోని వ్యావహారిక హిందూస్థానీ భాష "అవధీ" భాషలోని మాధుర్యమును, నమ్రతను సంతరించుకొనిన దనుటలో సందేహములేదు. ఇచటి సభ్యతలో సౌందర్య మున్నట్లే ఇచటి భాషలో కోమలత కలదు. కొన్ని శబ్దముల ఉచ్చారణ, కొన్ని జాతీయములు నానుడులు, కొన్ని లింగభేదములు ఈ భాషను దిల్లీ భాషకు భిన్నము చేసినవి. దిల్లీ మఱియు లఖ్నోల కవితను గంభీర దృష్టితో పరిశీలించిన వారికీ విభేదము లవశ్యము కన్పించును. కాని లఖ్నోలోని లోపములు దిల్లీలో లేవనికాని దిల్లీలోని విశేషములు లఖ్నోలో లేవనికాని అనుకోరాదు. కొన్ని భావములు, వానిని ప్రకటించు విధము ఒకచో ఒకతీరు–ఇంకొకచో ఇంకొకతీరు. భావములలో అంతగా భేదము లేకున్నను శైలిలోగల భేదమే మూల తత్త్వములోని విభేదమువలె రూపొందుట సంభవమే–దానిపై రెండుకేంద్రముల స్పర్ధ ఆ భేదమును బలపఱచెను.

విపులముగా వ్రాయబడకున్నను ఈ మాత్రపు విశ్లేషము వలన "దిల్లీ–లఖ్నో స్కూళ్ళ కలహము" అనబడు సాహిత్య వాదవివాదముల స్వరూపము కొంతకొంత గ్రాహ్యమగును. పైన సూచించిన అంశములకు అనుకూలమగు వాతావరణము మొదలే యేర్పడినది. కొలది దినములలోనే అది స్పష్టరూపము పొందినది. వేలాది కవులు తమతమ శక్తి ననుసరించి దానికి దోహదము కావించిరి. 19వ శతాబ్దారంభమున లఖ్నోలోని మూలమూలలలో కవి సమ్మేళనములు జరుగుచుండెను. చదువురానివారును కావ్యరచన చేయుచు, కవితా సౌందర్యమును దర్శించి ఆనందించుచుండిరి. అట్లగుట సమస్త ప్రజానీకమున కవిత్వపు భావము లలముకొనెను. ఈ సంక్షిప్త చరిత్రలో కొందఱు ప్రథమశ్రేణికి చెందిన కవుల గూర్చియే తెల్పబడును.

లఖ్నో కేంద్రపు కవిత్వమును గూర్చి వ్రాయునప్పుడు మొట్టమొదట పేర్కొనదగినవారు "నాసిఖ్" మఱియు "ఆతిష్" అను కవులు-ఈ యిద్దఱు, అందు ముఖ్యముగా "నాసిఖ్" లఖ్నో ప్రత్యేకతకు, మహత్వమునకు కారకుడు-"నాసిఖ్" "వాగనుశాసనుడు" అనదగినవాడే. సాహిత్యము మీద అతనికిగల అధికారమును లఖ్నోవారే కాక దిల్లీ సాహిత్యవేత్త లందఱును అంగీకరించిరి.

"నాసిఖ్" పేరు ఇమామ్ బఖ్ష. అతని జన్మస్థానము ఫైజాబాద. అతని వంశమును గూర్చి చరిత్రకారులు భిన్నాభిప్రాయులు-ఇట అతని వంశమును గూర్చి ఏల ప్రస్తావింపబడినదన అతని ప్రతికక్షులు ఈ విషయమును పురస్కరించుకొనియే నిందచేసిరి. నాసిఖ్ స్వల్పకాలమున గొప్ప పేరు గాంచెను. లఖ్నోలోని ప్రభుత్వోద్యోగులును, అమీరులును అతని శిష్యులైరి. అతడెన్నడును రాజాస్థానముతోడి సంబంధమునకు ప్రయత్నింపలేదు. అయినను అతని చుట్టుపట్ల ఉన్నదంతయు ఆస్థానపు వాతావరణమే. కనుక తానును ఆస్థాన నియమములు పాటింప వలసిన వాడయ్యెను. ఆత్మాభిమానము కలవాడగుట ఆ నియములకు విరుద్ధముగా ప్రవర్తింప బోయినంత లఖ్నో విడువవలసి వచ్చెను. కొంతకాల మతడు అలహాబాదలో నివసించెను. అచట ఒక ప్రత్యేక పరిధిలోనే జీవితము గడుపవలసి వచ్చెను. తన కవితలో పలుతావుల ఈ సంగతి తెల్పుకొనెను.

హిర్ ఫిర్ కె దాయెరే హిమె రఖ్తాహూఁ మై ఖదమ్
ఆయీ కహాఁసె గర్దిషె - పర్ కార్ పాంవ్ మే 1

* * * * *

తీఁ త్రివేణీ వ దో ఆంఖేఁ మెరీ
అబ్ ఇలాహాబాద్ భీ పంజాబ్ హై 2

ఇట్లే అతడు లఖ్నో విడచి ఫైజాబాద, బనారసు, మఱియు కాన్పూరులలో నివసించెను. కాని యెన్నడును పాదుషాల ప్రశంసించుచు కవిత వ్రాయలేదు.

---

1. తిరిగి తిరిగి వృత్తములోనే అడుగిడుచున్నాను. నాకాళ్ళకు వృత్త లేఖిని గతి యెట్లుపట్టినదో!
2. ఇచటి త్రివేణితో నా రెండు కనులు జతగూడినందున అలహాబాద పంజాబయినది. (పంజాబనగా పంచనదప్రదేశము)

నాసిఖ్ కావ్యశైలి అద్వితీయము. అట్లే అతని జీవితమును విచిత్రము. అతనిది స్థూలకాయము. కసరతు వలన దార్ఢ్యము పొందినది. వర్ణము నలుపు - సాంసారిక జీవితపు జంజాటమునుండి దూరముగా నుండుటకై వివాహమే చేసికొనడయ్యెను. దినమంత ఒకసారియే భోజనము చేయువాడు. ఆ భోజనము కనీసము అయిదు సేర్లు - పసులన్నియు నియమిత సమయమున చేయువాడు. కాలానుసారముగా లభించు ఫలజాతులను మక్కువతో తినువాడు. అతని శిష్యులనేకులు ధనికులు. కనుక యెన్నడును తిండికి కొదువ కలుగలేదు. నవ్వాబ్ ఆగామీర్ (ఇతని దేవిడీ లఖ్నో నేటికిని ప్రసిద్ధము) ఇతనిని చాల గౌరవించు చుండెను. "గాజీయుద్దీన్ హైదర్" ఇతనికి "కవిరాయ్" అను బిరుదు ప్రదానము చేయ దలచగా అంత చిన్న పాదుషా బిరుదు వలన లాభమేమని నిరాకరించెనట. అతని కీర్తి దూర దూరములకు వ్యాపించెను. దక్కను నిజాము దీవానగు మహారాజా చందూలాల్ పదిపన్నెండు వేల రూపాయలు పంపి దక్కనుకు ఆహ్వానించెను. కాని "నాసిఖ్" వెళ్ళలేదు. క్రీ. శ. 1838 లో మరణించెను.

"నాసిఖ్" కావ్య సంగ్రహములు మూడు. అందు రెండు ప్రపిద్ధములు - మతసంబంధమగు ఒక మస్నవీ "నజ్మేసిరాజ్" అనునది వ్రాసెను. అతడు వ్యాకరణమును కావ్యశాస్త్రమును గూర్చి చిన్న చిన్న పుస్తకములు కొన్ని వ్రాసెనందురు. కాని నిశ్చయముగా చెప్పజాలము. "నాసిఖ్"గజలు కవి. అతని శైలి ననుసరించియే అతనిని మహాకవులలో లెక్కింతురు- గజలులకు కావలసిన భావుకత, హార్దిక వేదన అతనిలో అత్యల్పము. భాషను కావ్యశాస్త్రమును కూలంకషముగా గ్రహించిన పండితుడు. భావనల ననుసరించి కవులలో చివరివాడు-భాషాప్రయోగము ననుసరించి ప్రథముడు. అతని కవిత కృతకము. అలంకార వ్యామోహ మతిమాత్రము. కనుక అతని గజలులు చాలవఱకు చప్పనివి - నీరసమైనవి. శుద్ధ శబ్దప్రయోగమే కవిత్వమైనచో "నాసిఖ్"ను మించిన కవి లేడు. గాంభీర్యము లేనందున, భావనలు గొప్పవి కానందున అతని కవిత పఠితల హృదయములను తాకజాలదు. కవితలో మంచి పద్యములే లేవని దీని తాత్పర్యము కాదు. అయినను స్పష్టరూపమున ఎట్టిలోపమును కనిపించకున్నను అతని కవిత జీవకళ లేనిది. భాషా విషయమున అతడు చేసిన కృషి వలన భాషకు లాభము కలిగినది - హానియు కలిగినది. హాని యేమన భావములు పరిమితము లైనవి. కవుల దృష్టి శబ్దజాలముపై అలంకారములపైననే

నిలిచినది. లాభమేమన భాషాప్రయోగ విషయమున ఒక సమానత కలిగినది. దానికి విముఖత్వము చూపుట కావ్యశాస్త్ర సిద్ధాంతముల నుల్లఘించుటే అను భావము కలిగినది. క్లుప్తముగా చెప్పవలెనన్న "నాసిఖ్" కృతకృత్యుడు కాలేదు - ఏలయన కవిత్వమును ప్రభావవంతము చేయగల భావనలే అతని కవితలో అణగి యణగి, ఆరియారి యున్నవి. తద్విరుద్ధముగ భాష, జాతీయములు, అలంకారములు ప్రధానత వహించి అతని కవిత యంతటను వ్యాపించియున్నవి.

ఉదాహరణ కొఱకు ఈ పద్యపాదములు చూడుడు:-

ఆజ్ హోతాహై దిలా ! దర్దె మీఠా మీఠా
ధ్యాన్ ఆతాహై తుఝే కిస్కే లబేషీరీఁకా 1

* * * *

సైకడోఁ ఆహే కరూఁ పర్ జిక్ర్ క్యా ఆవాజ్‌కా
తీర్ జో ఆవాజ్‌దే, హై నఖ్స్ తీరందాజ్ కా
నాజినీనోంసే కరూఁ క్యా రబ్త్ మై నాజుక్ - మిజాజ్
బోఝ్ ఉఠ్ సక్తా నహీ ముఝ్‌సే కిసేకే నాజ్‌కా 2

* * * * *

తుర్ఫా-గుల్ ఇస్ బాగ్ మేఁహై ఔర్ షబ్నమ్‌హై అజీబ్
హన్స్ కె బైఠా జోతేరీ మహఫిల్ మెవో రోకర్ ఉఠా

1. ఓ హృదయమా ! ఇట్టి మధురవ్యధ నేడు కలుగుచున్నది. ఎవరి మధురాధరము స్మృతిలో మెదలు చున్నది?

2. వందలకొలది ఊర్పులు విడచినను శబ్దమెచటిది ! బాణము వలన శబ్దము కలుగునేని అది సంధాత లోపము.

కోమలులతో సుకుమార స్వభావుడ నేనెట్లు సంబంధము చేతును ? కోమలతయొక్క భారమును నేను సహింపలేను.

బాత్ జిణ్ నాజుక్ మిజాజోంసే న ఉఠ్ఠీ థీ కభీ
బోఝ్ ఉన్సే సైకడోం మణ్ ఖాక్‌కా క్యోంకర్ ఉఠా 1

*   *   *   *   *

రష్క్‌సే నామ్ నహీ లేతేకె సుణ్‌లే న కోయీ
దిల్‌హి దిల్‌మేం ఉసేహమ్ యాద్‌కియా కర్తే హై 2

వో నహీ భూల్తా జహాం జావూం
హాయ్ మై క్యా కరూం కహాం జావూం 3

*   *   *   *

కిసీకా కబ్‌కోయీ రోజే - సియామే సాథ్ దేతా హై
కి తారీ కీ మె సాయాభీ జుదా హోతాహై ఇన్సాంసే 4

*   *   *   *

నాసిఖ్ వలెనే సువిఖ్యాతుడగు మఱియొక లఖ్నో మహాకవి ఖాజాహైదరలీ "ఆతిష్". అతడు ఢిల్లీలోని "సూఫీల" కుటుంబమునకు చెందినవాడు. అతని తండ్రి ఢిల్లీనుండి ఫైజాబాదకు వెళ్ళెను. అచటనే ఆతిష్ జన్మించెను. చిన్నప్పుడే తండ్రి విడిచి వెళ్ళుట వలన ఆతిష్ కుటుంబ బాధ్యతలు వహించెను. స్వతంత్ర జీవితము గడపు అవకాశము కలిగినందున విద్యాభ్యాసమునకు తగిన అవకాశము కలుగలేదు. సిపాయీలతో వారి పిల్లలతో ఆడుచు కత్తిసాము నేర్చెను. భయరహితమగు జీవనము గడపు ఉపాయము నేర్చెను. స్వభావము స్వతంత్ర మయ్యెను. ఉద్ధతి

1. ఈ తోటలో విచిత్రమగు పుష్పము, వింతయగు మంచుకణము కలదు. నీ సభలో నవ్వుచు గూర్చున్నవాడు ఏడ్చుచు లేచును. ఎన్నడైనను పలుకు బరువునే సహింపని సుకుమార స్వభావులు వందలకొలది మణుగుల బరువు నెట్లు సహింప గల్గిరో!

2. ఆమెను హృదయముననే స్మరింతుము. ఎవరేని వినిపోదురను అసూయచే పేరు నుచ్చరింపకుము.

3. ఎచటికి వెళ్ళినను అతడు నన్ను మఱచిపోడు. ఏమిచేతును- ఎందుబోదును!

4. చీకటికాలమున (దురదృష్టమున) ఎవరికెవరు తోడ్పడగలరు? చీకటిలో నీడకూడ మనిషిని విడిచిపెట్టును.

పెరిగెను. సూఫీ కుటుంబ సంబంధము వలనను స్వచ్ఛంద జీవితము గడుపుట వలనను అతనిలో ఒక విధమగు సంతృప్తి, ఆత్మాభిమానము పెంపొందెను. అవి రెండును అతని కవితలో అడుగడుగున గోచరించును. ఫైజాబాదలోని ఒక నవాబు దగ్గఱ కత్తిసాము చేయు ఉద్యోగమున కుదిరి ఆ నవాబుతో తానును లఖ్నో చేరెను. ఆనాటి లఖ్నో సారస్వత కేంద్రము - ఇన్షా ముస్హఫీలు అచటి సుశ్లోకులగు మహా కవులు - ఇంటింట వీరి చర్చలే వినవచ్చుచుండెను. "ఆతిష్" కవితారచన చేయగోరి "ముస్హఫీని" ఆశ్రయించెను. ఏదో మాటపై గురుశిష్యుల మనసులు కలతచెందెను. ఆనాటినుండి స్వంత పరిశ్రమచే తన ప్రతిభను వికసింపజేసి ఆతిష్ మహాకవులలో నొకడుగా పేరొందెను. అనేకులు అతని శిష్యులైరి. అతడే రాజాస్థానమును సమీపించక సంతుష్ట జీవనము గడపెను. "అవధ్" దర్బారునుండి అతనికి నెలకు ఎనుబది రూపాయిలు దొఱకుచుండెను. వానిని దీనులకు ఆశ్రితులకు పంచి యిడుచుండెను.

"ఆతిష్" స్వభావము విచిత్రమైనదే. అతని అవసరము లతిపరిమితములు - కోర్కెలు లేనివానితో సమానము. గొప్పవారి సవాహస మెప్పుడును చేయువాడు కాడు. దరిద్రులును దీనులును అగు వారిని చుట్టూ గూర్చుండ జేసికొని సంతోషించువాడు - ఒక పెద్ద కావివస్త్రము కట్టుకొని ఒక లావుపాటి దుడ్డుకఱ్ఱ ధరించి నడుమున 'తరవారి' వ్రేలాడగట్టుకొనువాడు. 'భంగు' త్రాగుచుండెను. తనకవితలో అక్కడక్కడ దాని కైపును వర్ణించెను. లోకులు "నాసిఖ్" పట్ల అతనికి ద్వేషము కలిగించిరి. కాని ఎన్నడును అసభ్యముగా ప్రవర్తించలేదు. క్రీ. శ. 1846 లో మరణించెను.

"ఆతిష్" కవిత "నాసిఖ్" నడిపిన లఖ్నో శైలికి సంబంధించినదే. అనగా అలంకారమయము - అతడును కొన్నిచోట్ల భావహీనుడై కేవలము శబ్దముల కొఱకు అలంకారముల కొఱకు పద్యములల్లె ననిపించును. అట్టి కవిత తొలగించిన పిదప మిగులు కవిత్వము భావనా ప్రధానమై, కల్పనా చాతుర్యము వెల్లడించుచు శుద్ధవ్యావహారిక భాషలో ప్రవాహవేగమున జాలువారు చుండును. భాషాసౌందర్యమే కాక అతని కవితలోని హార్దిక భావములు హృదయముపై సుత్తెదెబ్బ పెట్టును. అతని స్వభావములోని స్వచ్ఛందత, నిర్భీకత మఱియు సరళత అతని కవితలోను కాన్పించును. అతడధికముగా వ్రాయలేదు. రెండు చిన్న కావ్యసంగ్రహములు మాత్రమే ప్రకాశితములైనవి. వానిలో గజలులే కలవు. ఆ గజలులలో ప్రేమకు సంబంధించిన

కోమలాతికోమలములగు భావములు మఱియు "తసవ్వుఫ్" కు సంబంధించిన గంభీరాతి గంభీరములగు భావములును కలవు. నైతిక సిద్ధాంతములు అడుగడుగున ఉల్లేఖింపబడినవి. అందువలన అతడు జీవితములోని సంఘర్షణ మఱియు సౌందర్యాన్వేషణనే మానవ జీవన కర్తవ్యమని భావించువాడని స్పష్టపడును. "నాసిఖ్" గొప్ప భాషావేత్త. కాని అతనికంటె "ఆతిష్" అతిమనోహరముగా సాధికారముగా భాషాప్రయోగము చేయగలవాడని గట్టిగా చెప్పవచ్చును. అతని దృష్టిలో కవిత ఒక విశిష్టకళ. శబ్దసౌందర్యమత్యవసరము. కనుక అతని కవితలో కళతో భావములు విడదీయరాని విధముగా కలిసిపోయినవి.

ఉదాహరణ కొఱకీ పద్యపాదములు చూడుడు:—

జమీనే చమఁ గుల్ ఖిలాతీహై క్యా క్యా
బదల్తాహై రంగ్ ఆస్మాఁ కైసె కైసే
న గోరే - సికందర్ నహైఖబ్రె - దారా
మిటే నామయోఁకే నిషాఁ కైసె కైసే.
బహారే గులిస్తాఁ కి హై ఆమద్ ఆమద్
ఖుసీ ఫిర్తేహైఁ బాగ్బాఁ కైస్లె కైసే

*   *   *   *

బుత్ఖానా ఖోద్ డాలియే మస్జిద్ కుఢాయియే
దిల్కూ న తోడి యే యె ఖుదా కా ముఖామ్హై 2

1. తోట ఎట్టి యెట్టి పూలను వికసింపజేయుచున్నది!
ఆకాశ మెట్లెట్లు రంగులు మార్చుచున్నది!
'సికందరు' (అలెగ్జాండర్) గోరీలేదు. 'దారా' సమాధియులేదు. ప్రఖ్యాత పురుషుల గురుతులెట్లు నశించినవి!
తోటలో వసంతము రానున్నది— తోటమాలీలు ఎట్టి సంతోషమున తిరుగుచున్నారు!

2. మందిరము పడగొట్టుడు-మస్జిదు కూలద్రోయుడు.
కాని మనస్సు విఱువకుడు-అది భగవానుని నివాసము.

దిల్ కీ కుదూరతేఁ అగర్ ఇన్సాఁసే దూర్ హోఁ
సారే నిఫాఖ్ గబ్రో - ముసల్మాఁసే దూర్ హోఁ 1

* * * *

నామర్ద్ ఔర్ మర్ద్‌మే ఇత్నాహీ. ఫర్క్ హై
వో నాఁ కేలియే మరే యె నామ్‌కే లియే 2

* * * *

మేరే సనమ్ క కిసీకో మకాఁ నహీ మాలూమ్
ఖుదా క నామ్ సునాహై నిషాఁ నహీ మాలూమ్
ఆఖీర్ హో గయే గఫ్లత్‌మె దిఁ జవానీకే
బహారె - ఉమ్ర్ హువీ కబ్ ఖిజాఁ నహీ మాలూమ్
ఖులీహైఁ ఖానయే - సయ్యాద్‌మే హమారీ ఆంఖ్
ఖఫస్‌కో జాన్తేహైఁ ఆసియాఁ నహీ మాలూమ్ 3

* * * *

హమ్ క్యాకహేఁ కిసీసే క్యాహై తరీఖ్ అప్నా
మజ్హబ్ నహీహై కోయీ మిల్లత్ నహీహై కోయీ 4

* * * *

---

1. మానవుని హృదయమునుండి విద్వేషము తొలగిపోవునేని, ముస్లిముల ముస్లిమేతరుల కలహములన్నియు తీరిపోవును.

2. షండునకు పురుషునకు కల భేదమేమన వాడు కూటికొఱకు చచ్చును. వీడు కీర్తికొఱకు చచ్చును,

3. ఎవరికిని నా ప్రియురాలి ఇల్లుతెలియదు. భగవానునిపేరు విన్నాము కాని అతని గురుతులు తెలియవు- పరధ్యానములోనే యౌవ్వనకాలము సమాప్త మైనది. జీవిత వసంతము పోయి ఆకురాలు కాలమెపుడు వచ్చినదో తెలియదు. మా కనులు వేటకాని యింట తెఱువబడినవి. చెఱసాల తెలియును కాని గూడెట్లుండెనో తెలియదు.

4. మా పద్ధతి యేమని తెల్పవలయును. మతము లేదు- జాతిలేదు.

సర్ షమ్మసా కటాయియ్యే పర్ దమ్ న మారియే
మన్జిల్ హజార్ సఖ్త్ హో హిమ్మత్ న హారియే 5

"నాసిఖ్" కావ్యములను "ఆతిష్" కావ్యములను పరిశీలించినచో లఖ్నో తత్త్వమున్నంత వఱకు రెంటిలో సమానత గోచరించును. కాని మూలతత్త్వము చాల భిన్నము. ఉర్దూ సాహిత్య చరిత్రకారు లందఱును ఈ యిరువురి రచనల సంతులనము చేసినారు. అట్టి తులనాత్మక విమర్శల సారాంశ మేమన ఒకరి కవిత కృతకము. అలంకార భూయిష్టము. ఇంకొకరి కవిత సుశబ్దములు ఉచితాలంకారములు ప్రయోగింపబడుట వలన సుందరము ప్రభావ సహితము. "ఆతిష్" సూఫీ తత్త్వముతో సంబంధము కలవాడు. లఖ్నో కవులు దానికి దూరస్థులు. కనుక "ఆతిష్"వాణి లఖ్నోలో వింతగా విన్పించును. అతని కవితలో ప్రపంచ నిరసనము, సంఘర్షణ ద్వారమున పురోగమనము, స్వతంత్ర జీవనము నుద్బోధించు భావములు ప్రబలములు. అందువలన అతనికి లఖ్నోలోనే కాక సమస్త ఉర్దూ సాహిత్యమున ఉన్నత స్థానము లభించినది. ఈ మహాకవు లిరువురకు అనేకులు శిష్యులుండిరి. వారు తమ గురువులు ప్రారంభించిన శైలిని వృద్ధిపఱచి పరిపుష్టము చేసిరి. నాసిఖ్ శిష్యులు భాషాపరిశుద్ధతకు ప్రాధాన్యమిచ్చిరి. ఆతిష్ శిష్యులు విషయ గౌరవమునకు భావగాంభీర్యమునకు ప్రాధాన్యమిచ్చిరి.

నాసిఖ్ శిష్యులతో "వజీర్", "బర్క్", "రష్క్", "బహ్ర్", "మునీర్" మఱియు "షేహ్" ప్రముఖులు పేర్గాంచినవారు. ఆతిష్ శిష్యులలో "రింద్", "సబా", "నసీమ్", "ఖలీల్" "షౌక్" మొదలగువారు ప్రసిద్ధులు. ఈ శిష్య ప్రశిష్యుల పరంపర నేటి వఱకు సాగుచున్నది. ఈ సంక్షిప్త చరిత్రలో అందఱను గూర్చి వ్రాయుట అసంభవము. అయినను ఇద్దరు ముగ్గురిని గూర్చి వ్రాయుట అవసరము – ఏలయన వీరి వలననే లఖ్నో కావ్యసంప్రదాయ మవగతమగును. ఈ మహాకవుల శిష్యులు సాగించిన సంప్రదాయము "మీర్ అనీస్" మఱియు "మీర్జా దబీర్" అను కవులు మర్సియాను భూమినుండి ఆకాశ వఱకు ఉన్నత మొనర్చు వఱకు ఎట్టి విశేషోన్నతి లేకయే సాగినది.

---

5. దీపము వలె తల నరికించుకొనుడు. కాని బాధ ప్రకటించవలదు.
గమ్యము కఠినమైనను ధైర్యము విడువ వలదు.

నాసిఖ్ శిష్యులలో సుప్రసిద్ధుడగు "వజీర్"లఖ్నో నివాసి. అతడు ఉన్నత వంశమునకు చెందినవాడు. విరక్తుడై జీవితమును యధేచ్ఛగా గడపెను. వాజిదలీషా రెండు తడవలు ఆహ్వానించినను వెళ్లుటకు నిరాకరించెనందురు. "వజీర్" నాసిఖ్ శైలిలో ఉత్తమ కవిత వ్రాసెను. అతని శిష్యులా శైలిని సాగదీసిరి. అతడు తన కావ్యసంగ్రహమును, సమకూర్చుకొనలేదు. క్రీ. శ. 1853 లో అతడు మరణించిన తరువాత అతని శిష్యులు కొందరు కొన్ని గజలులను "దఫ్తరె-ఫసాహత్"అను పేర ప్రకాశింపజేసిరి.

ఉదాహరణమునకై కొన్ని చరణములు:—

జబ్ ఖపా హోతాహై తో యూ దిల్‌కు సమ్ఝాతాహుఁ మై
ఆజ్ హైఁ నా మెహర్బాఁ కల్ మెహర్బాఁ హోజాయెగా 1

థామ్‌లూఁ దిల్‌కుఁ జరా హాథోఁస్సె
ఆప్ పహలూసె న ఉఠ్ జాయియేగా 2

జో కహ్తాహుఁ తేరా బీమార్‌హూఁ మైఁ
తో క్యా కహ్తాహై కుఛ్ అప్నీ దవాకర్
నహీ ఉఠ్నే కె ఖాతిల్‌కీ గలీసే
కి హమ్ బైఠేహైఁ సర్‌సే హాథ్ ఉఠాకర్ 3

తిర్ఛీ నజరోంసే నదేఖో ఆశిషే దిల్గీర్‌కూ
కైసే తీరందాజ్‌హో, సీధాతోకర్‌లో తీర్‌కూ 4

---

1. ఆమె కోపించె నేని, నేడు ఆగ్రహించినను రేపు అనుగ్రహించు లెమ్మని హృదయము నాశ్వాసించు కొందును.

2. హృదయమును చేతులతో పొదవి పట్టుకొందును. నీవు ప్రక్కనుండి లేచి వెళ్ళకుము.

3. నేను నీ రోగినని చెప్పగా ఏదో చికిత్స చేసికొమ్మని చెప్పును-ఆ హంతకురాలి వీధినుండి లేవను-తలమీద ఆన వదలుకొనియే కూర్చుంటిని.

4. వ్యధిత హృదయుడగు ప్రేయసునిపై కటాక్షము ప్రసరింప జేయకుము. ఎట్టి బాణ సంధాతవు? బాణమునైన సరిచేసికొనుము.

నాసిఖ్ శిష్యులలో "రష్క్" కూడ ప్రముఖుడు. అతడు భాషను సంస్కరించుటలో, శబ్దకోశము తయారుచేయుటలో గురువుగారి సిద్ధాంతములను ప్రచారము చేయుటలో చాల ప్రసిద్ధివడసెను. అతని కావ్య సంగ్రహములు రెండు ప్రకాశితములైనవి. అందలి కవిత నీరసము - నిస్సారము-శబ్ద సాధుత్వము మఱియు జాతీయముల ప్రయోగమే అతనికి ముఖ్యము. భావనల యెడ పట్టింపులేదు. అతడు క్రీ. శ. 1867లో మరణించెను. అతని అనేక శిష్యులలో "మునీర్", "జలాల్" అనువారు ముఖ్యులు.

'ఆతిష్' శిష్యులలో నవాబ్ సయ్యద్ మొహమ్మద్ ఖాఁ "రింద్" మఱియు పండిత దయాశంకర్ "నసీమ్" అనువారు మహాకవులలో లెక్కింపదగినవారు. "రింద్" రాజవంశమునకు సంబంధించినవాడు. ఫైజాబాదలో బాల్యమును యౌవనమును సుఖముగా గడపి చివరికాలమున లఖ్నో చేరెను. అచటి రాజ దర్బారులోను అతని జీవితము విలాసయుతముగా గడచెను. ఆతిష్చే పద్యములు దిద్దించుకొనుచు తుదకు అతనివంటి జీవితమునే అవలంబించెను. క్రీ. శ. 1857లో మరణించెను. అతని భాష పరిశుద్ధము. కవిత భావమయము. రెండు కావ్యసంగ్రహములు ప్రకాశితములు.

ఉదాహరణకొఱకు కొన్ని పద్యపాదములు :—

హజార్ బార్ కియా మేర ఇమ్తెహాఁ ఉస్నే
బస్ ఆజ్మా చుకా అబ్ ఆజ్మాయెగా ఫిర్ క్యా 1

మై భలా క్యోంకర్ కహూఁ తుమ్‌కో బురా
ఆప్‌నే జో కుఛ్ కియా అచ్ఛా కియా 2

వాదేపె తుమ్‌న ఆయెతో కుఛ్ హమ్ నమర్ గయే
కహ్నేకు బాత్ రహగయీ దిఁతో గుజర్ గయే 3

1. వేయిసార్లు నన్ను పరీక్షించితివి. ఇంక చాలును. ఏమి పరీక్షించ గలవు?

2. నేను నిన్ను చెడ్డవాడని ఎట్లనగలను? నీవు చేసినదంతయు మంచియే.

3. వాగ్దానము ప్రకారము నీవు రానందున నేను చచ్చిపోలేదు- అనుట కొఱకమాట మిగిలినది- కాలము గడవనే గడచినది.

ధూప్ దిన్‌కీ ఓస్ షబ్‌కీ ఖాయియ్యే
అస్తానే యార్‌పర్ మర్ జాయియ్యే 4

పడ్‌గయీ జాన్ కిస్ అజాబ్ మేహాయ్
చాహ్నాభీ బడీ ముసీ బత్ హై 5

నఖుల్వావో మేరీ జుబాం చుప్ రహో
కోయీ బాత్ ముహ్‌సే నికల్ జాయేగీ 6

పండిత దయాశంకర్ కౌల్ "నసీమ్" కులీన కాశ్మీర కుటుంబమునకు చెందినవాడు. క్రీ. శ. 1811లో జన్మించెను. బాల్యము నుండియే కవితా రచన ప్రారంభించెను. ఉర్దూ ఫారసీలలో విద్వాంసుడు. 'అమ్జదలీ' పాదుషా సేనలో "బక్షీ" పదవియందుండెను. ఆతిష్ శిష్యులలో సుప్రసిద్ధుడు. అతడు గజలులు కూడ వ్రాసెను. కాని అతని కీర్తికి కారణము అమరఖ్యాతి నొందిన మస్నవీ "గుల్జారె నసీమ్"-నసీమ్ తన 32వ యేట క్రీ. శ. 1843 స్వర్గస్థుడయ్యెను. "అలీఫ్‌లైలా" కథలు (అరేబియన్ నైట్సు) కొన్ని ఉర్దూలో అనువదించెనందురు.

'గుల్జారె నసీమ్' మీర్ హసన్ మస్నవీ తరువాత పేర్కొనదగినది. వ్రాసినప్పుడది సుదీర్ఘమట. గురువగు "ఆతిష్"కు చూపించగా అతడు దానిని సంక్షేపించి చెప్పుమని సలహాయిచ్చెనట-అట్లే "నసీమ్" సంక్షిప్తపఱచెను. అది నేడు ఉర్దూ సాహిత్యకోశమున అనర్ఘమణి. గుల్-బకావళి ప్రసిద్ధ కథ ఇతి వృత్తము. ఇందు హార్దిక భావ చిత్రణ వివిధాలంకార ప్రయోగము దర్శనీయము. మస్నవీ క్రమబద్ధమగు కథా కావ్యము (ప్రబంధము) కనుక అందుండి ఉదాహరణము లిచ్చుట కష్టము.

గజలుల నుండి కొన్ని ఉదాహరణములు :—

నామ్ మేరా సున్తేహీ షర్మాగయే
తుమ్‌నే తో ఖుద్ ఆప్కో రుసువా కియా 7

4. పగటి యెండను, రాత్రి పూట మంచును తినుడు- ప్రియురాలి దేహళిపై అంతమొందుడు-
5. ప్రాణమెట్టి సంకటమున బడినది ? ప్రేమించుటయు గొప్ప ఆపదయే.
6. నేను నోరు తెఱచునట్లు చేయకుము- ఏ మాటయేని జారిపోవును.
7. నా పేరు విననంతనే సిగ్గుపడితివి. నిన్ను నీవే నిందపాలు చేసికొంటివి.

గర్ యహీహై ఇస్ గులిస్తాం కీ హవా
శాఖె - గుల్ ఎక్ రోజ్ ఝోకా ఖాయెగా 1

* * * *

రూహే రవానో - జిస్మ్ కీ సూరత్ మై క్యా కహూం
ఝోంకా హవాకా థా ఇధర్ ఆయా ఉధర్ గయా 2

* * * *

అబ్ దర్దే - జిగర్ హోకె నికల్తాహై దహన్‌సే
వో జోష్ జో బర్సోంసే మేరే సీనేమె నిహాం థా 3

* * * *

జబ్ హోచుకీ షరాబ్ తోమై మస్త్ మర్‌గయా
శీషేకె ఖాలీ హోతేహీ పైమానా భర్ గయా 4

ఆనాడు అవధులో మఱియు భారతదేశమంతటిలో 'గజ'లొక్కటే ప్రియమైన ఛందము. ఖసీదాల రచన అత్యల్పము. 'హిజో'ల ప్రచారము తగ్గెను. మస్నవీల నిర్మాణము సన్నగిల్లెను. కాని ఈ యుగముననే "మర్సియా" రచన అత్యున్నతి చెందెను. అట్లగుటకు కారణము, లఖ్నో పాలకులు 'షియా'లు. అచట "మొహర్రమ్" మఱియు ఇతర ఉత్సవములు అత్యుత్సాహమున జరుపబడుచుండెను. పెద్దపెద్ద అమీరులు, జాగీర్దారులు హిందువులైనను ముసల్మానులైనను ఆయుత్సవములలో పాల్గొనుచుండిరి. ఆరంభమునుండియు అవధ్ సభ్యత హిందూ-ముస్లిముల సమైక్యతకు ప్రసిద్ధము. మొహర్రములోని సంతాప సభలలో వేలకొలది ప్రజలు పాలుగొనుచుండిరి.

---

1. ఈ తోటలో వీచు గాలి యట్టిదే యగునేని ఒకనాడు పూరెమ్మ విరిగిపోవును.
2. ప్రాణము, శరీరము ఎట్టిదో ఏమి చెప్పవలెను? ఒక గాలితెప్ప ఇట్లు వచ్చినది. అటు పోయినది.
3. చిరకాలము నా యెదలో గుప్తముగానున్న ఆవేశము నేడు హృదాయావేదనయై నా నోట వెలువడుచున్నది.
4. మద్యమయిపోగనే మత్తుడ నగునేను మరణించితిని. కలశము సమాప్తము కాగనే పానపాత్ర నిండుకొనినది.

అందు 'మర్సియా' పఠనము జరుగుచుండెడిది. లఖ్నో కవితలోని కృతకత్వము మఱియు దాని పతన దశను అరికట్టుటకై మర్సియాలు చాల తోడ్పడెను. మర్సియాలలో ఉత్కృష్ట సిద్ధాంతములు నైతిక భావములు ప్రచారములగును. వాని ప్రగతి కదియే అనుకూల సమయము. కళావికాసమున కనుకూలమగు వాతావరణ మవసరము. లఖ్నోలో మర్సియాలకొఱకట్టి వాతావరణ మేర్పడియుండెను.

'మర్సియా' అనగా మతసంబంధముననో రాజకీయముగనో లేక యితర కారణముల వలన లోకప్రియులగు వ్యక్తుల మృత్యువు పట్ల వెల్లడించు శోక భావముల కవితారూపము. ఆ వ్యక్తుల మంచితనము వినువారు ప్రభావితులగునట్లు ఉల్లేఖింపబడును. ఉర్దూ మర్సియాలు సాధారణముగా ఇమామ్ హుస్సేన్ మఱియు అతని సహచరుల గూర్చి వ్రాయబడినవి. ఇమామ్ హుస్సేన్ ముసల్మానుల 'రసూలు' (హజ్రత్ మహమ్మద్) దౌహిత్రుడు. అతనిని నామ మాత్రమునకు ముసల్మానుడగు పాదుషా "యజీద్" అనువాడు "కర్బలా" యుద్ధ భూమిలో మూడు రోజులు ఆకలిదప్పులకు మాడ్చి అతి నిర్దాక్షిణ్యముగా చంపెను. ఇమామ్ హుస్సేన్ వెంట డెబ్బది యిద్దరు వ్యక్తులే ఉండిరి. వారిలో 80 ఏండ్ల వృద్ధుల నుండి ఆరునెలల శిశువులును ఉండిరి. అందఱును ఆకలిదప్పుల కాగలేక మరణించిరి. ఇమామ్ హుస్సేన్ తన ఆదర్శపాలనము కొఱకు అనేకులతో పోరి అంతమున వీరస్వర్గ మలంకరించెను. అతని 'డేరా'లు (గుడారములు) తగులబెట్టబడెను. పూజనీయురాండ్రగు అతని కుల స్త్రీలు దాసీలయి దేశముల ద్రిప్పబడిరి. ఈ సంఘటనలనే హృదయ విదారకముగా మర్సియాలలో అభివర్ణింతురు.

మొట్టమొదటి ఉర్దూ మర్సియాలు దక్కను కవులే వ్రాసిరి. అవి కేవలము ఇమామ్ హుస్సేను పట్ల తమకుగల భక్తిని వెల్లడించుకొనుటకే వ్రాయబడినవి కాని, సాహిత్య గౌరవము కలవికావు. దిల్లీలోను కొన్ని పూర్వకాలపు మర్సియాలు లభించినవి. వానిలోను సాహిత్యము లేదు. మీర్జాసౌదా కూడ ఒక మర్సియాల సంగ్రహము సిద్ధపఱచెను. అవి సాహిత్యపు విలువలు కలవి. తరువాత లఖ్నో కవులును కొన్ని మంచి మర్సియాలు వ్రాసిరి. అనేకులు పుణ్యము నాశించియే వ్రాసిరి. మర్సియా రచయితలలో "దిల్గీర్", "ఫసీహ్", "ఖలీఖ్" మఱియు "జమీర్" అనువారు ప్రసిద్ధులు. 'ఖలీఖ్' మీర్ హసన్ కొడుకు. అతని కుటుంబమున నాల్గుతరముల నుండి మర్సియాలు వ్రాయబడుచుండెను. అతడును కొన్ని

ఉత్తమ మర్సియాలు వ్రాసెను-మర్సియాలను కళాత్మకముగా రచించిన కవి "జమీర్"-అతడు ఇతివృత్తమును వ్యాప్తిచెందించి కర్బలా దుర్ఘటన లన్నిటిని క్రమబద్ధముగా కనులకు కట్టినట్లు వర్ణించెను. కేవల దుఃఖ గాథలగు మర్సియాల కట్టి రూపము కల్గించిన మొదటి కవి తానే అయినట్లు చెప్పికొనెను. అతని మర్సియాల సంకలనములన్నియు ప్రకాశితములైనవి. అతడు తన జీవితమునంతయు మర్సియా రచనలోనే గడపిన మహాకవి-మీర్ బబర్ అలీ "అనీస్", మఱియు మీర్జా సలామత్ అలీ "దబీర్" అను వారిరువురు అతని శిష్యులు. వారు ఉర్దూ మర్సియా సాహిత్యాకాశమున సూర్యచంద్రులు. ఈ యిరువురు మర్సియా రచనను సుపరిపుష్టము చేసిరి. తరువాతి వారెవరును దానిని చేపట్టుటకు సాహసింపలేదు.

మీర్ అనీస్, ఖలీఖ్ పుత్రుడు. క్రీ. శ. 1804న ఫైజాబాదలో జన్మించెను. తండ్రివెంట లఖ్నో వెళ్ళెను. ఖలీఖ్ స్వయముగా గొప్ప మర్సియా రచయిత. అయినను తన పుత్రుని మీర్ జమీర్ శిష్యత్వమున నియోగించెను. అతడు కేవలము మర్సియాలే వ్రాయవలయు ననునది ఖలీఖ్ అభిలాష. ఆనాటి ఆచారమునను సరించి అనీస్ అరబీ ఫారసీ గ్రంథములు చదివి మత సాహిత్యము నవలోకించెను. అంతే కాక గుఱ్ఱపుస్వారి, వ్యాయామము మఱియు శస్త్ర విద్యలందును నేర్పుగడించెను-అతడు ఉదార స్వభావుడు. మృదు హృదయుడు-ఆత్మాభిమాని. ఆదర్శములపై అభిమానము కలవాడు. ఎవరి ముందును తల వంచువాడు కాడు. నిత్య సంతోషి. నిర్భీకుడు-వినయ నమ్రుడు-అతడు జీవితమంతయు లఖ్నోలోనే గడపెను. కావ్య రసజ్ఞులు, సాహితీ సౌందర్య వేత్తలునగు లఖ్నోవాసులే తన విలువ గ్రహించగల వారని అతని విశ్వాసము. లఖ్నో నుండి అలహాబాద, బనారస్, పట్నా మఱియు హైదరాబాదలకు వెళ్ళి అశేష సత్కారములంది తిరిగి వచ్చెను. లఖ్నోలోనే క్రీ. శ. 1874న మరణించెను.

మీర్ అనీస్ చిన్నవాడు ఒకటి రెండు గజలులు వ్రాసెనందురు. అతడధిక ముగా వ్రాసినవి మర్సియాలే. కొన్ని "సలాములు" మఱికొన్ని "రుబాయీ"లును వ్రాసెను. అతని రచనలన్నియు అయిదు భాగములుగా ప్రకాశితములైనవి. కొన్ని రచనలతని వంశస్థులకడ సురక్షితముగానున్నవి కాని ప్రకాశితము కాలేదు. ఒక గొప్ప కళావేత్త, ఒక గొప్పకవికి కావలసిన విశేషములన్నియు "మీర్ అనీసు"కు కలవు. మర్సియాలలో అన్నిరకముల పాత్రలు ఉండును. సజ్జనులు, దుర్జనులు; తనవారు, పరులు; వృద్ధులు, యౌవనులు, బాలురు; స్త్రీలు, పురుషులు; మిత్రులు,

బంధువులు ; వారి పరస్పర సంబంధమొకచో గంభీరము. ఒకచో సామాన్యము. వారి స్వభావములు, వ్యవహారములు విభిన్నములు– అయినను ఏ పాత్రకు తగినరీతి ఆ పాత్రను సహజముగా చిత్రించిన మహాకవి మీర్ అనీస్. అతడు గొప్ప మనస్తత్త్వవేత్త. అంతటి బృహద్రచనకు కావలసిన శబ్దజాలమతనికి స్వాధీనము. మతసంబంధమును, చారిత్రకమును అగు విషయముపై కవిత వ్రాయుట కష్టమైన పని. అందు హెచ్చుతగ్గులుచేయుట, చేర్పులు, మార్పులు చేయుట పాపమనిభావించు వాడతడు. అతని దృష్టిలో ఇమామ్ హుస్సేన్ మఱియు అతని అనుచరులు దివ్యగుణసంపన్నులు. అతడు చాల పరిశోధించి అంతర్ముఖుడై పరిశీలించి చరిత్ర పుటలలోలేని అంశముల నుల్లేఖింపగలిగెను. ఆయాస్థితులలో సంభవములగు సన్నివేశములను వర్ణింపదగిన ఊహాశక్తి అతనిది. ఇదే కవి భావనాశక్తికి పరీక్ష. ఈ పరీక్షలో అతడు అతి నిపుణుడనిపించు కొనెను. అతని కవితలోని ప్రకృతి వర్ణన సుందరము– భావప్రకటనలో విశ్వసాహితియందలి కొందఱు కవులే అతనికి సరివత్తురు. అతని మర్సియాలు నైతికములును, ఉదారములును అగు భావసముదాములు కలవు. వానిని చదువునప్పుడు ఆత్మగౌరవము, పవిత్రభావములు జాగృతములగును. పఠితలను శ్రోతలను శోకరసమున ముంచివైవగల రచనలవి. ఎట్టివాడైనను ప్రభావితుడు కాకుండ ఉండలేడు.

అనీస్ భాషాప్రయోగమున నేర్పరి. ఆనాటి లఖ్నో కవులు అలంకారములను అనుచితముగా ఉపయోగించుచుండిరి. అనీస్ తన కవిత నట్లుకాకుండ కాపాడు కొనెను. అతని భాష సరళము, పరిశుద్ధము, మధురము – భాషను దేశకాల పరిస్థితుల ననుసరించి వాడుటలో అతడు చతురుడు. అతని రచన ఆదర్శవాదమయ్యును వాస్తవికతకు సమీపము. అతని విషయ మెంతటి ఉదాత్తమో శైలి దాని కనురూపము – మర్సియాలనుండి ఉదాహరణ లిచ్చిన లాభము లేదు.

రెండవ మర్సియా రచయిత మిర్జాసలామతలీ "దబీర్". అతడును "అనీస్" వలె సువిఖ్యాతుడు. జన్మస్థానము ఢిల్లీ అయినను తండ్రి లఖ్నోలోనే స్థిరపడినందున "దబీర్" జీవిత మంతయు లఖ్నోలో గడచెను. చిన్ననాడు మంచి శిక్షణ పొందెను. ఆనాటి ఆచారము ననుసరించి చదువవలసిన వన్నియు అత్యుత్సాహముతో చదివెను. బాల్యము నుండియు అతనికి మతసాహిత్యమన్నను కవిత్వమన్నను అభిమానము. తానును మర్సియా రచన చేయదలచి "మీర్ జమీర్" శిష్యుడయ్యెను. ఇతని కీర్తి లఖ్నో దాటి వ్యాపించెను. అవధ్ దర్బారులో సన్మానములు జరుగుచుండెను. ఇతని

కీర్తితోపాటు మీర్ అనీస్ కీర్తియు వ్యాపించుచుండెను. "దబీర్" లఖ్నో విడచి వెళ్ళదలచలేదు. కవితారసజ్ఞులు లఖ్నోలోనే కలరని విశ్వసించెను. కాని క్రీ. శ. 1857 నాటి విప్లవమున లఖ్నో విడచి వెళ్ళవలసి వచ్చెను. ముర్శిదాబాద, పట్నాలలో కొంత కాలము నివసించి మరల లఖ్నోచేరి అచటనే క్రీ.శ. 1875లో మరణించెను.

"దబీర్" సుమారు 3,000 మర్సియాలు వ్రాసెనందురు. వానిలో చాలవఱకు లఖ్నో ప్రభావము కలవి. అతని భావములు ఉదాత్తములు. శైలి కఠినము - అలంకార వ్యామోహ మధికము. అతడు గొప్ప విద్వాంసుడు. "కర్బలా" దుఃఖ గాథను సమగ్రముగా ఎఱిగి సవిస్తారముగా వర్ణింపగల వాడనుటలో సందేహము లేదు. అనీస్ వలె కళాసూక్ష్మముల నెఱిగినవాడు మాత్రము కాదు. తన కాలమున లోకులను చాల ప్రభావ పఱచెను. కాని అతని మరణానంతరము, అలంకార వ్యామోహముడిగిన కాలమున అతని కవిత కృతక మనిపించసాగెను. మర్సియాలకు కావలసిన గాంభీర్యము, మహనీయత అతని కవితలోలేవు. శ్రోతలు శబ్దార్థములను, అలంకారముల గూఢతను అన్వేషింపవలసిన వారైన ఆ కవిత తన ప్రభావమును నిలుపజాలదు. 'దబీర్' కవిత అట్టిదే. అనీస్ దబీరుల సమయ మొకటి, విషయ మొకటి, కావ్యరూప మొకటి కనుక విమర్శకులు వారి తులనాత్మక విమర్శచేతురు. లఖ్నోలో ''అనీసియా'' లొకవైపు "దబీరియా" లొకవైపుచేరి పరస్పరము పరిహసించుకొనిరి. కలహించుకొనిరి. కాని నేటి పాఠకులు దబీర్, అనీస్ వంటి మహాకవి కాడని సులువుగా గ్రహించగలరు. దబీర్ కవితనుండియు ఉదాహరణము లిచ్చుట కష్టము - అతని కవిత అరబీ ఫారసీ పద బహుళము - అలంకార భూయిష్టము - మీర్ అనీస్ మఱియు మీర్జా దబీరుల శైలీ భేదము ఈ క్రింది ఉదాహరణముల వలన స్పష్టపడును :—

అర్థమొకటి శైలి వేరు -

దబీర్ :— జేరే - ఖదమే - వాలిదా, ఫిర్దౌసె - బరీఁహైఁ 1

అనీస్ :— సున్తేహైఁ మాఁకె పాంవ్‌కె నీచే బహిష్త్ హై 2

---

1. మాతృదేవి పాదముల క్రింద స్వర్గము కలదు.

2. మాతృదేవి పాదముల క్రింద స్వర్గమున్నదని విందము.

దబీర్ :— జిస్ తరహ జల్జలేమె కోయీ సాహబే మకాఁ 3

అనీస్ :— జైసే కోయీ భూంచాల్ మే ఘర్ ఛోడ్‌కే భాగే. 4

లఖ్నోలో మర్సియాల ఉన్నతి ఉర్దూ కవితా సీమలన్నిటిని విస్తృత మొనర్చినది. అంతవఱకు సాహిత్యమునకు కలిగిన పతనము నరికట్టి నూత్నమార్గము పట్టించినది. మర్సియాలే ఆధునిక కవితకు ప్రేరకములయ్యెనని కొందఱు విమర్శకులందురు. కాని అది సరికాదు. ఆధునిక కవులకుగల సమస్యలానాడు మర్సియా కవులకులేవు. నవ్యకవితలో నూత్నచైతన్యముకలదు. మర్సియాలలోని నవ్యత చైతన్యపు నవ్యత కాదు- విషయ ప్రకటనకొఱకు ఎన్నుకొనిన నవ్యశైలిమాత్రమే అది. మీర్ అనీస్ మఱియు మీర్జా దబీరుల తరువాత కూడ మర్సియాలు వ్రాయబడెను. అనీస్ సోదరులు "మునీస్" మఱియు "ఉన్స్" అనువారును మంచి కవులు. వారు మర్సియాలు వ్రాసిరి. అనీస్ కొడుకులు ముగ్గురు మర్సియాలు వ్రాసిరి. వారిలో "నఫీస్" అనునతడు తండ్రివంటి గౌరవము పొందెను. ఈ వంశమువారు నేటికిని మర్సియాలు వ్రాయుచున్నారు. కాని సామాజిక, ధార్మిక, రాజకీయ పరిస్థితులు మారినవి. కనుక ఆ రచన కంతటి స్థానము నేడు లేదు. దబీర్ కొడుకు "ఓజ్" కూడ ప్రసిద్ధ మర్సియా రచయిత. అతని వంశమువారును వ్రాయుచున్నారు. ఈ రెండు వంశముల వారు తమ పితరుల శైలిని పాలించుట ముదావహము. వారి బంధువులలో అనేకులును మర్సియా రచయితలు- "ఇష్క్", "త-అష్షుఖ్", "రషీద్", "ఆరిఫ్" మఱియు "వహీద్" మొదలగు వారును వారి వంశీకులును మర్సియా రచన చేయుచున్నారు.

లఖ్నో కేంద్రపు విశేషములను పరిశీలింతుమేని ఢిల్లీనుండి వచ్చినవారే ఇచట కావ్యరచన ప్రారంభించిరని తెలియును. కొంతకాలము తరువాత ఇచటి సామాజిక, ఆర్థికపరిస్థితులలో చిన్నచిన్న మార్పులు కలుగుటచే ఇచటి భాషయు సాహిత్యమును ఢిల్లీకంటె భిన్నమయ్యెను. ప్రారంభమున ఈ భిన్నత్వము అస్పష్టముగా, అవ్యక్తముగా ఉండెను. కాని తరువాతి కవులును, రచయితలును తమ శైలిని ఢిల్లీశైలికి భిన్నముచేయ ప్రయత్నించి కృతకృత్యులైరి. అవధ్‌లో జీవితమంతటిలోను మఱియు సభ్యతలోను ఒక విధమగు మార్దవము, కోమలత ఉత్పన్నమై బాహ్య

3. భూకంపమున ఇంటి వాస్తవ్యుని వలె (పరుగెత్తెను- అనియుండును)

4. భూకంపమున ఎవరేని ఇల్లు విడచి పారిపోయినట్లు.

సౌందర్యమును కృతకము చేసెను. రచయితలు శబ్దాడంబరమును చూపిరి. అందు జీవిత సమస్యలు, గంభీర విషయములు అడుగున పడిపోయెను. లఖ్నోయందు భాషను సుందరముగా మృదువుగా రూపొందించు ప్రయత్నము విశేషముగా జరిగిన దనుటలో సందేహము లేదు. కాని దాని పరిణామరూపమున కవులు శబ్దాడంబరమే కవిత్వమని భావించి అలంకార ప్రయోగములోనే తమ శక్తినంతయు ధారవోసిరి. కొందఱు కవులు, విశేషించి మర్సియా కవులు ఈ సముద్రములోనే తమ నౌకలు నడపినను గంభీరములగు మహాకావ్యములను సృష్టించి లఖ్నోను నిందపాలు చేయుచున్న సాహిత్యదోషములనుండి తప్పించుకొనిరి.

సాహిత్యవేత్తలు కొందఱు ప్రదర్శించిన విధముగా దిల్లీ లఖ్నోల వివాదము లేకుండెనని పైనగల కొన్ని కమ్మలలో స్పష్టపడినది. భారతదేశపు రాజకీయ పరిస్థితిలో కలుగుచున్న పరివర్తనముల వలన దిల్లీ మఱియు లఖ్నోలలో చెప్పికోదగిన భేదము లేకుండెను. ఆర్థికస్థితి ఉన్నదున్నట్లే ఉండెను. పై పై మార్పులు మాత్రము జరుగుచుండెను. దానివలన సాహిత్యాధారములు మారజాలవు. సామ్రాజ్య సభ్యత వలన రూపొందిన సంప్రదాయములు ఇంకను ప్రబలియుండెను. భారత జీవనమున ఐరోపాలోని ఆలోచనలు ప్రవేశించు చుండెను కాని సామాన్యుల జీవితములు వానిచే ప్రభావితములు కాకుండెను. అధిక సంఖ్యాకులు తమ ప్రాచీనతనే అంటిపెట్టుకొని యుండిరి.



ఐదవ అధ్యాయము

# నజీర్ అక్బరాబాదీ - ఒక విశిష్ట సంప్రదాయము

ఉర్దూ సాహిత్యము ఫారసీ భాష మఱియు ఫారసీ భావములచే ఎంతగా ప్రభావితమైనను అందు అణచినను అణగని రీతి ప్రగాఢమగు దేశీయత ఉండెనని ఈ సంక్షిప్త చరిత్ర చదువువారు గ్రహించి యుందురు. ఆ విదేశీయ ప్రభావమునకు తత్కాలీన పరిస్థితుల పరిణామ రూపములగు చారిత్రక కారణము లనేకములు. వానిపై ఎవరి అధికారమును లేదు. బహుముఖమగు భారతీయ సభ్యతలో ఒక విధమగు ఏకత్వము కలదు. అది కాలక్రమమున స్పష్టమగు చున్నది. 18 వ శతాబ్దాంతము మఱియు 19 వ శతాబ్దారంభమున జాగీర్దారీ వ్యవస్థ పతనమును నూత్న శక్తుల విజృంభణమును క్రొత్త సమస్యలను జన్మింప జేసెను. రాజకీయ పరివర్తనములు సాంస్కృతిక ప్రవాహము నరికట్టెను. కనుక ఏ సంస్కృతీ విభాగమునను ప్రగతి గోచరింపదు. రాజదర్బారు, రాజధానీనగరము, కొంత దూరమున కొన్ని ముఖ్య నగరములు సాహిత్యమునకు, కళలకు సంస్కృతికి కేంద్రము లయ్యెను. ఈ విధముగానే అన్ని కాలములలో అన్ని దేశములలో జరుగును - భాష ఇట్లే కేవల సాహిత్య సంబంధమై సీమితమై పోవును. ఇంతేకాదు. సాహిత్యమునందు కొన్ని ప్రత్యేక నియమము లంగీకరింపబడి యుండును. వానిని ఉల్లంఘించు ప్రయత్నము చేయువానికి ఆ కాలమున ఎట్టి మహత్వమును లభింపదు.

ఉర్దూ వ్యావహారిక భాషా రూపముననే వికసించెను. దానికి సాహిత్యములో ఒక స్థానము కలిగినంతనే దాని కొలమానములు మారిపోయెను. కేంద్రముననే సీమితమై యున్నందున ప్రజాసామాన్యముతో దానికి గల సంబంధము కొంత సడలిపోయెను. ఇట్లగుట వలన సాహిత్యముపైనను దాని ప్రభావము పడెను. పైన పలు తావుల చెప్పినట్లు ఆనాటి సామాజిక ఆర్థిక జీవన మూలధారలు రెండు. ఒకవైపు కర్షకులు మఱియు అల్పోద్యోగములు చేయువారు. వీరు సామాన్యప్రజ. రెండవ వైపు ఉచ్చవర్గీయులనబడు పాదుషాలు, జాగీర్దారులు, సైన్యాధికారులు, రాజాస్థాన సంబంధితులు మొదలగువారు. మధ్యమవర్గ మింకను ఏర్పడలేదు. మధ్యమ వర్గీయులున్నను వారు చాల వఱకు మానసికముగా సామ్రాజ్య వ్యవస్థచే ప్రభావితులు -

కనుక సాహిత్యమునను రెండు ధార లేర్పడును. అవి అప్పుడప్పుడు ఏ మహనీయు డగు రచయిత రచనలలోనో వ్యాపక రూపమున కలిసిపోవును. రచయిత లందరును సాధారణముగా ఉచ్చవర్గీయుల భావములను మాత్రమే చిత్రించువారని తాత్పర్యము కాదు. వాస్తవమేమన వారి చైతన్యము సామ్రాజ్యయుగపు టాలోచనలు, నైతిక సిద్ధాంతములు మఱియు శిక్షాసంబంధ నియమముల చేతనే రూపొందినది. ఆ సంప్ర దాయమును కొనసాగించుట తమ కర్తవ్యమని వారు భావించుచుండిరి. అయినను మానవతా కల్యాణము మఱియు దళితజాతుల పట్ల న్యాయము అను సమస్యలు వచ్చి నప్పుడు మాత్రము వారు ఆ నియమములను తొలగద్రోయుచుండిరి. వారు ధర్మమును, రాజనీతిని ఆర్థికమగు అసమానతను ఎదురించి నిలుచుచుండిరి. వీని మూలముననే మానవులు జాతులలో విభజింవబడినారను విషయమందరు ఎఱిగినదే. కవుల ఈ భావములు కొన్ని "తసవ్వుఫ్" (సూఫీతత్త్వము) నకు సంబంధించిన వ్యాపకములు, ఉదారములు అగు భావముల కారణమున కలిగినవి. కొన్ని వ్యక్తికి సమాజమునకు నడుమ నైతిక సంబంధము స్థాపించు ప్రయత్నమున కలిగినవి. ఈ సంప్రదాయ ప్రచారకులలో మహాకవులందరను పేర్కొనవచ్చును. మొహమ్మదు ఖులీఖుతుబ్‌షా, వలీ, సిరాజ్, మీర్, దరద్, ఆతిష్, గాలిబ్ మొదలగు వారనేకులు ఇట్టివారే. ఉన్నత కావ్యసాహిత్యపు ఈ విశేషము అన్ని భాషలలోను చూడనగును. మానవుల పట్ల జరుగు అన్యాయమును సహృదయులగు మహాకవులే తొలుత గ్రహించి బాధ పడుదురు. వారు వర్గవిభజిత సమాజములోని వారైనను సామాన్యజీవులయెడ ఉదార భావములు ప్రకటింప సాహసింతురు.

ఉర్దూలో ప్రజాసాహిత్యము పుట్టలేదనుట నిస్సందేహము. దానికి కారణ మేమన ఉర్దూభాష రూపొందునాటికి భారతీయ సంస్కృతి విశిష్టరూపము ధరించి యుండెను. ఎన్నియో భాషలు సాహిత్య సమృద్ధములై యుండెను. ఒక క్రొత్త భాషగా తయారగుచున్న ఉర్దూ ఉత్కృష్టములగు ఇతర భాషల సాహితినే అనుస రించెను. వ్యావహారిక భాషగా ఉన్నంత వఱకు ప్రజల భావములు మఱియు వ్యవ హారములపైననే ఆధారపడి యుండెను. సామాన్య సమస్యలకు సంబంధించిన జాతీయములు, పలుకుబళ్లు అందు చేరిపోయెను. ప్రారంభదశలోని ఉర్దూసాహిత్యము సరళము. సమయము గడచిన కొలది ఫారసీ, అరబీ శబ్దము లధికముగా కలిసి పోయెను. ప్రత్యక్ష సంబంధములేని విషయములు కవితావస్తువ లయ్యెను. నగర జీవనమునందును గ్రామీణ జీవనమునందును అంతర మేర్పడెను. నగరవాసులగు

ప్రజలు తమ అంతస్థునకు చెందిన వారితో కలిసిమెలసి యుండుటయే మర్యాద రక్షణమునకు ఆవశ్యకమని భావించుచుండిరి. ఈ విధముగా ఉర్దూ కవిత్వము ప్రజా సాహిత్యమునకు దూరమైపోయెను.

ఉర్దూ కవిత్వము చదువు నప్పుడు ఇంకొక విషయమును దృష్టిలో ఉంచుకొనుట లాభదాయకము. ఉర్దూకవు లనేకులు ఫారసీ భాషను మఱియు ఫారసీ కావ్యశాస్త్రము నెఱిగినవారు - వారిలో పలువురు ఆ భాషను ఉర్దూకంటె ఉత్తమ మైనదిగా తలచి అందులో రచనలు చేయుటే సభ్యతాలక్షణమని భావించుచుండిరి. కొందఱు హిందీ భాషా పరిచయము కలవారు. కాని వారు హిందీ కావ్యశాస్త్రము నెఱిగిన వారనుటకు వీలులేదు. కనుక ఫారసీ శాస్త్రము ననుసరించియే కావ్యరచన చేయుచుండిరి. ఫారసీ కావ్యమీమాంసపై "అరిస్టాటిల్" (Aristotle) ప్రభావ మధికము. కనుకనే ఫారసీ సాహిత్యవేత్తలును కవిత్వములోని సన్నివేశములకు చారిత్రక సంఘటనలకు అంతరముండవలెనను సిద్ధాంతమును ఆదరించుచుండిరి. చరిత్రలో విశేష సంఘటనల వర్ణన జరుగును. కావ్యములలో సాధారణములు, సార్వజనీనములగు సన్నివేశముల వర్ణన జరుగును. అందువలననే ఉర్దూ ఫారసీ కావ్యసాహిత్యములలో లోకప్రియ ఛందమగు "గజలు" లో ఒకే విధములగు అనేక సన్నివేశములకు సంబంధించగల భావములును అనుభూతులును వర్ణింపబడును. ఉర్దూ కవితలోని ఈ విశేషమును దృష్టియందుంచుకొనిన ఎన్నియోసంగతులు తెలిసికొనుటలో సహాయము లభించును. విశేష సన్నివేశములను, విషయములను గూర్చి కవితలు వ్రాయబడకుండుటకు కారణము విదితమగును. కవిత్వమును అత్యంత విశ్వవ్యాపకమును, అలౌకికమును చేయుటకై కవులు ఈ మార్గము ననుసరించిరి. దీని సామాజిక, ఆర్థిక కారణము గ్రహించుట కష్టము కాదు. అన్నిటికంటె ముఖ్యమైన కారణమేమన అనేకులగు కవులు సామాన్య ప్రజల జీవితముతో సంపూర్ణ పరిచయము లేనివారు. ఈ పరిచయము ఏదో కొంత కలిగిన కవులు దానిని ఏదో రూపమున ఉల్లేఖించిరి.

ఇట్టి కవులలో ఒకడు "నజీర్" అక్బరాబాదీ. అతడు తన శైలిలో అప్రతిమానుడు అతడు క్రీ. శ. 1740 లో దిల్లీయందు జన్మించి జీవితమంతయు ఆగ్రా (అక్బరాబాద) లో గడపెను. ఆగ్రా కొంత కాలము అక్బరు పాదుషా రాజధాని. దాని నలువైపుల కృష్ణభక్తి సంబంధమగు వైష్ణవమకాందోళనము చెలగి సూరదాసు, నందదాసు, మీరాబాయీల గీతములు భజనలు జననమొందెను. విశాలమగు కోట

మరియు తాజ్‌మహల్ గల ప్రదేశమది. అచటి వాతావరణమున రాధాకృష్ణప్రేమ భక్తిగీతములు ప్రతిధ్వనించుచుండెను. దాని సమీపమున గల మధురా బృందావనము లలోని మేళలలోను, ఉత్సవాదులలోను పాల్గొను జనులహృదయములు ఉద్విగ్నము లగుచుండెడివి. ఈ సంప్రదాయములతోపాటు జ్ఞాపకముంచుకో వలసిన విషయ మింకొకటి. నూతనార్థిక స్థితిలో భారతదేశము దైన్యము పొందుచుండెను. వ్యాపారస్థులు నిర్వ్యాపారులగు చుండిరి. దేశములోని సంపద సముద్రములు దాటి పోవు చుండెను. శతాబ్దములనుండి భారతదేశ జీవనమునకు పట్టుగొమ్మయైయుండిన గ్రామీణ వ్యవస్థ శిథిలమగుచుండెను. "నజీర్"జీవితము ఇట్టి ఆగ్రాలోనే కడచినది. దాని అణువణువును అతడు ప్రేమించెను.

స్వయముగా తానే ఇట్లనును:—

ఆషిఖ్ కహో, అసీర్ కహో, ఆగ్రేకాహూం
ముల్లా కహో, దబీర్ కహో, ఆగ్రేకాహూం
ముఫ్లిస్ కహో, ఫకర్ కహో, ఆగ్రేకాహూం
షాయిర్ కహో, "నజీర్" కహో, ఆగ్రేకాహూం 1

కనుక ఆనాడు ఆగ్రాలోను దానిచుట్టుపట్లనుగల జీవనమే అతని కవిత్వములో నిశ్వసించుట చూడగలము.

"నజీర్" పూర్తిపేరు "వలీమొహమ్మద్" ఆనాటి ఆచారము ననుసరించి అతడు పారసీ, ఉర్దూ గ్రంథములు చదివెను, గొప్ప విద్వాంసుడనుటకు వీలులేదు. జీవితములో చాల భాగము పిల్లలకు చదువు చెప్పుటలో గడపెను. కొంత కాలము "లాలావిలాసరాయ్" కొడుకులకు నెలకు రూ. 17ల వేతనముపై పారసీ బోధించెను. ఒకపూట వారి యింటనే భోజనము చేయువాడు. యౌవనము భోగవిలాసములలో హాస పరిహాసములలోగడచెను. ఆటలు, గాలిపటములు, ఈత, వ్యాయామము, కుస్తీ, పావురాలు పోట్లాడించుట ఈ మొదలగు మనోరంజక కార్యక్రమములలోపాల్గొనెను. ముసల్మానుల ఉత్సవములలోను పాల్గొనెను. హిందువుల హోలి. దీపావళి, రక్షా

1. నన్ను ప్రేమించువాడే అనుడు, బంధితుడు (ప్రియురాలిచే) అనుడు, పండితు డనుడు, లేఖకు డనుడు, బీదవాడనుడు, ఫకీరనుడు, కవి యనుడు, నజీర్ అనుడు ఎట్లనినను నేను "ఆగ్రా" వాడను.

బంధనము, కృష్ణజన్మాష్టమి మొదలగు ఉత్సవములలోను పాల్గొనుచుండెను. ఆగ్రాను విడిచి ఎచటికిని వెళ్లువాడు కాడు. మధురాబృందావనముల మేళలు మాత్రము తప్పక వెళ్ళి దర్శించువాడు. అయోధ్య మఱియు భరతపూర్ రాజదర్బారు లతనిని ఆహ్వానించెను. కాని ఆ సుఖమయ జీవితమును నిరాకరించి ఆగ్రానే అంటిపెట్టు కొని యుండెను. ఈ త్యాగము స్వల్పమైనదే అనిపించును. కాని దీనికి కారణము ప్రజాసామాన్య జీవనముపట్ల గల అభిమానమే. ఆ అభిమానము, ఆ ప్రేమ రాజ దర్బారు చేరినంతనే సమాప్తమై పోవును.

"నజీర్" సుఖదుఃఖమయమగు సుదీర్ఘ జీవితము వడసెను. అందు ప్రేమ తరంగములలో ఓలలాడెను. భక్తులవంటి జీవితమును గడపెను. ఆగ్రాలోని గొప్పవారు ఆతనిని సన్మానించుచుండిరి. పీడిత ప్రజలు అతనిని తమవాడని తలంచు చుండిరి. అతడు ప్రజలలో ఒకడుగా కలిసిపోయెను. అందువలన ఉన్నత వర్గము నకు చెందినవారు, నిమ్నవర్గీయులు, హిందువులు, మొహమ్మదీయులు, పిన్నలు పెద్దలు అందఱును భేదరహితముగా అతనిని గౌరవించుచుండిరి. అతని స్వభావము అతిసరళము. ప్రవర్తన స్వచ్ఛందము. కనుక ఎల్లరును అతని మిత్రులు. బిచ్చ గాళ్లును, వీధులవెంట తిరిగి సరుకులమ్ముకొను వారును అతనిచే పద్యములు పాటలు వ్రాయించు కొనుచుండిరి. "నజీర్" ఆగ్రాలోని "మొహల్లా తాజ్‌గంజ్" లో నివసించుచు అటనే క్రీ. శ. 1830 లో మరణించెను. ఇంటియందే సమాధి చేయ బడెను. అతడు సత్పురుషుడు. కనుక ప్రజలతని గొప్ప సూఫీగా భావించుచుండిరి. ఏటేట అతని సమాధిపై ఉత్సవములు జరుగుచుండెను. అతని కుమారుడు ఖలీఫా గుల్జారలీ "అసీర్" కూడ కవియే – నజీర్ శిష్యులనేకులు. వారిలో "బాతిన్" అను నతడు ఒక కవుల చరిత్ర వ్రాసి అందు తన గురువగు "నజీరు"ను విస్తారముగ వర్ణించెను.

"నజీర్" కావ్యసంగ్రహములు రెండు ప్రకాశితములైనవి. ఒకటి అతని సమస్త కవితల సంకలనము "కులియ్యాతె నజీర్" అనునది. అది చాలసార్లు అచ్చు పడినది. అందలి అనేక భాగములు హిందీలోను ప్రచురితములైనవి. రెండవ సంగ్ర హము ఈ నడుమనే ప్రకాశింపబడినది. అందు కేవలము గజలులే కలవు. నిశ్చయ ముగా చెప్పలేము కాని, అతని కవిత ఇంకను అతని సంబంధీకుల దగ్గర ఉండి యుండును. రెండవ సంగ్రహము లభించుట వలన "నజీర్" గజలులను గూర్చియు ఆలోచించుటకు అవకాశము కలిగినది. అయినను భారతీయ సాహిత్య ప్రపంచమున

అతనికి చిరకీర్తి కలుగుటకు అతని మొదటి గ్రంథమే కారణము. అందు భారతీయత తన సమస్త సదసద్వస్తు సముదాయముతో జీవితమైయున్నది. ఈ సంగ్రము లోని ఒక భాగము కృష్ణుడు, మహాదేవుడు, భైరవుడు, బలదేవుడు మొదలగు వారి వర్ణనలు కలది. "నజీర్"కు పూర్వులగు కవులు సామాన్య విషయములను ప్రజా జీవితమునుగూర్చి రచనలు చేయుటకు సంకోచించుచుండిరి. "నజీర్" ఉచ్చవర్గీయుల భావనల నుండియే ఒక రహస్య మార్గమును కనిపెట్టి దానిగుండ ప్రజాసామాన్యపు సాహిత్య భవనమున ప్రవేశించెను. మహనీయమగు ఈ సంప్రదాయముతో "నజీర్" అక్బరాబాదీ పేరు చిరస్థాయియైనది. నిజమునకు ఈ సంప్రదాయ స్థాపకుడు "అమీర్ ఖుస్రూ''. దానినే నజీర్ ప్రబలము, వ్యాపకము మఱియు లోకప్రియము చేసెను. అమీర్ ఖుస్రూ తరువాత ఆ సంప్రదాయమును భక్తకవులు, గోలకొండ ఖులీఖుతుబ్‌షా మఱియు దిల్లీకవి "ఫాయెజ్" నశింపకుండ కాపాడిరి. ''నజీర్" ఆకాశమునంటునట్లు ఉద్ధరించెను.

ఒక హిందీ రచయిత[1] "నజీర్'' యొక్క ఉదారతను, ఒక క్రొత్త శైలిని ప్రవేశపెట్టిన అతని సాహసమును ఇట్లు ప్రశంసించెను. ''.................. ఆ శుష్కమును, నిర్జనమును అగు సంగమమున నిల్చి ''నజీర్''అజాఁ (మస్జిదులలో నమాజు సమయమున ఉచ్చైస్స్వరమున చేయుస్తుతి)చేసెను. శంఖమును పూరించెను. తస్బీహ్(మునల్మానుల జపమాల)ధరించెను. జంధ్యము వైచికొనెను. మొహర్రమ్‌లో ఏడ్చెను. హోలీలో వసంతమాడెను. ''షబ్బరాతు" లో మతాబాలు కాల్చెను. దీపావళినాడు దివ్వెలు వెలిగించెను. నబీ, రసూల్ (మొహమ్మదు ప్రవక్త) పైగంబరు వలీ (యోగి) పీర్ (మతగురువు) గూర్చి తనవితీర రచించెను. కృష్ణుడు, మహాదేవుడు, నరసింహుడు, భైరవుడు మఱియు నానకులకు శ్రద్ధాంజలి సమర్పించెను. గులాబి మఱియు బుల్బులి పిట్టలను గూర్చి వ్రాసినను మామిళ్ళను కోయిలలను తొలుత స్మరించెను. పర్దాతోపాటు వసంత వర్ణపు చీరను మఱచిపోలేదు. అన్నియటుండ, వేసవి వర్షర్తువు మఱియు చలికాలముల గుఱించియు వ్రాసెను. పిల్లల కొఱకు 'ఎలుగుబంటిపిల్ల', 'కాకి - లేడి' 'ఉడుతపిల్ల' 'తర్‌బూజా' (పుచ్చకాయ) 'గాలిపటము ఎగురవేయుట' 'బుల్బులుల పోరు', 'దోసకాయ', 'ఈత' 'నువ్వుల లడ్డూలను'గూర్చి వ్రాయునప్పుడు తానుపిల్లవాడయి పోయెను. పిల్లలందరు వీధులలో

1. "లేర్ - వ. షాయిరీ". రచయిత అయోధ్యాప్రసాద్ గోయలీయ. క్రీ. శ. 1948.

అతని పాటలే పాడుచు తిరుగుచుండిరి. యువకులకు వృద్ధులకు ఉపదేశమిచ్చు చుండ ప్రజలు పరవశులగు చుండిరి. ఖురాను, హదీసు, వేదము, గీత, ఉపనిషత్తులు, పురాణములు ఇవన్నియు కరగించి త్రాగిన సిద్ధుడొకడు మాటలాడుచున్నాడా అనుపించును.''

"నజీర్" కవితలో సామ్రాజ్య సభ్యత మఱియు పర్షియా ప్రభావము వలన జన్మించిన కవితా సంప్రదాయము బొత్తిగా లేదనుటయు, వాస్తవికత మఱియు రాష్ట్రీయత అతని కవితలోనే పుట్టినవనుటయు సరికాదు. ఈ రెండు మాటలును అసంభవములు – కాని అతని కవితలో యాధార్థ్యము, దేశభక్తి, ప్రజాజీవన పరిజ్ఞానము, మానవప్రేమ, సహృదయత, సరళత కలవు. అవి ప్రాచీనకవు లెవరి కవితలో లేవు, "నజీర్" కవిత చదువుచున్నప్పుడు ఇట్లనిపించును. మనము పృథ్వి పై కాళ్ళుని నిల్చియుండగా సమస్త విధముల మనుష్యులు నలువైపుల నిస్సంకోచముగా సంచరించుచున్నారు. చలికాలము, ఎండాకాలము, వానకాలము వచ్చుచు పోవుచున్నవి. పరిచితములగు ఈ కాలముల వలన మనము ఆనందము ననుభవించుచున్నాము. వివిధ ధర్మములకు, వివిధ జాతులకు సంబంధించిన ప్రజలు, పక్షులు, జంతువులు చుట్టు పరివేష్టించి యున్నవి. ఆ వాతావరణమంతయు మనదే–మన స్వంతమే. ఈ చిన్న చిన్న విషయములను గూర్చి సజీవములగు కవితలు వ్రాయుట ఒక సామాన్య కవికి సాధ్యముకాని పని. "నజీర్" అనుభవ క్షేత్రము అతి విస్తృతము. అతడు భారతీయ జీవితము సమస్తము ఎఱిగినవాడు. అతనిది గంభీరమగు దార్శనిక దృష్టికాదు. కాని జీవిత సమస్యలన్నియు తెలిసినవాడు. దారిద్ర్య కారణములు, మతమునకు జీవితమునకు గల సంబంధము, వర్గముల విభిన్నత, మానవుల ఆవశ్యకములు, ఇవన్నియు అతనికి తెలిసినవే. సామాన్యమగు సరళభాషలో ఇన్ని విషయములకు కావ్యరూప మెట్లొసగెనో ఆశ్చర్యము. వర్షము, తుఫాను, చీకటి రాత్రి, పప్పు, పిండి, ఈత మొదలగు వానిని గూర్చి వ్రాయునప్పుడు అన్నిటిని అన్ని వేళలలో దర్శించి అనుభవించియే వ్రాయుచున్నాడనిపించును. అతడు జీవితమును ఎట్లు చూచెనో, ఎట్లు అనుభవించెనో అట్లే చిత్రించును. సర్వత్ర అతనిది ప్రజాసామాన్యపు దృక్పథమే. అతడు దేశపు ఆర్థిక సమస్యలను శాస్త్ర సమ్మతముగా ఎఱిగినవాడు కాడనుట స్పష్టము. వర్గముల ఆంతరంగిక సంఘర్షణమును గూర్చిన విశేష జ్ఞానము కలవాడు కాడు. అయినను అతడు జనసామాన్యములోనివాడే కనుక, యథార్థమగు మానవప్రేమ కలవాడు కనుక, ప్రజల సుఖదుఃఖములను సరిగానే గ్రహించెను.

నజీర్ కవితను చదువునప్పుడు అతని భాషను గూర్చియు ఆలోచించ వలసి యుండును. అతని భాష ఆగ్రాలోని వ్యావహారికము. అందు 'ఖడీబోలీ' మఱియు 'బ్రజభాష' కలిసియున్నవి. కొన్ని కవితల వలన అతనికి అరబీ, ఫారసీ భాషలే కాక బ్రజ, అవధి మఱియు పంజాబీ భాషలును తెలియునని తోచును. సంక్షేపముగా చెప్పవలెనన్న సమస్త మహాకవులకువలె భాషాప్రయోగము "నజీర్"వ్యక్తిత్వమును గూడ తెలియజేయును. కళాదృష్టితో చూచిన అతని కవితలో లోపములు కలవు. భావముల ననుసరించి చూచిన జటిలత-విషమతలు కలవు. అయినను అతని సత్య ప్రియత్వము, అతని మానవప్రేమ అన్నిటిని కప్పివైచును. అతని కవితలు చదువు నప్పుడు ఒక బంధింపబడిన, త్రొక్కుడువడిన ప్రదేశమునుండి విడివడి స్వేచ్ఛా వాయువులు పీల్చుచున్నట్లనిపించును.

ఉదాహరణ కొఱకు కొన్ని కవితలలోని కొన్ని భాగములు చూడుడు:—

దున్యామె బాదుషాహై సోహై వోభీ ఆద్మీ
ఔర్ ముఫ్లి సో గదాహై సోహై వోభీ ఆద్మీ
జర్‌దార్ బేనవాహై సోహై వోభీ ఆద్మీ
నేమత్ జో ఖారహాహై సోహై వోభీ ఆద్మీ
టుక్డేజో మాంగ్తాహై సోహై వోభీ ఆద్మీ 1

మస్జిద్ భీ ఆద్మీనె బనాయీహై యాఁ మియాఁ
బన్తేహై ఆద్మీహీ ఇమామ్, ఔర్ ఖుత బా - ఖాఁ
పఢ్తేహైఁ ఆద్మీహీ ఖురాన ఔర్ నమాజ్ యాఁ
ఔర్ ఆద్మీహీ ఉన్కి చురాతేహైఁ జూతియాఁ
జో ఉన్కో తాడ్తాహై సోహై వోభీ ఆద్మీ 2

---

1. ప్రపంచములో పాదుషా మానవుడే, బీదవాడగు ఫకీరును మానవుడే - ధనవంతుడును, ధన హీనుడును మానవుడే - దివ్యాన్నము భుజించువాడును మానవుడే - రొట్టెముక్కలు అడుక్కొనువాడును మానవుడే.

2. మస్జిదు మానవుడే కట్టించెను. మానవుడే ఇమాముగా ఖుతుబా చదువువాడుగా వ్యవహరించును. మానవుడే ఖురాను చదువును - నమాజు చేయును - మానవుడే అట్లు చేయువారి చెప్పులు దొంగిలించును. అట్లు దొంగిలించినది గ్రహించువాడును మానవుడే.

యాఁ ఆద్మీపె జాఁకొ వారేహై ఆద్మీ
ఔర్ ఆద్మీపె తేగ్‌కొ మారేహై ఆద్మీ
పగ్డీభీ ఆద్మీకి ఉతారే హై ఆద్మీ
చిల్లాకె ఆద్మీకొ పుకారే హై ఆద్మీ
ఔర్ సుఁకే దౌడ్తాహై సోహై వోభీ ఆద్మీ. 1

(ఆద్మీనామా)

బాదల్ హవాకె ఊపర్ హోమస్త్ ఛా రహేహైఁ
ఝుడియోంకి మస్తియోన్సే ధూమేఁ మచారహేహైఁ
పడ్తేహైఁ పానీ హర్‌జా జల్‌థల్ బనారహేహైఁ
గుల్జార్ భీగ్తేహైఁ సబ్జే నహారహే హైఁ
క్యా క్యా మచీహై యారో, బర్సాత్ కీ బహారేఁ. 2

మారేఁహైఁ మౌజ్ డాబర్, దర్యా ఉమఁడ్ రహేహైఁ
మోరో పపీహె కోయిల్, క్యాకా ఉమఁడ్ రహేహైఁ
ఝడ్ కర్ రహీహైఁ చిడియాఁ, నాలే ఉమడ్ రహేహైఁ

---

1. మానవుడే మానవుని కొఱకు ప్రాణమర్పించును. మానవుడే మానవునిపై కత్తి విసరును. మానవుని మానవుడే అవమానించును. మానవుడే మానవుని ఎలుగెత్తి పిలుచును. ఆ పిలుపు విని పరుగెత్తువాడును మానవుడే.

[ఆద్మీ నామా (మానవుడు) అను పద్యము నుండి]

2. మేఘములు గాలిపై కైపెక్కి వ్యాపించుచున్నవి. జలధారలతో అల్లరి చేయుచున్నవి. నీరు ప్రతిచోట పడి స్థలమును జలముగా చేయుచున్నది. తోటలు తడియుచున్నవి. పచ్చికలు జలకమాడుచున్నవి. సఖులారా ! వర్షాకాలపు శోభ ఎంత గొప్పగా ఉన్నది.

బర్సేహైం మేహ్ ఝుడాఝుడ్, బాదల్ ఘుమడ్ రహేహైం
కాక్యా మచీహైం యారో బర్సాత్‌కీ బహారేం. 1
(బర్సాత్‌కీ బహార్)

బేరోజ్ గారీనే యె దిఖాయీహై ముఫ్లిసీ,
కోఠేకి ఛత్ నహీహై యె ఛాయీహై ముఫ్లిసీ,
దీవారో - దర్‌కే బీచ్ సమాయీహై ముఫ్లిసీ,
హర్ ఘర్‌మె ఇస్ తరహసే ఫిర్ ఆయీహై ముఫ్లిసీ,
పానీకా టూట్ జాయెహై జూం ఏక్ బార్ బంద్ 2

అబ్ ఆగ్రేమే జిత్నేహైం సబ్ లోగ్‌హైం తబాహ్
ఆతా నజర్ కిసీకా నహీ ఏక్ దమ్ నిబాహ్
మాంగో అజీజో ! ఐసే బురే వఖ్త్‌సే పనాహ్
వో లోగ్ ఏక్ కౌడీకె మొహతాజ్ అబ్‌హై ఆహ్
కస్బో హునర్‌కే యాద్‌హైం జిన్కో హజార్ బంద్ - 3

1. మురికినీటి కాలువలు తరగలెత్తు చున్నవి. నదులుప్పొంగు చున్నవి. నెమళ్లు, పపీహాలు ("పీకహాం" అని కూయు పక్షులు) కోయిలలు గుంపులు కూడు చున్నవి. పిచ్చుకలు అఱచుచున్నవి. కాలువలు పొరలి పారుచున్నవి. వర్షము ధారాపాతముగా కురియుచున్నది. మబ్బులు వ్యాపించుచున్నవి. సఖులారా ! వర్షాకాలపు శోభ ఎంత గొప్పగా నున్నది.
[బర్సాత్‌కీ బహార్ (వర్షాకాలపు శోభ) అను పద్యము నుండి]

2. నిరుద్యోగ మెంతటి పేదఱికము కలిగించినది ! ఇంటికప్పులేదు. గోడలకు తలుపులకు నడుమ దారిద్ర్యము తాండవించుచున్నది. అన్ని యిండ్లలో ఆనకట్ట తెగినంత జలము ప్రవేశించునట్లు దారిద్ర్యము ప్రవేశించినది

3. "ఆగ్రా"లో ఇప్పుడున్న వారందఱును నష్టపడినవారే. ఎవరును కోల్కొను మార్గము కనిపించదు. ప్రియ బాంధవులారా ! ఇట్టి పాడు సమయమునుండి రక్షకై భగవంతుని ప్రార్థింపుడు. అన్ని విధాల నేర్పరులైనవారు గవ్వకు గతిలేక యున్నారు.

సర్రాఫ్, బన్యే, జౌహరీ, ఔర్ సేఠ్, సాహుకార్,
దేతేథే సబ్కో నఖ్ద్, సో ఖాతేహై అబ్ ఉధార్,
బాజార్ మే ఉడేహై పడీ ఖాక్ బేషుమార్,
బైఠేహైఁ యూఁ దుకానోంపే అప్నీ దుకాఁదార్
జైసేకె చోర్ బైఠేహోఁ ఖైదీ ఖతార్ బంద్. 1

ఖిస్మత్ సే చార్ పైసే జిన్హే హాథ్ ఆతేహైఁ
అల్బత్తా రూఖీ సూఖీ వో రోటీ పకాతేహైఁ
జో ఖాలీ ఆతేహైఁ వో ఖరజ్ లేకే జాతే హైఁ
యూఁభీ నపాయా కుఛ్ తో ఫఖత్ గమ్కో ఖాతేహైఁ
సోతేహైఁ కర్ కి వాడ్కో ఎక్ అహ్మార్ బంద్– 2

జిత్నేభీహైఁ ఆజ్ ఆగ్రేమే కార్ఖానా – జాత్,
సబ్ పర్ పడీహై ఆఁకె రోజీకి ముష్కిలాత్,
కిస్కిస్కె దుఃఖ్కో రోయియ్యే ఔర్ కిస్కీ కహీయే బాత్,
రోజీకే అబ్ దరఖ్త్ క మిల్తా నహీహై పాత్,
ఐసీ హవా కుఛ్ ఆకె హువీ ఏక్ బార్ బంద్. 3

(షహర్–ఆషోబ్)

1. "సర్రాఫులు" (ఇచ్చి పుచ్చుకొను ఖజానాదారులు) కోమట్లు, నగల వర్తకులు, సేట్లు సాహుకార్లు అందఱకు "నగదు" వస్తువ లిచ్చువారు ఇప్పుడు "దిద్దెర"డిగి తినుచున్నారు. వీధులవెంట ధూళి ఎగయుచున్నది. దుకాణదారులు తమ తమ దుకాణములలో ఖైదీలు వరుసగా కూర్చున్నట్లు కూర్చున్నారు.

2. అదృష్ట వశమున నాలుగు పైసలు సంపాదించినవారు మాత్రము కలిగినంతలో ఎండు రొట్టె కొఱుక గలుగుచున్నారు. లేనివారు అప్పుచేతురు. అదియు దొఱకకున్న దుఃఖమును మ్రింగి నిట్టూర్చి కవాటము మూసి పడుకొనెదరు.

3. ఆగ్రాలోనున్న కర్మాగారము లన్నిటిపై ఆపదలు పడినవి. ఎవరి బాధకు ఏడ్వవలెను. ఎవరిమాట చెప్పవలెను? జీవిక అను చెట్టుయొక్క ఆకయినను లభించకుండ ఏదోగాలి వీచి కమించినది.

జబ్ ఆద్మీకె హాల్‌పే ఆతీహై ముఫ్లిసీ,
కిస్ కిస్ తరహాసే ఉస్కొ సతాతీహై ముఫ్లిసీ,
ప్యాసాతమామ్ రోజ్ బిఠాతీహై ముఫ్లిసీ,
భూకా తమామ్ రాత్ సులాతీహై ముఫ్లిసీ,
యే దుఃఖ్ వో జానె జిస్పేకి ఆతీహై ముఫ్లిసీ. 1

ముఫ్లిస్‌కి కుఛ్ నజర్ నహీ రహ్తీహై ఆన్‌పర్,
దేతాహై అప్నీ జాన్‌వో ఎక్ ఏక్ నాన్ పర్,
హర్ ఆన్‌టూట్ పడ్తాహై రోటీకీ ఖాన్ పర్,
జిస్ తరహా కుత్తే లడ్తేహై ఎక్ ఉస్తు ఖాన్ పర్,
వొసాహీ ముఫ్లిసోంకో లడాతీహై ముఫ్లిసీ. 2

(ముఫ్లిసీ)

హైరీతి జనమ్‌కీ యూం హోతీ జిస్ ఘర్‌మే బాలా హోతాహై
ఉస్ మండల్‌మే హర్ మన్ భీతర్ సుఖ్‌చైన్ దో బాలాహోతాహై
సబ్ బాత్ వ్యధాకీ భూలేహైం జబ్ భోలా భాలా హోతాహై
ఆనంద్ మండలీ బాజత్ హై, నిత్ భవన్ ఉజాలా హోతాహై
యూం నేక్ న ఛత్తర్ లేతేహై, ఇస్ దున్యామే సంసార్ జనమ్
పర్ ఉన్కే ఔర్‌హీ లచ్ఛన్ హైం, జబ్ లేతేహై అవతార్ జనమ్[3]

1. మానవునకు దారిద్ర్యము సంభవించునేని పలురీతుల బాధించును. పగలెల్ల దాహముతో తపింపజేయును. రాత్రి యంతయు ఆకట పడుకోబెట్టును. ఈ బాధ అనుభవించిన వారే గ్రహింపగలరు,

2. దరిద్రునకు అభిమానముండదు. రొట్టెముక్కలను ఆత్మాభిమానము నమ్మికొనును. ప్రతి క్షణము రొట్టెల గంపపై విరుచుకపడును. ఎమ్ముకై కుక్కలు పోట్లాడునట్లు దరిద్రము దరిద్రులను పోట్లాడించును.

[ముఫ్లిసీ (దారిద్ర్యము) అను పద్యమునుండి]

3. ఏ యింట శిశువు జన్మించునో ఆ యింటివారి హృదయములలో సుఖసంతోషము లినుమడించును - అమాయిక శిశువు జన్మించినంత అందఱును తమ వ్యధ మఱచిపోదురు. ఆనంద వాద్యములు చెలగును, భవనము నిత్యప్రకాశవంతమగును. మంచివారు మంచి నక్షత్రముననే జన్మింతురు. కాని అవతార పురుషుల జన్మకాల నక్షత్రమే వేరు.

శుభ్‌సా అత్‌సే యూఁ దునియామే అవతార్ గర్భమే ఆతేహైఁ
జో నారద్‌మునిహైఁ ధ్యాఁ భలీ సబ్ ఉస్కా ఖేద్ బతాతేహైఁ
వోనేక్ ముహూర్త్‌సే జిస్‌దమ్ ఇస్ సృష్టిమే జన్మే జాతేహైఁ
జో లీలా రచ్నీ హోతీహై, వో రూప్ యే దిఖ్లా జాతేహైఁ
యూఁ దేఖ్నేమే ఔర్ కహ్నేమే వో రూప్‌తో బాలేహోతేహైఁ
పర్ బాలేహీపఁమే ఉన్కే ఉపకార్ నిరాలే హోతేహై. 1
(జనమ్ కన్హయ్యాజీ)

ఈ సమయమున ఇంతకుమించి ఉదాహరణ లిచ్చుట సాధ్యపడదు. ఈ అధ్యాయమును ముగించుటకు ముందు ఒక విషయము తెల్పుట అవసరము. "నజీర్" ను గూర్చి ప్రత్యేకమగు అధ్యాయము వ్రాయుటకు కారణమేమన అతడు సంప్రదాయమును కొంత కొంత అనుసరించినను అతనిశైలి ప్రత్యేకమైనదే. అతనిని ఢిల్లీ కేంద్రమున కాని లఖ్నో కేంద్రమున కాని చేర్చుటకు వీలులేదు. అతడు నూత్నసంప్రదాయముల జన్మదాత. పదుగురు నడచిన బాటను విడిచి తానువైచిన మార్గమున నడచువాడతడు. అతడు జీవితమును గ్రహించుటకై దర్శనశాస్త్రమును కాని సంప్రదాయములను కాని ఆశ్రయించలేదు. తాను స్వయముగా జీవితములో లీనమై జీవించి ఇతరులెవ్వరును వ్రాయలేనిది వ్రాసెను. అతని కాలపు విమర్శకులు అతని కెట్టి ప్రాముఖ్యము నీయరైరి. అతని శైలి ఆనాడు ప్రచారము పొందలేదు. కాని నేడు అతని మహత్వము అంగీకరింపబడినది. వర్తమాన మహాకవులు "జోష్" మలీహాబాదీ, మఱియు, "ఎహసాఁ దానిష్" అతని మహత్వము నంగీకరించినవారే కాక అతనిచే ప్రభావితులు నేటి విమర్శకు లతనిని ఉన్నత శ్రేణిలో నిల్పినారు. ఎందుకన ఆధునిక దృష్టితో కవిత్వము మఱియు జీవితమునకు గల యెట్టి సంబంధమూ అన్వేషింపబడుచున్నదో దాని సుందరములగు ఉదాహరణములు "నజీర్" కవితలో కలవు. ఏ సంప్రదాయము ననుసరింపని యెడల సాహిత్యము పరిమిత క్షేత్రమున సీమితమై పోగలదో దాని పథప్రదర్శనము అతని కవితయే దివ్య రూపమున చేయగలిగియున్నది.

---

1. శుభ సమయమున అవతార పురుషులు గర్భస్థులగుదురు. ధ్యానపరుడగు నారదముని ఆ రహస్యము వెల్లడిచేయును. శుభ నక్షత్రమున జన్మించి తాము రచింపదలచిన లీల ఆ రూపముననే రచింతురు. చూచుటకు అనుటకువారు బాల రూపులే. కాని ఆ రూపముననే వారు చేయు ఉపకార కార్యములు అపురూపములు.

[జనమ్ కన్హయ్యాజీ (శ్రీకృష్ణుని జననము) అను పద్యమునుండి]

ఆ ర వ  అ ధ్యా య ము

## దిల్లీ అంతిమ ప్రతిభ

పదునెన్మిదవ శతాబ్దపు దిల్లీని గుఱించి చర్చించుచు సహస్రాధిక సమ్రాట్టుల రాజధానియగు ఈ నగరము పాడుపడుచున్నందున ఇచటి కవులును కళావేత్తలును అన్యప్రాంతములకు వలసపోవుచుండిరని తెల్పబడినది. మహాకవి 'మీర్', దిల్లీనే 'దిల్' (హృదయము) గా భావించి యిట్లు చెప్పెను :—

''దిల్‌కి వీరానీక క్యామజ్కూర్ హై
యే నగర్ సౌమర్త బాలూటా గయా.'' 1

దిల్లీ పాడువడియు మరల మరల పొందెను. నశించియు మరల మరల జీవించెను. ప్రతి శిశిరము తరువాత వసంతము వచ్చెను. కొన్ని సమయములలో పతన దశలోని దాని శోభయే ఉన్నతదశలోని శోభకంటె ఆకర్షణీయ మనిపించెను.

కవులు "అవధు" వైపు తరలి పోవుచున్నను దిల్లీలో కవితావాణి వినిపించు చుండెను. అయినను ప్రజలందఱు అవధుపైననే దృష్టి నిలిపిరి. దిల్లీలో మౌనము వ్యాపించగలదనియే అనిపించెను. కాని అస్థిరమగు ప్రశాంతత తరువాత తూఫాను చెలరేగునట్లు ఇచటి సాహిత్య స్రవంతులుఱికి ఉప్పొంగి పారెను. ఒక క్రొత్త మహాయుగము ప్రారంభమయ్యెను. నశించిపోవుచున్న మొగలు సామ్రాజ్యము తిరిగి కోలుకున్నదని దీని భావముకాదు. మొగలు సభ్యతలోని సౌందర్యము ఈ పతనదశ లోనే ఇనుమిక్కిలిగా వెలిగిపోయెను. ''జోఖ్", ''మోమిఙ్", ''జఫర్" మఱియు ''గాలిబు" లు ఉర్దూ సాహిత్యసాగరమున నెనలేని రత్నములనదగిన వారు. వారు కొడిగట్టిన దీప శిఖను ప్రజ్వరిలజేసి, ''మీర్", ''సౌదా", ''దరదు"ల వంటి మహా కవులు మొదలిడిన సంప్రదాయమును ప్రబలము చేసిరి. వ్యాప్తినొందించిరి.

---

1. "హృదయపు (దిల్లీయొక్క) భావశూన్యతను (నిర్మానుష్య స్థితిని) గూర్చి ఏమిచెప్పవలెను ? ఈ నగరము వందసార్లు దోచుకొనబడినది."

ఢిల్లీలోని పురాతన కవులలో "షాహనసీర్" ఒకడు. అతనికి ఈ యుగము ననే కీర్తి లభించుట వలన ఇచట పేర్కొనబడుచున్నాడు. అతడు ఢిల్లీ నివాసి. బాల్యము నుండియు కవితా రచన చేయుచుండెను- కొలది కాలముననే ప్రసిద్ధివడసి "షాహె ఆలమ్" ఆస్థానమునచేరి సన్మానితుడయ్యెను. అట్టి సన్మానము లోపించినంత ఢిల్లీని విడిచి రెండుతడవలు లఖ్నోకును, నాల్గుతడవలు హైదరాబాదుకును వెళ్ళెను. మొదటిసారి లఖ్నో వెళ్ళినప్పు డచట ఇన్షా, ముస్హఫీ మఱియు "జుర-అత్" లు పరస్పరము కలహించుకొనుచుండిరి. నసీర్ ఆ కలహమున పాల్గొనెను. రెండవ సారి వెళ్ళినప్పుడచట "నాసిఖ్" కీర్తి వ్యాపించియుండెను. కనుక అతనికి తగిన ఆదరము లభింపలేదు. హైదరాబాదలో దీవాన్ చందూలాల్ స్వయముగా మంచికవి. కవి పోషకుడు- అతడు 'నసీర్'ను ఆహ్వానించెను, నసీర్ ఆగమనమువలన హైదరా బాదలో ఉర్దూకవిత నూతనోత్సాహము పొందెను. అతడచటనే క్రీ. శ. 1835 లో మరణించెను. కావ్యసంగ్రహమచటనే ప్రకాశితమయ్యెను.

షాహనసీర్ భాష కఠినము. శైలికృతకము. అలంకారవ్యామోహమధికము. ఆ యలంకారములును కొన్నియెడల అర్థము కావు. అతనిపై లఖ్నో ప్రభావము కలదని కొందఱందురు. కాని అది సరికాదు. ఆరంభమునుండియు అతనిశైలి అట్టిదే. అతని కల్పనాశక్తి అత్యంతము. భావగాంభీర్య మత్యల్పము. ఆనాడతడు మహాకవి. కాని నేడతని కవిత అవాస్తవికము, నిస్సారము అనిపించును. కనుక దానికి చారిత్రక మగు విలువయే కాని సాహిత్యగౌరవములేదు. అతని శిష్యులలో జోఖ్ సుప్రసిద్ధుడు.

ఈ యుగమహత్వమునకు యధార్థకారకులు 'మోమిన్', 'గాలిబ్' మఱియు 'జోఖ్' అను మహాకవులు. వీరిలో సర్వశ్రేష్ఠుడు 'గాలిబ్'. కాని కొందఱు 'మోమిన్' గజలులే గొప్పవందురు. ఒకరిద్దరు 'జోఖ్'నే గొప్ప కవిగా గణింతురు. మోమిన్‌ఖాన్ మోమిన్‌హకీమీ(వైద్యవృత్తి)చేయుచుండెను. ఢిల్లీలోని ఒక ఉన్నత కుటుంబమున క్రీ. శ. 1800 లో జన్మించెను. అచటనే మతవిషయములను సాహిత్యమును అభ్యసించెను. గణిత, జ్యోతిషములలో నైపుణ్యము సంపాదించెను. కావ్య రచనలో సిద్ధహస్తుడయ్యెను. చదరంగమాడుటలో చతురుడు. సంగీత శాస్త్రముతో గాఢపరిచితి కలవాడు. కలవారి కుటుంబమున పుట్టుట వలన భోగవిలాసములకు వెలితిలేకుండెను. కవితను జీవనోపాధికై ఆశ్రయింపలేదు. రాజదర్బారుల సమీపము నకు వెళ్ళలేదు. ఎవరిని ప్రశంసించలేదు. 'పటియాలా' మహారాజొక ఏనుగును బహూకరించి నపుడు మాత్రమతని ప్రశంసలో ఒక 'ఖసీదా' వ్రాసెను. కొన్ని

ఖసీదాలు ప్రవక్తలగూర్చి వ్రాసెను. శృంగార రసమయములగు కొన్ని మస్నవీలు రచించెను. ఆ ప్రేమ కథలు భావుకతతో నిండినవి. కొన్ని వర్ణన లసభ్యమయినవి కూడను. యౌవనమున అతడు స్త్రీలోలుడగుటయే అందుకు కారణమందురు. చివరి కాలమున ధార్మిక జీవనము గడపెను. క్రీ. శ. 1851 లో మరణించెను.

మోమిన్ రచనలలో ఉర్దూ కావ్యసంగ్రహమే కాక ఒక ఫారసీ కావ్యసంగ్రహమును, ఒక ఫారసీ గద్యగ్రంథమును కలవు. అతని ఖ్యాతికి గజలులే కారణములు. అవన్నియు శృంగారరస తరంగములు. ఈ పరిమిత పరిధిలో అతని మనోభావములు క్రొంగ్రొత్త పోకడలు పోయినవి. అతని భావములలో సహజత్వము కలదు. కాని గాంభీర్యములేదు. 'జుర-అత్' మొదలగువారి సంప్రదాయమునే అతడవలంబించె ననవచ్చును. అక్కడక్కడ అశ్లీలతయు గోచరించును. అతని ప్రేమ భావములు కామ వాసనతో కూడిన మానసిక వికారములు. వానిలో పవిత్రత లేదు, ఉదారతలేదు. యౌవనమున ఒక వేశ్యతో అతనికి సంబంధముండెనందురు. అదియే అతని కవితలో ప్రతిబింబించును.

మోమిన్ భాష ఫారసీ పదబాహుళము- అలంకార భూయిష్ఠము. శైలి జటిలము- ఇతర కవుల శైలికంటె భిన్నము- సాధారణ భావప్రకటన చేయుటకును అసాధారణమగు కాఠిన్యము కూర్చును. కొన్ని సందర్భములలో అతడనని విషయములు చాలవఱకు మనమూహించి కలుపుకొనిన గాని అతని పద్యములు బోధపడవు. అయినను అతని గజలులు మనోహరములు, రమ్యములు అనుటలో సందేహము లేదు. ఉదాహరణమునకొక కొన్ని పద్యపాదములు :—

> "సహర్ సే షామ్ తక్ తుఝ్‌బిన్ యహీహాలత్ రహీ దిల్కీ
> న ముఝ్‌కో చైన్ దేతాహై న ఆప్ ఆరామ్ లేతా థా
> నమానూంగా నసీహత్ పర్ నసున్తా మైతో క్యాకర్తా
> కెహర్‌హర్ బాత్ పర్‌నాసెహ్ తుమ్హారా నామ్ లేతాథా". 1

*　　*　　*　　*　　*

1. నీ విరహమున నా హృదయము ఉదయమునుండి సాయంకాలము వఱకు నాకు స్తిమితము కలిగించదు ; తాను పొందదు.

ఉపదేశకుడు ప్రతిపలుకున నిన్ను పేర్కొను చున్నందున అతని ఉపదేశము నంగీకరింప కున్నను వినక యెట్లుందును ?

''కుఛ్ ఖఫస్‌మే ఇన్‌దినోఁ లగ్‌తాహైజీ
ఆషియా అప్నా హువా బర్బాద్ క్యా. 1

*    *    *    *

జానేదె చారగర్ ! షబె హిజ్రాఁ మెమత్ బులా
వో క్యాం షరీక్ హో మెరే హాలే-తబాహ్ మేఁ. 2

*    *    *    *

అసర్ ఉస్కో జరా నహీ హోతా
రంజ్ రాహత్ - ఫిజా నహీ హోతా
తుమ్ హమారే కిసీ తరహ న హువే
వర్నా దునియామే క్యా నహీ హోతా
తుమ్ మెరే పాస్ హోతే హో గోయా
జబ్ కోయీ దూస్రా నహీ హోతా. 3

*    *    *    *

బర్క్ కా ఆస్మాఁ పర్ హై దిమాగ్
ఫూంక్ కర్ మేరే ఆష్యా నేకో. 4

*    *    *    *

---

1. నా గూడు కూలిపోయినదా యేమి ? ఇప్పుడు మనసు చెఱలోనే లగ్నమైనది.

2. వైద్యుడా ! పోనిమ్ము - విరహ నిశిలో ఆమెను పిలువకుము- నా దుస్థితిలో ఆమె ఎందుకు పాల్గొనవలెను ?

3. ఆమె పట్టించుకొనునది కాదు. వ్యాకులత సుఖకరము కాదు. నీ వే విధమునను నా దానవు కాలేదు కాని, అయిన నిక ప్రపంచములో కాజాలనిదేమి? —— ఎవరును లేనప్పుడు నీవు నా చెంతనుందువు.

4. నా గూటిని కాల్చినంత విద్యుత్తు ఆకసమున తిరుగుచున్నది. (గర్వించుచున్నదని జాతీయము)

యె హాలత్ హైతో క్యాహో సిల్ బయాఁసే
కహూఁకుఛ్ ఔర్ కుఛ్ నిక్లే జబాఁసే
వో ఆయేహైఁ పషీమాఁ లాష్ పర్ అబ్
తుఝే ఐ జిందగీ లావూఁ కహాఁసే. 1

ఈ యుగపు సుప్రసిద్ధ కవులలో 'షేఖ్ మొహమ్మద్ ఇబ్రాహీమ్ జోఖ్' ఒకడు. అతడు క్రీ. శ. 1789 లో ఒక బీద సిపాయీ యింట జన్మించెను. విద్యార్థి దశలోనే కవితా రచన చేయసాగెను. ఆనాడు దిల్లీలో షాహ నసీర్ ప్రఖ్యాతుడు. జోఖ్ అతని శిష్యుడయ్యెను. నసీర్ శిష్యుని ప్రతిభను చూచి తన కీర్తి సన్నగిలు నేమో అను సంశయమున తప్పించుకొన జూచెను. అది గ్రహించి జోఖ్ స్వయం కృషి వలననే అచిరకాలమున సుప్రతిష్ఠితుడయ్యెను. మొగలు యువరాజు బహాదుర్‌షా అతనిని తన గురువుగా నియమించుకొనెను. అప్పుడు జోఖ్ వయము ఇరువదేండ్లు. ఆ యల్ప వయస్సున పాదుషా ప్రశంసలో వ్రాసిన ఖసీదా వలన "ఖాఖానియే-హింద్" అను బిరుదుపొందెను. బహాదుర్‌షా చక్రవర్తియైనంత 'జోఖ్' అతని ఆస్థానమున కవి రాజయ్యెను. నెలకు వందరూయల వేతనము నిర్ణయింపబడెను. అతడు అనేక సందర్భములలో అనేకములగు ఖసీదాలు వ్రాసి జాగీరుగా గ్రామములును ఇతర పురస్కారములను పొందెను. క్రీ. శ. 1854 లో ఆ మహాకవి మరణించెను.

దిల్లీలో జోఖ్ శిష్యులనేకులు. వారిలో 'జఫర్', 'ఆజాద్', 'దాక్' 'అన్వర్', 'జహీర్', 'మారూఫ్' మఱియు 'వీరాన్' ముఖ్యులు. అతడు తన జీవితమంతయు దిల్లీలోనే గడపెను. మహారాజా చందూలాల్ అతనిని హైదరాబాదకు ఆహ్వానించినను వెళ్లలేదు. అతడిట్లనుకొనెను :—

గర్చెహై ముల్కె దకన్ మేఁ ఇన్ దినోఁ ఖదరే-సుఖన్,
కౌన్ జావే "జోఖ్," పర్ దిల్లీకి గలియాఁ ఛోడ్‌కర్. 2

1. అనబోయిన దొకటి నోట వెడలిన దొకటి - ఇట్లయిన నేను అనుట వలన లాభమేమి? ఆమె పశ్చాత్తప్తయై నా శవము జూడవచ్చినది. ఓ జీవితమా! నిన్నిక ఎచటనుండి తెత్తును?

2. ఈ దినములలో దక్షిణదేశమున సాహిత్య గౌరవమున్నది. కాని దిల్లీ వీథులను విడిచి యెవరంత దూరము వెళ్లగలరు?

'జోఖ్' కావ్యసంగ్రహ మొకటే లభ్యము. అందు అధికముగా ఖసీదాలు మఱియు గజలులు కలవు. 'సౌదా' తరువాత అతడే గొప్ప ఖసీదా రచయిత. విమర్శకు లీ యిరువుర ఖసీదాల తులనాత్మక విమర్శ చేసిరి. సౌదాస్థాయి ఉన్నత మని అందఱు నంగీకరించిరి. 'జోఖ్' తన ఖసీదాలన్నిటిని పాదుషాల ప్రశంసలోనే వ్రాసెను. అతడు గొప్ప విద్వాంసుడు. విజ్ఞాన ఖని. అట్లగుట అతని ఖసీదాలు ఉత్కృష్టమైనవే అనిపించును. కాని ఇతివృత్తము బలహీనులగు పాదుషాల అసత్య ప్రశంస కనుక నిర్జీవములు. ఫారసీ మహాకవులును ఉర్దూ కవులును కావ్యరచనా పాటవమునకు, పాండిత్య ప్రకర్షకు ఖసీదాలే గీటురాళ్ళని భావింతురు. కాని భావము ననుసరించి చూచిన అవి కృత్రిమ కావ్యరూపములు. మాట నుండి మాట పుట్టును. కనుక శబ్దప్రయోగముపైనే ఖసీదారచయితల ధ్యాస. మనోభావములకు ప్రాముఖ్య మీయరు. అందువలన ఖసీదాలు వ్రాయు వారి గజలులలో కావలసిన భావుకత, ఆవేశము మఱియు హార్దికవ్యథ కన్పించవు.

'జోఖ్'కు కల ప్రతిష్ఠ, అతని స్వాభావిక నమ్రత, అతని భాషలోని సారళ్య మును చూచి కొందఱు అతనిని 'గాలిబ్' కంటె గొప్ప కవి యని తలంచిరి. అది సత్యదూరము. జోఖ్ శిల్పము చాలవఱకు శబ్దాడంబరము మఱియు అలంకారము లపై ఆధారపడియున్నది. కవిత్వమునకు మూలపదార్థమగు భావన అతనిలో అత్యల్పము. అతని కవితహృదయమునకు ఉద్వేగము కలిగింపదు. వేడి పుట్టింపదు. కాని అతని కవిత సమస్తము పనికి మాలినదని భావింపతగదు. అతడు 'వస్తాదు' అనతగిన మహాకవి. భాషపై అధికారము కలవాడు. కావ్యశాస్త్రమున పండితుడు. జీవితములోని సామాన్యసమస్యలను నైతికముగా ప్రదర్శించగలవాడు. అతని స్వభావ సరళత, అతని సహృదయత అతని ఉత్తమ కవితలలో కాననగును. ఉర్దూ భాషను విశుద్ధరూపమున చూడదలచిన వారు 'జోఖ్' కవితల వలన అవశ్య ముగా ఆనందము పొందగలరు. అతని పద్యపాదములు కొన్ని :—

కహ్తేహైఁ ఆజ్ ''జోఖ్'' జహాఁసే గుజర్ గయా
హాఖ్ మగ్ఫరత్ కరే అజబ్ ఆజాద్ మర్ద్ థా. 1

* * * *

1. ప్రజలందురు; "నేడు జోఖ్ ప్రపంచమును విడిచి పోవుచున్నాడు. స్వతంత్ర పురుషు డతడు. భగవంతుడు మోక్షమొసగుగాక.

కిసీ బే కస్‌కు ఐ బే దాద్‌గర్ మారాతో క్యా మారా.
జో ఆపీ మర్‌రహాహో ఉస్కో గర్ మారాతో క్యామారా.
గయా శైతాన్ మారా ఏక్‌సిజ్దేకే న కర్నే సే
అగర్ లాఖోఁ బరస్ సిజ్దేమె సర్ మారాతో క్యా మారా : 1

*  *  *  *  *

అబ్‌తో ఘబ్రాకె యె కహ్తేఁ కె మర్ జాయేంగే
మర్‌కే భీ చైన్ న పాయా తో కిధర్ జాయేంగే. 2

*  *  *  *

ఆద్మియ్యత్ ఔర్ షై హై ఇల్మ్‌హై కుఛ్ ఔర్‌షై
కిత్నతోతే కో పఢాయా పర్‌వా హైవాఁహీ రహా. 3

*  *  *  *

కియా హమ్నే సలామ్ ఐ ఇష్క్ తుఝ్కో
కి అప్నాహో స్లా ఇత్నా నపాయా. 4

*  *  *  *

---

1. ఓ క్రూరుడా : తనకు తానే చచ్చిపోవు దీనుని చంపి ఏమి సాధించితివి ? శైతాను ఒక సిజ్దా (తల నేలమోపుట) చేయనందున నష్టపడెను. ఇప్పుడు లక్షల సంవత్సరములు తల కొట్టుకొనిన నేమి సాధించును ?

(అగ్నితో తయారయిన శైతానును మట్టితో తయారైన మానవుని ముందు తలవంచుమని ఈశ్వరు డాజ్ఞాపించెను. అట్లు చేయక శైతాని అతని కోపమునకు పాత్రమయ్యెను.)

2. ఇప్పుడు భయపడి చచ్చిపోయిన బాగుండునందురు. చచ్చియు శాంతి పొందలేకున్న నెటు పోగలరు ?

3. మానవత వేరు. విద్యవేరు. చిలుక నెంత చదివించినను అది జంతువే. (పక్షియే.)

4. ఓ ప్రణయమా : నీ కొక నమస్కారము. నా కంతటి సాహసము లేదు.

ఐషమ్మ తేరి ఉమ్రెతబాయీ హై ఏక్ రాత్
హన్స్కర్ గుజార్ యా ఇసె రోకర్ గుజార్ దే. 4

* * * *

ఎహసాన్ నా ఖుదాక ఉఠాయే మెరీబలా
కిష్తీ ఖుదాపె ఛోడ్దూం లంగర్కు తోడ్దూం. 5

* * * *

ఉల్ఫత్క నషా జబ్ కోయీ మర్ జాయెతో జాయే
యే దర్దెసర్ ఐసాహైకె సర్ జాయెతో జాయే. 6

* * * *

తుమ్ భూల్కర్ భీ యాద్ నహీ కర్తే హోగోయా
హమ్‌తో తుమ్హారీ యాద్‌మే సబ్‌కుఛ్ భులాదియా. 7

* * * *

ఈ యుగముననే కాదు. ఉర్దూ సాహిత్య చరిత్ర మొత్తమున వీను మిగిలిన మహాకవి 'మీర్జాగాలిబ్'. పద్యరచనలోనే కాక గద్యరచనలోను అతడు అసమానుడు. ఫారసీ భాషలోను మహాకవి. అతని కవితలో మొగలు సభ్యతలోని మంచి చెబ్బర లన్నియు కలవు. ఆ సభ్యత కతడు ప్రతీక. ఏ దృష్టితో చూచినను అతడు ప్రతిభా శాలియగు పురుషుడు. కనుకనే నాటి నేటి విమర్శకులెందరో అతనిగూర్చి అనేక వ్యాసములను ఉద్గ్రంథములను వ్రాసినారు.

అతని పేరు "ఖ్వాజా అసదుల్లా" ఇంటిలోని పేరు "మీర్జానౌషా". మొగలు రాజ్యమనికి 'నజముద్దౌలా', 'దబీరుల్ముల్క్' మఱియు 'నిజామ్‌జంగ్' అను బిరుదు

---

4. ఓ దీపమా ! నీ జీవిత కాల మొక రాత్రి. దీనిని నవ్వుచు గడపుము. లేదా ఏడ్చుచు గడపుము.

5. నా బరువు బాధ్యతలను భగవంతుని అనుగ్రహానికి వదిలివెయ్యక, పడవను వదిలివేస్తాను-లంగరుని కోసివేస్తాను.

6. ప్రేమపిచ్చి చచ్చిన పిదపనే పోవును. ఈ తలనొప్పి తలపోయిననే పోవును.

7. మేము నీ స్మృతిలో సమస్తము మఱచితిమి నీవు మఱచియైన మమ్ము స్మరింపవు.

లిచ్చి గౌరవించెను. గాలిబ్ క్రీ. శ. 1797 లో ఆగ్రా పట్టణమున జన్మించెను. ఐదేండ్ల ప్రాయమున తండ్రి మరణించెను. తండ్రి మహారాజా 'అల్వర్' సేనలో ఉన్నతోద్యోగి. గాలిబ్ పినతండ్రి ఆశ్రయమున పెరిగెను. నాలుగేండ్ల తరువాత ఆ పినతండ్రియు మరణింపగా తల్లితండ్రి యింట నివసించెను. అతని నూత్న యౌవనము భోగవిలాసములలో గడచెను. పదమూడేండ్ల వయమున ఢిల్లీలోని యొక్క కులీనుల యింటి కన్యతో వివాహమయ్యెను. తన వివాహమును గుఱించి తరువాత ఒక లేఖలో "పదుమూడేండ్ల వయముననే కాళ్ళకు బేడీలు పడినవి" అని వ్రాసెను. వివాహానంతరము ఢిల్లీలోనే స్థిరపడెను. ఉత్తరములలో తన వంశము, బాల్యము, ఆగ్రానివాసము, విద్యాభ్యాసము, వివాహము మొదలగు వానిని రమ్యముగా తెలియజేసెను.

ఆగ్రాలో నున్నప్పుడే గాలిబ్ కవితారచన కుపక్రమించెను. ఆనాటి కవిత ఫారసీలోనే అధికము. అతనికి ఆ భాషపై అభిమాన మతివేలము. ఈరానునుండి "అబ్దుస్సమద్" అను ఫారసీ విద్వాంసు డొకడు వచ్చి ఆగ్రాలో నివసించుట తటస్థించెను. గాలిబ్ అతని కడ ఫారసీభాష అభ్యసించెను. ఢిల్లీ చేరిన పిదప సుశిక్షితులగు ఉన్నతశ్రేణివారి సహవాసముననుండు అవకాశము లభించెను. అతడు స్వయముగా (టర్కీ) తుర్కిస్థానులోని "సల్జూఖీ" రాజవంశమునకు చెందినవాడు. ఈ విషయము చాలసార్లు చెప్పికొనెను. అతని శరీరములోని ప్రతి రక్తనాళమున గొప్ప సమ్రాట్టుల యొక్కయు విజేతల యొక్కయు రక్తము ప్రవహించుచున్నదని భావించుచుండెను. కనుక సత్కార సన్మానముల కొఱకు కవిత నవలంబించుట అతని అభిమతము కాదు. అతడెంత వఱకు విద్య గడించెనో నిశ్చిత ముగా చెప్పరాదు. కాని అతని రచనల వలన, అతడు శతాబ్దముల తరబడి ముస ల్మానులకు ఆవశ్యకములైన సమస్త విద్యలలో పారంగతు డయ్యెనని తెలియును. కనుకనే ఇరువదొక సంవత్సరముల వయముననే ఢిల్లీలోని విద్వాంసులలో, కవు లలో గణుతికెక్కెను.

ఢిల్లీలో గాలిబ్ అనేక కష్టములను ఎదుర్కొనవలసి వచ్చెను. అన్నిటికంటె పెద్దది అర్థిక లోపము. అతని పినతండ్రి ఉపకార వేతనము ఎందఱో బంధువులలో విభజింపబడుచుండెను. ఏవోకారణముల వలన "గాలిబు"కు రావలసిన భాగము రాకుండెను. తన భాగము పొందుటకై ముప్పదేండ్ల వయమున కలకత్తాకు వెళ్ళి మూడేండ్లు అట నివసించెను. కలకత్తా ప్రయాణము ఎన్నియో అనుభవములు

కల్గించెను. లఖ్నో, బనారస్ మఱియు కలకత్తాలోని కవులతోను రచయితలతోను అతనికి పరిచయ మేర్పడెను. అచటి సాహిత్యచర్చలలో పాల్గొనెను. బంగాళముపై ఈస్టిండియా కంపెనీ అధికారము పొందుట వలన కలకత్తాలో ఏర్పడిన నవజీవనము దర్శించెను. ఆ నూత్న జీవితముతో పరిచయము గల కవి ఆనాటి కవులందఱలో "గాలిబ్" ఒక్కడే. కలకత్తాలోని నవజాగృతిని చూచుట మాత్రమేకాదు గ్రహించుటకును ప్రయత్నించెను. పెన్షన్ భాగము పొందుటలో కృతకృత్యుడు కాలేదు కాని, ఆ ప్రయాణము వలన దేశవ్యాప్తముగ సాగుచున్న సాహిత్య ప్రవృత్తుల నవగాహన చేసికొనుటలో కృతకృత్యు డయ్యెను. క్రీ. శ. 1850 లో గాలిబ్ మొగలు వంశ చరిత్ర వ్రాయుటకు నియుక్తు డయ్యెను. శుద్ధ ఫారసీలో "మెహరె - నీమ్‌రోజ్" అను పేర ఒక భాగము వ్రాసెను. అది అతని జీవిత కాలముననే ప్రకాశితమయ్యెను. "జోఖ్" మరణించిన తరువాత బహదుర్‌షాహ "జఫర్" గురువుగా నియుక్తు డయ్యెను. కాని రెండేండ్లలోనే సుప్రసిద్ధ విప్లవము జరిగెను. మరల అతనికి కష్టకాలము ప్రాప్తించెను. కొంతకాలము ఇంటిలోనే నివసించి ఫారసీ భాషలో ఒక "డైరీ" వ్రాసికొనెను. దానివలన ఆనాటి విశేషము లెన్నియో తెలియును. తన మిత్రులకును శిష్యులకును వ్రాసిన ఉత్తరములలో భారతదేశ దుర్దశను గూర్చి వాపోయెను. సామ్రాజ్యములు నశించునవియే అని అతడు మొదటినుండియు తలంచినట్లే తోచును. మొగలు రాజ్యము నశించినందువలన అతనికి విశేష దుఃఖము కలుగలేదు. ఆ దీపము ఏ విధముననైన ఇక ఆరిపోవునదే అని అతడు భావించెను.

క్రీ. శ. 1859లో అతనికి రామపూర్ రాజదర్బారుతో సంబంధము కలిగెను. అచటినుండి ఆమరణము నెలకు వంద రూపాయలు లభించుట వలన కొంత శాంతి చేకూరెను. అతని మిత్రులును, శిష్యులును సహాయ పడుచుండి, తన అవసరములను వారి కెప్పుడును తెల్పుచుండెడివాడు. గాలిబ్ క్రీ. శ. 1869 ఫిబ్రవరి మాసములో తన (73) ఏండ్ల వయమున మరణించెను.

మీర్జాగాలిబ్ స్వభావమున గల విశేషములు ఇతరులలో అరిది. తీవ్రమగు బుద్ధి, మాట నుండి మాట పుట్టించు నేర్పు, హాస్యప్రియత్వము, జీవిత బాధలను సహించు ఓర్పు, విజ్ఞానము, సహృదయత, ఆత్మాభిమానము, నమ్రత, క్రొత్త విషయములను స్వీకరించు జిజ్ఞాస, మైత్రిని నిల్పుకొను శక్తి, ప్రేమపాత్రుడగుటకు తగిన ప్రవర్తన - ఇవన్నియు అతనిని లోకప్రియుడగు మహావ్యక్తిగా చేసినవి. పాదుషాలనుండి తపాలబంట్రోతువఱకు అతనికిపరిచితులు. అతడు తన లోపములను

కప్పిపుచ్చుకొనుట కెప్పుడును ప్రయత్నింపడు. మద్యపానరతుడు. మతవిష యికములగు బాహ్యాడంబరములను ఏవగించుకొనువాడు. అతని హృదయము మానవతా ప్రేమ భరితము. మానవుల సుకుమార భావములను, వారి సుఖదుఃఖము లను, అవసరములను బాగుగా గుర్తించినవాడు. జీవితములోని జటిల సమస్యల నతిసుందరముగా తన కవితలో ఉల్లేఖించును. అతడు తన కవితలో వెలువరించిన భావములను పఠితలు తమ హృదయ భావములే అని తలంతురు. భారతీయులతోనే కాక అతడు ఆంగ్లేయులతోను మైత్రిచేసెను. వారిలో అనేకులతని శిష్యులు. అతనిలో సంకుచితత్వమే కోశమునను లేకుండెను. జాతి మత భేదములు లేక అందఱతో సమానముగా ప్రవర్తించుచుండెను. ఆ సమానత అతని కవితలో సర్వత్ర దర్శ నీయము.

గాలిబ్ రచన లనేకములు. అతని చిన్న చిన్న రచనలును నేడు వెదకి వెదకి వెలికి తీయబడుచున్నవి. ఆ రచనల గూర్చి పుస్తకములపై పుస్తకములు వ్యాసములపై వ్యాసములు వ్రాయబడుచున్నవి. ఇట్టి ప్రాముఖ్య మొక గాలిబ్ రచన లకే కలిగినది. ఒక ఉర్దూ కావ్యసంగ్రహము, ఉత్తరముల సంగ్రహము లనేకము లభించినవి. అవికాక రెండు మూడు చిన్న పుస్తకములును దొఱకినవి. ఫారసీలో అనేక గద్య రచనలు, కొన్ని పుస్తకములు దొఱకినవి. ఉర్దూ కావ్యసంగ్రహమును తన ఇరువొకటవయేటనే తయారు చేసెను. ఇచట అతని నొక ఉర్దూ కవిగానే పరిచయము చేయబడును. లేదేని చాల విపులముగా వ్రాయవలసి యుండును. ఈ సంక్షిప్త చరిత్రలో అది అసాధ్యము.

గాలిబ్ కవితాశైలి వివిధము. ప్రారంభమున అతనికి ఫారసీ భాషపై మమకార మధికము. ఆనాటి కవిత ఫారసీకి సన్నిహితము. జటిలములగు ఆధ్యాత్మిక విషయముల నభివర్ణింపదగిన శక్తి ఉర్దూభాషకు లేదని అతని అభిప్రాయము. ఒక ఫారసీ పద్యమున తన కవితను గూర్చి ఇట్లు చెప్పెను; "నా కవిత వలన ఆనందము పడయగోరువారు నా పారసీకవితను చదువవలెను. ఉర్దూకవిత నీరసము; నిస్సారము" కాని ఈ సందర్భమున గాలిబ్ పొరపడినాడు. నేడతని ఉర్దూ కావ్యమును ప్రజ లెంతటి ఉత్సాహముతో చదువుచున్నారో ఫారసీ కావ్యమును చదువరు. ఫారసీ మహాకవి "బేదిల్"ను ఉర్దూలో అనుకరించెను. ఆనాటి అతని కవితలో స్వల్ప భాగము మాత్రమే బోధపడును. ఇరువదైదేండ్ల వయమున అతడు తన శైలిని మార్చుకొనెను. కేవల కల్పనలనువిడచి తనకు అనుభూతములగు జీవితసమస్యలను

చిత్రింపసాగెను. అతని ఉత్ప్రేక్ష, ఉపమాద్యలంకారములు నవీనములు. కల్పనా శక్తి అతిమాత్రము. సంబంధము లేని విషయములలో సంబంధమును సమానతను సాధింప జూచును. కాలము గడచిన కొలది అతని కవితలో తాత్త్విక గాంభీర్యము కళాత్మక సౌందర్యము ప్రవృద్ధమగు చుండెను.

అతడు సామ్రాజ్యకాలపు సభ్యతలో పుట్టి పెరిగిన వాడనుటలో సందేహము లేదు. దానికి సంబంధించిన మంచి చెడ్డలతనిలో నుండెను. కాని అతని జ్ఞాననేత్రము వివృతము. ఇతరు లెవరును కనుగొనలేని జీవిత సత్యముల నతడన్వేషించును. మారిపోవుచున్న లోకమును చూచి "కాలము మారుచున్నది. మారుట సహజము" అని గ్రహించెను. కాని చరిత్రకు సంబంధించిన దార్శనిక దృక్పథము లేనివాడగుట భవిష్యన్నిర్మాణమును గూర్చి ఏ మాటయు చెప్పలేక పోయెను. పతనావస్థతోనున్న సభ్యత కతడు ప్రతీక. అతని కవితలో ఎంతటి సౌందర్యమున్నను నిరాశ, భయము తాలూకు తెర అస్పష్టముగా దానిపై ఆవరించియే యున్నది. అతని కవితలో నిరాశా వాదమునకు కొదువలేదు. అయినను జీవితములోని సారమంతటిని గ్రహించి అనుభవింపవలెనను ఆశావాద ప్రచారమునకు కొఱతలేదు.

పైన చెప్పినట్లు అతనిలో సంకుచితత్వము లేకుండెను. మతసంబంధములగు భేదభావములు అతనిముందు తుచ్ఛములు. సానుభూతి మఱియు మానవప్రేమనే శ్రేష్ఠ ధర్మమని భావించువాడతడు. అతనికి షేఖ్ మఱియు బ్రాహ్మణుల తారతమ్యము కన్పించదు. తమ మతముపై విశ్వాసము కలవారు, తమతమ మార్గముల ననుసరించి సత్యాన్వేషణచేయువారు ఎవరైనను అతనికి సమానులే. అతని మిత్రుల లోను, శిష్యులలోను హిందువులు క్రైస్తవులు కలరు. వారిని మఱియు ముసల్మానులను సమదృష్టి జూచువాడు. అనగా అతడు సాంఘిక నైతిక వ్యవస్థను, మత ధర్మములను ఉల్లంఘించినవాడని తాత్పర్యము కాదు. సూఫీ తత్త్వ పరిపూర్ణజ్ఞాన మతనిలో అట్టి సామరస్యము కలుగజేసినది.

గాలిబ్ కవితలో తత్త్వముతో మేళవించిన కల్పనకలదు. అతని పద్యములు కఠినములు. అయినను బాణములవలె హృదయమున నాటుకొనును. పద్యరచనలోను గద్యరచనలోను అతని మార్గము ప్రత్యేకము. అతని జీవితము విచిత్రమైనది. అతని రచనలట్లే చిత్రమైనది. గాలిబ్ ఉర్దూలో కొన్ని ఖసీదాలు వ్రాసెను. గజలు లధికముగా వ్రాసెను. ఖసీదాలు ఈరాను కవుల శైలిలో వ్రాయుట సంప్రదాయము. ఏ మాత్రము మార్పుచేయుటయు అనుచితమని అప్పటి వారి అభిప్రాయము.

అయినను గాలిబ్ తన ఖసీదాలను క్రొత్త త్రోవ పట్టించెను. గజలు రచనలో అనేక ప్రయోగములుచేసి అనుపమమగు నవ్యత సాధించెను. అతని ఉర్దూ కావ్యసంగ్రహ మతి సంక్షిప్తము. మిత్రుల సలహా ననుసరించి ఫారసీ మిశ్రితములును, సుబోధక ములు కానివియు నగు పద్యము లనేకము తొలగించినందున అట్టి సంక్షిప్తత కలిగి నది. ఈ సంగ్రహమును గూర్చి ఒక విమర్శకుడు[1] ఇట్లనెను. "నూరు కమ్మలకు మించని ఈ గ్రంథమున లేనిదేమి? ఈ జీవితతంత్రులలో స్పష్టముగానో అవ్యక్తము గానో ధ్వనింపని రాగమేది?" అతని కవితలో, భావుకత, వాస్తవికత, నవీనత దార్శనిక గంభీరత, సుందరశైలి, ఈ గుణములు ఒకదానితో ఒకటి కలిసియున్నవి. అతనికి సమానుడన దగిన కవిలేడు. ఇంతవఱకు అతనిని గూర్చి వ్రాయబడిన గ్రంథములలో ఒకటి రెండు తప్ప అన్నియు ఆతని ప్రశంసలతో నిండినవే. సామ్రాజ్య సభ్యతయొక్క పతనమును విశ్లేషించు కవిగా అతనిని కొందఱే చిత్రిం చిరి. జీవితమును ఉల్లాస విలాసములతో గడపు ఇచ్ఛ అతనికి ప్రబలము. కాని ఆ యుగమందుకు బాధకము - వ్యక్తిత్వమునకు పతనశీలమగు సమాజమునకు కలిగిన సంఘర్షణయొక్క 'సుందర చిత్రము లతని కవితలో చూడనగును. అతని కవిత తాత్త్వికాదర్శముల ప్రచారము చేయదనుట సత్యము. కాని జీవితములోని గొప్పతనమును, ప్రాబల్యమును, సౌందర్యమునుగూర్చి గానము చేయుచు బ్రదుకుపై ప్రేమ కలిగించును. జీవితపు లోతు లెఱుగ దలచినవారు గాలిబ్ కవితలు చదువ వలయును.

ఉదాహరణ కొఱకు అతని కొన్ని పద్యములు:—

"యేనధీ హమారి ఖిస్మత్ - కె - విసాలె యార్ హోతా"
అగర్ ఔర్ జీతెరహెతే - యెహి ఇంతెజార్ హోతా
యెకహాఁ కి దోస్తీహై - కె బనేహైదోస్త్ నాసేహ్
కోయీ చారసాజ్ హోతా - కోయీ గమ్ గుసార్ హోతా 2

1. డా. అబ్దుర్రహమాన్ 'బిజనౌరీ' తన "మహాసిసె-కలామె-గాలిబ్" లో ఇట్లు వ్రాసెను.

2. మా అదృష్టమున ప్రియురాలి సంయోగము లేకుండెను. ఇంకను జీవించియుండిన ఎదురు చూపు మాత్రమే దొఱకెడిది.

ఉపదేశకుడు మిత్రుడైనాడు. ఇదెక్కడి మైత్రి? ఒక వైద్యుడో లేక దుఃఖమును పంచు కొనువాడో లభించవలసియుండెను.

కిస్‌సే మహరూమియె, ఖిస్మత్‌కి షికాయత్ కీజే
హమ్‌నే చాహాథాకె మర్‌జాయెం సోవోభీన హువా 1

* * * *

జిందగీ యూం భి గుజర్ హీ జాతీ
క్యోం తేరా రాహగుజర్ యాద్ ఆయా !
కోయీ వీరానీ సీ వీరానీ హై
దస్త్‌కో దేఖ్‌కే ఘర్ యాద్ ఆయా ! 2

* * * *

వో ఆయే ఘర్‌మె హమారే ఖుదాకి ఖుద్రత్‌హై
కభీహమ్ ఉన్‌కో కభీ అప్నే ఘర్‌కో దేఖ్తేహై
నజర్ లగే న కహీ ఉన్‌కే దస్తో బాజూకూ
యెలోగ్ క్యోంమెరే జఖ్మే జిగర్‌కూ దేఖ్తేహై. 3

1. భాగ్యహీనతను గూర్చి యెవరితో మొరపెట్టుకోవలయును ? చావవలెననుకున్న అదియు సంభవము కాలేదు.

2. జీవిత మీ విధమునను గడచిపోవునదే. నీ మార్గమేల జ్ఞాపకమునకు రావలయును ? ఏదో నిర్మానుష్యతయే యున్నది. ఎడారిని చూడగా ఇల్లు స్మృతికి వచ్చుచున్నది.

3. ఆమె మా యింటికి వచ్చెను. ఇది భగవల్లీల. ఒకప్పుడామెను ఒకప్పుడు మా యింటిని చూచెదను —

ఆమె చేతికిని, భుజమునకును దృష్టిదోషము తగులకుండు గాక ! ఈ లోకులు నా యెడద గాయముల నేల చూచుచున్నారు ?

నీంద్ ఉస్కీ హై, దిమాగ్ ఉస్కా హై రాతేఁ ఉస్కీ హైఁ
తేరీ జుల్ఫే జిస్కే బాజూపర్ పరీషాఁ హోగయీఁ
రంజ్ సే ఖూగర్ హువా ఇన్సాఁతో మిట్ జాతాహైరంజ్
ముష్కిలేఁ ఇత్నీ పడీఁ ముఝ్ పర్ కె ఆసాఁ హోగయీఁ. 1

*　　*　　*　　*

ఇస్ సాదగీపె కోఁ న మర్ జాయె ఐ ఖుదా
లడ్తే హై ఔర్ హాథ్ మే తల్వార్ భీ నహీ
మిల్నా అగర్ నహీ తెరా ఆసాఁ తో సహల్ హై
దుష్వార్ తో మహీహై కె దుష్వార్ భీ నహీ. 2

*　　*　　*　　*

ఖైదే-హయాతొ-బందే-గమ్, అస్లమే దోనోఁ ఏక్ హైఁ
మోత్ సే పహలే ఆద్మీ, గమ్ సే న జాత్ పాయే క్యాం. 3

*　　*　　*　　*

జిందగీ అప్నీ జబ్ ఇస్ షిక్ల్ సే గుజ్ రీ గాలిబ్
హమ్ భీ క్యా యాద్ కరేంగే కె ఖుదారఖ్తే థే. 4

---

1. ఎవని భుజములపై నీ కురులు విరియబడునో వానిదే నిద్ర - వానిదే బుద్ధి - వానివే రాత్రులు వ్యధల వలని అభ్యాసము కలిగిన తరువాత నశించును.

నాకు సంభవించిన విపత్తు లనేకములగుట అవి సహ్యములైనవి.

2. ఓ భగవానుడా! అంతటి అమాయకత చూచి ఎవరు మరణింపరు. కలహింపవచ్చినారు. చేతిలో కత్తియైనలేదు. నీవు లభించుట సులభము కాదేని సంభవము - కష్టమేమన కష్ట మైననుకాదు.

3. జీవనము ఖైదు. దుఃఖము ఖైదు. మృత్యువురానిదే మానవుడు ముక్తుడెట్లగును?

4. జీవిత మీ విధముగనే గడచెనేని మాకొక భగవంతు డుండెనని యెట్లు స్మరించగలము.

పూఛ్తే హైవోకే గాలిబ్ కోన్ హై
కోయీ బతావోకె హమ్ బతాయేఁ క్యా. 1

* * * *

గోహాథ్‌మె జుంబిష్‌నహీ ఆంఖోమ్మెతో దమ్‌హై
రహ్నేదో అభీ సాగిరో - మీనా మెరే ఆగే. 2

* * * *

హమ్‌కు మాలూమ్ హై జన్నత్‌కి హఖీఖత్ లేకిన్
దిల్కే ఖుష్ రఖ్నేకో గాలిబ్ యెఖ్యాల్ అచ్ఛాహై. 3

* * * *

హజారోఁ ఖాహిషేఁ ఐసీకె హర్ ఖాహిష్ పెదమ్ నిక్లే.
బొహత్ నిక్లే మెరే అర్మాన్ లేకిన్ ఫిర్‌భీ కమ్ నిక్లే. 4

ఈ యుగప్రతినిధి గాలిబే. ఇతర కవులు కొందఱు నశించిపోవుచున్న సభ్యత ప్రసాదించు జీవిత దఃఖముల నుల్లేఖించిరి. అతి విస్తృతమగు మొగలు సామ్రాజ్యము అంతమొందుచున్న దినములవి. చివరి పాదుషా బహాదుర్‌షా 'జపర్'. ఆనాటి మహాకవులు కొందఱు, పురాతనమగు ఉత్కృష్ట సభ్యతాదీపము ఆరిపోవు నప్పుడును తన అంతిమప్రభ ప్రదర్శించుననను విషయమును తమ రచనలచే సిద్ధ పఱచిరి. బహాదురుషా జపర్ పేరునకే ప్రభువు. ప్రభుత్వము కోల్పోయినను అతడు సాహిత్య జగతిలో ఉన్నతస్థానము సంపాదించెను. విఫలుడగు పాదుషా సఫలుడగు

1. గాలిబెవరని ఆమె ప్రశ్నించుచున్నది. నేనేమి చెప్పవలయునో ఎవరేని చెప్పుడు.

2. చేయి కదలకున్నను కనులలో ననువు లున్నవి. మధు కలశమును పానపాత్రను నా ముందుండనిండు.

3. స్వర్గమును గూర్చిన యదార్థ్యము మేమెఱిగినదే. అయినను మనసు సంతోషపెట్టుకొనుట కిదొక మంచి తలంపు.

3. ఒక్కొక్క దానిపైనే ప్రాణము పోవునట్టి వేలకొలది కోరికలున్నవి. నా కోరికలు చాల తీఱినవి. అయినను కొన్నియే తీఱినవి.

కవి యయ్యెను. యౌవనముననే కవిగా కీర్తిగాంచెను. నసీర్, జౌక్ మఱియు గాలిబులను క్రమముగా తన గురువులుగా నియమించుకొనెను. క్రీ. శ. 1857 విప్లవమున రాజ్యభ్రష్టుడై ఆంగ్లేయుల బందీయై అంత్యకాలము రంగూనులో గడపి క్రీ. శ. 1865 మరణించెను.

అతని కావ్యసంగ్రహములు నాల్గు ప్రకాశితములైనవి. ఐదవది విప్లవములో నష్టమైనదందురు. అతడు స్వయముగా కవి కాడనియు, జౌక్ అతని పేర పద్యములు వ్రాసి యిచ్చెననియు కొందఱందురు. కాని అది నిజముకాదు. అతని కవితలోని వ్యథ, కరుణాజనకములగు భావములు అతని ఆత్మ కథ అనిపించును. అతడు వేగముగా వ్రాయగలవాడు. అతని కవిత పూర్వ సంప్రదాయ బద్ధమే. అయినను స్వీయ దశను వర్ణించుపట్ల మాత్రము మహాకవికి కావలసిన భావుకత, వాస్తవికత గోచరించును. అతని సంగ్రహములు సూఫీతత్త్వము, నైతికాదర్శములు మఱియు శృంగారభావములతో నిండియున్నవి. అతడు కొన్ని మతసంబంధముగల కవితలను వ్రాసెను. కాని కీర్తిప్రతిష్ఠలకు కారణము అతని గజలులే.

జఫర్ పరిశుద్ధమగు దిల్లీవ్యావహారిక భాష నుపయోగించెను. హిందీ శబ్దములను ఇంపుగా ప్రయోగించెను. హిందీలో గీతములు మఱియు 'ఠుమ్రీలు' వ్రాసెను. అవి సంగీత శాస్త్రసంబంధము కలవి. ఉపదేశములు, జీవితము తుచ్ఛమగు భావములు జీవితము త్యజించు కోరికలు అతని కవితావస్తువులు. అతని కవితలో నవ్యత లేదు. ఆధ్యాత్మిక గాంభీర్యమును లేదు. కనుక అతడు ప్రథమశ్రేణి కవులలో లెక్కింపబడడు. అతని కావ్యములు చాలవఱకు స్వీయజీవిత చిత్రణములే కనుక వాస్తవికత కలవి.

ఉదాహరణకు కొన్ని పద్యపాదములు :—

నకిసీకి ఆంఖ్ కా నూర్ హూఁ– నకిసీకె దిల్‌కా ఖరార్ హూఁ
జో కిసీకె కామ్ న ఆసకే–మై వో యేక్ ముష్తె–గుబార్ హూఁ
పయే–ఫాతిహా కోయీ ఆయెక్యోం–కోయీ చార్ ఫూల్ చడాయెక్యోం

కోయి షమ్మలాకె జలాయెక్యోం-మైతో బేకసీకా మజార్‌హూం
న 'జఫర్' కిసీకా హబీబ్‌హూం-నజఫర్ కిసీకా రఖీబ్‌హూం
జో బిగడ్‌గయా వొనసీబ్‌హూం-జో ఉజడ్‌గయా వోదయార్‌హూం 1

*    *    *    *

ఠండీ ఠండీ జో కోయీ సాంస్‌హై ఆతీజాతీ
దిల్‌మే హై ఆగ్‌మేరీ ఔర్ బఢాతీజాతీ. 2

ఈ యుగమున మరణోన్ముఖమైన దిల్లీ ఆత్మ మరల జీవించినది. కవుల శోకపూరిత రాగములతో గీతము లాలపించిరి. వారి స్వరముతో కాలము తన స్వరము కలిపి పలికినది. ఒక ప్రతీకవలె ప్రజల హృదయమున నెలకొనిన మొగలాయి రాజ్యము నశించినది. అయినను మార్పుచెందుచున్న ఆర్థిక, సామాజిక పరిస్థితులను గ్రహింపలేని కవులు కొందఱు ఇంకను ప్రాత పాటలే పాడుచుండిరి. ఈ అధ్యాయమున ఉర్దూ సాహిత్యమున వెలలేని రత్నములన దగిన మహాకవుల గూర్చియే వ్రాయనైనది. ఈ కవులు రెండున్నర శతాబ్దములనుండి సాగుచున్న సంప్రదాయమును పాటించుటతోపాటు నూతనత్వమును సాధించిరి. వీరిచేతిలో ఉర్దూ కవిత మెఱుగుపెట్టబడి పరిశుద్ధమయ్యెను. కవితా విషయములు వ్యాపకత చెందెను. మోమిన్, గాలిబులు గజలును మానసికానుభూతులకు హార్దిక భావములకు దర్పణముగా రూపొందజేసిరి. ఈ దిల్లీకవులు లఖ్నోలోని భాషావిషయిక విప్లవముచే

---

1. నేనెవరి కనుల కాంతిని కాను. హృదయానందమును కాను. ఎవరికిని పనికిరాని పిడికెడు మట్టిని.

ఎవరేని నా సమాధిపై శ్రద్ధాంజలి సమర్పింపరానేల ?

ఎవరేని నాల్గుపూలేల చల్లవలయును. ఎవరేని దీపమునేల వెలిగింపవలెను? నేను నిస్సహాయపు సమాధిని.

ఈ 'జఫర్' ఎవరి మిత్రుడును కాడు. ఎవరి ప్రతి ద్వంద్వియుకాడు. నేనొక చెఱిగిపోయిన అదృష్టమను. పాడువడిన ప్రదేశమను.

2. వచ్చుచుపోవుచున్న చల్లనిగాలి నా హృదయములోని అగ్నిని రగుల్కొల్పుచున్నది.

ప్రభావితులు - రెండు సాహిత్య కేంద్రముల సమకాలిక కవులను పరిశీలించు విమర్శకున కా ప్రభావము తెల్లమగును.

సారాంశమేమన, దిల్లీలో సౌదా, దరద్ మఱియు మీర్ అను కవులు ముప్వురు వెలిగించిన దీపము నీయుగపు కవులు ప్రజ్వరిలజేసిరి. విశేషించి గాలిబ్ ఆరిపోవుచున్న బూడిదను కెలికి కెలికి అందలి వేడిమిని, ప్రకాశమును వెలికితీసెను. అతని మధురశ్రుతులలో కరుణానుభూతి కలదు- అది నశించిపోవుచున్న సంస్కృతి ప్రసాదించినది.

ఆనాటి రచనలు చాలవఱకు నేడు సాహిత్యదృష్టితో విలువకలవికావు అనుటలో సందేహము లేదు- కాని పైన ఉల్లేఖింపబడిన కావ్యములు మాత్రము చారిత్రక మాహాత్మ్యమే కాక సాహిత్య గౌరవమును కలవే-



## ఏడవ అధ్యాయము

### ఉర్దూ గద్య వికాసము

వెనుకటి అధ్యాయములలో ఉర్దూ భాషయొక్క ప్రారంభిక సాహిత్యమును గూర్చి వ్రాయబడినది. దకనీ ఉర్దూ సాహిత్య వికాసమును గూర్చి వ్రాయునప్పుడా భాషలోని గొప్ప రచనల పరిచయమును చేయబడినది. ఆ రచనలు చాలవఱకు మతమునకు, సూఫీ తత్త్వమునకు సంబంధించినవి. రెండు మూడు మాత్రమే సాహిత్యమూలము కలవి. పురాతన ఫారసీ చరిత్రలలోను సూఫీ మత గ్రంథముల లోను సూఫీపక్కీరుల రచనల ప్రసక్తికలదు. అట్టి రచనలు పదుమూడవ శతాబ్దిలో ప్రారంభమైనవి. కాని లభ్యములైన గ్రంథములలో మొట్టమొదటిది "గేసూదరాజ్" (మృ- క్రీ. శ. 1421.) వ్రాసిన "మేరాజుల్-ఆషిఖీన్". అంతకు ముందటి "షేఖ్ ఏనుద్దీన్-గంజుల్-ఇల్మ్" రచనలను, లేదా "సం. మఖ్దూమ్ అష్రఫ్ జహాంగీరీ, కిఛౌఛవీ" పుస్తకమును గూర్చియు కొందరు ప్రస్తావింతురు. కాని వానిని గూర్చి విశ్వసనీయములగు విషయము లెవ్వియు తెలియవు.

గేసూదరాజ్ తరువాత రెండు శతాబ్దముల వఱకు ఎట్టి గొప్ప గద్యరచనయు లభింపదు. ఈ మధ్యకాలమున మీరాఁజ్, బురహానుద్దీన్ జానమ్ మొదలగువారి రచనలు కాన్పించును. కాని క్రీ. శ. 1635 లో "ముల్లావజీ" వ్రాసిన "సబ్‌రస్" అనునది సాహిత్యగౌరవముకల ఉత్తమరచన. ఒక ఫారసీగ్రంథముపై ఆధారపడినదే అయినను ఇది స్వంతరచన అనిపించును. ఇందు అతి నిగూఢములగు తాత్త్విక విషయములు ఆశ్చర్యముగొలుపు విధముగా ప్రదర్శింపబడినవి- అంత్యప్రాస (తుకాంతిక) నియమములుగల వచనశైలి. ఇందలి కథ సమస్తనైతికాధ్యాత్మిక విషయప్రధానము. పాత్రలు ప్రేమ, సౌందర్యము, హృదయము, బుద్ధి అను నిట్టివి. ఇదొక ఆధ్యాత్మిక గ్రంథమే అయినను సాహిత్య దృష్టితోను ప్రథమశ్రేణి గ్రంథములలో కెక్కింపబడు చున్నది- 'వజీ' ఈ కథ నెచటినుండి గ్రహించెనో తెలుపలేదు. తానే ఇట్టి రచన కాద్యుడైనట్లును చెప్పినాడు. ఇంకను ఇట్లు సోత్కర్షగా వ్రాసికొనినాడు :—

"ఆజ్ లగన్ కోయీ ఇస్ జహాన్‌మే, హిందూస్థాన్‌మే,
హిందీ జబాన్‌మే, ఇస్ లతాఫత్, ఇస్ ఛందాం
సోం నజమ్ ఔర్ నసర్ మిలాకర్, గులా కర్
నహీ బోల్యా." 1

ఇట్టి సుందర శైలిలో ఉర్దూలోను హిందీలోను ఇంతకు పూర్వమెట్టి గ్రంథ మును వ్రాయబడకుండుట వాస్తవము. వరీు సాహిత్యదర్పము సమంజసము.

రెండవ అధ్యాయమున దక్షిణదేశమందలి ఉర్దూసాహిత్య వికాసము వివరింప బడినది- ఆ యుగము గద్యరచనయొక్క- ఉన్నతికి అనుకూలమైనదికాదు. కనుక ఆనాటి పద్యరచన ముందు గద్యరచన అత్యల్పము. ప్రపంచమునందలి ఏ సాహిత్య మునసైనను ప్రజాజీవితము ప్రగతిమార్గము పట్టినప్పుడే మంచి గద్యరచన వెలయును. వరీు తరువాత క్రీ. శ. 1687 న ఔరంగజేబు దక్షిణదేశమును తనరాజ్యమున కలుపు కొను వఱకును గద్యరచన సాగినది. ఈ నడుమ వెలువడిన వన్నియు మతసంబంధ మైన గ్రంథములే- వైజ్ఞానికముగా ఔద్యోగికముగా ఉన్నతస్థితిలో లేనివారికి మతమే శరణ్యము- అదియు గాక ప్రారంభమున ప్రబలమగు విజయనగర సామ్రాజ్యము ముందు తను గౌరవము నిలుపుకొనుటకు, ఆధ్యాత్మికోన్నతి పొందుటకు మతము నాశ్రయించుట ఆనాటి దకనీ ముసల్మానుల కావశ్యక మనిపించియుండును- మతము తప్ప ఇతర విషయముల గూర్చి వ్రాయబడనే లేదని తలంపరాదు. పంచతంత్రము మఱియు హితోపదేశములోని కథలు "తూతీనామా" పేర తర్జుమా లయ్యెను. ఈ తర్జుమా ఫారసీనుండి జరిగినది. ఇందలి భాష దకనీయే కాని "సబరస్" భాష వలె సుందరము కాదు.

18 వ శతాబ్దిలో ఆర్కాటు, మైసూరు మఱియు హైదరాబాద రాజ్యములు స్థాపింపబడెను. ఈ రాజ్యములలో ఉర్దూ భాష వ్యాప్తిచెందెను. ఉర్దూ ద్వారమున మరాఠీ భాషపై ఫారసీప్రభావము పడినది. అది ఇప్పటికిని నిలిచియున్నది. ఈ కాల మునవే ఉత్తరదేశమున ఉర్దూ సాహిత్యము బలపడుచుండెను. దాని వికాసమును

1. నేటివఱకు ఈ ప్రపంచమున, భారతదేశమున, హిందీ భాషలో, ఇట్టి సుకుమార సుందరి శైలిలో గద్య పద్యములను మేళవించి ఎవరును చెప్పలేదు.

ఉన్నతినిగూర్చి వెనుకటి అధ్యాయములలో తెలుపబడినది. ఇచట గద్యరచన ప్రగతిని గూర్చి తెలుపబడును.

భాషా తత్త్వవేత్తలు దిల్లీ పరిసరముల భాషను గూర్చి వ్రాయుచు ఆ భాష వ్యావహారిక రూపమున అభివృద్ధిముఖమై వ్యాపించుచుండెనని వ్రాసిరి. చాల పూర్వము నుండియే అందు వ్యవహార వశమున చేరిన లోకోక్తులు జాతీయములు మఱియు పలుకుబళ్లు దానికి ప్రజాసామాన్యముతోగల సంబంధమును తెలియజేయును. ఈ భాష యొక్క చక్కని ఉదాహరణములు మీర్ జాఫర్ ''జటల్'' కావ్యములలోను, వచన రచనలలోను కనిపించును. 'జటల్' హాస్యరస ప్రధానములగు వినోదరచనలు చేయుటయేకాక లజ్జారహితములగు అశ్లీల భావములను ప్రకటించుటకును సంకోచించువాడుకాడు. ఒకరిని నిందించి ఒకరిని స్తుతించువాడు. అతడు ఔరంగజేబు మఱియు మొదటి బహాదురుషా కాలపు కవి. అతని కవితలు, వచన రచనలు ఫారసీ మఱియు వ్యావహారిక భాషల మిశ్రమ రూపములు. అతని రచనలు చదివిన ఆనాటి దుర్దశ అర్థమగును- సామాన్య సైనికునినుండి పాదుషా వఱకు ఎవరికిని భయపడువాడు కా డతడు- నోటికి వచ్చిన మాట నిరాటంకముగ అనువాడు. భాషాధ్యయనము చేయగోరువారు అతని రచనలు చదువవలయును. అతని రచనల సంగ్రహము చాల తడవలు ప్రకాశితమైనది. కాని అశ్లీలత కారణముగ దానిని చదువు వారు అరుదు- సాహిత్య చరిత్రకారులును అతని పేరు స్మరింపరు-

ఉర్దూసాహిత్య చరిత్రలన్నియు మొహమ్మద్‌షాహీయుగము (1716-1748) గద్యరచన ప్రారంభకాలమని తెల్పును. మొట్టమొదటి పుస్తకము ''ఫజలీ'' వ్రాసిన ''కర్బల్ కథా'' లేక ''దహ-మజ్లిస్'' కావచ్చునని భావింపబడుచున్నది. ''ఫజలీ'' పేరు ఫజల్ అలీ. అతడు ఈ గ్రంథమును క్రీ. శ. 1731 లో రచించి క్రీ. శ. 1747 లో పరిష్కరించుకొనెను. ముల్లా హుస్సేన్ ఫాయెజ్ 'కాషిఫీ' వ్రాసిన ప్రసిద్ధ ఫారసీ గ్రంథము, ''రోజతుష్షొహదా'' అనునది మత సంబంధములగు సభలలో బహుగా చదువబడు చుండెను. కాని అది ఫారసీలో ఉండుట వలన సామ్రాజ్య ప్రజలకు బోధపడదని ''ఫజలీ'' దానిని ఉర్దూలో అనువదించెను. అందు కర్బలాయుద్ధగాథ, ఇమామ్ హుస్సేన్ వర్ణన కరుణాత్మకముగా రచింపబడినవి. దురదృష్టవశమున ఈ గ్రంథము నేడు అలభ్యము- దాని పీఠిక మఱియు కొన్ని మచ్చుతునకలవంటి పద్యములు ఇతర గ్రంథములలో లభించును- వాని వలన ''ఫజలీ'' ఆనాటి వఱకు ఎట్టి ఉర్దూ రచనను ఎఱుగడని తెలియును. అతడు తనదే తొలిరచన అనియు తన

భాష హిందీ అనియు తెల్పెను. అతని గ్రంథములో కొన్ని దకనీ జాతీయములు కన్పించుట వలన అతడు దక్షిణదేశపు కవియేమో అని కొందఱు అనుమానించిరి. కాని ఈ మాట రూఢిగా చెప్పవీలులేనిది. అతని శైలి దక్షిణపు శైలికి భిన్నము. అతడు దక్కను వాడేని అచటి రచనలను అనువాదములను గుఱించి తప్పక తెలిసి యుండును. అతని భాషలో అరబీ, ఫారసీ శబ్దములనేకములు. అది మత గ్రంథమగుట వలన ఆ పదములకు పరిచితులే అగుట వాని ఉపయోగము అనివార్యమయి యుండును. ఇచట ఆనాటి ఉత్తరదేశపు భాషను గూర్చి ఒక సంగతి గమనింపవలసినది. ఉత్తర దేశమున వికాసము పొందుచున్న ఉర్దూభాష దిల్లీకి సమీపమున ఉన్నందునను ఈరాను (పర్షియా) భాషాసాహిత్యముల ప్రభావమునకు గురియగుట వలనను సులువుగా అరబ్, ఫారసీ శబ్దములను తనలో చేర్చుకొనుచుండెను. సికందర్ లోధీ మఱియు తోడర్‌మల్లు ఆజ్ఞల ననుసరించి ప్రభుత్వోద్యోగులందఱకు ఫారసీ నేర్చికొనుట ఆవశ్యకమయ్యెను. దాని ప్రభావము వ్యావహారిక భాషపై పడుటలో సందేహములేదు.

సామ్రాజ్యముల యుగమున కవితకుగల ఆదరము గద్యరచనలకుండదు. పైపెచ్చు అది పతనకాలము. ఉదారభావముల యుగము అంతరించినది. ఎవరేని గంభీర విషయమేదైన వ్రాయదలచిన ఫారసీలోనే వ్రాయుచుండిరి. అయినను సామాన్యజీవనమున తన స్థానముపొందుచు ఉర్దూ అవసరములను ప్రకటించుకొనుటలో ఉపయోగపడుచునే ఉండెను. మీర్జా "సౌదా" తన మర్సియాల సంగ్రహమునకు వచనములో పీఠిక వ్రాసెను. అతని ఆ వచనము గ్రంథముతోపాటు పలు తడవలు ప్రకాశితమైనది. అందు ఫారసీ, అరబ్ పదము లధికము. వాక్యము లన్నియు అంత్యప్రాసనియమము కలవి. మీర్ తఖీ "మీర్" వ్రాసిన ప్రఖ్యాత మస్నవీ, "షోలయే-ఇష్క్" అను దానిని "సౌదా" వచన రూపమున వ్రాసెను. కాని అది నేడు అలభ్యము. కథాకథనములో "సౌదా" వచనశైలి యెట్టిదో మనకు తెలియదు.

18 శతాబ్దాంతమునకు కొన్ని సంవత్సరములు ముందే దిల్లీలో 'ఖురాన్ షరీఫు'ను ఇరువురు అనువదించిరి. షా హెరఫియుద్దీన్ మఱియు షాహ్ అబ్దుల్ ఖాదిర్ అను వారిరువురును సుప్రసిద్ధ విద్వాంసుడును మతాచార్యుడును అగు "షా హెవలీవుల్లాహ" కొడుకులు. వారు తండ్రివలెనే మతప్రచారము చేసిరి. రఫియుద్దీన్ క్రీ. శ. 1786 లో తన అనువాదము ముగించెను. అబ్దుల్ ఖాదిర్

క్రీ. శ. 1790 లో పూర్తి చేసెను. అరబ్ రానివారు అర్థము గ్రహించి ఖురాను చదువవలెనను ఉద్దేశ్యముతోనే ఈ రెండు అనువాదములు చేయబడినవి. ఈ అనువాదముల భాష సరళముకాదు. ఇవి చారిత్రకముగా విలువైనవే కాని సాహిత్యగౌరవము కలవికావు. తరువాత ఖురాను అనువాదములు ఉత్తమమైనవి చాల వచ్చినవి. అవి సాహిత్యదృష్టితోను గొప్పవే. ఇట్టి మతగ్రంథములే కాక క్రీ. శ. 1775 సంవత్సర ప్రాంతమున మీర్ అతాహుస్సేన్ "తహసీన్" అను నతడు "ఖిస్సయే-చహార్ దర్వేష్" అను ఫారసీ కథా కావ్యమును "నౌతర్జే-మురస్సా అను పేర ఉర్దూలో అనువదించెను. అది ఆ యుగపు గొప్ప రచన. మూలగ్రంథ రచయిత "అమీర్ ఖుస్రూ" అందురు. కాని నిర్ధరించి చెప్ప లేము. ఏలయన "అమీర్ ఖుస్రూ" రచన లన్నిటిని పరిశోధించిన పండితులకు ఆ పేరుగల అతని రచన యేదియు లభించలేదు. కాని ఆశ్చర్యమేమన చిరకాలము నుండియు ఆ గ్రంథము అతనిపేరు మీదనే చలామణియగుచున్నది. "తహసీన్" ఇటావా నివాసి. అతడు ఒక ఆంగ్లసైనాధికారి దగ్గఱ 'మీర్‌మున్షీ'గా పనిచేయుచు కలకత్తాలో నివసించెను. ఆ ఆంగ్లోద్యోగి స్వదేశమునకు తిరిగివెళ్ళిన తరువాత "తహసీన్" పట్నా మీదుగా ఫైజాబాద చేరి నవాబు షుజావుద్దౌలా ఆస్థానమున స్థిరపడెను.

'తహసీన్' ఫారసీలో గొప్ప విద్వాంసుడు. ఫారసీలో అనేక గ్రంథములు వ్రాసినవాడు. అయినను ఈ అనువాదము వలననే ఉర్దూసాహిత్య చరిత్రలో జీవితుడు. "నౌతర్జే-మురస్సా" శైలి కఠినము. అరబీ ఫారసీ పదము లధికము. అలంకార వ్యామోహము అతిమాత్రము. కనుక సామాన్యపాఠకులకు అది దుర్గ్రాహ్యము. ఒక్కొకచోట ఫారసీ వాక్యములట్లే ఎత్తి వ్రాసి ఉర్దూ క్రియాపదములు మాత్రము చేర్చి అనువదించెను. పుస్తకమంతయు ఈ రీతిగా లేకున్నను అధికభాగము ఇట్టి విచిత్రశైలిలోనే రచింపబడినది.

18 శతాబ్దము ముగియునప్పటికి భారతదేశచరిత్ర రూపురేఖలు చాలవఱకు మాఱినవి. మొగలురాజ్యము దుర్బలమగుటవలన దాని అవశిష్టములపై క్రొత్త శక్తులు తమ రాజభవనములు నిర్మించుకొనుచుండెను. కాని అన్నియు జాగీర్దారీ ఆర్థిక విధానముపై ఆధారపడినవే. ఒక విదేశీయశక్తి వ్యాపారార్థమై భారతదేశమున వ్యాపించుచుండెను. దాని ప్రవేశము వలన క్రొత్త ఆర్థిక సమస్యలు ఉత్పన్నము లయ్యెను. క్రొత్త సంకటములు, క్రొత్త ఆలోచనా విధానము రేకెత్తెను.

విదేశీయుల రాజకీయపు ఎత్తుగడల ముందు దుర్బలులగు ఇచటి రాజులును అమీరులును నిలువలేకపోయిరి. వ్యాపారమను తెరచాటున బ్రిటిష్‌రాజ్యముచే ప్రోత్సహింపబడిన ధనపతులు పన్నిన వలలో ఇచటి యావత్సంపద చిక్కుకొనెను. ఇచటి జీవనము కేంద్రమునుండి చలనముపొందెను. వారి ఇంద్రజాలము వలన సమైక్యభావము చచ్చిపోయెను. అలీవర్దీఖాన్, షుజావుద్దౌలా, హైదరలీ, మరాఠులు, నిజాము, మొగలులు, రాజపుత్రులు మఱియు సిఖులు అందఱును ఉండిరి. కాని వారు ఎన్నడును కలిసిపోక పరస్పర విరోధముచే బలహీనులైరి. లేదా ఆంగ్లేయులు వారిని పరాస్తముచేసి నశింపజేసిరి. 18 వ శతాబ్దము ముగియక మునుపే ఏదో విధముగ బంగాళము, బీహారు, ఒరిస్సా, మద్రాసు, బొంబాయి మఱియు దక్షిణ భారతములోని కొన్ని భాగములు ఆంగ్లేయుల వశమయ్యెను. నామ మాత్రమునకు స్వతంత్రములైయున్న ప్రాంతములను ఏదోరూపమున ఆంగ్లేయులను ఆశ్రయించియేయుండెను. బలహీనమైయున్న సామ్రాజ్య వ్యవస్థ, నూత్నమును ప్రగతి శీలమును అగు ఆంగ్ల రాజనీతి ముందు తలవంచవలసిన దయ్యెననుట తథ్యము.

ఆంగ్లేయులు ఇచట రాజ్యము స్థాపించుకొనిన తరువాత జీవితరంగము లన్నిటిలో ప్రవేశము కలిగించుకొనసాగిరి. విద్యకు సంబంధించిన వారి నీతిని పరి శీలింతుమేని రాజకీయ యంత్రమును అధికోపయోగకారిగా చేయుటకై వారు విశేష ముగా విద్యనుగూర్చియే ఆలోచించిరని తెలియును. జ్ఞానోపార్జనదృష్టితోను రాజకీయ దృష్టితోను ఇచటి భాషలను అధ్యయనము చేసిరి. ఈస్టిండియా కంపినీ స్థాపితమై కొలదినాళ్ళలోనే దాని ప్రభావము వ్యాపించినంత వారు భారతదేశపు మత పరిస్థితిని కూడ పరిశీలించిరి. కాని ఇచటి మతములలో, ధార్మిక వ్యవహారములలో కలుగ జేసికోగూడదనియే నిశ్చయించిరి. అయినను ఈ నీతి చాలకాలము నిలువలేదు. 16 వ శతాబ్దిలో క్రైస్తవ మతప్రచారకులకు తమ మత ప్రచారమునకే కాక హిందూ ముసల్మానులను పోట్లాడించుటకును అవకాశము దొఱకెను. క్రైస్తవ మతమవలం బించిన వారికి లాభము కలిగించుట సాధారణ విషయమయ్యెను. ఈ సందర్భమున ఐరోపాలోని కొందఱు రచయితలు ఉర్దూ భాషవైపు శ్రద్ధచూపిరి. ఐరోపా మఱియు భారతదేశముల ఆర్థిక, సాంస్కృతిక సంపర్కమునుగూర్చి ఇంకొక చోట చర్చింపబడును. ఉర్దూభాషాభివృద్ధికి వారెట్టి సాయము చేసిరి? ఆ సహాయము

యొక్క ఉద్దేశ్యము భాషా సేవయా లేక రాజకీయతంత్రమా ? అను విషయములు ఇచట చర్చింపబడును.

మొట్టమొదట 'జాషువాకేట్లర్' అను డచ్చి రచయిత క్రీ. శ. 1715 వ సంవత్సరమున ఒక హిందూస్థానీ వ్యాకరణము వ్రాసెను. అది ఉర్దూ ఉదాహరణములుగల లాటిన్ భాషా పుస్తకము. 'కేట్లర్' డచ్చి ఈస్టిండియా కంపెనీ ఉద్యోగి కనుక 'సూరత్', 'లాహోర్', 'దిల్లీ' మఱియు 'ఆగ్రా' లలో నివసించెను. అట్లగుటచే అతనికి ఉర్దూభాషతో మంచి పరిచయము పొందు అవకాశము కలిగెను. నేడు ఈ పుస్తకము అలభ్యము. కనుక దీనినిగూర్చి ఇంతకుమించి చెప్పుటకు వీలులేదు.

ఈ రీతిగా ఇతర ఐరోపీయులనేకులు వ్యాకరణములను, నిఘంటువులను వ్రాసిరి. ఇచటి ప్రజలు మాటలాడు సామాన్యభాషను నేర్చికొనవలయు ననునదే వారి ముఖ్యోద్దేశ్యము. ఫాదరీ 'బెంజమిన్‌షుల్జు' అనునతడు క్రీ. శ. 1744 న మఱి యొక వ్యాకరణమును వ్రాసి క్రీ. శ. 1748 వ సం॥ న బైబిలు ఉర్దూ అనువాదమును చేసెను. మఱికొందఱు ఉర్దూ వర్ణమాలను లిపిని గూర్చి చిన్నచిన్న రచనలు చేసిరి. అట్టివారిలో 'మిల్', 'ప్రిట్జ్', 'బేలిగాటి', 'హేడ్లే' మఱియు 'డఫ్' అనువారు ప్రముఖులు. అందఱికంటె "జాన్‌గిల్‌క్రాయెస్ట్" సువిఖ్యాతుడు. అతడు క్రీ. శ. 1787 నుండి సుమారు ఇరువది ఏండ్లవఱకు ఉర్దూను గూర్చి వ్రాయుచుండెను. హిందూస్థానీ భాషావేత్తగా అతని కీర్తి ఎల్లెడల వ్యాపించుట వలన కలకత్తాలో ఫోర్టువిలియమ్ కాలేజి స్థాపింపబడినప్పుడు అతడే ప్రథమాధ్యక్షుడుగా నియుక్తుడయ్యెను. అతని పర్యవేక్షణలో ఉర్దూ రచనలు ఎన్నియో రూపొందెను. వానిని గూర్చి వివరముగా తెలుపబడెను.

గిల్‌క్రాయిస్ట్ ఈస్టిండియా కంపెనీ ఉద్యోగి. భారత దేశము చేరగనే అతనికి హిందూస్థానీ భాషపై అభిమానము కలిగెను. వ్యావహారిక భాష, వ్యాకరణము మఱియు శబ్దకోశముల గుఱించి ఆంగ్లములోను ఉర్దూలోను అనేక గ్రంథములు వ్రాసెను. క్రీ. శ. 1804 లో అతడు స్వదేశమునకు తిరిగివెళ్ళి ఈస్టిండియా కంపెనీ ఉద్యోగులుగా పంపబడువారికి ఉర్దూ నేర్పుచుండెను. లండనులో 'ఓరియంటల్ ఇనిస్టిట్యూట్' స్థాపింపబడినప్పుడు గిల్‌క్రాయిస్ట్ అందు ఉర్దూ భాషాధ్యాపకుడుగా నియుక్తుడయ్యెను. ఆ విద్యాలయము మూసివేయబడిన తరువాత అతడు మరల

ప్రజలకు ఉర్దూ నేర్పుచుండెను. క్రీ. శ. 1841 లో అతడు 'ప్యారిస్' పట్టణమున మరణించెను. గిల్‌క్రాయిస్ట్ వ్రాసిన గ్రంథములు పది పండ్రెండు. వానిలో ప్రసిద్ధములు ఇవి : "అంగ్రేజి-హిందూస్థానీ డిక్షనరీ" (1793) "హిందూస్థానీ గ్రామర్" (1796) "ఓరియంటల్ లింగ్విస్ట్" (1798), "ఖససే-మష్రకీ" (1803) "రహనుమాయె-జబానె-ఉర్దూ" (1804) "ఖవాయిదే-ఉర్దూ" (1809) మఱియు "అంగ్రేజీ-బోల్‌చార్" (1820). 16వ శతాబ్దిలో ఇతర ఆంగ్లేయులు అనేకులు భాషావిషయమున గొప్ప కృషి చేసిరి. నేటికిని ప్రామాణికములనబడు నిఘంటువులు కొన్ని నిర్మించిరి. వారిలో టేలర్, రోబెక్, షేక్స్పియర్, ఫార్బ్స మఱియు 'ఫేలన్' అనువారు ముఖ్యులు. హిందూస్థానీ భాషా నిఘంటువుల విషయమున కృషిసల్ప దలచిన విద్వాంసులకు పైన పేర్కొనబడిన రచయితల రచనలు సహాయపడును- 'ఫేలన్' నాల్గు నిఘంటువులు తయారుచేసెను. అతనికి లాలా ఫకీర్‌చంద్, లాలా చిరంజీలాల్, ఠాకూర్‌దాస్, లాలా జగన్నాథ్ మఱియు మిస్టర్ వాట్లింగ్ అనువారు తోడ్పడిరి. దిల్లీ నివాసియగు మోల్వీకరీముద్దీన్ మఱియు ఫేలన్ కలిసి ఒక కవుల చరిత్ర వ్రాసిరి. అది చాలవఱకు ఫ్రెంచి విద్వాంసుడగు 'గార్సా-ద-తాసి' ఫ్రెంచి రచనకు అనుసరణ. ఈ విధముగా ఐరోపీయ విద్వాంసు లనేకులు ఉర్దూను భారత దేశపు రాష్ట్రభాషగా భావించి, తత్సాహిత్యమును మనోహరమని యెంచి అందు రచనలు చేసిరి.

19వ శతాబ్ది రాకపూర్వమే భారతదేశపు అధిక భాగముపై ఆంగ్లప్రభుత్వము వ్యాపింపసాగెను. క్లైవు కుయుక్తుల ననుసరించి మొగలు చక్రవర్తి షాహె ఆలమ్ బంగాళము మఱియు బీహారు రాష్ట్రములలో భూమిపన్ను సేకరించు అధికారము ఈస్టిండియా కంపినీ పరముచేసెను. ఆ ప్రాంతములపై అధికారము చేయుటకై అచటి భాషలు నేర్చుట ఆంగ్లేయులకు ఆవశ్యకమయ్యెను. కంపినీ ఉద్యోగులై వచ్చు వారికి హిందూస్థానీ భాష నేర్చికోదగిన ఏర్పాట్లు లేకుండెను. లార్డ్ వెల్లస్లీ కంపినీ డైరెక్టర్ల అనుమతిపొంది నాలుగవ మే. క్రీ. శ. 1800 సంవత్సరమున కలకత్తాలో ఫోర్ట్ విలియమ్ కాలేజీ స్థాపించెను. క్రొత్తగాచేరిన ఉద్యోగులకు భారతీయ భాషలు నేర్పుటకొఱకే ఆ కాలేజి ఉద్దేశింపబడినది. ఇచట మన సంబంధము కేవలము ఉర్దూతోనే కలదు కనుక అచట బోధింపబడు అన్యభాషల గుఱించి తెలిసికొనుట అనావశ్యకము. ఆంగ్లేయోద్యోగులు రాజభాషయగు ఫారసీవికూడ నేర్చికొనిరి. కాని ప్రజల భాష ఉర్దూ అయినందున దానిపట్లనే అధిక శ్రద్ధ చూపిరి. కాలేజీ యొక్క బోధనా

ప్రణాళిక ప్రశస్తమైనదే కాని కంపినీ అధికారులు దాని భారము వహించుటకు సిద్ధపడ నందున అది భాషాబోధన వఱకే పరిమితమయ్యెను.

డా. జాన్ గిల్‌క్రాయిస్ట్ ఉర్దూతోగల సాహిత్యముతో కొద్దిగొప్ప పరిచయము కలవాడే. అందు కవిత అధికముగా నుండి గద్యము స్వల్పముగా నున్న సంగతి గ్రహించెను. అధిక గ్రంథములు మత సంబంధములై యున్నందున, విదేశీయోద్యోగు లకు నేర్పదగిన గ్రంథములంతగా లేనందున, శిక్షణతోపాటు సాహిత్య నిర్మాణకార్య క్రమమును పూనుకొని అందుకొఱకు ప్రత్యేక విభాగమును స్థాపించెను. తన పర్య వేక్షణలో అనుకూలముగా వ్రాయగల పండితులను వెదకి వెదకి పిలిపించెను. గ్రంథ ములు కాలేజీ పర్యవేక్షణలోనే రచింపబడి అచటనే ప్రకాశింపబడుటకై ఒక ప్రచుర ణాలయమును నెలకొల్పెను. ఇదియే భారతదేశములోని మొదటి ప్రచురణాలయము.

ఫోర్ట్ విలియమ్ కాలేజీలో చేరిన విద్వాంసులు తమ విధులను చక్కగా నిర్వ హించిరి. ఆ విద్వాంసులను పిలిపించుట కేవలము సాహిత్య నిర్మాణదృష్టితో కాదనుటలో సందేహము లేదు. ఏలయన అచటినుండియే హిందీ, ఉర్దూ. భేదభావ ములు కలిగి రాజకీయ రూపము ధరించెను. ఈ కాలేజీలో రచింపబడిన గ్రంథములు ఆలోచింపదగినవే. ఆ రచనలు సాహిత్యమునకు ఏమాత్రము లాభము చేయలేదని కొందఱు విమర్శకులు అభిప్రాయపడిరి. వారి అభిప్రాయము తప్పుకాదు. అచటి రచనలను అచటి వారే చదివిరి కాని ఇతరులు చదువరైరి. అయినను ఆ రచనలను ఉపేక్షింపదగదు. కాలేజీలోని లేఖకులు ఎందఱో కాని పదునేనుగురు మాత్రము ప్రసిద్ధులు— అందఱిలో అగ్రగణ్యుడు "మీర్ అమ్మన్"— అతని రచన సువిఖ్యాతము— లోకప్రియమును.

మీర్ అమ్మన్ దిల్లీ వాస్తవ్యుడు. అతని పేరు మీర్ అమాన్— కలకత్తాకు రాకపూర్వము అతడు కవిగా కాని రచయితగా కాని ఎవరికిని పరిచితుడు కాడు— ఇప్పటికిని అతని జీవిత చరిత్రనుగూర్చి ఏమియు తెలియదు. తన సుప్రసిద్ధ రచన "బాగో-బహార్" పీఠికలో స్వవిషయము ఎంత తెల్పెనో అంతే తెలియును. దిల్లీ పాడువడిన పిదప మీర్ అమ్మన్ కొంతకాలము పట్నాలో నివసించెను. అటనుండి కలకత్తాకు వెళ్ళి రెండు సంవత్సరములు వృథాగా గడపెను. క్రీ. శ. 1801 సంవత్స రమున మీర్ బహాద్దూరలీ హుస్సేన్ సహాయమున గిల్ క్రాయిస్టును దర్శించెను. ఆపైన ఫోర్ట్ విలియమ్ కాలేజీలోని సాహిత్య నిర్మాణశాఖలో ఉద్యోగియై మూడేండ్లలో "బాగో-బహార్" మఱియు "గంజె-ఖూబీ" అను రెండు గ్రంథములు వ్రాసెను.

వానిలో "బాగో-బహార్" అధిక కీర్తి గడించెను. క్రీ. శ. 1803 తరువాత మీర్ అమ్మన్ ఇంకేమైన వ్రాసెనో లేక ఏమయ్యేనో తెలియదు.

'బాగో-బహార్' ప్రారంభమున "మీర్ అమ్మన్" సంప్రదాయముననుసరించి తద్రచనకు కారణములను తెల్పెను. అతడును అతా హుస్సేన్ 'తహసీన్' వలె ఈ కథ అమీర్ ఖుస్రూ వ్రాసిన "చహార్ దుర్వేష్"పై ఆధారపడినదని తెల్పెను. పైన వ్రాసినట్లు ఇట్టి పేరు గల ఖుస్రూరచన ఏదియులేదు. ఈ కథ ఫారసీ భాషలో చాల వ్యాప్తిచెందియుండెను. కొలది నాళ్ళలోనే దీని అనువాదములు మూడయ్యేను. మీర్ అమ్మన్ ఫారసీనుండి రాక "తహసీన్" రచననే సరళవ్యావహారిక భాషలో వ్రాసెనని కొందఱు సాహిత్య పరిశోధకులందురు. మీర్ అమ్మన్ ఇట్లు వ్రాసెను. "........... జాన్ గిల్ క్రాయిస్ట్ దొర, ఈ కథను ఉర్దూ తెలిసిన ప్రజలు, హిందువులు, ముసల్మానులు, స్త్రీలు, పురుషులు, బాలురు విశేష ప్రజలు, సామాన్య ప్రజలు పరస్పరము మాటలాడుకొను అచ్చమైన హిందూస్థానీ భాషలో అనువదించుమని ఆదరముతో సెలవిచ్చిరి. వారి ఆజ్ఞానుసారము వ్యావహారిక శైలిలో సజాతీయమగు భాషలో వ్రాయుటకు ప్రారంభించితిని-" మీర్ అమ్మన్ ఫారసీ గ్రంథమును చూచియుండును. అయినను అతడు అనుసరించినది 'తహసీన్' వ్రాసిన "నౌతర్జె-మురస్సా" ను అనుటలో సందేహములేదు. కథ ఒకటియే అయినను శైలిననుసరించి రెండును వేరువేరు గ్రంథము లనిపించును. నిజముగా మీర్ అమ్మన్ అచ్చమైన హిందూస్థానీనే వాడినాడు. కనుక గ్రంథము సుందరమును లోకప్రియమును అయినది. అనువాదమైనను స్వంతరచనయే అనిపించును. దీనిని అనేక ఐరోపీయ భాషలలో అనువదించుకొనిరి. అచటి విమర్శకులు ఈ రచనను అత్యంతము ప్రశంసించిరి. అమ్మన్ ఇందు భారతీయ సామాజిక స్థితి, ముఖ్యముగా ముసల్మానుల జీవిత విధానమును సహజముగా చిత్రించెను. దీనిని చదువుటవలన జాగీర్దారీ సమాజపు ఆచార వ్యవహారములు, నైతికభావములు వస్త్రాద్యలంకారములు మొదలగు అనేక విషయములు అవగతములగును- ఇందు సంస్కృత శబ్దములును "భాషా" శబ్దములును బంగారు నగలో రతనాలవలె సుందరముగా ఉపయోగింపబడినవి. మీర్ అమ్మన్ "బాగో-బహార్" అమర రచన అతని రెండవ గ్రంథము. 'గంజె-ఖూబీ' ఫారసీలోని "అఖ్లాకె-మొహసినీ" అను గ్రంథమునకు అనువాదము. ఈయది ఫోర్ట్ విలియమ్ కాలేజీనుండి ప్రకాశితముకాక తరువాత బొంబాయినుండి ప్రకాశితమయినది.

ఫోర్ట్ విలియమ్ కాలేజీ రచయితలలో హైదర్ బక్ష్ 'హైదరీ' అనునతడు అందరికంటె అధిక గ్రంథములు వ్రాసెను. కాని అన్నియు ప్రకాశితము కాలేదు. అతడు దిల్లీ నివాసి. జీవితములో చాలభాగము బనారసులో గడపెను. అచట ఏమేని వ్రాసెనో లేదో కాని కలకత్తాలో కాలేజీ స్థాపించబడగానే అచటికి చేరి ఉద్యోగి యయ్యెను. అనేక గ్రంథములను అనువదించి కొన్ని స్వంత రచనలు చేసెను. క్రీ. శ. 1814 లో మరల బనారసునకువెళ్ళి క్రీ. శ. 1823 లో అచటనే మరణించెను.

'హైదరీ' రచనలలో "ఖిస్సయే-మెహరో-మాహ్", "లైలా-మజ్నూ". "హఫ్త్ పైకర్", "తారీఖె-నాదిరీ", "గుల్షనె-హింద్", "తోతా-కహానీ", "ఆరాయిషె-మహఫిల్" మఱియు "గులే-మగ్ఫిరత్" అనునవి పేర్కొన దగినవి. చివరి మూడును అత్యంత ప్రసిద్ధములు. "తోతా-కహానీ" క్రీ. శ. 1801 లో వ్రాయబడినది. ఇది క్రొత్తపుస్తకము కాదు. దకనీ ఉర్దూలో మొహ్మద్ ఖాదిరీ వ్రాసిన "తూతీనామా" అను గ్రంథమునకు సరళ శుద్ధ వ్యావహారిక భాషారూపము- ఈ గ్రంథము పలుతడవలు ప్రకాశితమైనది. "ఫార్బ్స్" అనునతడు లండనునుండి దీనిని అతి సుందరముగా ప్రచురించెను. "స్మాల్" అను నతడు ఆంగ్లమున అనువదించెను. 'హైదరీ' రచనలలో "ఆరాయిషె-మహఫిల్" అన్నిటికంటె గొప్పది. ఇందు అరబ్‌దేశపు ప్రసిద్ధదాత హాతిమ్ తాయీ యొక్క సముద్ర యాత్రలు ఏడు మనోహరముగా వర్ణింపబడినవి. ఈ యాత్రలు కాల్పనికములు. ఈ గ్రంథము ఒక ఫారసీ రచనపై ఆధారపడినది. అయినను హైదరీ ఇందు పెక్కు మార్పులు చేసినాడు. ఇది గిల్ క్రాయిస్ట్ కోరికపై క్రీ. శ. 1402 లో వ్రాయబడినది. ఇందలి భాష సరళము. మనోహరము- ఇదియు చాలసార్లు ప్రకాశితమైనది. "గులె-మగ్ఫిరత్" అనునది ముల్లాహుస్సేన్ వాయిస్ కాశిఫీ వ్రాసిన "రోజ తుష్షోహదా" అను గ్రంథమునకు అనువాదము. ఇది కాలేజీ కొఱకు వ్రాయబడినది కాకపోవచ్చును. అయినను కలకత్తానుండియే క్రీ. శ. 1812 లో ప్రకాశితమైనది. క్రీ. శ. 1845 లో ఒక ఫ్రెంచి రచయిత దీనిని స్వభాషలో అనువదించెను. హైదరీకవికూడ- అతడు గజలులు, ఖసీదాలు మఱియు మర్షియాలు రచించెను. అయినను అతని కీర్తికి కారణమైనవి అతని గద్యరచనలే. అతని భాష సరళమే అయినను మీర్ అమ్మను భాష కంటె భిన్నము. అమ్మన్ అరబీ, ఫారసీ శబ్దముల కంటె హిందీ శబ్దములనే ఎక్కువగా ఉపయోగించెను. హైదరీ ఫారసీ శబ్దములను ఎక్కువగా ఉపయోగించెను.

ఈ కాలేజీలోని ఇంకొక రచయిత మీర్ షేరలీ "అఫ్సోస్". ఇతడు కాలేజీ చేరక ముందే విఖ్యాతుడు. ఢిల్లీ, పట్నా మఱియు లఖ్నో నగరాలలోని విద్వద్గోష్ఠులలో పాల్గొనినవాడు. అతడు నివసించినది మీర్, సౌదా, మీర్‌హసన్ జురత్ మఱియు ఇన్షాల కాలము. అప్పటి కవిసమ్మేళనములలో అఫ్సోస్ స్వీయకవితా గానము చేయువాడు. క్రీ. శ. 1801 లో కలకత్తా చేరి గిల్‌క్రాయిస్ట్ సమ్మతితో ఒక ఫారసీ గ్రంథము అనువదించెను, క్రీ. శ. 1802 లో షేక్‌సాదీ రచించిన జగత్ప్రసిద్ధ గ్రంథము "గులిస్తాఁ"ను "బాగె-ఉర్దూ"అనుపేర అనువదించెను. ఇతని భాష ఫారసీ భూయిష్ఠము. ఇతని రెండవ గ్రంథము మున్షీ సుజాఁరాయే ఫారసీలో వ్రాసిన "ఖలాసతుత్తవారీఖ్" అను పుస్తకమునకు "ఆరాయిషె మహఫిల్" అను పేరిట ఉర్దూ అనువాదము. మేజర్ హెనరీ కోర్టు మఱియు జాఁ షేక్స్పియరు దీనిని ఇంగ్లీషులో తర్జుమా చేసిరి. ఈ పుస్తకము పలుతడవలు ప్రకాశితమైనది. ఫోర్టు విలియమ్ కాలేజీనుండి ఏక కాలమున వ్రాయబడిన రెండేసి మూడేసి గ్రంథములకు ఒకే పేరు పెట్టుట విచిత్రమయిన సంగతి. "ఆరాయిష్ మహఫిల్" అనుపేరు "హైదరీ" వ్రాసిన పుస్తకమునకును "అఫ్సోస్" అనువదించిన పుస్తకమునకును కలదు. "హైదరీ" రెండవ పుస్తకము "గుల్షనె హింద్" అనునది. ఆ కాలపువాడే అగు మీర్జాఅలీ "లుత్ఫ్" అను నతడు తన పుస్తకమునకును ఆ పేరే పెట్టెను. ఇట్లగుటకు కారణమేమన ఉర్దూ ఫారసీ భాషలలో పుస్తకముల పేర్లు అక్షరముల లెక్క ననుసరించి, వ్రాయబడిన సంవత్సరములపేర్లు వచ్చునట్లు ఉంచబడుచుండెను. ఇట్టి పేర్లను "తారీఖీనామ్" అందురు.

"మిర్జా అలీ లుత్ఫ్" ఢిల్లీ నివాసి. ఢిల్లీపాడువడిన పిదప అతడు లఖ్నో, పట్నాల తిరుగుచు కలకత్తా చేరెను. గిల్‌క్రాయిస్టును దర్శింపగా అతడు ఉర్దూ కవుల చరిత్ర వ్రాయుటకు ఆదేశించెను. అలీ ఇబ్రాహీమ్‌ఖాఁ వ్రాసిన "గుల్జారె - ఇబ్రాహీమ్"ను దృష్టియందిడుకొని "లుత్ఫ్" "గుల్షనె - హింద్" వ్రాసెను. ఇతని భాష కఠినము. అయినను ఇతని గ్రంథములో ఆ కాలపు కవులను గుఱించిన విషయములు చాల స్పష్టముగా సవివరముగా వ్రాయబడినవి. ఈ గ్రంథము కలకత్తాలో ప్రకాశితము కాలేదు. హస్తలిఖిత ప్రతియు లుప్తమయ్యెను. క్రీ. శ. 1906 లో హైదరాబాద రాష్ట్రములోని ఒక నదిలో కొట్టుకొని పోవుచు దొరకెను. అచటినుండి ప్రకాశితమయ్యెను. "లుత్ఫ్"హైదరాబాదలో చివరికాలము గడపి క్రీ.శ. 1822 లో మరణించెను.

ఢిల్లీనివాసి యగు మీర్ బహాదురలీ హుస్సేనీ కూడ కాలేజీలోని సాహిత్య నిర్మాణశాఖలో ఉద్యోగి. అతడు మీర్ హసన్ వ్రాసిన ప్రఖ్యాత మస్నవీ "ఖిస్సయే బేనజీర్-వ-బదర్‌మునీర్"ను "నస్రె-బేనజీర్" అను పేర గద్యమున వ్రాసెను. హుస్సేనీ రెండవ రచన "అఖ్లాకె-హిందీ" అను గల్ప సంగ్రహము. అది చాల లోకప్రియము. ఈ గల్పికలు సంస్కృతములోని నీతి కథలకు ఫారసీనుండిపొందిన తర్జుమాలు. క్రీ. శ. 1803 లో ఇది కలకత్తానుండి ప్రకాశితమయ్యెను. అతని మూడవ రచన "తారీఖె-ఆసామ్" అనునది. అదియు ఫారసీనుండియే అనూదితము. దీని ఫ్రెంచి తర్జుమా కూడ చేయబడినది. హుసేనీ గిల్‌క్రాయిస్ట్ వ్రాసిన ఒక వ్యాకరణమును కూడ సంక్షిప్తపఱచి సరళ శైలిలో వ్రాసెను. అది క్రీ. శ. 1816 లో కలకత్తానుండి ప్రకాశితమయ్యెను.

మజ్హరలీఖాన్ "విలా" ఢిల్లీలోని ఒక విద్వత్కుటుంబమునకు చెందినవాడు. సంస్కృత, ఫారసీ, హిందీభాష లెఱిగినవాడు. కవిత్వము కూడ వ్రాసినాడట. కాని అతని కవిత గూర్చి నేడు ఏదియు తెలియదు. క్రీ. శ. 1802 లో కలకత్తా చేరి కాలేజీకొఱకు అనేక గ్రంథములు వ్రాసెను. వానిలో "మాధవనల్ ఔర్ కామకుండలా", "వైతాళ పచ్చీసీ" - మఱియు "తారీఖె-షేర్‌షాహీ" అనునవి ప్రసిద్ధములు. "మాధవనల్ కామకుండలా" అనునది మోతీరామ్ "కవిషేర్" హిందీ గ్రంథమునకు భాషాంతరీకరణము. మొహమ్మద్‌షా పాదుషా కాలమున ఎవరో దానిని బ్రజభాషలో వ్రాయగా దానిని చూచి విలా ఉర్దూలో వ్రాసెనందురు. ఈ అనువాదమున "లల్లూలాల్" అను నతడు సహాయపడెను. అతనిని గూర్చి తరువాత వ్రాయబడును. అనువాదములోను బ్రజభాషాశబ్దములు మనోహరముగా చేరియున్నవి. ఈ గ్రంథము లెక్కలేనన్నిసార్లు ప్రకాశితమయ్యెను. ఇది ఆనాటి ఉర్దూభాషకు సుందరమగు నమోనా. "తారీఖె-షేర్‌షాహీ"కూడ ఫారసీనుండి అనువాదమైనది. ఫారసీ గ్రంథమును క్రీ. శ. 1865 లో "గార్సాన్-ద-తాసీ" ప్రకాశింప జేసెను.

మిర్జా కాజిమ్ అలీ "జవాన్" కూడ ఫోర్టువిలియమ్ కాలేజీ ఉద్యోగి. ఢిల్లీ నివాసియగు ఇతడు కలకత్తా చేరెను. క్రీ. శ. గిల్‌క్రాయిస్ట్ కోరికపై శకుంతలా నాటకమును ఉర్దూలో తర్జుమా చేసెను. ఈ గ్రంథమును సంస్కృతమునుండి "నివాజ్" అను రచయిత బ్రజభాషలో వ్రాసియుండెను. ఈ నాటకానువాదమున లల్లూలాల్‌జీ తోడ్పడెను. ఈ అనువాదము నాటక రూపమున కాక కథ రూపమున

చేయబడెను. "జవాన్" ఇంక కొన్ని గ్రంథములు వ్రాయుటేకాక లల్లూలాల్‌జీకి "సింహాసన్ బత్తీసీ" వ్రాయుటలో తోడ్పడి కొన్ని రచనలను పరిష్కరించెను.

"నిహాల్ చంద్ లాహోరీ" అను నతడు కాలేజీలోని ఇంకనొక ఉద్యోగి. అతడు ఢిల్లీనివాసియే అయినను పంజాబులో ఉండుట వలన లాహోరీ అనబడెను. అతడు క్రీ. శ. 1803 లో గిల్ క్రైస్ట్ కోరికపై "గుల్‌బకావళీ" కథను ఫారసీనుండి ఉర్దూలో వ్రాసెను. ఇది భారతదేశపు జానపద గాథ. దీనిని "ఇజ్జతుల్లా బెంగాళీ" అను నతడు ఫారసీలో వ్రాసెను. దానినే నిహాల్‌చంద్ సరళ సుందర శైలిలో తీయని పలుకుబళ్ళతో "మజ్హబె-ఇష్క్" అను పేర అనువదించెను. ఇది తొలిసారి క్రీ. శ. 1804 లో ప్రచురింపబడినది. తరువాత దీని ప్రచురణలు లెక్కలేనన్ని తడవలు వివిధ ప్రచురణాలయములనుండి వెలువడినవి. ఈ కథనే పండిత దయా శంకర్ నసీమ్ క్రీ. శ. 1838 లో "గుల్జారె-నసీమ్" అను సుప్రసిద్ధ మస్నవీగా రూపొందించెను. ఈ పద్యరచన ముందు "మజ్హబె ఇష్క్" విస్మృతమైనది.

లాహోరు నివాసియగు బేణీనారాయణ్ "జహాఁ" అను నతడు జాన్ గిల్ క్రైస్టు వెడలి పోయిన తరువాత ఫోర్టు విలియమ్ కాలేజీలో ఉద్యోగి అయ్యెను. అతడు కాలేజీ కొఱకు రెండు గ్రంథములు వ్రాసెను. ఒకటి "చార్ - గుల్షన్" అను ప్రేమకథ. రెండవది కవుల చరిత్ర. రెండవ గ్రంథము కప్తాన్ "రోబెక్" కోరిక మీద వ్రాయబడినది. ఇది క్రీ. శ. 1814 లో సమాప్తమయ్యెను. ఇందు 125 గురు కవుల సంక్షిప్త చరిత్రతోపాటు "జహాఁ" తన కవిత్వమునే చాలవఱకు చేర్చినాడు. కనుకనే దీనికి "దీవానె-జహాఁ" అను పేరు పెట్టినాడు.

గుజరాతు నివాసియగు ఒక బ్రాహ్మణుడు లాలాలల్లూలాల్‌జీ అనునతడు ఫోర్టు విలియమ్ కాలేజీలో హిందీ పుస్తక రచనకు నియుక్తుడయ్యెను. అతడు ఆధునిక హిందీ గద్య రచనకు జన్మదాత. "ప్రేమసాగర్", "రాజనీతి" అనునవేకాక మఱికొన్ని హిందీ పుస్తకములు అతని రచనలు. అతని హిందీ "ఖడీబోలీ"పై ఆధారపడినది. ఈ గ్రంథము లన్నియు ముఖ్యమైనవే కాని, ఈ ఉర్దూ సాహిత్య చరిత్రలో వాని వర్ణన చేయబడదు. లల్లూలాల్‌జీ ఉర్దూభాష తెలిసినవాడు. అతడు కాజిమలీ "జవాన్" సహాయమున "సింహాసన - బత్తీసీ"ని ఉర్దూలో వ్రాసెను. అది ఉర్దూ హిందీ రెండు భాషలలో ప్రకాశితమైనది.

ఈ రచయితలే కాక అమానతుల్లా "షైదా", హఫీజుద్దీన్, ఎకరామలీ, ఖలీలలీ "అష్క్" మఱియు మిర్జాజాన్ "తపిష్" అనువారు అనేక గ్రంథములు వ్రాసిరి. కొలది కాలములోనే ఫోర్టు విలియమ్ కాలేజీలో ఉర్దూ గ్రంథము లెన్నియో సమకూడెను. కాలేజీలో వ్రాయబడిన పుస్తకములను, ఉర్దూ గద్య వికాసమును సమీక్షింపదలచిన ఎన్నియో విషయములు దృష్టియందుంచుకొన వలసియుండును. మొదటి విషయము, ఆంగ్లేయులు ఈ కాలేజీని తమ లాభము కొఱకు స్థాపించి తమకు పనికివచ్చు గ్రంథములే వ్రాయించిరి. ఈ గ్రంథములలో తత్కాలీన పరిస్థితులను, ప్రజల దుస్థితిని, స్వాతంత్ర్య భావములను అన్వేషించుట నిష్ప్రయోజనము. ఆంగ్లేయులు ఉర్దూభాష నేర్చికొనుటకు తోడ్పడు విధముగా ఈగ్రంథములు వ్రాయించబడినప్పటికి కొన్ని గ్రంథములు ఉత్కృష్ట రచనలై గద్య వికాసమునకును తోడ్పడినవి.

ఇంక నొక విషయము; ఫోర్టు విలియమ్ కాలేజీ అధికారులు అనువాదముల పైనే శ్రద్ధ చూపిరి. కాని గంభీర విషయ ప్రధానములగు గ్రంథములు వ్రాయించరైరి. ఈ పుస్తకములు ఒక ఉద్దేశముతో, రాజకీయ, సామాజిక పరిస్థితులను దృష్టియందుంచుకొని వ్రాయించబడినవి. ఇవన్నియు ఫోర్టు విలియమ్ కాలేజీ వఱకే పరిమితములై యున్నందున ఇతరులు వీనిని గుఱించి అంతగా తెలిసికొనలేక పోయిరి. కనుక ఈ రచనలు సాధారణముగా ఉర్దూ గద్య వికాసముపై ఎట్టి ప్రభావము చూపలేదనియే చెప్పవచ్చును. ఒక విశేషము మాత్రము జరిగినది. అదే మన ఢిల్లీ, లఖ్నోల వాతావరణములలో సంప్రదాయ బద్ధమగు కవిత్వము వ్రాసికొనుచున్న కొందఱు సామాన్య కవులు ఈ కాలేజీ మూలమున నూత్న గద్య శైలికి జన్మదాతలగు సదవకాశము పొందిరి.

ఫోర్టు విలియమ్ కాలేజీ ఇవతల కూడ కొన్ని గద్య రచనలు చేయబడెను. వానిని గూర్చి కొంత కొంత తెలిసినది. ఈ సంక్షిప్త చరిత్రలో వాని సంక్షిప్త పరిచయమే చేయబడును.

మీర్ తకీ "మీర్" బంధువు మొహమ్మద్ హుస్సేన్ "కలీమ్" అను నతడు తన కాలమున మహాకవి. అతడు సూఫీ తత్త్వసంబంధమగు ఒక గూఢ గంభీర గ్రంథము "ఫుసూసుల్ – హేకమ్" అను దానిని ఉర్దూ గద్యమున అనువదించెను. బృందావన్, హకీమ్ మొహమ్మద్ షరీఫ్, మౌల్వీ కరీముద్దీన్ మొదలగువారు

గద్య రచనలు చేసిరి. ఎన్నియో గ్రంథములు వ్రాయబడినవి కాని, మనకు దొరికినవి కొన్నియే. ఆనాడు ప్రచురణాలయములు ఉండియు లేనట్లుండెను. హస్తలిఖిత గ్రంథములు లుప్తమైపోవుచుండెను. లభించిన వానిలో ఇన్షా వుల్లాఖాఁ "ఇన్షా" రచన "రాణీకేతకీ ఔర్ కుఁవర్ ఉదయభాఁకీ కహానీ" అనునది మహత్తరమయినది. దాని గొప్పతనము హిందీ విమర్శకులును ఉర్దూ విమర్శకులును అంగీకరించిరి. ఇన్షాను గూర్చి లఖ్నోకవులలో వ్రాయనైనది. ఈ కథను అతడు అరబీ, ఫారసీ శబ్దములు లేని శుద్ధ హిందూస్థానీ భాషలో ధారాళముగా వ్రాసినాడు. ఇది దేవనాగర లిపిలోను ప్రకాశితమైనది. ఇంకే దృష్టితో కాకున్నను భాషాదృష్టితోనైనను చదువదగిన గ్రంథమిది. "ఇన్షా" యొక్క బుద్ధితీవ్రత, కల్పనా చాతురి భావనవ్యత ఈ పుస్తకమున సంపూర్ణముగా వెల్లివిరిసినవి. అతని రెండవ రచన "దర్యాయె - లతాఫత్". ఇది ఫారసీ రచన అయినను ఇందు ఉర్దూ రచనల నమోనాలు విరివిగా చేర్చబడినవి. ఒక భారతీయుడు వ్రాసిన మొదటి ఉర్దూ లక్షణగ్రంథమిది. నేటివఱకు ఉపయోగపడుచున్న భాషావిజ్ఞాన కోశము కూడ ఈ గ్రంథమున ఆనాటి ఉర్దూ యొక్క చక్కని ఉదాహరణములు, వివిధ ప్రాంతముల భాషలోని భేదములు చక్కగా ప్రదర్శింపబడినవి. కొంతకాలము క్రిందట "ఇన్షా" మఱియొక రచన "సిల్కే - గుహర్" అనునది లభించినది. ఇది ఒక కథ. ఈ గ్రంథమంతట నిర్బిందుకములగు అక్షరములే ఉపయోగింపబడినవి. ఇదొక అలంకారము. ఈ అలంకారమును "ఇన్షా" వచన రచనలోను ప్రయోగించెను.

భారత దేశమున వహాబీ ఆందోళన నాయకులలో ఒకడు మోల్వీ ఇస్మాయిల్. ఈ ఆందోళనము 19 వ శతాబ్ది ప్రారంభమున సిఖ్ఖులు మఱియు ఆంగ్లేయుల విరుద్ధమున ప్రముఖమైనది. వహాబీలు ఇస్లాము మతములో కొన్ని సంస్కరణలు చేయదలచి తత్ప్రచారమును ఉల్లాసముతోను ఉత్సాహముతోను చేసిరి. ఈ సంబంధమున కొన్ని ఫారసీ రచనలును కొన్ని ఉర్దూరచనలును చేయబడెను. మోల్వీ ఇస్మాయిల్ ''తఖ్వియతుల్ - ఈమాఁ'' అను నొక ఉర్దూ గ్రంథమును వ్రాసెను. అది ధార్మిక కారణముల వలన ప్రఖ్యాతము.

ఈ యుగమున అన్నిటి కంటె సుప్రసిద్ధమగు రచన మీర్జా రజ్జబలీబేగ్ 'సురూర్' వ్రాసిన "ఫిసానయే - అజాయబ్" అనునది. "సురూర్" లఖ్నోలోని ప్రథమ గద్య రచయిత. అతడు క్రీ. శ. 1787 లో జన్మించి ఆనాడు ప్రచారములో నున్న విద్యలో నైపుణ్యము సంపాదించెను. అతడు కవిత్వమును వ్రాసి ఆదరణ

పాత్రుడయ్యెను. ఏదో విషయమున లఖ్నో పాదుషాయగు గాజియుద్దీన్ హైదర్ కోపించి అతనిని లఖ్నోనుండి వెడలగొట్టించెను. సురూర్' కాన్‌పూర్ చేరి మిత్రుడగు అసదలీ కోరికపై "ఫిసానయే - అజాయెబ్" రచన ప్రారంభించెను. వాజిదలీషా సింహాసన మెక్కినంత "సురూర్"ను క్షమించి లఖ్నోకు పిలించుకొని ఆస్థానకవిగా నియమించెను. సిపాయీల విప్లవము తరువాత లఖ్నో విడచిపెట్టవలసి వచ్చెను. క్రీ. శ. 1859 తరువాత తన అన్యగుణముల వలన మహారాజా బనారస్, మహారాజా అల్వర్ మఱియు మహారాజా పటియాలాల దగ్గఱ సన్మానములందు చుండెను. క్రీ. శ. 1863 వ సం॥న నేత్ర చికిత్సకై కలకత్తాకు వెళ్ళెను. అచటి నుండి తిరిగి వచ్చి క్రీ. శ. 1867 లో మరణించెను.

సురూర్ రచనలు అనేకములు. వానిలో "ఫిసానయే-అజాయబ్" సర్వశ్రేష్ఠము. అప్పటి కథలలోవలె ఇందును అస్వాభావిక విషయములు కోకొల్లలు. ఈ కథపై "పద్మావత్" మఱియు "అలిఫ్ లైలా" కథల ప్రభావము స్పష్టముగా కాన్పించును. కొందఱు దీనిని ప్రాచీన గాథలను నవీన నవలాలను కలుపు సంకెలగా భావింతురు. ఇందు పురాతన కథలలోవలె నైతిక భావప్రచారమును, అసంభవ సంఘటనల కల్పనాత్మక వర్ణనలును చేయుచు మనోహరత్వము కలిగించు ప్రయత్నము చేయబడి నది. శైలి సుందరము.- వాక్యములు అంత్య ప్రాసనియమము కలవి. ఇందు మీర్ అమ్మన్ సరళభాష పరిహసింపబడినది. సురూర్ దృష్టిలో సరళభాష కళకాదు. అలంకారములు అత్యవసరమయినవి. అతడు సందర్భము ననుసరించి శబ్దముల నెన్నుకొనుటలోను హిందీ శబ్దములను ప్రయోగించుటలోను కడునేర్పరి. ఈ పుస్తకము వలన లఖ్నో సభ్యత చాల స్పష్టమగును. జననము, మరణము, వివాహ సంస్కారము, ఆనాటి జ్ఞానాదికము, ఆచార వ్యవహారములు సుందరముగా వర్ణితములు. కథ వాస్తవిక జీవితమునకు దవుదవ్వుల నుండుట వలన నేటి పఠితలకు ఆనందప్రదము కాజాలదు. అయినను ఇది ఉర్దూ భాషలోని గొప్ప రచనలలో ఒకటి అనేక పర్యాయములు అచ్చయినది.

'ఫిసానయే-అజాయబ్' కాక 'సురూర్' ఇతర రచన లెన్నియో చేసెను. వానిలో "సురూరె-సుల్తానీ", షరరె-ఇష్క్" "షిగూఫయే-మొహబ్బత్" "గుల్జారె-సురూర్", "షబిస్తానె-సురూర్" మఱియు "ఇన్షాయె-సురూర్" అనునవి పేర్కొనదగినవి. "సురూరె సుల్తానీ'' క్రీ. శ. 1847 లో వాజిదలీషా ఆ దేశమున వ్రాయబడినది. అది ఒక ఫారసీ రచనకు అనువాదము. అందలి శైలి 'ఫిసానయే-

అజాయబ్' వంటిదే. "షరరె-ఇష్క్" సురుచిర శైలిలో వర్ణితమైన పక్షుల ప్రేమ గాథ. దాని రచన క్రీ. శ. 1856 లో జరిగినది. ఆ సంవత్సరమే "షిగూఫయే-మొహబ్బత్" కూడ వ్రాయబడినది. అది అంతకు పూర్వమే మెహర్‌చంద్ ఖత్రీ చేత వ్రాయబడిన ఒక ప్రేమ కథ. 'సురూర్' దానిని తన శైలిలో రచించెను. "గుల్జారె-సురూర్" ఒక మత గ్రంథమునకు అనువాదము. దానికి మీర్జాగాలిబ్ ప్రస్తావన వ్రాసెను. "షబిస్తానె-సురూర్" లో "అలిఫ్‌లైలా" లోని కొన్ని కథలు అనువదించబడినవి. ఇన్షాయె-సురూర్" అతని ఉత్తరముల సంగ్రహము. అది అతని మరణానంతరము సేకరింపబడినది.

ఈ సమయముననే అవధులో ఒక గొప్ప రచన చేయబడెను. ఫకీర్ మొహమ్మద్‌ఖాన్ "గోయా" షాహీ సైన్యములో రిసాలదారుడు. ఆతడు ప్రతిభా శాలి. ఆ నాటి మహాకవి. తన కవితలను మహాకవి "నాసిఖ్"కు చూపించువాడు. క్రీ. శ. 1850 లో అతడు మరణించెను. "గోయా" క్రీ. శ. 1835 వ సంవత్సర మున ప్రసిద్ధ ఫారసీ గ్రంథమగు "అన్వారె-సుహైలీని" "బూస్తానె-హిక్మత్" అను పేర అనువదించెను. అందలి కథలు హితోపదేశము నుండియు పంచతంత్రము గ్రహింపబడినవి. అతని భాష సరళముకాకున్నను "సురూర్" భాషవలె అలంకార భూయిష్టము కాదు. రెండు సంవత్సరముల తరువాత "నీమ్‌చంద్ ఖత్రీ" అను నతడు ఒక ఫారసీ కథను, "ఖిస్సయే-గుల్-వ-సనోబర్" అనుపేర అనువదించి ప్రచురించెను. ఇంక కొందఱ పేర్లు లభించును కాని ఇచట వారిని గూర్చి వ్రాయ బడదు.

"దహిలీ కాలేజీ" మఱియు "దహిలీ వర్నాకులర్ ట్రాన్‌లేషన్ సొసైటీ" వర్ణనచేయనిచో ఉర్దూ గద్యవికాసగాథ అసమాప్తమగును. ఏలయన ఫోర్టు విలియమ్ కాలేజీలో గల్పికలు, చరిత్ర మఱియు మతగ్రంథముల అనువాదము జరిగినది. ఈ కాలేజీలో గణితము, విజ్ఞానము, జ్యోతిషము, తర్కము మఱియు దర్శనశాస్త్ర ముల అనువాదము జరిగినది. క్రీ. శ. 1804 తరువాత దిల్లీ ఈస్టిండియా కంపినీ ప్రభావ వశమై ఉండెను. కంపినీవారు అచ్చట కూడ ఇతర చోట్లలో పఱచి నట్టి వాగుర పఱచిరి. దిల్లీ హిందూముస్లిముల సంస్కృతికి పురాతన కేంద్రము. ఇచట ఇరుతెగలవారును కలిసిమెలసి ప్రేమపూర్వకముగా నివసించుచుండిరి. ఇతర ప్రదేశములలో ఉత్పన్నమైన నూతన పరిస్థితులే ఇచట ఉత్పన్నము లగుచుండెను. అయినను ప్రాచీన సంప్రదాయములు గల ఈ నగరము అంత సులువుగా లొంగి

పోలేదు. జీవితాసరముల ననుసరించి క్రొత్తరకపు శిక్షణాలయము స్థాపించుట ఆవశ్యకమయ్యెను. క్రీ. శ. 1825 వ సంవత్సరమున దిల్లీ కాలేజి స్థాపింపబడెను. అచట ఉర్దూ మాధ్యమికభాషగా సమస్త విషయముల ఉన్నతవిద్య బోధింపబడు చుండెను. సర్కారువారి రిపోర్టు ప్రకారము ఈ యోజన చాలవఱకు ఫలవంత మయ్యెను. క్రీ. శ. 1828 న ఈ కాలేజీలో ఆంగ్ల భాషా శాఖ నెలకొల్ప బడెను. దిల్లీ నివాసులు ఈ విషయమున చాల వ్యతిరేకించిరి. కనుక ప్రభుత్వ శాసనము పునఃపరిశీలించబడెను.

ఈ కాలమున బోధనాభాష ఆంగ్లేయమనియు, కార్యాలయముల భాష ఫారసీ యనియు తెల్పబడినను కాలేజీ విద్య ఉర్దూ ద్వారముననే బోధింపబడుచుండెను. కాలేజీ నిబంధనలు రూపొందించు "ఎడ్యుకేషన్ కమిటీ" కొన్ని పుస్తకములను ఉర్దూలో తర్జుమా చేయించెను. క్రీ. శ. 1841 లో 'దహిలీ వర్నాకులర్ ట్రాన్స్లేషన్ సొసాయిటీ' స్థాపింపబడెను. దాని సంరక్షణమున 125 కంటె అధిక గ్రంథములు వ్రాయించబడెను. ఈ సొసాయిటీ సాధారణముగా ప్రజల సహకారమున నడచుచుండెను. అప్పుడప్పుడు ప్రభుత్వ సహాయమును లభించుచుండెను. ఇచట రచింపబడిన పుస్తకముల యొక్కయు అనువదింపబడి ప్రకాశితములైన పుస్తకముల యొక్కయు సూచీ పత్రము ఇచ్చుటకు వీలులేదు. కాని వ్రాయబడిన విషయముల గూర్చి తెలుపబడును. దానివలన ఈ సొసాయిటీ యొక్క మహత్త్వము బోధపడును. రామాయణము, మహాభారతము, వీరావతి ధర్మశాస్త్రము, శాకుంతలము, రఘువంశము మొదలగువాని అనువాదములు సౌదా, మీర్, దర్ద్, జురాత్ మొదలగు వారి కావ్యసంగ్రహములు; భారతదేశము, పర్షియా, గ్రీసు, ఇంగ్లాండు, రోము మొదలగు దేశముల చరిత్ర; గణిత విజ్ఞానముల సమస్తశాఖలగూర్చిన గ్రంథములు మొదలుగాగల సమస్త విషయములగూర్చి సొసయిటీ గ్రంథములు తయారు చేయించెను. ఆంగ్లము, ఫారసీ, అరబీ మఱియు సంస్కృత భాషలనుండి చాల అనువాదములు చేయబడెను. కాని విచారకరమగు విషయమేమన వీనిలో చాల గ్రంథములు నేడు లభించవు. ఇండియా ఆఫీసు లైబ్రరీ (లండన్) లో మాత్రము చాలవఱకు కలవు. అనువాదకులలో ధర్మనారాయణ, అయోధ్యాప్రసాద్, హరివర్మన్‌లాల్, శీతలాప్రసాద్, కాశీరాఖ్, వజీరలీ, గులామలీ, మొహమ్మద్ అహసన్ మఱియు రామచంద్రుల పేర్లు వినవచ్చును. అందఱిలో మాస్టర్ రామచంద్ర గొప్పవాడు.

రామచంద్ర దిల్లీ కాలేజీలో చదివి తరువాత అచటనే యూరోపియన్ విజ్ఞాన శాఖలో అధ్యాపకుడయ్యెను. అతనికిగణితము అభిమానశాస్త్రము. అతడు అనేక గణిత గ్రంథములు అనువదించెను. అతడు వ్రాసిన ఒక గణితగ్రంథము ఇంగ్లాండులో చాల ఆదరింపబడెను. రామచంద్ర అనేక సాహిత్య గ్రంథములను కూడ వ్రాసెను. వానిలో "అజాయబె-రోజుగార్" మఱియు "తజ్కిరతుల్-కామిలీన్" అనునవి ప్రసిద్ధములు. అతడు క్రైస్తవ మతములో చేరుటవలన దిల్లీలోని హిందూ ముసల్మానుల కడ అతని మాన్యత కొంత తగ్గిపోయెను. అయినను అతని యోగ్యత మఱియు విజ్ఞత అతనికి తిరిగి మాన్యత కలిగించెను. ఈ కాలపు రచయితలు మఱి కొందఱు కలరు. వారిని గూర్చి ముందటి అధ్యాయమున వ్రాయబడును.

ఇది ఉర్దూ గద్య వికాసపు సంక్షిప్త రూపము. దీనిని చదువుట వలన ఉర్దూ గద్య రచన 15 వ శతాబ్దమున ప్రారంభింపబడినను దానికి వ్యాప్తి మఱియు బహుముఖ వికాసము 19 వ శతాబ్ది పూర్వార్ధముననే కల్గినవని తెలియును. దిల్లీ కాలేజీ యొక్క పాఠ్యక్రమ ప్రణాళికను చూచినచో విజ్ఞాన శాస్త్రమును మఱియు ఇతర విషయములను ఎట్లు బోధించుచుండిరో అను ఆశ్చర్యము కలుగును. కాని ఫల స్వరూపములగు దాని రిపోర్టులను చూచితిమేని అన్ని విషయములను బోధించుటకు మాధ్యమిక భాషగా ఉండదగిన స్తోమత ఆనాడు ఉర్దూ భాషకు కలిగినదనియే తెలియును.

ఉర్దూ గద్యము ఏ విధముగా సంపూర్ణముగా జీవన సంఘర్షణకు దర్పణమైనదో దాని వివరణము ముందటి అధ్యాయములలో వచ్చును.



# ఎనమిదవ అధ్యాయము

## నవ్యధారకంటె ముందు - పద్యమును, గద్యమును

ఉర్దూభాష ఏ సామాజిక, రాజకీయ ఆవశ్యకతను సమైక్యత ద్వారమున నెఱవేర్చుచుండెనో దాని ప్రభావము వలన అతివేగముగా లోకప్రియమగు చుండెను. రేప్పుడది దిల్లీ మఱియు లఖ్నో కేంద్రములలోనే పరిమితమైయుండక క్రొత్త క్రొత్త కేంద్రములను స్థాపించుకొనుచుండెను. రాజకీయ పతనము వలన దేశములో కలిగిన పరివర్తనమును కడుకొలదిమంది మాత్రమే గుర్తించిరి. కవులును, రచయితలును పూర్వసంప్రదాయములను అంటిపెట్టుకొనియుండిరి. భారతదేశమున ఆంగ్లరాజ్యము స్థాపింపబడుట వలన, నూతనమగు ఆర్థిక స్థితియు, సామాజిక స్థితియు ఏర్పడుట వలన, 19 వ శతాబ్ది మధ్యభాగమున లేచినట్టి నూత్నలహరిని గుఱించి ముందు ఉల్లేఖింపబడును. తుఫాను వచ్చుటకు ముందు స్తబ్ధతను, శిథిలతను సూచించు దశను మాత్రమే ఇచట చూడవలసి యున్నది. పరిస్థితుల మార్పును అనుభవించి గ్రహించిన వారును సాహిత్యములో ఎట్టి పరివర్తనమునకును ఇష్టులై లేకుండిరి. సంప్రదాయములకుగల శక్తిని నిరూపించుటకు ఇదొక చక్కని ఉదాహరణము.

దిల్లీ లఖ్నోలు పూర్వకేంద్రములే. రామపూర్ మఱియు హైదరాబాదలలో గొప్ప కేంద్రములు స్థాపింపబడెను. ఒక దర్బారునుండి ఇంకొక దర్బారునకు పెద్ద అంతరమేదియు ఉండదు. కనుక సాహిత్య శైలిలో కలిగిన నవీనతనుచూచి మూల సిద్ధాంతములలో మార్పుకలుగు చుండెనని తలంపరాదు. దిల్లీలో గాలిబ్, జోఖ్ మఱియు మోమినుల శిష్యులును, లఖ్నోలో ఆతిష్ మఱియు నాసిఖుల శైలిని అనుకరించు వారును కొంత పూర్వమార్గమును అనుసరించుచు కొంత నవీనమార్గమును అన్వేషించు చుండిరి. క్రీ. శ. 1857 వ సంవత్సరపు విప్లవము తరువాత దిల్లీ రాజ్యమును లఖ్నో రాజ్యమును సమాప్తిచెందెను. వాజిదలీషా మటియా బుర్జ్ (కలకత్తా) లో బందీ అయి యుండగా లఖ్నో లోని కవులు కొందఱు అతని వెంట ఉండిరి. బహాదుర్‌షా జఫర్ సాహిత్య క్షేత్రమునకు దూరమున రంగూనులో పడి యుండెను. హైదరాబాదలో కవులకు గొప్ప ఆదర సత్కారములు జరుగుచుండెను.

పెద్దపెద్ద వేతనములపై కవులు అచటికి ఆహ్వానింపబడుచుండిరి. పూర్వసంప్రదాయములననుసరించి ఉర్దూసాహిత్య వికాసమునకు కావలసిన అవకాశములుండెను. రామపురము నవాబు స్వయముగా కావ్యరచన చేయుటయేకాక కవులను, విద్వాంసులను, కళావేత్తలను పిలిపించి తన ఆస్థాన శోభ పెంపుచేసికొనెను. అవియేకాక పట్నా, ముర్షిదాబాద, టాండా, టోంక్, భూపాల్, మఁగ్రోల్ మఱియు అల్వర్ మొదలగు సంస్థానములు కవులను ఆకర్షించు చుండెను- ఇచట ఆ కవులను సాహిత్యవేత్తలనుగూర్చి సవిస్తరముగా వ్రాయుట అసంభవము. ప్రముఖ కవులను వర్ణించుచు ఆనాడు దేశములో నలుమూలల ఉర్దూ సాహిత్యము ఎట్టి వికాసము చెందుచుండెనో అన్ని జాతులవారును మతములవారును ఆ వికాసమునకు ఎట్లు తోడ్పడుచుండిరో తెలుపబడును.

కావ్యరచనతోపాటు గద్య వికాసమును జరుగుచుండెను. ఉర్దూ దేశ భాష అనబడెను. ఆంగ్లప్రభుత్వము క్రీ. శ. 1835 లో ఫారసీని తొలగించి ఉర్దూను ప్రభుత్వ భాషయని చాటింపించెను. దీని ప్రభావము "ప్రెస్సు" పై పడెను. ఎన్నియో క్రొత్త క్రొత్త ముద్రణాలయములు స్థాపింపబడి ఎన్నియో పత్రికలు ప్రకాశితములు కాజొచ్చెను. ఇంతకు ముందే గద్యరచన లనేకములు సిద్ధమయ్యెను- కాని ప్రచురణ సౌకర్యములు లేనందున వ్యాప్తి చెందకుండెను. కవితలు వేగముగా ఒకచోటినుండి వేఱొకచోటికి చేరుచుండెను. గద్యరచన మాత్రము హస్త లిఖిత రూపముననే పడియుండెను. మత సంబంధ రచనల ప్రతులు మాత్రము తయారగుచుండెను. ప్రెస్సు స్థాపించుట వలన గద్య వికాసమునకు వలసినంత సహాయము లభించెను.

అది భారతవర్షమున విచిత్ర సమస్యలు రేకెత్తించిన యుగము. ఒక వైపు నవీనములగు ఆర్థిక స్థితులవలన కలిగిన నవీనత- వేఱొక వైపు సంప్రదాయబద్ధమగు పురాణత- పల్లెలు వెనుకబడి నిద్రించుచుండెను. నాగరికులు క్రొత్తప్రాతల నడుమ తమ మార్గమును అన్వేషించు చుండిరి. ఈ యుగ విశ్లేషణము కష్టమగుటకు మఱికొన్ని కారణములు కలవు. సామ్రాజ్య యుగము నశించియు నశింపకుండెను. పురాతన అద్యతన ప్రవాహములు సమానాంతర రేఖలవలె సాగుచుండెను. అధునాతన ప్రవాహముయొక్క వర్ణన ముందటి అధ్యాయమున చేయబడును. ఇచట శతాబ్దముల తరబడి సాగుచున్న సంప్రదాయమును నిలుపుటకే ప్రయత్నింపబడును. దిల్లీలో గాలిబ్, మోమిన్ మఱియు జౌఖుల శిష్యులగు "షేఫ్తా", మజ్రూ, నసీమ్, జహీర్, అన్వర్, సాలిక్ మఱియు "దాగ్" మొదలగు వారును, లఖ్నోలో

వాజిదలీషా "అఖ్తర్", మునీర్, అసీర్, షౌఖ్, ఖలఖ్, అమానత్, జలాల్, అమీర్ మీనాయీ మొదలగువారును తమ గురువుల మార్గమునే అనుసరించుచుండిరి. శైలి క్రొత్తదే అయినను వారి చేతనలో ఎట్టి నవీనతయు లేకుండెను. ఈ కవుల వలన ఖసీదా, మస్నవీ, గజల్, మర్సియా మొదలగువాని అన్నిటిలో అభివృద్ధి జరిగినది. కాని అందలి అధిక భాగము సంప్రదాయ స్తబ్ధతకు గుఱియైనది. ఈ కవులలో అనేకులు రామపూర్, హైదరాబాద మొదలగు ఆస్థానములు చేరి కావ్య రచనను పెంపుచేసిరి. ఇచట వారి సంక్షిప్త వర్ణన చేయబడును. విస్తార వర్ణన వలన అధ్యాయము చాల పెఱిగిపో గలదు.

నవ్వాబు ముస్తఫాఖాఁ "షేఫ్తా" ఉర్దూలో "మోమిఁ" శిష్యుడు- ఫారసీలో "గాలిబ్" శిష్యుడు. ఇతని తండ్రికి ఆంగ్ల ప్రభుత్వము వలన ఒక పెద్ద పరగణా దొఱకెను. అట్లగుట అతనిది గౌరవనీయమగు కుటుంబము. షేఫ్తా దిల్లీలో పెద్ద పెద్ద విద్వాంసుల దగ్గఱ శిక్షణపొంది అనేక విద్వాంసుల మైత్రి సంపాదించెను- విప్లవములో ఆంగ్లేయులు అతనిని ఉపబందిగాచేసి తరువాత నిర్దోషి యని విడిచి పెట్టిరి. అతని విజ్ఞానమును నైపుణ్యమును గాలిబ్ మహాకవియే అంగీకరించెను- ఇరువదొకయేండ్ల వయములోనే అతడు తన కావ్యసంగ్రహమును సిద్ధపఱచుకొనెను. 33 ఏండ్లవయమున రాజు యాత్ర చేసి వచ్చి ఆనాటినుండి కావ్యరచన తగ్గించెను. క్రీ. శ. 1869 లో మరణించెను.

ఉర్దూ కావ్యసంగ్రహమే కాక "షేఫ్తా" ఫారిసీలో ఒక కావ్యసంగ్రహమును మఱికొన్ని గ్రంథములును రచించెను. అందు "గుల్షనె-బేఖార్" ప్రసిద్ధమైనది. ఆ పుస్తకమున ఉర్దూకవుల జీవిత విశేషములును, కావ్యగుణములును సంక్షేపముగా సమీక్షింపబడెను. దానివలన అతని విమర్శనాశక్తి తెల్లమగును. అతడు మంచి కవియే కాని కవిగా ఆదరణపాత్రుడు కాడయ్యెను- విమర్శకుడుగానే గొప్ప యశము గాంచెను. అధికముగా అతడు గజలులే వ్రాసెను. అవన్నియు ప్రభావవంతమైనవి. వాస్తవిక భావనతో కూడినవి. మనోభావముల ఊహాచిత్రములు సుందరమగు సుకుమారశైలిలో రచించుట యందతడు నేర్పరి. అతిశయోక్తులు లేకయే అతని కవిత హృదయంగమము. ఆ విషయమున అతడే గర్వించెను. గాలిబ్, మోమిఁ మఱియు హాలీ మొదలగువారు అతని కావ్యసంబంధమగు జ్ఞానమును ప్రశంసించిరి.

ఉదాహరణమునకై కొన్ని పద్యపాదములు .—

షాయెద్ ఇసీకా నామ్ మొహబ్బత్ హై "షేఫ్తా"
ఇక్ ఆగ్‌సీహైసీనేకే అందర్ లగీ హువీ. 1

*        *        *        *

లో షేఫ్తా కి ధూమ్‌థీ హజ్రత్ కే జుహద్ కీ
మై క్యా కహూఁ కీ రాత్ ముఝే కిస్‌కే ఘర్ మిలే. 2

*        *        *        *

హజార్ దామ్‌సె నిక్లాహూఁ ఏక్ జుంబిష్‌మేఁ
జిసే గురూర్ హో ఆయే కరే షికార్ ముఝే. 3

*        *        *        *

ఇజ్‌హారే ఇష్క్ ఉస్‌సె న కర్నాథా షేఫ్తా"
యే క్యాకియాకె దోస్త్‌కో దుష్మన్ బనాదియా. 4

*        *        *        *

కిస్‌లియే లుత్ఫ్‌కీ బాతేఁ హైఁ ఫిర్
క్యాకోయీ ఔర్ సితమ్ యాద్ ఆయా. 5

*        *        *        *

---

1. ఎదదలో అగ్నివలె తగిలియున్నది దీని పేరే ప్రేమ కావచ్చును.
2. పావిత్ర్యమున ప్రఖ్యాతుడైన "షేఫ్తా" రాత్రి ఎవరి యింట కనిపించెనో ఏమి చెప్పుదును?
3. ఒక్క ఊపులోనే వేయి వలలనుండి విడివడితిని. గర్వము వచ్చి నన్ను బంధింతురు గాక.
4. ప్రేమ ప్రకటన చేయవలసినది కాదు. అట్లుచేసి మిత్రుని శత్రువుగా మార్చుకొంటిని.
5. మరల ప్రేమ ప్రస్తావన యేల? ఏదేని బాధించు పన్నుగడయా?

మీర్ మహెదీ "మజ్రూ" గాలిబ్ ప్రియశిష్యుడు. పానిపట్టు నివాసి. అయినను అధికకాలము ఢిల్లీలోనే గడపుచుండెను. గాలిబ్ అతని పేర చాల ఉత్తరములు వ్రాసినాడు. వానివలన వారిద్దఱి స్నేహసంబంధములు స్పష్టపడును. విప్లవము తరువాత అతడు మహారాజా అల్వార్ ఉద్యోగములోచేరి చివరికాలమున రామపురము వెళ్ళెను. అచటనే క్రీ. 1892 లో అతని కావ్యసంగ్రహము ప్రకాశిత మయ్యెను. "మజ్రూ" దీర్ఘాయువుపొంది క్రీ. శ. 1902 లో మరణించెను. అతనిది ఢిల్లీలోని శుద్ధ వ్యావహారిక భాష – సరళభాషలోనే చక్కని పద్యములు వ్రాసెను. సుప్రసిద్ధ విమర్శకుడగు మోలానా "హాలీ" అతనిని ప్రశంసించెను.

కొన్ని ఉదాహరణములు :—

సబ్ర్‌కే ఫాయిదే బొహత్ హైఁ వలే
దిల్‌హీ బస్ మె నహీ తో క్యా కీజే. 1

*　*　*　*

దిల్‌కో కోయీ బచానకే క్యోంకర్
ఉస్కే అందాజ్ హైఁ ఖయామత్ కే. 2

*　*　*　*

దిల్ హీ సమ్ఝే హై కుఛ్ తడప్‌కో మేరే
చర్ఖ్‌మే లుత్ఫే-ఇజ్‌తెరాబ్ కహాఁ. 3

అఫ్జరలీఖాన్ "నసీమ్" ఢిల్లీ నివాసి. "మోమిన్" శిష్యుడు – కలిగిన కుటుంబమునకు సంబంధించినవాడు. కనుక ఆడంబరముగా కవి సమ్మేళనములు జరిపించువాడు. పితృమరణానంతరము సోదరులతో జగడమాడి లఖ్నోకు వెడలెను.

---

1. ఓర్మి వలని లాభములు అనేకములు. అయినను హృదయమే స్వాధీనము కానప్పుడు ఏమి చేయవచ్చును ?

2. ఆమె విధానము ప్రళయాంతకము, హృదయము నెవరేని ఎట్లు కాపాడుకొనగలరు ?

3. నా ఉద్వేగమును హృదయమే గ్రహింప సమర్థము. మెఱపులో ఉద్వేగ మాధుర్య మెచ్చటిది ?

అచట కీర్తితోపాటు అనేకులగు శిష్యులను సంపాదించెను. విప్లవకాలమున తన జన్మ భూమికి దూరముగా లఖ్నోలో దైన్యమును అనుభవించెను. "నవల్ కిశోర్ ప్రెస్సు"లో "అలిఫ్ లేలా" (అరేబియన్ నైట్సు) కథలను పద్యరూపమున రచించు పనిలో కుదిరెను. కాని ఆ పని సమాప్తము చేయలేనందున మిగిలినది మున్షీ తోతారామ్ పూరించెను. లఖ్నోలో అతడు సగర్వముగ దిల్లీభాషను ప్రచారము చేసెను. అయినను అతనిపై లఖ్నో భాషాప్రభావము కొంతపడినదని భాషాభిజ్ఞుల అభిప్రాయము - అతని కవితా శైలిపై "మోమిన్" ప్రభావము కననగును. అతని కావ్యసంగ్రహము ప్రకాశితమైనది. కాని సాధారణముగా ప్రజల కది అపరిచితము. అతనికంటె అతని శిష్యుడు అమీరుల్లా "తస్లీమ్" గొప్ప కీర్తి గడించెను.

ఉదాహరణ కొఱకు రెండు పద్యములు:—

నామ్ మేరా సున్తేహీ షర్మాగయే
తుమ్‌నెతో ఖుద్ ఆప్కో రుస్వాకియా 1

* * * *

జబ్ దేఖియే ఖరార్ నహీ ఏక్ హాల్‌పర్
మేరా సా అబ్‌తో హాల్ హువా రోజ్‌గార్‌కా 2

దిల్లీలోని మఱియొక కవి "జహీర్" 14 ఏండ్ల వయమునవే "జౌఖ్" శిష్యుడయ్యెను. విప్లవానంతరము జీవికకై పలుచోట్లు తిరిగెను. నాలుగేండ్లు రామపూర్‌లో, నాలుగేండ్లు అల్వర్‌లో, 19 ఏండ్లు జయపూర్‌లో, 15 ఏండ్లు టోంక్‌లో మఱియు చివరి కాలము హైదరాబాదలో గడపెను. "జహీర్" విశేషముగా గజలులే వ్రాసెను. ఇన్ని దర్బారులు తిరిగిన కవికి ఖసీదాలు వ్రాయుట అనివార్యము. ఖసీదాలు

1. నా పేరు వినినంతనే సిగ్గుపడి నిన్ను నీవే నిందపాలు చేసికొంటివి. (ఈ పద్యపాదమునే ఈ గ్రంథకర్త పండిత్ దయాశంకర్ "నసీమ్" రచనగా నాలుగవ అధ్యాయమున ఉల్లేఖించెను. ఇద్దఱి ఉపనామము లొకటియే అయినందున ఈ పొరపాటు జరిగియుండును.
—అనువాదకుడు

2. నా గతియే కాలమునకు పట్టినది. ఒక చక్కి నెమ్మదియే (స్థిరత్వమే) లేదు.

ఇతర కవితలు వ్రాసెను. అయినను గజలులే కీర్తి తెచ్చినవి. అతడు నాల్గు కావ్య సంగ్రహములు సిద్ధపఱచెను. మూడు ప్రకాశితములు.

జహీర్ "జోఖ్" శిష్యుడు. అయినను అతని కవితలో మోమిౝ శైలి గోచరించును. మోమిౝవలె అతడును ప్రేమానుభూతులను, మనోభావములను సుందరముగా సుకుమారముగా చిత్రించును. అతని భాష ఫారసీ మిశ్రమయ్యును సరళము. అతని తమ్ముడు "అన్వర్" అను నతడును పేరుగల కవి. అతడు తొలుత తన పద్యములను "జోఖు"కు తరువాత "గాలిబ్"కు చూపించుచుండెను. విప్లవానంతరము అతడు జయపురమునకు వెడలి యువావస్థలోనే మరణించెను. అతనివి రెండు కావ్యసంగ్రహము లుండెనని చెప్పుదురు. కాని అవి నష్టమైనవి. "ఖుమ్ - ఖానయే - జావీద్" వ్రాసిన సుప్రసిద్ధుడగు లాలా శ్రీరామ్ అతని పద్యములు సేకరించి ఒక చిన్న కావ్యసంగ్రహముగా ప్రకాశింప జేసెను. అతని గజలుల పైనను జహీర్ వలెనే గాలిబ్ మఱియు మోమినుల ప్రభావము కలదు.

దిల్లీనగరము కవులతో నిండియుండెను. వేల సంఖ్యలో కవులు కావ్య నిర్మాణము చేయుచుండిరి. కాని అంతిమ యుగమున "దాగ్" కు కలిగిన కీర్తి ఇంకెవనికి కలుగలేదు. అతనిపేరు నవ్వాబ్ మీర్జాఖాన్ - ఫిరోజుపూరులోని ప్రసిద్ధ అమీరగు నవ్వాబు షమ్సుద్దీను కొడుకు. ఆరేండ్ల వయము వచ్చునప్పటికి అతనికి పితృ వియోగము కలిగెను. అతని విధవ తల్లి దిల్లీ చక్రవర్తి యగు బహాదూర్‌షా జఫర్ కుమారుడగు మీర్జాఫకురూతో 'నికా' చేసికొనెను. ఇట్లు విప్లవము "దాగ్" రాజభవనములో పెరిగెను. అచటనే విద్యాభ్యాసము చేసి కావ్యరచనకు ఉపక్రమించెను. అపుడు దిల్లీకోటలో మహాకవి జోఖ్ కీర్తి వ్యాపించి ఉండెను. పాదుషాయును రాజకుమారులును, రాజకుమార్తెలును అందఱును అతని శిష్యులే. దాగ్ కూడ తన కవితలను అతనికే చూపించుచుండెను. విప్లవములో మొగల్ పరివారము నశించినంత "దాగ్" తన పరివారముతో రామపురముచేరి అచట ఒక ఉద్యోగము సంపాదించెను. ఇరువదినాల్గు సంవత్సరములు మహావైభవముతో గడపెను. అతనికి అచట కలిగిన సన్మాన సత్కారములవలన భోగవిలాసముల ననుభవించు అవకాశము కలిగెను. రామపురము నవాబు "కల్బెఅలీఖాన్" అతనిని చాల గౌరవించువాడు. క్రీ. శ. 1886 లో నవాబు మరణించెను. "దాగ్" కూడ అచటినుండి కదలి లఖ్నో, పట్నా మఱియు కలకత్తాలలో కొంతకాలము గడిపి మఱికొంతకాలము దిల్లీలో నివసించెను. ఎచటికి వెళ్ళినను అతనికి గొప్ప మాన్యతయే జరిగెను. క్రీ. శ. 1888 లో అతడు

హైదరాబాద చేరెను. ఈ నడుమ అతని శిష్యులు అనేకులు ఏర్పడిరి. మొదట హైదరాబాదలో ఉచిత సత్కారము జరుగలేదు. కనుక దిల్లీకి తిరిగి వెళ్లెను. క్రీ.శ. 1891 లో హైదరాబాద నిజాము, నవాబు మహబూబలీఖాన్ అతనిని పిలిపించి వేయి రూపాయలు నెలసరి వేతనము నియమించెను. "దాగ్" క్రీ. శ. 1905 వఱకు హైదరాబాదలోనే నివసించి అచటనే మరణించెను. దర్బారునుండి అతనికి ఎన్నియో బిరుదులు లభించెను. హైదరాబాదలో అతడు పొందిన గౌరవము ఇంకే కవియు ఎచ్చటను పొందియుండడు.

"దాగ్" కవియే కాక గొప్పవ్యక్తి. హాస్య ప్రియుడు. స్మితాస్యుడు. మానవ ప్రేమ కలవాడు. మిత్రుల సమక్షమున నమ్రుడు. ధనికులముందు అభిమాని. అందుకే ఉర్దూ కవిత మారుచున్నను అతని గౌరవము తగ్గలేదు. అతని సహస్రాధిక శిష్యులలో అనేకులు పత్రముల ద్వారమున పరిచయము పొందినవారే. అతని ప్రసిద్ధ శిష్యులలో నిజాము, దా-ఎక్బాల్, సాయల్ (ఇతడు అల్లుడు కూడ), బేఖుద్, అహసన్, నూహ్, ఆగాషాయెర్ మఱియు సీమాబ్, అక్బరాబాదీ పేర్కొనదగిన వారు. వీరిలో పులువురకు వేలకొలది శిష్యులు కలరు.

"దాగ్" కావ్య సంగ్రహములు, "గుల్జారెదాగ్", "ఆఫ్తాబె - దాగ్" "మాహతాబె - దాగ్" మఱియు "యాద్‌గారె - దాగ్" అనునవి నాలుగు. ఇవికాక "ఫర్యాదె-దాగ్" అనునొక మస్నవీ "ఇన్షాయె - దాగ్" అనునొక ఉత్తరముల సంగ్రహమును ప్రకాశితములైనవి. అతని కావ్య సంగ్రహములలో కొన్ని ఖసీదాలు, మఱికొన్ని చిన్నచిన్న కవితలు పోగా మిగిలినవన్నియు గజలులు. అతడు గజలు రచనలో మహాకవి. మొదటి రెండు సంగ్రహములు రామపూరులో ప్రకాశితములైనవి. వానిలోని గజలులలో వినోదము, హాస్యరసము, మాధుర్యము, భావుకత ముఖ్యగుణములు. వానిని చదివినచో ఒక నిర్విచారుడగు యువకుడు విలాసమయ జీవితము గడపుచు హార్దిక భావములను స్పష్టరూపమున ప్రకటించినట్లు తెలియును. "దాగ్" కవితలో వలె ఇతరుల కవితలలో దిల్లీ వ్యావహారిక భాషా సౌందర్యము, జాతీయముల సమయోచిత ప్రయోగము, ప్రేమభావముల విస్పష్ట వివరణ కనిపించవు. అతని కవితలో గాంభీర్యములేదు. హృదయభావములను నిస్సంకోచముగ వెలువరించుట అతని లక్షణము. మోహ శృంగారములు తప్ప ఇతర విషయములగూర్చి అతడు వ్రాయలేదు. తర్వాతి కవితల్లో అక్కడక్కడ సూఫీ భావములు, నైతిక సిద్ధాంతములు, ఇతర సమస్యలు చర్చింపబడినవి. కాని అట్టి కవితచెప్పిన "దాగ్"

"దాగ్" వలె కన్పించడు. అతని ప్రేమభావములును ఉదారమైనవి కావు. కొన్ని తావులలో అతడు ఒక జాతీయమును ప్రయోగించుటకు ఒక నానుడిని ఉపయోగించుటకు ఒక సుందర శబ్దమును పొదుగుట కొఱకే పద్యములు వ్రాసినట్లనిపించును. "దాగ్" విలువకట్టుటలో పండితులకు అభిప్రాయభేదము కలదు. అతడు జీవించిన పతిత, భ్రష్ట వాతావరణముగల సమాజములో దార్శనిక తత్త్వమునకు, గూఢ జ్ఞానమునకు మఱియు ఉన్నతాదర్శములకు తావు లేకుండెను. అతని కవితలోని గొప్పతన మొకటి, నిరాశావాదమునకు వ్యతిరేకముగా ఆశావాద ప్రచారముచేసి జీవితమును మనోరంజకమగు మార్గమున నడపింపజూచెను. నిరాశాభావము లలముకొనిన ఆ కాలమున ప్రేమను ఆదర్శవాదము కాకుండ చేయుట కూడ ఒక మహత్కార్యమే. స్వయముగా ప్రేమ వ్యవహారములు నడిపిన "దాగ్" ఆ యత్నమున సఫలీకృతుడయ్యెను. అన్నిరకముల ప్రజలు చదివి ఆనందము పొందదగిన గజలులు రచించిన లోకప్రియులగు కవులలో అతడొకడు. సామాన్య భావములను సరళమును, శుద్ధమును, మధురమును అగు భాషలో ప్రకటించుటయే అతని లోకప్రియత్వమునకు కారణము. ఇది అందఱకు సాధ్యమగు కళకాదు. ఇంకెట్టివాడు కాకున్నను "దాగ్" గొప్ప కళావేత్త అనుట సత్యము.

ఉదాహరణ కొఱకు కొన్ని పద్యపాదములు :—

షబే - వస్ల్‌జిద్‌మే బసర్‌హోగయీ
నహీ హోతె హోతే సహర్ హోగయీ.
లగాతేహైఁ దిల్ ఉన్‌సే, అబ్, హార్‌జీత్
ఇధర్ హోగయీ యా ఉధర్ హోగయీ.
బురే హాల్‌సె యా భలే హాల్‌సే
తుమ్హే క్యా, హమారీ బసర్ హోగయీ. 1

* * * *

1. సంయోగరాత్రము కాదు కాదను హఠముననే గడచి తెల్లవాఱినది.
ఆమెతో మనసు కలిపితిని. ఇక జయాపజయములు ఎటువైపైన కానిమ్ము. నా జీవితము మంచిగనో చెడ్డగనో గడచినది. నీకెందుకు లెమ్ము.

ఇధర్ అయినాహై ఉధర్ దిల్ హై
జిస్కో చాహా ఉఠాకే దేఖ్‌లియా. 1

* * * *

బుత్‌కో బుత్ ఔర్ ఖుదాకో జో ఖుదా కహ్తేహై
హమ్ భి దేఖ్‌తో ఉసే దేఖ్‌కె క్యా కహ్తేహై.
హమ్ తసవ్వుర్‌మే భీ జో బాత్ జరా కహ్తేహైఁ
సబ్‌మేఁ ఉడ్‌జాతీహై జాలిమ్ ఇసే క్యా కహ్తేహై
పహ్లేతో 'దాగ్' కీ తారీఫ్ హువా కర్తీథీ

* * * *

అబ్ ఖుదా జానె, వొ క్యోం ఉస్కో బురా కహ్తేహై. 2
"దాగ్" కా నామ్ సున్కే వో బోలే

* * * *

ఆద్మీకా యే నామ్ హోతాహై, 3

* * * *

న జానాకి దున్యాసే జాతాహై కోయీ
బొహత్ దేర్‌కీ మెహెర్బాఁ ఆతేఆతే- 4

* * * *

---

1. ఈ వైపు అద్దము ఆవైపు హృదయము కలదు. దేనిని తలచిన దాని నెత్తి చూచుకొనును.

2. విగ్రహమును విగ్రహమనియు భగవంతుని భగవంతుడనియు అనువారు ఆమెను చూచి ఏమందురో చూచెదము గాక.

మేము ఊహించిన మాటలే అందఱిలో వ్యాపించును. నిర్దయులారా! ఇదేమి?

తొలుత 'దాగ్' ప్రశంసయే జరుగుచుండెడిది. ఆమె యిప్పుడతనిని ఎందుకు చెడ్డవాడను చున్నదో దేవుడెఱుగును.

3. 'దాగ్' పేరు విని ఆమె మనుష్యుల కిట్టి పేళ్లుండునా? అనెను.

4. ప్రపంచమునుండి ఒకడు వెళ్లి పోవుచున్నాడని గ్రహింపక ఓ దయామయా! వచ్చుచునే చాల జాగుచేసితివి.

పయామీ కామ్యాబ్ ఆయే న ఆయే
ఖుదా జానే జవాబ్ ఆయే న ఆయే
షుమార్ అప్నే ఖతావోంకా బతాదూం
తుమ్హేషాయద్ హిసాబ్ ఆయే న ఆయే
పియూంగా ఆజ్ సాఖీ సైర్ హోకర్
మయస్సర్ ఫిర్ షరాబ్ ఆయే న ఆయే. 1

* * * *

ఇత్నీహీ తో బస్ కసర్ హై తుమ్ మేం
కహ్నా నహీం మాన్తే కిసీకా. 2

లఖ్నో అణువణువున కవితారసము చిప్పిలుచుండెను. మహాకవులు మాత్రము ఇక పుట్టరైరి. ఆతిష్, నాసిఖుల శిష్యులును ప్రశిష్యులును కవిత్వమును ఒక శబ్దాడంబరముగమార్చి రచనలు చేయుచుండిరి. వీనిలో అప్పుడప్పుడు వాస్తవిక జీవితముతో సంబంధముకల రచనలును వెలువడుచుండెను. కారణమేమన అవధ్ నవాబులును పాదుషాలును సామాన్యసభ్యత జన్మించునట్టి వాతావరణమున లీనమై యుండిరి. హిందువులును ముసల్మానులును సాంస్కృతిక జీవనప్రదర్శనములో ఉత్సుకతతో పాల్గొనుచుండిరి. ముసల్మానులు, హోలీ దీపావళి ఉత్సవములు జరుపుకొనుచుండిరి. హిందువులు మొహర్రమ్ ఉత్సవమున పాలుగొనుచుండిరి. అవధ్ పాదుషాలు హిందూ ముసల్మానులను ఉన్నతపదవులలో సమానముగా నియమించుచుండిరి. ఇరుతెగలవారి ధార్మికజీవనము భిన్నమైనది. అయినను ఆచారవ్యవహారములలో ఉనికి మనికిలో సమానత కలిగి ఏక కుటుంబమువారివలె కలిసికట్టుగా జీవితము గడపుచుండిరి. ఆసఫోద్దౌలా హోలీనాడు వసంతమాడుటను ఎందరో కవులు వర్ణించిరి. హిందూ రచయితలు ముసల్మానుల మతమును సౌహార్దముతో సమీక్షించిరి. రాజా టికైత్ రాయ్

1. వార్తాహరుడు కృతకృత్యుడై వచ్చునో రాదో - ప్రత్యుత్తరము వచ్చునో రాదో - ఆ సంగతి దేవుడెఱుగును.

నా పాపముల సంఖ్య చెప్పెదను; నీకు లెక్కలు వచ్చునో రావో.

సాఖీ! నేడు తనివితీర త్రాగెదను. మఱల మద్యము దొఱకునో దొఱకదో.

2. నీలో ఇదొకటే లోపము - ఎవరి మాటయు వినవు.

మహారాజా ఝావూ లాల్, రేజా నవల్ రాయ్, రాజా ఖుష్‌హాల్ రాయ్, టీకారామ్ "తసల్లీ", మంగల్ సేన్ "ఉల్ఫత్", కువర్ సేన్ "ముజ్తర్", బక్షీ భోలానాథ్ అనువారు ముసల్మానుల వలెనే ఇచటి జీవనముపై ప్రభావము కలిగి యుండిరి. ఇచటి జీవితమును సవివరముగా పరిశీలించినచో ఇట్టి స్థితి యేర్పడుటకు మూలకారణములును విశదములగును.

పాదుషాలు స్వయముగా కళాకౌశలములందును సాహిత్యమునందును అభిరుచి కలవారు- విద్వాంసులను ప్రేమాదరములతో గౌరవించి పైకెత్తువారు. అయినను ఆనాటి జీవితమే భ్రష్టాచారములతో నిండియుండెను. ప్రగతి మార్గములన్నియు మూయబడియుండెను- కనుక ప్రజలు చీకటిలో తడుముకొనుచు కల్పనల ఆధారమున బ్రదుకుచుండిరి. సాదతలీ ఖాన్, గాజియుద్దీన్ హైదర్, నాసిరుద్దీన్ హైదర్ ఈ ముగ్వురును స్వయముగా కవులు - వీరి దర్బారులలో కవిసమ్మేళనములు జరుగు చుండెను. గాజియుద్దీన్‌హైదర్ మఱియు నాసిరుద్దీన్ హైదరుల కాలమున విజ్ఞాన శాస్త్రగ్రంథములు అనువదింపబడెను. క్రొత్త ముద్రణాలయములు స్థాపింపబడెను- శాస్త్ర పరిశోధనాలయములు నెలకొల్పబడెను- అందు జ్యోతిషాది శాస్త్ర పరిశీలనము జరుగుచుండెను. మొహమ్మదలీషా మఱియు అమ్జదలీషాకూడ విద్వాంసులను గౌర వించిరి. కాని వారికి మతముపై అభిమాన మధికము - వారి కాలమున మత సాహిత్యము ప్రోత్సహింపబడెను.

క్రీ. శ. 1847 వ సంవత్సరమున వాజిదలీషా తన ఇరువదవయేట అవధు సింహాసన మధిష్ఠించెను. అతని జీవితమును అతని కాలమును గుఱించి భ్రమ ప్రమాదములు ప్రచారమున ఉన్నవి. చరిత్రజ్ఞులు ఎవరును అట్టి ప్రచారమును ఆద రింపరు. కనుక ఇచట వాని ఉల్లేఖనము అనవసరము. అవధురాజ్యపు ఈ అంతిమ పాదుషా ఎన్ని అవరోధములున్నను కళా కౌశలముల ఉన్నతికి పాటుపడెను. కళా కౌశలములపట్ల హార్దికాభిమానము కలవాడతడు. "మటియాబుర్జు"లో బందీగా ఉన్నప్పుడును అతడు వానిపట్ల అభిమానము చూపెను. అతని ఉపనామము "అఖ్తర్" అతని ఫారసీ ఉర్దూ గద్యపద్య రచనలు సుమారు వంద- ఇవి కాక అవధీ భాషలో "దాద్రా"లును "ఠుమ్‌రీ"లును వ్రాసెను. అతని ఆరు కావ్యసంగ్రహములు, మస్నవీల సంగ్రహములు మఱియు మర్సియాల సంగ్రహములు అనేకము, కొన్ని ఖసీదాలు లభించును. సంగీతము, కళలు మఱియు సైనికవ్యవస్థను గూర్చియు అనేక రచనలు చేసెను.

వాజిదలీషా 'అఖ్తర్' శైలి ఆనాటి లఖ్నోలోని సాధారణ శైలికి భిన్నము కాదు. విశిష్టమును కాదు. అతని గజలులును, మస్నవీలును స్వీయజీవితమునకు సంబంధించినవిగా ఉండుట వలన సుందరములు- ప్రభావసహితములు- అతని ఉత్తరములు మఱియు ఇతర రచనల వలన ఆనాటి రాజకీయ పరిస్థితులు చక్కగా తెలియును. అతడు మహాకవులలో లెక్కింపబడడు. కాని అతని రచనలన్నియు చదివితిమేని అతనిలో ఒక మహాకవి హృదయముండెననియు అవకాశములభించినచో అతడొక మహాకావ్యరచన చేయగలవాడే అనియు అనిపించును.

లఖ్నోలోని కావ్యరచనయొక్క సాధారణరూపము కొన్నినాళ్ల క్రిందట ఉన్నట్లే ఉండును- పతనోన్ముఖమైయున్న ఆ శైలిలో కొంత సుందరత, కొంత శక్తి కలిగించుటకై కొందఱు కవులు ప్రయత్నించిరి. ఇచటి ప్రసిద్ధ కవులలో మునీర్ షికోహాబాదీ, ఒకడు. అతడు నాసిఖ్, "రష్క" మఱియు "దబీరు"ల శిష్యుడు. అతడు సర్వవిధముల కవితను సునాయాసముగా వ్రాయగలవాడు. క్రీ. శ. 1857 నాటి విప్లవమున అతనినికూడ విద్రోహిగా లెక్కించి నల్లనీళ్ళ శిక్షకై పంపిరి. దీర్ఘకాలము శిక్ష అనుభవించి వచ్చిన తరువాత కొలదినాళ్ళలోనే- అనగా క్రీ. శ. 1881 లో మరణించెను. అతని భావము లెట్లున్నను పూర్వసంప్రదాయ పరాయణడగుటవలన కవితలో ప్రగతి కన్పించదు. ఆనాటి ఇతర కవుల కవితలవలె అతని కవితయు శబ్దములు, అలంకారములు మఱియు జాతీయముల తిరుగలిలో పడిపోయెను- అతని కావ్య సంగ్రహములు మూడు. మత ప్రవక్తల మహిమలను స్తోత్రము చేయుచు ఒక మస్నవీకూడ వ్రాసెను. ఒకచోట బనారసులోని సూర్యోదయవర్ణన చేసినాడు. అది సాహిత్యమున సర్వకాలము నిలువదగిన మనోహర రచన-

అతని గజలుల ఉదాహరణలు కొన్ని :—

గయీ చోర్‌కీ తరహ ఛిప్‌కర్ జవానీ
దగా దేకె ఘర్‌సే యే మెహ్‌మాఀ నిక్లా. 1

* * * *

వోఁభీ ఖబర్‌హైఁ షర్మ్‌సే హమ్ పాయెమాల్‌హైఁ
హైరత్‌హై కామ్ అయేగీ నీచీ నిగాహ్ కబ్ 2

1. యౌవనము దొంగవలె రహస్యముగా వెడలిపోయినది. ఈ చుట్టము వంచించి ఇల్లువెడలెను.
2. ఆమె లజ్జావివశ- నేను పదదళితుడను. క్రిగంటి చూపు ఎప్పుడు పనికివచ్చునో తెలియదు.

గుర్బత్ మే కిస్ సే చష్మె కరమ్ కీ ఉమీద్ హో
ఆంఖేఁ చురా రహీహై జమానా గరీబ్ సే 1

*   *   *   *

సబ్ కో ఇబ్రత్ హో గయీ మేరీ ముసీబత్ దేఖ్ కర్
హమ్ సే ఐ బుత్ తూ ఫిరా, తుఝ్ సే ఖుదాయీ ఫిర్ గయీ 2

*   *   *   *

కీ తర్క్ మైనే షేఖో- బరహమన్ కీ పైరవీ
దైరో హరమ్ మే ముఝ్ కో తెరా నామ్ లేగయా. 3

"   *   *   *

లఖ్నోలో ఈ యుగముననే ఒక మస్నవీ వ్రాయబడినది. అది మానవ హృదయములను సార్వకాలీనముగా స్పందింపజేయగలది. హకీమ్ తసద్దుఖ్ హుస్సేన్ "షౌఖ్" లఖ్నోలో ప్రసిద్ధ కవి. అతని వ్యవహారనామము నవ్వాబు మిర్జా- అతడు గజలులుకూడ రచించెను. కాని మస్నవీల వలననే సువిఖ్యాతుడు. "జహరె-ఇష్క్" అను అతని మస్నవీ సహస్రాధిక పర్యాయములు ప్రకాశితమై పఠితల నుఱ్ఱూత లూగించినది. "షౌఖ్" ఆతిష్ శిష్యుడు- అయినను "జహరె-ఇష్క్" ఆనాటి సామాన్య శైలికి భిన్నమగు శైలి కలది. ఇందు ఒక వాస్తవిక ప్రేమగాథ సరళ సుందర శైలిలో మనోహరముగా రచింపబడినది- ఇందు వర్ణితములైన ప్రేమభావ ములు చిరవసంతములు- ఇందలి వాస్తవికత మఱియు నిరాడంబరత ఆనాటి కవితలో మచ్చునకైన లేని రెండు గుణములు. ఇందు ఆనాటి విలాసయుక్తమును పతనశీలమును అగు వాతావరణము కలదు- వినాశమెఱుగని సత్యమును కలదు.

1. పేదఱికము (ప్రవాసము) లో ఎవరి అనుగ్రహమును విశ్వసింపవలెను? కాలమే పేద వానికి (ప్రవాసికి) విముఖమగుచున్నది.

2. నా బాధ చూడగనే అందఱకు గుణపాఠము దొఱకినది- నీవు నాయెడ విముఖత చూపినంత ప్రకృతియంతయు విముఖమైనది.

3. నేను 'షేఖు' ను కాని బ్రాహ్మణుని కాని అనుసరించుట మానితిని. నీ పేరే నన్ను మంది రమునకును మస్జిదుకును తీసుక వెళ్ళినది.

కొందఱు విమర్శకులు ఇందు అశ్లీలత కలదందురు. కాని అది వారి భ్రాంతి. అశ్లీలతకును వాస్తవకతికును కల అంతరము తెలియనివారు వారు. సాహితీసౌందర్యోపేతమై కలకాలము జీవింపగల కావ్యమిది. ఇదొక ప్రబంధమగుటవలన ఇందలి పద్యపాదములు చెదరుచెదరుగా చదివినందున ఆనందము పొందజాలము.

ఈ కాలమున లఖ్నోలో వందలకొలది కాక వేల కొలది కవులుండిరి. ఒక విపుల చరిత్రలో అనేకులను వర్ణింపవచ్చును కాని ఇచ్చట ఇద్దరు ముగ్గురిని గూర్చియే వర్ణింపబడును. అసీర్, అమానత్, ఖలక్, జకీ, ఖాజీ అఖ్తర్, తఅష్షుఖ్, రషీద్, అమీర్ మఱియు జలాల్ అనువారు ఎవరికి వారు మహాకవులే. ఇచట అమీర్, జలాల్ మఱియు అమానతుల గూర్చి కొన్ని మాటలు వ్రాయబడును.

మున్షీ అమీర్ అహ్మమద్ అమీర్ మీనాయీ, క్రీ.శ. 1828 వ సంవత్సరమున లఖ్నోలో జన్మించి అచటనే విద్యాభ్యాసము చేసెను. ఆనాటి ఉన్నతవిద్యలన్నిటిలో నిపుణుడయ్యెను. అచటి గొప్ప విద్వాంసులతోను మతగురువులతోను పరిచయము సంపాదించు కొనెను. చిన్ననాటినుండియే కవిత్వము వ్రాయుచు సుప్రసిద్ధుడగు "అసీర్" శిష్యుడయ్యెను. "అసీర్" సహాయమున దర్బారులో ప్రవేశముపొందెను. అది వాజిదలీషా కాలము. నాలుగేండ్లలోచే విప్లవము జరుగుట వలన దర్బారు సంబంధము తెగిపోయెను. పాదుషా ఆ దేశమున రెండు గ్రంథములు వ్రాసెను. వానివలన అతనికీర్తి దూరదూరములకు వ్యాపించెను. సర్వత్ర సత్కారసన్మానములు జరిగెను. కొన్నినాళ్ళు నిరుద్యోగిగా ఉండి తరువాత రామపురము వెళ్ళెను. అచటి నవాబు యూసుఫలీఖాన్ దిల్లీ కవులకును లఖ్నో కవులకును చివరి ఆశ్రయదాత. రామపురములో "అమీర్" జీవితము శాంతి సౌఖ్యములతో గడచెను. నవ్వాబు అతనిని గురువుగా నియమించుకొనెను. అతడు విద్వాంసుడు, కవి, రచయిత, మహాపురుషుడు అగుటవలన పిన్నలు పెద్దలు అందఱును అతనిని గౌరవించుచుండిరి. ఇట్లు అమీర్" రామపురములో నలుబది మూడేండ్లు నివసించెను. క్రీ. శ. 1900 వ సంవత్సరమున "దాగ్" కోరికపై హైదరాబాద నిజాము అతనిని ఆహ్వానించెను. కాని హైదరాబాదకు చేరిన కొన్ని నెలలలోనే "అమీర్" మరణించెను.

అమీర్ మీనాయీ సభ్యత కలవాడు. గంభీరుడు. పరోపకార పారీణుడు. సత్యము, సానుభూతి అతని విశిష్టగుణములు — ఎన్నడును పరనిందచేయువాడు కాడు. సంస్కారము, విద్య ఎంతయున్నను వినయమును విడువనివాడు. నవాబు

మొదలుకొని సామాన్యోద్యోగుల వఱకు అందఱును అతని చెంత కూర్చుండి ఆనందము పొందుచుండిరి. సాహిత్యమునకు సంబంధించిన ప్రశ్నములకు ప్రసన్న చిత్తముతో జవాబు చెప్పువాడు - మతాచారములను పాలించువాడే కాని మత విషయిక సంకుచితదృష్టి లేనివాడు. అతని శిష్యులు వందమందికి మించి యున్నారు. వారిలో రామపూర్ నవాబు కాక, రియాజ్, జలీల్, వసీమ్, మొహసిన్, సఫర్, దిల్, ముజ్తర్, హఫీజ్, ఆహ్, అఖ్తర్ మఱియు ఖమర్ అనువారు ప్రసిద్ధులు. వీరిలో అనేకులు మహాకవులు. అమీర్ పుత్రులును కావ్య రచన చేసిరి. అతని వంశమువారు నేటికిని సాహిత్యసేవ చేయుచున్నారు.

అమీర్ మీనాయీ గద్యపద్యములలో అనేక గ్రంథములు రచించెను. అతని గ్రంథములు కొన్ని విప్లవమునందును కొన్ని ఇంటికి అగ్ని తగిలినప్పుడును నష్ట పడెనందురు. అవి పోగమిగిలిన గ్రంథములు ఇరువది కంటె అధికమే. అన్నిటిలో ప్రసిద్ధములు "మిరాతుల్-గైబ్" మఱియు "సనమ్‌ఖాన-యే ఇష్క్" అను రెండు గజలుల సంగ్రహములు. మూడవ సంగ్రహము ఇంకను ప్రకాశితము కాలేదు. అతడు మతసంబంధముగా అనేక రచనలు చేసెను. అందు పైగంబరు వర్ణనయే అధికము - ప్రేమరసాత్మకములగు మస్నవీలు మఱికొన్ని ఇతర కవితలు వ్రాసెను. "ఇంతెఖాబె-యాద్‌గార్" అను వచన గ్రంథమొకటి సంతరించెను. అందు రామపూర్‌తో సంబంధముగల కవుల జీవితవిషయములును కవితారీతులును ఉల్లేఖింపబడినవి. అతని కీర్తికి మూలకారణము "అమీరుల్లొఘాత్" అను శబ్ద కోశము. దాని రెండు భాగములే ప్రకాశితములైనవి. ఈ నిఘంటువును విస్తార రూపమున నిర్మింపదలచెను. ప్రకాశితములగు రెండు భాగములలోను వర్ణమాల లోని మొదటి అక్షరమగు "అలీఫ్" తో ప్రారంభింపబడు పదములు మాత్రమే కలవు. నిజమునకు అతని విజ్ఞానము కవితల వలనకాదు. ఈ నిఘంటువు వలన బోధపడును. అతని శిష్యులు అనేకులు అతని జీవితచరిత్రలు వ్రాసిరి. వానివలన అతనిని గూర్చిన విషయము లెన్నియో తెలియును.

"అమీర్" మహావిద్వాంసుడు, మహాపురుషుడు అయినప్పటికి కావ్యప్రపంచ మున అతని గజలులే ప్రఖ్యాతములు. చాలకాలము రామపూర్‌లో నివసించినను అతడు లఖ్నో కవులలోనే లెక్కింపబడును. ఢిల్లీవాడగు దాగ్‌తో ఇతని తులనాత్మక విమర్శ చేయబడినది. లఖ్నో కవులను వారి శైలిని గూర్చి ఈ వఱకే తెల్పి యున్నాము. ఢిల్లీ లఖ్నో శైలులు క్రమముగా కలసి పోవుచుండెను. రామపురములో

ఇరుదెసల కవులు కలిసి క్రొత్త శైలిని సృష్టించిరి. ఆ శైలి భావుకతా విలసితము కనుక లఖ్నో శైలికి చేరువైనది. అమీర్ మీనాయీ మొదటి సంగ్రహమగు "మిరాతుల్_గైబ్" శైలి వికృతమగు లఖ్నో శైలి. అందు వాస్తవికభావములకు బదులుగా కృతభావములును అలంకారములును నిండియున్నవి. రెండవ సంగ్రహమగు "సనమ్_ఖానయే_ఇష్క్" మాత్రము నవ్యరీతుల చెప్పబడినది. అందు సరళములు, మధురములు మఱియు సుందరములగు గజలు లనేకము కలవు. భావుకత కొంత గంభీరమైనది. అలంకారములు వెనుకటి దానిలోవలె కృతకములు కావు. ఈ రెండవ గ్రంథమున "దాగ్" చే ప్రభావితమై వ్రాయబడిన రచనలు కలవందురు. "అమీర్" మీనాయీ కవితలో అటనట సూఫీభావములు నైతికభావములు కలవు. కాని, ప్రేమభావములు కలచోట్లనే అతని కవిత రమ్యము. విద్వాంసుడగుట వలన భాషావిజ్ఞానము, కావ్యశాస్త్రము మఱియు సాధుశబ్దప్రయోగమున నిపుణుడు – దిల్లీ భాషకు దాగ్ వలెనే లఖ్నో భాషకు అమీర్ ప్రామాణికుడు. ఆనాటి కవితలన్నియు ఆధ్యాత్మిక గంభీరతలేనివే. లఖ్నో, రామపూర్ మఱియు హైదరాబాదల దర్బారీ వాతావరణమును దాటివెళ్ళని "అమీర్" కవితలో గంభీరత ఎట్లుండును ? అతని ఉత్తరముల సంగ్రహము ప్రకాశితమైనది. ఆ ఉత్తరములలో అతడు వెలువరించిన అభిప్రాయములనుబట్టి సంప్రదాయములకు భిన్నముగా అతడేదియు ఆలోచించు వాడెకాడని తెలియును.

ఉదాహరణ కొఱకు అతని కొన్ని పద్యపాదము .—

ఆయీ సహర్ ఇధర్, కి, ఉధర్ షామ్ హోగయే
దోదో ఘడీకె హోనేలగే దిన్ విసాల్ కే. 1

*      *      *      *

ఉన్కో ఆతాహై ప్యార్ పర్ గుస్సా
హమ్‌కో గుస్సేపే ప్యార్ ఆతాహై. 1

*      "      *      *

1. ఇటు ఉదయమయినంత అటు అస్తమయము కలిగినది. సంయోగ దివసములు రెండేసి ఘడియలవే అయినవి.

1. ఆమెకు ప్రేమపై కోపము. నాకు ఆ కోపము పైననే ప్రేమ కలుగును.

మై జాగ్‌రహాఁ హూఁ హిజ్ర్ కీ షబ్
పర్ మేరా నసీబ్ సోరహాహై. 2

*　　*　　*　　*

తీర్ ఖానేకి హవస్ హైతో జిగర్ పైదాకర్
సర్‌ఫరోషీ కీ తమన్నా హై తో సర్‌పైదాకర్. 3

*　　*　　*　　*

లచక్‌హై శాఖోంమ్మే జుంబిష్ హహ్వావాసే ఫూలోమ్మే,
బహార్ ఝూల్‌రహీహై ఖుషీసే ఝూలోమ్మేఁ. 4

*　　*　　*　　*

క్యాకహేఁ ఇష్క్‌మే క్యా మిల్తా హై
బుత్‌కె మిల్నేసే ఖుదా మిల్తాహై. 5

*　　*　　*　　*

జొ నిగాహ్‌కీ థి జాలిమ్ ఫిర్‌తో ఆంఖ్ క్యోం చురాయీ
వహీ తీర్ క్యోం న మారా జో జిగర్‌కే పార్ హోతా. 6

"　　"　　"　　*

---

2. విరహనిశ నేను మేల్కొనియున్నాను. నా భాగ్యమే నిదురించుచున్నది.
3. బాణాఘాతములు వలతువేని హృదయము కలవాడవు కమ్ము.
   తల సమర్పింపదలతువేని తల కలవాడవు కమ్ము.
4. గాలి వలన కొమ్మలు వంగుచున్నవి. సాగుచున్నవి. పూలు కదలుచున్నవి.
   వసంతము ఊయెల లూగుచున్నది.
5. ప్రేమలో ఏమి దొఱకునో ఏమి చెప్పుదును? విగ్రహము (ప్రియురాలు) దొఱకుట మూలమున భగవంతుడు దొఱకును.
6. చూచియు కనులు త్రిప్పికొందువేల? నిర్దయురాలా! హృదయమును దూసిగొనిపోవునట్టి బాణమే ఏల కొట్టవైతివి?

హమ్ చలే దైర్‌సే కాబెకోతో వో బుత్ బోలా
జాకె లేలీజియే కాబేమె ఖుదా రఖ్ఖా హై. 7

* * * * *

లఖ్నోలోని మఱియొక ప్రసిద్ధకవి, సయ్యద్ జామిన్ అలీ "జలాల్" అను నతడు – రామపూర్ దర్బారు కథకుడగు హకీమ్ అస్గరలీ కొడుకు – "జలాల్" ఫారసీ అరబీ భాషలలో మంచి శిక్షణపొంది లఖ్నోలోనే వైద్యవృత్తిని అవలంబించెను. చిన్నప్పటినుండియు కావ్యరచన చేయుచు తన కవితను నాసిఖ్ శిష్యులలో ప్రసిద్ధుడగు "రష్క్"కు చూపించుచుండెను. కొలది కాలములోనే గొప్ప యశము పొంది "ఉస్తాదు" అనిపించుకొనెను. విప్లవము తరువాత రామపూర్ నవ్వాబగు యూసుఫలీఖాన్ అతనిని పిలిపించుకొనెను. అధికమగు భావుకత కారణమున ఆతడు చాలసార్లు ఉద్యోగము విడిచిపెట్టెను. ప్రతి తడవ నవాబు అతనిని మరల పిలిపించి ఉద్యోగములో నియమించుచుండెను. ఇట్లు సుమారు ఇరువది సంవత్సరములు "జలాల్" రామపూర్ దర్బారులో నివసించి అచటి మహాకవి చతుష్టయములో ఒకడయ్యెను. దాగ్, అమీర్ మఱియు తస్లీమ్ అనువారు మిగిలిన ముగ్వురు. క్రీ. శ. 1887 ప్రాంతమున రామపూర్‌నుండి 'మంగరౌల్' కు వెళ్ళెను. అచటినుండి లఖ్నోచేరి క్రీ. శ. 1909 లో మరణించెను. జలాల్ పందొమ్మిదవ శతాబ్దిలోని ఉత్తమకవులలో ఒకడు. అతడు కావ్యశాస్త్రమునందును భాషాశాస్త్రమునందును పండితుడు. ఈ విషయమున ఆనాటి కవులకును ఇతనికిని వాదవివాదములు జరుగుచుండెను. అతనిలో అహంకారము మఱియు ఆత్మప్రశంస అధికము–తన సమక్షమున ఏ కవిని కవిగాను, ఏ రచయితను రచయితగాను తలంచువాడు కాడు. భాషా సంబంధమున అతడు వ్రాసినదంతయు సరియైనదని చెప్పుటకు వీలులేదు. అతని అధిక కవితలు మాత్రము ఉచ్చకోటికి చెందినవని చెప్పవచ్చును. అతని శైలి సాధారణమగు లఖ్నో శైలికి కొంత భిన్నము. అతడు అలంకారములు మఱియు శబ్దసౌందర్యముతోపాటు భావములకును ప్రాధాన్యమిచ్చుటకు ప్రయత్నించెను. కనుక అతనిపై దిల్లీ కవుల ప్రభావము పడిన దందురు.

---

7. మేము మందిరము విడిచి 'కాబా'కు వెడలుచుండగా ఆమె "కాబాలో దేవుడు కలడు - అతనిని చేకొనుడు" అనెను.

ఉదాహరణకు కొన్ని పద్యపాదములు :—

ఎక్ ఖదమ్ జానా జిధర్ దుష్వార్ థా
షోఖ్ లేకర్ సైంకడోం మన్జిల్ గయా. 1

*    *    *    *

తుమ్ లాఖ్ ఛిపో హమ్‌సే, మగర్ ఛిప్ నహీ సక్తే
జో దిల్‌మే హై ఆంఖోంసే నిహాం హోనహీ సక్తా. 2

*    *    *    *

తేరే డర్‌పే జో ఆ పడేం హైం ఉన్హేం
భూల్‌కర్ యాద్ ఘర్‌నహీ ఆతా.
ఖుద్ చలే ఆయేం వో న జాయేం జో హమ్
సబ్రహీతో మగర్ నహీ ఆతా.
ఆ నికల్తే హో జిస్కే ఖ్వాబ్ మే తుమ్
ఖ్వాబ్ ఉసే రాత్ భర్ నహీ ఆతా. 3

లఖ్నో కవులగూర్చిన ఈ ఉల్లేఖనము ముగించుటకు ముందు "అమానత్" పేరు స్మరించుట ఆవశ్యకము. అతని పేరు "ఆగాహసన్" ప్రారంభమున మర్సియాలువ్రాసి తరువాత గజలులు వ్రాసెను. (20) ఏండ్ల వయస్సులోనే ఏదో రోగము వలన నోరు పడిపోయెను. పదేండ్ల తరువాత అతడు తనంత తానే మాటలాడ సాగెను, కాని "నత్తి" విడిపోలేదు. అతడు కర్బలాకు వెళ్ళి అచటనే వాక్శక్తి

---

1. ఏ వైపునకు ఒక అడుగు కదులుట అసంభవమో జిజ్ఞాస ఆ వైపునకే వందలకొలది మజిలీల వఱకు నడిపించినది.

2. నీవు లక్ష విధముల దాగినను నా ముందు దాగలేవు. హృదయమున నిలిచిన వస్తువ కనులకు మరుగగునా ?

3. నీ గడపపై పడియున్న వారికి పొరపాటుననైన గృహము స్మృతికిరాదు.
మేము వెళ్ళమేని ఆమె స్వయముగానే వచ్చును – కాని ఓర్మి కలుగదెట్లు ?
ఎవరి స్వప్నమున నీవు వేంచేతువో వారికి రాత్రమంతయు నిద్రరాదు.

తిరిగి పొందెనని మతముపై నమ్మకము కలవారు కొందఱందురు. అతడు క్రీ. శ. 1858 లో మరణించెను. "అమానత్" గజలుల సంగ్రహమొకటి, ఒక "వాసోఖ్త్" కొన్ని మస్నవీలు ప్రకాశితములైనవి. కాని అతనికి అమరకీర్తి ప్రసాదించినది అతడు వ్రాసిన "ఇంద్రసభ" అను నాటకము. "అమానత్" గజలులలో సుందర శబ్దములు, రమణీయములైన అలంకారములు తప్ప ఇంకేదియు ఉండదు-అలంకారము లధికమగుట వలన అతని కవిత గంద్ర గోళమనిపించును. కాని, ఇంద్రసభ ప్రత్యేక విశిష్టత గలది. అది క్రీ. శ. 1853 ప్రాంతమున రచింపబడిన మొదటి ఉర్దూ నాటకము. దురదృష్టవశమున దానిగూర్చి కొన్ని భ్రాంతిమూలకములగు అభిప్రాయములు ప్రచారమునొందినవి. అట్టివి విమర్శనాదృష్టికి నిలుచునవి కావు. వాజిదలీషా ఆదేశమున ఒక ఫ్రెంచి "ఆపెరా" ఆధారమున "అమానత్" ఆ నాటకమును వ్రాసెనందురు - "ఖైసర్ బాగ్"[1] లో ఆ నాటకము ప్రదర్శించువారనియు అందు వాజిదలీషా స్వయముగా ఒక పాత్ర నటించువాడనియు అందురు. నిజమేమన "అమానత్ మూగవడియున్నప్పుడు ఒక మిత్రుడు ఊరికె కూర్చున్నందువలన ఏమియు తోచదనియు ఏదేని క్రొత్త రచన చేయుమనియు సలహా ఇచ్చెను. కనుక అతడా నాటకమును వ్రాసెను. నాటక రచననుగూర్చి అతడొక కమ్మ వచనరూపమున లిఖించెను. అది ఈ నడుమనే లభించి ప్రకాశితమైనందున ఇంతవఱకు ఉండిన భ్రాంతులన్నియు తొలగిపోయినవి.

ఇంద్రసభవంటి నాటకము లఖ్నోలోని విలాసయుక్తమగు అకాలముననే జన్మింపదగినది. హిందూముసల్మానుల సమైక్యత వలన ఏర్పడుచున్న సంస్కృతికి పరిణామమే అది. ఇంద్రసభలో హిందువుల దేవుడగు ఇంద్రుడు ఈరాను చక్రవర్తి వలె ప్రదర్శింపబడెను. ఈరానీ దేవతలు రాక్షసుల రూపము ధరించిరి. అప్సరసులు "పరీ"ల వలె ముస్లిమ్‌కాంతల దుస్తులు ధరించి రంగముపై ప్రవేశింతురు. ఈ నాటకములో గజలులు, గీతములు మఱియు ఠుమ్రీలు కలవు. నాయకుడగు "గుల్ఫామ్"ఆచారవ్యవహారములను,సంభాషణాశైలిని అనుసరించి అవధ్‌షాహజాదా (రాకుమారుడు) అనిపించును. వాస్తవికతాదృష్టితో జూచిన ఇదొక లోపమే. కాని ఇందలి వాతావరణమంతయు ఆనాటి అవధుడే అని దీనిని చదివినవారు గ్రహించ గలరు. ఇందలి భాష అతి సరళము. గీతములు మధురమైనవి. కథ రుచికరమైనది. కనుక దీనిని చూచిన ఆనాటి ప్రజలు పరవశులగుచుండిరి. సంగీతము మఱియు

1. లఖ్నోలో వాజిదలీషా నివసించు సుప్రసిద్ధ భవనము.

నృత్యములపై ఆధారపడిన ఈ రచన చారిత్రకముగాను సాహిత్యదృష్టితోను మహత్తరమైనదే. దీనిని చూచి ఇంకెన్నియో "సభలు" రచింపబడెను. కాని ఏ సభయు దీని స్థాయి నందుకొనలేదు. నజీర్ కవితలో, మీర్ హసన్ మస్నవీలో, ఇన్షారచనలలో కాన్పించు సాంప్రదాయక దృశ్యములే ఇందును కాన్పించును.

రామపూర్ మఱియు హైదరాబాద దర్బారులను గూర్చి సంక్షేపముగా తెల్పుట అవసరము. ఏలయన ఢిల్లీ, లక్నో దర్బారులు మూలవడిన పిదప అనేక కవులను ఆదరించినవి ఈ దర్బారులే. రామపూర్ నవాబు యూసుఫలీఖా౯ "నాజిమ్" అను పేర కవితలు వ్రాసెను. తొలుత తన కవితలు మోమి౯కు తరువాత గాలిబ్‌కు చూపించెను. గాలిబ్ మఱియు నవాబు వ్రాసికొనిన ఉత్తర ప్రత్యుత్తరములు ప్రకాశితములైనవి. వాని వలన నవాబు ఎంతటి విద్యాభిమానము కలవాడో విదితమగును. నవాబు కావ్యసంగ్రహము ప్రకాశితమైనది. అతని కొడుకు నవాబు "కలబలీఖా౯" స్వయముగా కవియేకాక కవిపోషకుడు. అతని హయాము రామపూర్ చరిత్రలో స్వర్ణయుగము. ఈ చిన్న రాజ్యములోని జీవిత విభాగము లన్నియు అతని కాలమున ఉన్నతి చెందెను. గొప్ప గొప్ప కళావేత్తలచట ఉండిరి. ప్రసిద్ధ కవులందఱును ఏదో విధముగ రామపూర్ దర్బారుతో సంబంధము కలిగి యుండిరి. అసీర్, అమీర్, దాగ్, జలాల్, తస్లీమ్, మునీర్, ఖలక్, జా౯సాహేబు మొదలగువారు దర్బారునుండి పెద్ద పెద్ద వేతనములు పొందుచుండిరి. నవ్వాబు ఉన్నతమగు శిక్షణ పొందెను. ఫారసీ, ఉర్దూ భాషలలో నైపుణ్యము సంపాదించెను. అనేక గ్రంథములు రచించెను. అతడు శబ్దార్థ విచారణ, శుద్ధాశుద్ధ శబ్దప్రయోగముల గూర్చి పండితులతో చర్చచేయువాడు. అతని కావ్యసంగ్రహములు నాలుగు ప్రకాశితములై ప్రజాదరణ పొందినవి. ఢిల్లీ లక్నో కవుల కూడిక వలన రెండు శైలులు విడదీయరాని విధముగ కలిసిపోయెను. ఉర్దూభాష కేంద్రములనుండి వెడలి దేశ మంతట లోకప్రియమై వ్యాపించుచుండెను. ఢిల్లీ లక్నోల వేరు వేరు సంప్రదాయములకు సమైక్యత కలిగించి భాషా సంబంధములగు భేదభావములను తొలగించిన కీర్తి రామపురమునకే దక్కినది.

హైదరాబాద రాజ్యము 18 వ శతాబ్ది మధ్యమున, ఒక శతాబ్ది క్రిందట గోలకొండ నవాబులు పాలించిన చోటనే స్థాపించబడెను. రెండవ అధ్యాయమున అచటి సాహిత్య జీవితమును గూర్చి తెలుపనైనది. ఆ నడుమ కొంత కాలము ఉత్సాహము సన్నగిల్లినది కాని సాహిత్య స్రవంతి ఇంకిపోలేదు. క్రొత్త రాజ్యము

స్థాపింపబడుటతోనే ప్రాచీన సంప్రదాయము పునరుజ్జీవిత మయ్యెను. అచటి రాజులును తమఆస్థాన శోభ నతిశయింప జేసికొనుటకై కవులను కళావిదులను పిలిపించుకొనిరి. నిజాముతోపాటు అతని మంత్రులును సాహిత్య పోషకులగుట సంతోషకరమగు విషయము. మహారాజా చందూలాల్ "షాదాఁ" స్వయముగా మంచి కవి. అతడు ఢిల్లీ కవులను హైదరాబాదకు పిలిపించెను. జోఖ్, నాసిఖ్ మఱియు నజీర్ అక్బరాబాదీలను కూడ అతడు ఆహ్వానించెను. కాని వారు వెళ్లలేకపోయిరి. షాహె నసీర్, మఱియు కొందఱు ఇతర కవులు వెళ్ళి సన్మానితులైరి. మహారాజావారి ఉర్దూ కావ్యసంగ్రహమొకటి ఫారసీ కావ్యసంగ్రహములు రెండు ప్రకాశితములైనవి. ఆనాడు హైదరాబాదలో సుమారు మూడు వందల మంది కవులుండిరట. ఇట్లే రాజా గిరిధారీ ప్రసాద్ "బఖ్" కూడ కవియేకాక కవిజనపోషకుడు. అతని రచన లనేకములు. వానిలో అధికము ఫారసీ గ్రంథములే. ఆనాటి హైదరాబాద కవులలో ఫైజ్, మాయల్, తౌఫీఖ్ మఱియు కైఫీ మొదలగువారు ప్రసిద్ధులు.

పద్య రచనవలె గద్య రచనయు అభివృద్ధి చెందుచుండెను. దాని ప్రగతిని గూర్చి ఆధునిక రచయితలకు సంబంధించిన అధ్యాయమున వ్రాయబడును. ఇచట ఇంత మాత్రము తెల్పుట చాలును. ఢిల్లీ కాలేజీలో ఉర్దూభాషను గుఱించిన చర్చ అధికమగుట వలన రచయితలు గద్యరచన వైపు శ్రద్ధచూపిరి. ఫారసీ ప్రభావము అధికముగా ఉన్నను ఉర్దూ భాష సాహిత్య రూపమును సంతరించుకొనెను. ఆనాటి వఱకు చదువుకొనినవారు హిందువులైనను, ముసల్మానులైనను ఫారసీలో ఉత్తర ప్రత్యుత్తరములు నడుపుకొనుటే సభ్యతగా భావించుచుండిరి. కాని 19 వ శతాబ్ది మధ్య భాగమునుండి ఉర్దూలో వ్రాయబడిన ఉత్తరములు లభించును. ఉర్దూ భాషలో ప్రఖ్యాత కవియగు మిర్జా గాలిబ్ పత్రరచనలోను ప్రముఖుడగుట విశేషము.

"గాలిబ్" జీవితమును గూర్చి ఇదివఱకే వ్రాయబడినది. ఇచట అతని గద్య రచనను గుఱించియే వ్రాయబడును. గాలిబ్ ఫారసీ గద్య రచనలోను సిద్ధహస్తుడు. ఫారసీ భాషలో అంతటి పాండిత్యముగల భారతీయ రచయితలు అరుదు. అయినను ఫారసీలో వ్రాయుటకు అవకాశము లేనందున అతడు ఉత్తరములు ఉర్దూలోనే వ్రాసెను. కొంత కాలమైన పిదప అనేకులు అతని ఉత్తరములను అధికముగా ప్రశంసించుట వలన మిత్రులకును శిష్యులకును ఆశ్రయదాతలకును ఉర్దూలోనే వ్రాయసాగెను. ఫారసీ పత్ర రచన బొత్తిగా మానుకొనెను. అతని ఉత్తరముల సంగ్రహములు అనేకములు ప్రకాశితములైనవి. ఇంకను కొన్ని ఉత్తరములు

లభించుచునే ఉన్నవి. ఉత్తరములేకాక అతడు కొన్ని గ్రంథ పీఠికలును మఱికొన్ని లఘు రచనలును ఉర్దూలోనే రచించెను. ఇదివఱకు ప్రకాశితములైన అతని ఉర్దూ గద్య రచనలివి.; ''ఊదె - హిందీ". ''ఉర్దూయె - మొఅల్లా" (రెండు భాగములు) ''మకాతిబె - గాలిబ్". ''ఖుతూతె - గాలిబ్", "నాదిర్ ఖుతూతె - గాలిబ్", "నామయే - గాలిబ్", "లతాయిఫె - గాలిబ్" మఱియు "తేగె - గాలిబ్". చివరి మూడు పుస్తకములు ఒక సాహిత్య వివాదమును పురస్కరించుకొని వ్రాయబడినవి. ఆ వివాదమున ఆనాటి అనేక రచయితలు ప్రత్యక్షముగాను పరోక్షముగాను పాల్గొనిరి.

గాలిబ్ వ్రాసిన గ్రంథ పీఠిక లన్నియు ఆనాటి కృతక శైలిలోనే ఉన్నవి. వానికి ఎట్టి గొప్పతనమును లేదు. ఇవి చాలవఱకు మిత్రుల కోరికపై వ్రాయబడినవి కనుక వానిలో కొన్ని ప్రశంసా వాక్యములు తప్ప ఇంకేమియు లేదు.

క్రీ. శ. 1846 ప్రాంతమున గాలిబ్ పత్రరచన ప్రారంభించెను. కలము చేగొని యథాలాపముగా అలవోకగా వ్రాసిన ఈ యుత్తరములే నేడు ఉర్దూ సాహిత్యమున వెలలేని రత్నములు. అవి సుమారు ఒక వేయి వఱకు కలవు. వానివలన గాలిబ్‌ను గూర్చిన చాల సంగతులు తెలియును. ఆ కాలపు చరిత్రాంశములు, రాజకీయములు, సాహిత్య చర్చలు వానిలో కలవు. తన జీవితమునకు సంబంధించిన ప్రతి విషయమును గుఱించి అతడు ఉత్తరములలో మనసు విడిచి వ్రాయువాడు. ఈ యుత్తరములలో కొందఱి స్తుతి, కొందఱి నిందకలదు. కొందఱపట్ల సానుభూతి మఱికొందఱపట్ల ద్వేషము ప్రకటింపబడినది. కొన్ని యెడల అతని స్వాతిశయము ఇతరులను అధః పాతాళమునకు అణచివైచినది. మఱికొన్ని యెడల ఇతరుల ప్రశంసలు భూమ్యాకాశములకు ముడివెట్టినవి. ఒకచోట సమస్యలను గంభీరముగా సమాలోచించి వేఱొకచోట జటిల విషయములను చిటికెలలో ఎగురగొట్టివైచినాడు. ఒకచో మతసంబంధములగు నిగూఢ తత్త్వములను వివరించి ఇంకొకచోట మతాభిమానుల అవహేళన జరిపినాడు. ఒకప్పుడు ఆశావాదమున జీవితానంద ప్రాప్తికై ప్రేరేపించి వేఱొకప్పుడు నిరాశావాదియై జీవితము నంతమొందించుకొను అభిలాష వ్యక్తము చేసినాడు. ఇట్లు ఈ ఉత్తరములు గాలిబ్ స్వీయకథనేకాక ఇతర సమస్త విషయములను చేర్చుకొని యున్నవి. ఆనాటి ప్రజల మానసిక స్థితిని తెలిసికొనగోరువారికి గాలిబ్ ఉత్తరాలు చాల సహాయపడును.

గాలిబ్ విప్లవ భావములు కలవాడు. అతడు పత్రరచనలో మహమ్మద్‌షా కాలము వఱకు ప్రచారములో నున్న నియమములను ఉల్లంఘించెను. అతడు తన మదిలోని మాటను పత్రారంభముననే తెల్పును. అందువలన అతడు ఎవరికి ఉత్తరము వ్రాయుచున్నాడో అతనితో ముఖాముఖిమాటలాడి నట్లుండును. మహమ్మద్‌షాహీ పద్ధతి తనకు నచ్చదనియు మనసులోని మాట వెల్లడించుకొనుటయే తన ఉద్దేశ్య మనియు అతడు తానే వ్రాసెను. అతని ఉత్తరములు ఇంతటి మనోరంజకము లగుటకు అతని పలుకులో పర్యవసించు హాస్యరసమే కారణము. గజలులవలె అతని ఉత్తరములును ఉత్కృష్ట రచనలు. వానిలో నేటికిని నవ్యత గోచరించును. అతనిని అనుకరించుటలో కృతకృత్యులయినవారు ఈనాటికి లేరు.

గాలిబ్ పత్రరచన యందు ఉత్సుకత కలవాడు. తపాలా పద్ధతులు సరిగా లేని ఆ కాలమున ఎన్నియో ఉత్తరములు లుప్తములై పోవుచుండెను. కనుక తాను "బేరంగులు" వ్రాయుచు అట్టివే తన పేర తెప్పించుకొను చుండెను. అతనికి తన ప్రఖ్యాతిపై విశ్వాసమత్యంతము. ఎవరేని అతని చిరునామాను గుఱించి అడిగినచో కుపితుడగు చుండెను. తనపేరు వ్రాసి క్రింద "దిల్లీ" అని వ్రాసిన చాలునని చెప్పు వాడు. దిల్లీలో పాదుషానుండి తపాలా బంట్రోతు వఱకు గల సర్వజనులు అతని కీర్తి నెఱిగినవారేమరి. అతడు తనకు వచ్చిన ఉత్తరములకు త్వరగా జవాబులు వ్రాసి తన ఉత్తరములకును అట్లే జవాబులు వ్రాయవలసినదిగా కోరుచుండెను. ఈ సమస్త విషయముల వలననే ఉర్దూలో ఎవరికిని లేని విశిష్టవ్యక్తిత్వము "గాలిబ్"కు కలిగినది.

ఖ్వాజా అమాఁ అను నతడు ఆ కాలమున సుప్రసిద్ధుడగు గద్యరచయిత. అతడు "గాలిబ్" బంధువు. గాలిబ్ తన ఉత్తరములలో పలుతావుల అతనిని పేర్కొని మిత్రులకును శిష్యులకును అతని రచనలతో పరిచయము కలిగించెను. "అమాఁ" పారసీలోని "బోస్తానె - ఖ్యాల్" అను ప్రఖ్యాత కథను ఉర్దూలో అనువదింపసాగెను. అది పది భాగములు గల కథ. ఆల్వార్ మహారాజు శివదాస్ సింహుని ఆదేశము ననుసరించి అతడు అయిదు భాగములు మాత్రము అనువదింప గల్గెను. అతని మృత్యువు వలన మిగిలిన భాగములు అనువదింప బడక

అట్లే ఉండిపోయినవి. అతని భాష సరళము - మధురము. అతని రచన అనువాద మనిపించక స్వంత రచనయే అనిపించును.

గాలిబ్ మిత్రులలో ఒకడగు ఖ్వాజా గులామ్ గౌస్ "బేఖబర్" మిగుల ప్రతిభావంతుడు. అతడు మెల్లమెల్లగా ఉన్నతి చెందుచు గవర్నరు దగ్గఱ మీర్ మున్షీ పదవి పొందెను. నలుబదైదేండ్లు ఉద్యోగముచేసి క్రీ. శ. 1885 లో ఉపకార వేతనము పొందెను. క్రీ. శ. 1905 లో మరణించెను. "బేఖబర్" అరబీ, ఫారసీ భాషలలో గొప్ప పండితుడు. అతని ఫారసీ కావ్యములు ఈరాను విద్వాంసులకును ఆదరపాత్రములైనవి. గాలిబ్‌కంటె వయమున చిన్నవాడే అయినను గాలిబ్ అతనిని గౌరవించుచుండెను. కవితలేకాక అతని ఉత్తరముల సంగ్రహము "పుగానె - బేఖబర్" అనుపేర ప్రకాశితమయ్యెను. అతని శైలి ప్రాచీన రచయితల వంటిది. అందు అరబీ ఫారసీ పదములతోపాటు అలంకార ప్రయోగ మధికము. 'బేఖబర్' మామ మోల్వీగులామ్ ఇమామ్ "షహీద్" కూడ మంచి గద్య రచయిత. "మౌలూదె - షరీఫ్" మఱియు "ఇన్షాయె - బహారె - బేఖిజాఁ" అనునవి అతని ప్రసిద్ధ రచనలు. ఆ కాలమున దక్షిణములోను అనేకులు గద్య రచయితలుండిరి. వారిలో "షమ్షులుమురా" ముఖ్యుడు. అతడు విజ్ఞాన గ్రంథముల నెన్నిటినో అనువదించి ప్రచురించెను. కాని అవి నేడు అలభ్యములు.

ఈ అధ్యాయమున పేర్కొనబడిన కవులలో, రచయితలలో అనేకులు సంప్రదాయ బద్ధమగు మార్గమున నడచువారు. కనుక వారిని గూర్చి వ్రాయునప్పుడు యుగమును దృష్టియందుంచుకొనుట జరుగలేదు. ఇందు 19 వ శతాబ్ది మధ్యభాగము నుండి 20 శతాబ్ది ప్రారంభము వఱకు గల సాహితీపరులు చేర్చబడినారు. అప్పుడు కవిత్వము అత్యంత లోకప్రియమైనది. హిందువులు, ముసల్మానులు, సిఖులు, పారశీలు, ఆంగ్లేయులు మఱియు ఇతర ఐరోపీయులు ఉత్సాహముతో ఉర్దూకవిత వ్రాయుచుండిరి. చాలమంది ఆంగ్ల కవుల కావ్యసంగ్రహములు ప్రకాశితములైనవి. పద్యరచనలో ఎట్టి నూత్నగతియు కన్పించదు. అల్పకాలములో అత్యున్నతి చెందిన నూత్న జీవితము గద్యరచనలోనే ద్యోతితమగుచుండెను. గద్యరచనపై ఆంగ్ల భాషా భ్యసన ప్రభావము, నవజాగృతి ప్రభావము మఱియు విజ్ఞానశాస్త్ర ప్రభావము గద్య రచనపై పడుచున్నను కవులధికులు పూర్వమార్గమునే అనుసరించుచుండిరి. రాజకీయ విషయములను సామాజిక విషయములను పద్యములలో కాక గద్యమున గోచరించు

చున్నవి. ముద్రణాయంత్రములు మరియు ప్రచురణాలయములు స్థాపింపబడుటవలన ఉర్దూ సాహిత్యము అతివేగమున ప్రగతి చెందుచుండెను. ఈ విషయము "గార్సా - ద - తాసీ'' రచనల వలనను వ్యాఖ్యాముల వలనను స్పష్టమగును. అతడు 'ప్యారిస్' పట్టణములోనుండి ఇచటి ప్రతి సంవత్సరపు ప్రగతిని గూర్చి తన రచలనలో తెల్పు చుండెను. ఈ సంక్షిప్త చరిత్రలో ప్రగతియొక్క వ్యాపకరూపమును ప్రదర్శించుట అసంభవము. ఆ కాలమున భారతదేశపు నవజాగృతి పరిణామ స్వరూపమగు మహా యుగము ప్రారంభమయ్యెనని చెప్పిన చాలును. ముందటి అధ్యాయములలో నవచైతన్యమువలన కలిగిన సాహిత్య గతి విశ్లేషణ జరుపుటకు ప్రయత్నింపబడును. సమగ్ర చిత్రమును ప్రదర్శించుటకై ప్రాచీన సాహిత్య దృష్టి కలిగి మారుచున్న అవస్థను అనుసరింపజాలని ప్రవృత్తులను కూడ అటనట సూచింపబడును.



# తొ మ్మి ద వ  అ ధ్యా య ము

## నవ జాగృతి మఱియు నవ్య సాహితి

ప ద్య ము :—

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థమున భారతదేశములోని అధిక భూభాగముపై ఆంగ్ల ప్రభుత్వము వ్యాపించెను. దేశస్థితి చాల మార్పు చెందెను. అయినను కళలను సాహిత్యమును ఆ ప్రభుత్వమును సంపూర్ణముగా స్వీకరింపవయ్యెను. ఆర్థిక పరివర్తనల వలనను ఉత్పాదనకు సంబంధించిన భౌతిక సాధనములవలనను మానవుని ఆలోచనా విధానము మాఱుట, వర్గముల పరస్పర సంబంధములలో మార్పు గలుగుట తథ్యము. అయినను కళలయందును సాహిత్యమునందు ఆర్థిక సంస్థల వలన కలుగు పరివర్తనము కొన్ని సమయములలో మంద గమనమును కొన్ని సమయములలో తీవ్రగమనమును కలిగియుండును. ఇట్లగుటవలన రెంటి సంబంధము గ్రహించుటే కష్టమగును. ఈ పరివర్తనలు రెండును సమానముగా ఉండకపోవుటకు కారణమేమన ఒకసారి స్థాపితములైన సాహిత్య సంప్రదాయములు నెమ్మది నెమ్మదిగా అంతరించును. అవి ప్రజా సమూహమునకు అత్యంత ప్రియమైనవి అయినందున ఆర్థిక పరిస్థితులు మాఱినను ప్రజల హృదయములు ఆ సంప్రదాయముల వైపే ఆకర్షింపబడుచుండును.

ఆంగ్లేయులు పదునేడవ శతాబ్ది నుండి భారత వర్షమునకు వ్యాపారార్థము వచ్చుచుండిరి. పదునెన్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమున దేశములోని కొన్ని భాగములపై అధికారము సంపాదించిరి. ఇంగ్లాండులో వైజ్ఞానికాభివృద్ధి ఫలితముగా ఔద్యోగిక విప్లవము జరిగెను. భారతదేశమున విజ్ఞానము వ్యాపించలేదు. ఇంటి ధనము వెలుపలికి వెళ్ళకుండ ఆపగలిగిన శక్తియు ఇచట లేకుండెను. కనుక ఈ దేశము ముడిపదార్థములు సరఫరాచేయు కేంద్రమగునట్టి యోగ్యతయే కలిగియుండెను. రాజకీయముగను ఆర్థికముగను చూచిన అది మొగలు ప్రభుత్వ పతన కాలము. ఆంగ్ల సామ్రాజ్య సంపర్కమువలనను, ఐరోపీయ పెట్టుబడిదారీ విధానము సంపర్కమువలనను ఉత్పన్నమైన నూతన వ్యాపార, పారిశ్రామిక వికాస కాలము.

ఇచటి ఆర్థిక విధానము ద్వైతత్వమున కట్టువడియుండెను. ప్రాచీన సంప్రదాయము దానిని ఆదిమమగు కృషి ప్రధాన జీవితము వైపునకును గృహ పరిశ్రమల వైపునకును లాగుచుండెను. ఐరోపా తోడి సంబంధము దానిని నూత్నమగు యాంత్రిక జీవనము వైపు ప్రోత్సహించుచుండెను. అనేక శతాబ్దముల నుండి భారతదేశపు ఆర్థిక పరిస్థితి మఱియు రాజకీయజీవనము నిలిచిపోయిన నీటివలె స్తబ్దత కలిగియుండెను. కొంత కాలము క్రిందటివఱకు శాంతి ప్రదములైన నైతికములగు విలువలు సామాజిక, దార్శనికములగు విలువలు ప్రభావ శూన్యములై పోయెను. అధిక సంఖ్యాకులగు భారతీయులు తమ ప్రాచీన సభ్యతను గౌరవదృష్టితో చూచుచుండిరి. కాని వారి రాజకీయపతనము వారికి ప్రియమైన సభ్యతను అంతమొందించుచుండెనను సంగతి యెఱుగకుండిరి. మారుచున్న పరిస్థితులలో తమ ప్రాచీన సంపదను విపణి వీదిలో పేర్చి ప్రజలను ఆకర్షించు సాహసము వారిలో లేకుండెను. ఏలయన సామాన్య ప్రజానీకము జీవనోపాధికై క్రొత్తబాటలు వెదకుచుండెను. పందొమ్మిదవ శతాబ్ది మధ్యభాగము వఱకు ఎన్నియో రాజ్యములు కూలిపోయెను. వానికి సంబంధించిన సైనికులును ఉద్యోగులును నిరాశ్రయులై జీవిక కొఱకు అన్వేషణ ప్రారంభించిరి. కొందఱు నూత్న జీవితపు సంకటములను కొంత కొంత గుర్తించి పరిస్థితులతో రాజీ పడుటకై ప్రయత్నించుచుండిరి. ఆంగ్లేయుల ఆలోచనలను ఆమోదించుటే కాక వానిని గూర్చి ప్రచారము చేయగల ఒక వర్గమును భారత దేశీయులలోనే తయారుచేయుట కొఱకే ఆంగిలేయులు ప్రారంభించిన విద్యా బోధనము ఉద్దేశింపబడెను.

మెల్ల మెల్లగా ఇదంతయు చేయుచున్న ఈస్టిండియా కంపినీ ఈ కాలము వఱకు భారతదేశముపై వాస్తవికాధికారము పొందెను. భారతదేశపు స్తబ్దజీవనమున అదొక క్రొత్త వాయుతరంగమును లేవదీసెను. ఈ వాయువులో ఘాతుకమగు విషమును జీవితమునకు నూత్నత్వము ప్రసాదించగల భావవీచికలును కలిసియుండెను. ఒక వైపు ప్రగతికి మఱొకవైపు గతినిరోధమునకు సంబంధించిన ఈ సమ్మిశ్రిత భావనల వలననే ఈ కాలపు విశ్లేషణ కఠినమైపోయినది. విమర్శకుడు ఒక పరిభావుకుడై ఆవేశముతో దానిని నిందించును. ఇంకనొక పరి దాని వలన ఆర్థిక సామాజిక జీవనమునకు ఎట్టి హానియు వాటిల్లలేదనియే ప్రశంసించును. నిజమునకు ఈస్టిండియా కంపినీ దోపిడిగాళ్ళ దండు. అది ఒక శతాబ్దకాలమున దేశమును పూర్తిగా కొల్లగొట్టెను. దాని వలన ఏదో కొంత లాభము కలిగినను,

ఒక నవచైతన్యము కలిగినను అది తప్పించుకోరాని చారిత్రక కారణముల వలన కలిగినదే. బంగాళములో ప్రారంభింపబడిన నూత్న శిక్షణ కలిగించిన ధర్మ సంస్కారము, మఱియు పునరుజ్జీవన చైతన్యము ఆర్థిక, సామాజిక దృష్టితో బహుమూల్యమైనది. అందు ఆంగ్ల విద్యా ప్రభావమే అధికముగా పనిచేసె ననుటలో సందేహములేదు. అయినను జాగీర్దారీ వ్యవస్థ పతనము చెందుచున్న ఆ కాలమున మధ్యమ వర్గ మొకటి జన్మించుచుండెననియు దాని సముఖమున జీవన సమస్య లుండెననియు మఱవరాదు. సంస్కారమునకు, నవజాగృతికి రాజారామ మోహన రాయలు చక్కని ప్రతీకవంటి వాడు. ఆతని భారతీయత నూతన జ్ఞానము వలన ఇంకను దివ్యమయ్యెను. ఈ నవీన శిక్షణ హిందూ మహమ్మదీయుల సంఘముపై ఎట్టి ప్రభావము చూపెనో దానిని వివరించుట ఇచట అసంభవము అయినను భారతీయులలో అల్పసంఖ్యాకులు మాత్రమే ఈ నూత్న జీవనమును చైతన్య పూర్వకముగా గ్రహింప గలిగిరనుట మఱవరాని విషయము. అధిక సంఖ్యాకులు ఆర్థికముగా అణగద్రొక్కబడుచున్నప్పటికిని తమ ప్రాచీన సంప్రదాయములనే అంటిపెట్టుకొని యుండిరి.

భావికాలపు రాజనీతిని దృష్టియందుంచుకొని చూచినచో ఆంగ్లవిద్య మఱియు ఈస్టిండియా కంపినీతోడి సంపర్కము కలుగజేసిన మహత్తర పరివర్తనములలో నవీనమగు మధ్యమ వర్గపు ఉత్పత్తి యొకటని తెలియును. ఈ నవీన మధ్యమవర్గము ఆంగ్ల సామ్రాజ్యము ఏర్పఱచిన సంప్రదాయము ననుసరించియే తమ దేశోన్నతిని వాంఛించుచుండెను. దాని దృక్పథము ననుసరించి అది ప్రాచీన సంప్రదాయములతో అది సంతుష్టమై లేకుండెను. ఈ సంపర్కము ఘనిష్ఠమైన సందర్భమున ఈ నవీన మధ్యమ వర్గము ప్రాచీనమగు కృషి ప్రధాన జీవనము నధిగమించుట కనుగొన గలము. ఈ వర్గమే విదేశీయమగు నవచైతన్యమును, పారిశ్రామిక విధానమును పెట్టుబడిదారీ పద్ధతిని స్వీకరించెను. ఇట్లు ఈ నాటబడిన విత్తనములు కొలది కాలముననే మొలకెత్తి పెఱిగి విశాల వృక్షములయ్యెను.[1]

ప్రాచీన సంప్రదాయములు కొన్ని పురాతనములైనందున స్వయముగా నశించి పోవుననియు, మఱికొన్ని నూత్న పరిస్థితుల ఒత్తిడి వలన సమాప్తములై పోవు ననియు చరిత్ర శాస్త్రజ్ఞులు ఎఱుగుదురు. భారతదేశమున సామ్రాజ్యములు పడిపోవు

1. ఈ అధ్యాయమున మదీయములగు ఇతర రచనల సహాయము పొందనైనది.

చుండెను. పూర్వకాలపు రాజదర్బారులు తమ సంప్రదాయములతో నశించి పోవుచుండెను. ఉన్నత వర్గమునకును మధ్యమవర్గమునకును సంబంధించిన ముసల్మానులు పట్టుదలతో సామ్రాజ్యముల శవములను పట్టుకొని వ్రేలాడుచుండిరనుటలో సందేహములేదు. కాని నవచైతన్యమునకు సంబంధించినంత వఱకు వారికిని హిందువులకును అంతగా అంతరము లేకుండెను. ఇరుతెగల వారిలో ఎవరును మారుచున్న రాజకీయ సమస్యలను, ఆర్థిక సమస్యలను సంపూర్ణముగా గ్రహించినవారు లేకుండిరి. దీని పరిణామమేమైనదన భారతదేశము కృషి ప్రధానమగు ఆర్థిక దశకును, ఉద్యోగ ప్రధానమగు ఆర్థిక దశకును నడుమ కొట్టుమిట్టాడుచుండెను. సామ్రాజ్య కాలమునాటి సంప్రదాయములు మఱల కోలుకోలేని విధమున నూత్నభావములలో లయమొందెను. ఇది జటిలమైన పరిస్థితి. దీనిని సంపూర్ణముగ గ్రహింపని యెడల నూత్నజీవనమును మఱియు నవ్యసాహిత్యమును గుఱించిన వివరణ ఆవేశపూరితమై పోవును.

సామ్రాజ్యకాలపు టవశేషశక్తులు ఆంగ్ల ప్రభుత్వమునుండి విడివడువకై క్రీ. శ. 1857 వ సంవత్సరమున సాయుధయత్నము చేసెను. ఆంగ్ల ధనాఢ్యులకు విరుద్ధముగా జాగీర్దారులును స్వాతంత్ర్య వాంఛకలవారును సాగించిన ఈ సంఘర్షణమును ఆంగ్లుల విజయముతో సమాప్తమయ్యెను. భారతదేశపు సామాన్య ప్రజానీకము ఈ సంఘర్షణమున సరిగా పాల్గొనదయ్యెను. సామ్రాజ్యవాదులలోనే చీలికలు కలిగెను. కొందఱు జాగీర్దారులు ఆంగ్లులకు సహాయపడిరి. మఱికొందఱు వారికి విరుద్ధముగా నిలిచిరి. అప్పటికి ఆంగ్లులు మన సామాజిక, సాంస్కృతిక, మత సంప్రదాయములను నశింపజేయగలరను భయముననే వారియెడ అసహ్యాభావము రేకెత్తుచుండెను. ఆర్థికముగా కూడ వినాశము జరుగుచున్నదను భయమును అస్పష్టరూపమున ఉండెననుటలో సందియము లేదు. అదియే ముందు స్పష్టరూపమున ప్రకటమై ఆంగ్లేయులకు విరుద్ధముగా తుఫానువలె చెలరేగెను. ఈ సమరములో ముందు నడచిన ముసల్మాను జాగీర్దారులును జమీందారులును అతిక్రూరముగ అణగద్రొక్కబడిరి. అయినను జాగీర్దారీ వ్యవస్థ ఇంకను నిలిచియుండెను. ఆంగ్లేయులు పూర్వపు జాగీర్దారుల స్థానమున ప్రభుభక్తులగు జాగీర్దారుల వర్గమును సృష్టించిరి. ముసల్మానులపై మతపరమైయుండియు రాజకీయ లక్షణములుగల "వహాబీ" ఆందోళనము లేవదీసినారను నేరము మోపబడెను. ఆంగ్లేయులు ముసల్మానుల రాజ్యములు అధికముగా కబళించియుండిరి కనుక, వారును ముసల్మానులును ఒకరినొకరు పరస్పరము అనుమానించుచునే ఉండిరి. క్రీ. శ. 1885 వ సంవత్సర

మున కాంగ్రెసు సంస్థ స్థాపింపబడినంత ఆంగ్లులకు క్రొత్తసమస్య ఎదురయ్యెను. భారతీయులలో కలిగిన దేశభక్తిని, రాష్ట్రీయతను అరికట్టుట ఆవశ్యకమనిపించెను. కనుక ముసల్మానులతో మైత్రి చేయుటయే ఉచితమని తలంచబడెను. సర్ సయ్యద్ మఱియు కొందఱు నాయకులు ప్రయత్నించి తమ ప్రభుభక్తిని ఋజువు పరచుకొనిరి. పిపవానంతరము ఈస్టిండియా కంపినీ పాలనము సమాప్తమై భారత దేశము ఆంగ్లప్రభుత్వ వశమయ్యెను. విక్టోరియా మహారాణి ఈ రాజ్యము లభించి నంతనే మతస్వాతంత్ర్యము ఈయబడినట్లు ప్రకటించెను. ఉన్నతవర్గమునకును మధ్యమవర్గమునకును సంబంధించిన హిందూ ముస్లిములు దీనికి లోలోన స్వాగతము పలికిరి. భారత చరిత్రలో రాజవంశములు మారుట పరిపాటి. ఒక రాజవంశము నశించిన తరువాత ఇంకొక రాజవంశము అధికారము పొందును. సామాన్యప్రజలు ఈ పరివర్తనమునుకూడ అట్లే భావించిరి. మొగలులు బలహీనులైరి. వారి స్థాన మున ఆంగ్లేయులు వచ్చిరి. వారు ఎన్నియో సదుపాయములు కలిగించిరి. రాజ్యము లోని ప్రతివ్యక్తిని సమాన భావముతో చూడగలమని, అందఱ మతసంరక్షణచేయ గలమని మాట యిచ్చిరి – ఇవన్నిటివలన తమ దేశమును చీడవలె తినివైచుచున్న ఆంగ్లేయులు ఆర్థిక దుర్నీతిని గొప్పగొప్ప విద్వాంసులే గ్రహింపలేక పోయిరి. ఈ అనభిజ్ఞత కారణముననే భారతీయుల హృదయములలో ఆంగ్లులపట్ల సంపూర్ణముగా అసహ్యభావము కలుగలేదు. రచయితలు దేశభక్తి మఱియు ప్రభుభక్తి నడుమ భ్రమించుచుండిరి.

భారతదేశములోని అన్ని భాషల సాహిత్యములను ఈ భూమిక ననుసరించియే చూడవలెను. ప్రతి రచయితయు, కవియు ఒక నూత్న దశలో ఉండెను. భారత దేశము ఇట్టి పరివర్తనము చెందుచున్నప్పుడు దానిని అర్థము చేసకొనలేక పూర్వ రాగములనే ఆలాపించు రచయితలును ఉండిరి. వారి దృష్టిలో సాహిత్యమనగా కొన్ని ఎన్నుకోబడిన సంప్రదాయముల సమూహము. వారు సాహిత్యమును శాశ్వత మైనదనియు మార్పులేనిదనియు నమ్ముచుండిరి. జీవితమునకును సాహిత్యమునకును గల సంబంధమును గ్రహించిన రచయితలు మాత్రము తమ జాగృతిని, చైతన్య మును అనుసరించి భావములలోను సాహిత్యరూపములలోను పరివర్తనము కలిగించు టకు వెనుదీయువారు కారు. జీవితము మారుచుండుట చూచి వారు సాహిత్యములోను మార్పుతెచ్చుటకు వాంఛించుచుండిరి. ఈ నవ్యచైతన్య వికాసము హిందీలో భార తేందుకాలమునను ఉర్దూలో ఆజాద్ మఱియు హాలీలకాలమునను చూడగలము. నేటి

ఆధునిక సాహిత్యదృష్టితో ఇదియు ప్రాచీనమే అనిపించును. కాని క్రొత్త ప్రాతల మేలు కలయికకు ఇంతకంటె మంచి ఉదాహరణము మఱి యెచటను దొరకదు - వారిది విప్లవకాలము కాదు. మెల్లమెల్లగా పరివర్తనము కలిగించు సంస్కార వాదుల కాలమది. ఆ కాలమును కొన్ని విషమతలు ఉండెను. వర్గచైతన్యము పని చేయుచుండెను. అయినను అవి ప్రతిచోట సమానరూపమున ప్రదర్శితములు కాలేదు. అది ప్రజాసామాన్యమునకు సంబంధించిన యుగమును కాదు. మధ్యమ వర్గపు యుగమది. అభివృద్ధిచెందుచున్న ధనికవర్గపు యుగమది. అట్టి కాలమున సామ్రాజ్యవాదమును నిరసించి ఔద్యోగిక కాలమును ప్రోత్సహింపదలచిన వారును ప్రగతి శీలురే అనవచ్చును.

భారతదేశమున ఆంగ్ల ప్రభుత్వకాలము ప్రపంచ చరిత్రలో అన్నిటికంటె చీకటి కాలమని ఈ వఱకు చాలచోట్ల చెప్పబడినది. అయినను ఆంగ్లేయుల వలనన భారతదేశమునకు వైజ్ఞానిక శాస్త్రముతోను, తదావిష్కరణములతోను పరిచయము కలిగెననుట నిరాకరింపరాని సత్యము. స్తబ్ధమైయున్న భారతదేశపు ఆర్థిక జీవనమున ఉత్పాదనమునకు, ప్రగతికి సంబంధించిన యంత్రములు క్రొత్త అలలు రేపెను. ఈ పరిస్థితి కొంత నైరాశ్యమును కూడ కలిగించెను. కొందఱు భారతీయులు పెఱిగి పోవుచున్న ఆలోచనలకు వెఱచి తిరిగి తిరిగి వెనుకకు చూచుచు తమ భూతకాలమున లీనమగుచుండిరి. మఱికొందఱు నవీనతయొక్క ఇంద్రజాలమున చిక్కుకొని తమ ప్రాచీనేతిహాసమును అసహ్యించుకొనుచు ఆలోచన లేకయే పాశ్చాత్యుల భావములను సర్వథా స్వీకరించుచుండిరి. కొందఱు అల్పసంఖ్యాకులు మాత్రమే తమ బుద్ధి నుప యోగించి యుగధర్మమును గుర్తించి దేశోన్నతికి సంబంధించిన భావములు కలిగి తదనుకూలముగ క్రియారూపమున వ్యవహరించుచుండిరి. భారతేందు (హరిశ్చంద్ర) మఱియు 'హాలీ' ఇట్టివారని నా అభిప్రాయము. వీరు ఒకవైపు మార్పును నిరాక రించు వారితోను మఱొకవైపు పాశ్చాత్య సభ్యతను కనులు మూసికొని స్వీకరించు వారితోను ఘర్షణ పడుచుండిరి. సాలోచనముగా చరిత్రలో తమ కర్తవ్యమును నిర్వహించు చైతన్య చిహ్నములు వీరి రచనలలోనే గోచరించును. వర్గ సంఘర్షణ దృష్టితో ఈ యుగమును చూడదలచితిమేని అప్పుడు ప్రతివర్గపు చైతన్యమును, మానసికస్థితిని స్పష్టముగా గ్రహింపదగిన విధముగా వర్గముల వ్యవస్థీకరణ లేకుండె నని మఱల ఒకతూరి నొక్కి చెప్పగలను. కనుక ఒక రచయిత ఒకవైపు తన ప్రజలపట్ల ప్రేమ ప్రకటించుచు ఆ నోటనే ఆంగ్ల ప్రభుత్వమును ప్రశంసించుట

చూచి మనము చకితులము కా బనిలేదు. ఆ పరిస్థితులలో ప్రభుభక్తి లేదా, ఆంగ్లుల ప్రశంస అనగా ఆధునిక యుగపు టాలోచనలను గ్రహించుటయే. విప్లవము మఱియు వాని తరువాత జరిగిన దురంతములు భారతీయులలో పరాజయ వాద మును, నిరాశాభావమును కలిగించెను. నూత్నమగు ఆర్థిక విధానమును స్వీకరించి, లేదా కనీసము దానిని వ్యతిరేకించక భారతేందు మఱియు హాలీ మహాకవులు తమ తమ ధార్మిక క్షేత్రములలో నిలిచి నిరాశాభావమును, అపాయశంకను దూరముచేసి పూర్వపు కీర్తిని స్మరించుచు గర్వించి ఆశాపూర్వకముగా జీవితసమరమున పాల్గొని భవిష్యత్తును స్వహస్తములతో తీర్చి దిద్దుకొనుటకై ప్రోత్సహించుట చూడగా ప్రభుభక్తి యనగా జీవించి పురోగమించుట కొక ఆలంబనమే అని స్పష్టపడును. ఆంగ్లులు భారతీయులకు శత్రువులను భావమున వారిని ప్రశంసింపలేదు. వారి భాష హిందూ ముసల్మానుల భావుకతను మృత్యు ముఖమునుండి కాపాడినది. అది మాత్రము సామాన్యమా ?

క్రొత్తగా జరిగిన మధ్యమవర్గపు ఉత్పత్తియొక్క ప్రభావము అతి వ్యాపకము. భారతీయులకు మత స్వాతంత్ర్యము లభించెను. అది వారిని అనుచిత మార్గమున పడవైచెను. వారు తమ సమస్యలను సామాన్యమగు రాష్ట్రీయ దృక్పథముతో చూచు టకు బదులుగా బూటకపు మత స్వాతంత్ర్యమును చాటుగొని తమ మతస్థులతోనే పురోగమించుటకై ప్రయత్నించుచుండిరి. వారు ఆంగ్ల ప్రభుత్వపు ఒత్తిడి వలనను, సమానములగు ఆర్థిక సమస్యల కారణమునను హిందూ ముస్లిముల సమైక్యతా దృష్టితో ఆలోచించవలసిన వారయ్యును వేఱొకవైపు తమ తమ మతసీమలలోనే ఉన్నతికి సంబంధించిన ఆలోచనలు చేయుచు సంకుచితత్వమునకు గురియగుచుండిరి. భారతేందు మఱియు అతని అనుచరులు ఒకవిధముగా ధర్మభీరువులు. వారు హిందువులను మాత్రమే అభివృద్ధి పథమునకు ఆహ్వానించిరి. అట్లే హాలీ, నజీర్, అహమద్, షిబ్లీ మఱియు అక్బరు మధ్యమ వర్గీయులగు ముస్లిముల ప్రాతినిధ్యమే వహించిరి. ఒకవైపు ఆర్యసమాజి కాందోళము మొదలయ్యెను. రెండవ వైపు ముస్లిమ్ సంస్కారోద్యమము బయలుదేరెను. ఈ రెంటి ఆలోచనలలో చాల వఱకు సమానత గోచరించును. ఈ విషయమునే ఆంగ్ల సామ్రాజ్యోన్నతి ననుసరించి చూచినచో సంస్కార వాదపు మూలమును, వేఱు వేఱు అభివృద్ధి చెందవలెనను భావములును దానితో ఎంతవఱకు సంబంధించియున్నవో వెంటనే బోధపడును. ఆనాటి మత సంస్కర్తలే కాక మంచి మంచి కవులును, రచయితలును, "హిందీ -

హిందూ — హిందూస్థాన్" అను నినాదములు చేసిరనిన మనము చకితులము కానవ సరము లేదు. ఇట్లే ముసల్మానులు ఉద్యోగములకై ముసల్మానులకు కేటాయింప బడిన స్థలములను అసెంబ్లీలో నియమితమగు సంఖ్యను, శిక్షణను గురించి ప్రయత్నించుటే కాక ఆంగ్లేయులనుండి ఉదార వ్యవహారమును అభ్యర్థించుచుండిరి. అయినను సాహిత్యములో కన్పించునట్టి ధార్మిక భావములు వాస్తవమునకు జాగృతికి ప్రతిబింబములే అనవచ్చును. ఇది శక్తి సంపాదించుట కొరక యెత్తు. ఆనాటి ఉర్దూ హిందీ రచయిత లందఱిలో ఈ ద్వైత విధానము కన్పించును. ఒకవైపు వారు రూఢి వాదులకు, ఛాందసులకు వ్యతిరేకముగా పోరుచు మఱొకవైపు మతాదర్శముల ద్వారమునను, ప్రాచీన గౌరవమును గానముచేయుట ద్వారమునను జాగృతి కలిగించుచుండుట చూడగలము.

దేశభక్తి, ఛాందసభావ విరోధము, ఉద్యోగ వ్యాపారాదుల ప్రోత్సాహము, సాంఘిక సంస్కరణ, విద్య, నీతి భావములలో పరివర్తనము మొదలగునవి ఆ యుగ గర్భమునుండి ఉత్పన్నమైన ప్రగతిశీల శక్తుల క్షేత్రమునుండి ప్రేరణ పొందినవే. ఈ భూమిక ననుసరించియే కవిత, విమర్శనము, జీవన చరిత్ర, నాటకము, చరిత్ర, ఉపన్యాసములు వ్రాయబడుచుండెను. రచయితలు దీని ప్రకాశముననే నూత్న భావముల సహాయమున మతమును క్రొత్త మార్గమున ప్రదర్శించి రూఢి వాదుల క్రోధమునకు గురియగుచుండిరి. సామాజిక సంస్కరణ సంబంధమునను, రాజకీయ సంస్కరణ సంబంధమునను వారినోట ఒకేరీతీ భావములు వెలువడు చుండెను. అయినను చారిత్రక సంప్రదాయములలో విభిన్నత ఉండుటవలన కొంత భేదమును కాన్పించును. ఈ కాలపు ఉర్దూ, హిందీ సాహిత్యముల నడుమ కనిపించు గొప్ప అంతరమును చూడవలసి యున్నది. ఆధునిక హిందీ సాహిత్యమున గల లోక గీతుల సంప్రదాయములు తమ సంబంధమును భారతదేశపు అన్య భాషలతో నిలుపుకొనినవి. ఉర్దూలో ఇట్లగుట కష్టము. దీనిప్రభావము ప్రజాసాహిత్య వికాసముపై ఇప్పటికిని పడుచున్నది. భారతేందు లోక సాహిత్య మహత్వమును గూర్చి చాల వ్రాసెను. ఉర్దూ సాహిత్యమున అట్టి రచనలు అతిస్వల్పము. 'హాలీ' మీరట్ లోని ప్రజాకవి యగు 'దల్‌మీర్'కావ్యసంగ్రహముపై ఒక వ్యాసము వ్రాసెను. దాని వలన ఉర్దూ సాహిత్యమునందును ఆ కాలమున ప్రజావాణి ఉపయుక్తమగు చుండె నని తెలియును. కాని ఈ రచనలు ముందు ముందు కాన్పించవు. నేడు వ్రాయబడు చున్న గీతములు మాత్రము ఉర్దూ హిందీ భాషలలో ఒకే శైలి కలవి.

రాజకీయస్థితి యెట్లుండెనన మధ్యమ వర్గము మూలవిహీన మయ్యును శక్తి సంపాదించుకొనుచుండెను. ఒకప్పుడది ఆంగ్ల ప్రభుత్వముతో రాజీపడి మఱొకప్పుడు కత్తులు దూసి యుద్ధమునకు సిద్ధమగుచుండెను. పందొమ్మిదవ శతాబ్దాంతము నాటికి భారతీయులగు విద్యావంతు లందఱలో రాష్ట్రీయ భావములు దృఢపడెను.

ఆర్థిక దృక్పథము ననుసరించి అభివృద్ధి చెందుచున్న భారతీయ ధనికవర్గము ఆంగ్లులనుండి శక్తి పొంది ఇచటి ప్రజలను బాధింపసాగెను. ఈ ప్రజల రక్తమునే నూరేండ్లకు పైగా ఆంగ్లేయులు పీల్చివైచిరి. ఇచటి ధనికులును తమ అధికారము సాగింపజూచిరి. ఆంగ్లేయులు ఇచటి గ్రామీణ ఆర్థికస్థితిని బలహీనపరచి ఇచటి పరిశ్రమలను నశింపజేసిరి. అంతేకాదు ఇచటి ప్రజలలోని మత విశ్వాసమును అదృష్టము మీది విశ్వాసమును కూడ సడలజేసిరి. భారతీయులను సంతోష పఱచుటకు వారికడ ఇంకేదియు మిగులలేదు. దినదినము ప్రజ దరిద్రమగుచుండెను. కఱవు కాటకములును, మహామారి మొదలగు వ్యాధులును ప్రకోపించి తమ కార్యము నిర్వర్తించుచుండెను. స్వతంత్ర వ్యాపారము వలన భారతదేశము సామ్రాజ్యవాదుల విపణివీధి యయ్యెను. కర్షకులు భూమిలేనివారై పట్టణములలో జీవిక నన్వేషించుచు తిరుగుచుండిరి. దేశములోని ఈ పరిస్థితులు ఆ నవ్య చైతన్యమును ఆసరాగాగొని విప్లవాత్మకమగు ప్రజాందోళనమును ఉత్పన్నముచేసెను. ప్రథమ ప్రపంచయుద్ధము, చైనా, ఈరాను మఱియు టర్కీ దేశముల రాజకీయ విప్లవములు రష్యాయొక్క మహా విప్లవము ఇవన్ని భారతీయ స్వాతంత్ర్య సమరమునకు శక్తి కూర్చి జాగృతి భావములను ఉత్తేజపరచెను. దానివలన ఆంగ్లుల పట్ల అసహ్యాభావలహరులు లేచుటే కాక ప్రజలను శాసించి పైకి రాదలచిన ప్రతి వర్గముతోను సంఘర్షణము ప్రారంభమయ్యెను. రచయితలలోను, కవులలోను ఈ సమస్త విషయములు మనము కనుగొన గలము. భారతదేశములోని ఏ భాషను చూచినను ఈ మహనీయమగు జాగృతికి సంబంధించినంత వఱకు సమాన భావములే కన్పించును. ఒకటే భూమిక, స్వాతంత్ర్యాందోళనము, ఆర్థిక సమానత మఱియు క్రాంతి కొఱకు సంఘర్షణ ఇవియే కలవు. కనుక ఒకేరీతి సాహిత్యము ఉత్పన్నమగుచున్నవి. ఇందలి అధిక భాగము తాత్కాలిక ప్రభావము కలదగుట వేఱు విషయము.

రాజకీయ పరివర్తనమును, సామాజిక పరివర్తనమును జరుగుచున్న ఆ కాలమున ఒక విధముగ ధార్మిక, సామాజిక, రాజకీయ నాయకు లనదగిన సాహితీపరులు జన్మించిరి. ఏలయన వారు సాహిత్యమును, జీవితమును జోడించిరి. తమ

మానసిక శక్తిని విశిష్టములగు ఉద్దేశ్యముల ప్రచారమునకే వినియోగించిరి. ఈ నూతనాందోళనమునకు సర్ సయ్యద్ నాయకుడు. అతడు సాహిత్యములో ఆజాద్, హాలీ, నజీర్ అహమద్ మఱియు షిబ్లీలకు తరువాతి వాడే కాని ఇతర సమస్త విషయములలో అందఱకంటె గొప్పవాడు. అందుకొఱకే ఈ యుగము సర్ సయ్యద్ యుగమనబడును. ఈనాటి ఉత్తమ గద్య రచయితలును, పద్య రచయితలును మానవజాతిని బంధవిముక్తము చేసి ఔన్నత్యము నందింపగల వ్యాకులతను, ఉద్విగ్నతను తమ సాహిత్యము ద్వారమున చిత్రించుచుండిరి. రచయితయొక్క చైతన్యము మఱియు వర్గ విభజితమగు సమాజనమున అతనికిగల స్థానము సంపర్కము మొదలగు వానిపై సాహిత్యము ఆధారపడియుండును. కనుక ఒకే యుగమున నానా ప్రకారముల వాణి వినిపించును. ఈ విభిన్నత రచయితల వ్యక్తిత్వ విశేషము కాదు. ఇది ఆనాటి సామాజిక చైతన్యముయొక్క భావమయ రూపము - ఈ అధ్యాయమున సంప్రదాయ బద్ధులును నవ చైతన్యముచే ప్రభావితులైన వారును అగు మహాకవుల గుఱించి వ్రాయబడును. మోలానా మొహమ్మద్ హుస్సేన్ ఆజాద్ నవ్యకవితా నిర్మాత.[1] విప్లవమునకు ముందు అతడు లాహోరులోని విద్యాశాఖలో ప్రభుత్వోద్యోగిగా ఉన్నప్పుడు ఎందఱో ఆంగ్ల విద్వాంసుల సహవాసమున మెలగెను. అతడు దిల్లీ కాలేజీ విద్యార్థిగా ఉన్నవాడే. నవ్య విజ్ఞానము నెఱిగినవాడు. నూత్న భావములు కలవాడు. అతడు ఆంగ్ల విద్వాంసుల సమ్మతి ననుసరించి నవ్య కవిత యొక్క రూపురేఖలను తన సహచరులకును భారత ప్రజలకును ప్రదర్శించెను. క్రీ. శ. 1867 ఆగస్టు మాసమున అతడొక ఉపన్యాసమున పూర్వుల కావ్య రచనలోని ముఖ్యముగా ఉర్దూ ఫారసీ భాషలలోని రచనలందు గల దోషములను ఎత్తి చూపుచు కవిత అనగా మానవ జీవితము మఱియు ప్రకృతికి సంబంధించిన ప్రతి విషయమును వెలుగులోనికి తెచ్చుటయే అని వక్కాణించెను. "మన కవిత కొన్ని విషయముల వఱకే పరిమితమై ఉన్నది. మన పూర్వులు గొప్ప రచనలే చేసిరి. కాని మనము వారు త్రొక్కిన త్రోవనే త్రొక్కుచు వారి ఉచ్ఛిష్టసేవనమే చేయుచున్నాము. మన ముందున్న క్రొత్త సమస్యలవైపు కన్నెత్తియైన చూచుట లేదు." ఈ భావములనే ఆజాద్ హృదయమును కదిలించునట్టి సుందర శైలిలో విపులముగా వివరించెను. మన కవులు తమ చీకటి గదులనుండి వెలువడి క్రొత్త వాతావరణమున క్రొత్త మార్గములపై నడువ వలసినదని సలహా యిచ్చెను.

1. ఇతని జీవిత చరిత్రము ముందటి అధ్యాయమున వ్రాయబడును.

నూతన శిక్షణ మఱియు నవ్యసామాజిక చైతన్యము వలన మాఱుచున్న ఆర్థికస్థితియొక్క పరిణామము ననుసరించి ఆజాద్ భావములు వ్యర్థములై పోలేదు. కొలదికాలములోనే లాహోర్‌లో "అంజుమనె-పంజాబ్" యొక్క పునాదులు గట్టి పడెను. క్రీ. శ. 1874 వ సంవత్సరమున మే ఎనిమిదవ తేదీన నవ్యకవితా గానము చేయబడిన ప్రథమ కవి సమ్మేళనము జరిగెను. అందు మొట్టమొదట మోలానా ఆజాద్ ఒక విజ్ఞానాత్మకమును, సుందరమును అగు భాషణము చేసెను. కవితలో వాస్తవికతను మఱియు దేశీయతకు ప్రాముఖ్య మొసగవలెనని నొక్కి చెప్పెను. మఱియు ఇట్లనెను; "మనము కోకిల, చంపకము, తీగమల్లె, అర్జునుడు, భీముడు, గంగ, యమున, హిమాలయము మొదలగు వానిని బొత్తిగా విస్మరించి నాము. మానసికస్థితి చెడిపోయిన తరువాత సూఫీ తత్త్వమునకు సంబంధించిన గజలులు మఱల వ్రాయ ప్రారంభించెను. అందు అధికముగా నష్టపడినవి. ఉదాహరణ కొఱకు అతని కవితలోని రెండు భాగములు చూడుడు :—

హై సామ్నే ఖులా హువా మైదాఁ చలే చలో
బాగే మురాద్ హై సమర్ - అఫ్షాఁ చలే చలో
దర్యాహో బీచ్‌మేకి బయాబాఁ చలే చలో
హిమ్మత్ యే కహ రహీ హై ఖడీ, హాఁ చలే చలో
చల్నాహి మస్లెహత్ హైమెరీ జాఁ చలే చలో-
హిమ్మత్‌కే షహ సవార్ జో ఘోడే ఉఠాయేంగే
దుష్మన్ ఫలక్ భీ హోంగేతో సర్‌కో ఝుకా యేంగే
తూఫాన్ బుల్బులోంకీ తరహ్ బైఠ్ జాయేంగే
నేకీకే జోర్ ఉఠ్‌కే బదీకో దబా యేంగే
బైఠోన తుమ్, మగర్, కిసీ ఉన్వాఁ చలే చలో- 1

1. ఎదుట విశాలమైన మైదానము కలదు- ముందుకు నడువుడు.
వాంఛల తోట ఫలోన్ముఖమైయున్నది- నది అడ్డమైనను అరణ్యము అడ్డమైనను నడువుడు- ధైర్యము నడువుడనియే ప్రోత్సహించుచున్నది. నడచుటయే కర్తవ్యము- నడువుడు. ధైర్యవంతులు అగు రౌతులు గుఱ్ఱముల నధిరోహించినంతనే ఆకాశవంటి శత్రువులైనను తలవంచుకొందురు. చెలరేగిన తూఫానులు కూడ నీటి బుడుగల వలె అణగిపోగలవు- సచ్ఛక్తి విజృంభించి దుష్టశక్తి నణచగలదు. మీరు ఏ విధముగనైనను కూర్చుండ వలదు- నడువుడు.

ఈ యుగపు కవులందఱలో అగ్రగణ్యుడు "హాలీ". అతడు నవ్యసాహిత్యపు పునాదులను ధృఢపఱచెను. క్రీ. శ. 1837 వ సంవత్సరమున పానీపత్ (పానిపట్టు) లో జన్మించెను. అతని పూర్తి పేరు ఖ్వాజాఅల్తాఫ్ హుస్సేన్. తొమ్మిది సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికి అతని తండ్రి గతించెను. తల్లిమొదటినుండియు హృద్రోగముచే బాధపడుచుండెను. కనుక అన్నలే అతనిని పోషించి చదివించిరి. కొలది కాలములోనే అతడు ఆనాటి పఠనీయగ్రంథములన్నిటిని చదివెను. అతనికి పదునేడు వర్షములు వచ్చునప్పటికి అన్నలు వివాహము చేసిరి. ఇంకను విద్యాభ్యాసము చేయ గోరుచున్న హాలీకి వివాహసంబంధము దుర్భరమే అయ్యెను. ఒకరికి ఇద్దఱయిన తరువాత అన్నలపై భారము మోపుట అసమంజసమనిపించెను. అదృష్టవశమున అతని భార్య సంపన్నుల యింటి బిడ్డ. ఈ పరిస్థితిని సదుపయోగముచేసికొని భార్య పుట్టింటికి వెళ్ళినప్పుడు తాను ఎవరికి చెప్పకుండ కాలినడకనే దిల్లీకి పయనమయ్యెను. అచట దైన్యస్థితిలోనే విద్వాంసులవెంట తిరిగి విద్యాభ్యాసము చేయసాగెను. అప్పుడే దిల్లీ కాలేజీ స్థాపింపబడెను. ప్రజలు అందు నూత్న విద్య అభ్యసించుచుండిరి. కాని 'హాలీ'కి అందు ప్రవేశము లభింపదయ్యెను. దిల్లీలో ఉన్నప్పుడే అతడు అరబీభాషలో మత సంబంధమగు ఒక పుస్తకము వ్రాసెను. అది చిన్నదే అయినను ఒక గొప్ప రచయితయొక్క ప్రారంభ కృషి. అతని గద్యరచనల ప్రసక్తి ముందు ముందు వచ్చును. ఇచట క్రమము తప్పిపోకుండుటకై అతని రచనలను పేర్కొనబడును.

అప్పటికి సిపాయీ విప్లవము జరుగలేదు. దిల్లీ తన అంతిమ శోభతో వెలుగొందుచుండెను. గొప్ప గొప్ప కవులును విద్వాంసులును అచట నివసించుచుండిరి. అందఱలో మిర్జా గాలిబ్ కీర్తి ప్రతిష్ఠలు కలవాడు. "హాలీ" కవిత్వము వ్రాయుట ప్రారంభించెను. అతడు ఏదోవిధముగా గాలిబ్‌ను సమీపించి తన కవితలను వినిపించెను. పదునేడు పదునెన్మిదేండ్ల యువకుని నోట అంత అందమగు గజలు విని గాలిబ్ చకితుడయ్యెను. అతడిట్లనెను; "నేను గజలులు వ్రాసి కాలహరణము చేసికొనుటకై ఎవరికిని సలహా ఈయను. కాని నీ విషయమున నా అభిప్రాయము మార్చుకొనుచున్నాను. నీవు ఇంతటితో విరమించితివేని అపచారము చేసినవాడవగుదువు." ఆ మాటల వలన హాలీకి కావలసినంత సాహసము లభించెను. అతడు నాటి నుండి దిల్లీలోని కవిసమ్మేళనములలో స్వీయ కవితాగానము చేయసాగెను. అతడు దిల్లీలో ఉన్నసంగతి తెలిసికొని అతని అన్నలు ఇంటికి వెంబడించుకొని వెళ్ళిరి. "హాలీ" క్రీ. శ. 1856 లో జీవనోపాధికై బయలుదేరి "హిస్సారు" లోని

డిప్టీకమిష్నర్ కార్యాలయమున ఉద్యోగము సంపాదించెను. తరువాత కొన్ని దినములకే విప్లవము జరిగెను. అతికష్టముమీద అతడు ప్రాణము దక్కించుకొని పానిపట్టుకు చేరుకొనెను. కాని అతని ఆరోగ్యము చెడిపోయెను. ఈ అనారోగ్యము ఆమరణాంతము అతనిని విడువలేదు. ఇంటికి చేరి అతడు మఱల అధ్యయనము ప్రారంభించెను. గ్రంధావలోకనము వలన విజ్ఞానాభివృద్ధి చేసికొనెను.

విప్లవము ముగిసిన పిదప మఱల జీవనోపాధికై ఢిల్లీకి వెళ్ళెను. ఈ సారి అతనికి "షేఫ్తా"తో పరిచయము కలిగెను. అతడు తన కుమారుని విద్యాబోధనకై హాలీని నియమించెను. విద్యాబోధన పేరునకు మాత్రమే. 'షేఫ్తా' హాలీతో సాహిత్య చర్చలతోనే కాలము గడపుచుండెను. షేఫ్తా యొక్క విద్వత్త మఱియు విమర్శనాజ్ఞానముచే లాభము పొందు అవకాశము 'హాలీ'కి కలిగెను. క్రీ.శ. 1869లో షేఫ్తా మఱియు గాలిబ్ ఇరువురును మరణించిరి. అప్పుడు ఢిల్లీ 'హాలీ'కి పాడుపడినట్లుతోచెను. అతడు లాహోరు వైపు వెడలెను. అచట "పంజాబు గవర్నమెంటు బుక్‌డిపో"లో అతనికొక చిన్న ఉద్యోగము దొఱకెను. ఆంగ్లము నుండి అనూదితములయిన గ్రంథము లందలి భాషను సంస్కరించుట అతడు చేయవలసిన పని. ఈ పనిలో అతనికి క్రొత్త వెలుగు కనిపించినట్లు అతడే వ్రాసికొనెను. ఆంగ్లసాహిత్యమున ఆకర్షణీయములగు గుణము లన్ని అతనికి గోచరించెను. ఫారసీ ఉర్దూ కవితలలోని దోషములను ప్రదర్శించుటలో అతనికి ఆనందము కలిగెను. హాలీ యొక్క ఆంగ్ల భాషా జ్ఞానము అతి స్వల్పము. అయినను అతడు అందలి గుణములను ఇప్పుడు వానివైపు శ్రద్ధ చూపవలెను"–ఆజాద్ పూర్వమునుండి వచ్చుచున్న సంప్రదాయములకు విముఖుడు కాడు. మన నలువైపుల వ్యాపించి యున్న జీవితమునే కవిత ప్రతిబింబింప జేయవలయునని అతడు అభిప్రాయపడెను. ఉపన్యాసానంతరము ఆజాద్ రాత్రి యొక్క విభిన్నరూపముల నభివర్ణించిన తన కవితను వినిపించెను. ఆజాద్ మహాకవికాడు. నూత్న శైలిని సృష్టించి నందున మహనీయుడు–లాహోరులోని ఈ కవి సమ్మేళనములు 'హాలీ'ని కూడ ఆకర్షించెను. అతడు ఈ సమ్మేళనముల కొఱకే కొన్ని గొప్ప కవితలు వ్రాసెను. కొలది కాలములోనే ఈ నూత్న శైలి భారతదేశ మంతటను వ్యాపించెను. ఏ కార్యమునకేని చారిత్రకములు, సామాజికములు అగు కారణముల వలన అనుకూల పరిస్థితు లేర్పడునేని ఆ కార్యము పుష్పించి ఫలించుటకు ఆలస్యముకాదు. అప్పటి భారత దేశము రాష్ట్రీయ భావములను దేశభక్తిని ప్రకటించుటకును, విప్లవము తరువాత

కలిగిన నైరాశ్యమును దూరము చేయుటకు సిద్ధపడి యుండెను. కనుక రూఢివాదు లెంత వ్యతిరేకించినను నవ్యసాహిత్యము జన్మించెను. ఆజాద్ కవితా సంగ్రహము "నజ్మె-ఆజాద్" అను పేర ప్రకాశితమైనది. అందుపైన పేర్కొనబడిన రెండు ఉపన్యాసములును ప్రకటించబడినవి. ఆజాద్ జోఖ్ శిష్యుడు. ప్రారంభమున అతడును సాంప్రదాయకములగు గజలులే వ్రాసెను. కొన్ని ఖసీదాలును మర్సియా లును వ్రాసెను. కాని పైన పేర్కొనబడిన నవ్యకవితలే సారవంతములైనవి. చివరికి అతని చక్కగా ఆకళింపుచేసికొన గల్గెను. ఆ సమయముననే 'ఆజాద్' నెలకొల్పిన క్రొత్తరకపు కవి సమ్మేళనములు జరుగుచుండెను. హాలీ ఆ నవ్య సాహిత్యోద్యమమున సంపూర్ణముగా లీనమయ్యెను. అతనిలో గొప్ప పరివర్తనము కలిగెను. సాహిత్యమునకు కవిత్వమునకు సంబంధించిన అతని దృక్కోణము మారెను.

లాహోరులో ఆరోగ్యము చెడిపోవుట వలన అతడు దిల్లీకి వెళ్ళిపోయెను. దిల్లీ కాలేజీలో అతనికి ఉద్యోగము దొరకెను. దిల్లీలో నివసింపవలెనని వాంఛయు తీరెను. అంతవరకే అతడు ఎన్నియో మహత్తరములగు కవితలను, వచన గ్రంథములను వ్రాసెను. అతని వచన రచనలను గురించి ముందటి అధ్యాయమున వ్రాయబడును. ఇచట అతని పద్యరచనలనే సూచింపబడును. దిల్లీలో నివసించు కాలమున అతనికి సర్‌సయ్యద్‌తో పరిచయ మేర్పడెను. విప్లవము తరువాత ముసల్మాను లందరకును సర్‌సయ్యద్ గొప్ప నాయకుడు. అతడు ముసల్మానుల వృద్ధిక్షయములను గూర్చి కవిత వ్రాయుమని హాలీని కోరెను. హాలీ "మద్దొ-జజరె-ఇస్లామ్" అను తన సుప్రసిద్ధ కవితను అప్పుడే వ్రాసెను. అది "ముసద్దసె-హాలీ" అను పేర ప్రఖ్యాతము. సర్‌సయ్యద్‌చే స్థాపింపబడిన "ముస్లిమ్ ఎడ్యుకేషనల్ కాంగ్రెస్" సమావేశములలో హాలీ తన కవితలను వినుపించుచునే ఉండెను. కాని "ముసద్దస్" రచన వలన అతని కీర్తి నలుదెసల వ్యాపించెను. క్రీ. శ. 1887లో అతడు తన రెండవ కవిత "మునాజాతె-బేవా" వ్రాసెను. ఇట్లే ఒకటి వెనుక ఒకటి చొప్పున సంస్కరణ భావములు కల కవిత లెన్నియో వ్రాసెను-

"ముసద్దస్" అనేక పర్యాయములు అచ్చయినది. అదికాక అతని కావ్య సంగ్రహము లెన్నియో పలుతడవలు ప్రకాశితము లైనవి. "దీవానె - హాలీ" అతని గజలులును లఘుకృతులును, మజ్మూఅయె - నజ్మె - హాలీ"లో అతని ఇతర రచన లన్నియును సంకలితములైనవి. దీర్ఘ కవితలు వేరు వేరుగా అచ్చయినవి. హాలీ తన

రచనలను గూర్చి స్వీయాభిప్రాయములను స్పష్టముగా ఉపోద్ఘాత రూపమున ప్రకటించెను. అవి అతని రచనల సమీక్షలో చాల సహాయపడును. చివరికాలమున హాలీకి హైదరాబాద ప్రభుత్వము గౌరవవేతనము నిర్ణయించెను. దాని వలన సంతుష్టుడై రచనా వ్యాసంగమున నిమగ్నుడయ్యెను. క్రీ. శ. 1904 వ సంవత్సరమున అతనికి "షమ్సులులమా" అను ఉపాధి లభించెను. హాలీ దానిని స్వీకరించెను. కాని దానివలన ప్రసన్నుడు కాడయ్యెను. క్రీ. శ. 1914 లో అతడు మరణించెను.

ఆనాటి ఆచారము ననుసరించి హాలీ మొట్టమొదట గజలులే వ్రాసెను. తాను మీర్; గాలిబ్ మఱియు షేఫ్తాలచే ప్రభావితుడైనట్లు వ్రాసికొనెను. ఈ ముగ్గురు కవులు గజలులలో వాస్తవికతను, హార్దిక భావములను అతిసుందరముగా ప్రకటింతురు. కనుక హాలీ గజలులు కూడ చాల సుందరమైనవి. అతని పద్యములు అమ్ములవలె హృదయమును దూసికొని పోవును. మనోభావములను, ప్రేమ భావములను ఉల్లేఖించునపుడు అతని సరళ శబ్దములలో పిడుగులు దాగి యున్నట్లనిపించును. ఇవన్నియు ప్రారంభ కాలపు మాటలు. నవ్య కవిత నాదరించిన తరువాత అతని గజలులలోను నైతిక సంస్కరణ మఱియు రాష్ట్రీయతకు సంబంధించిన భావములే చూడనగును. అతని దీర్ఘ కవితలలో "ముసద్దస్", "మునాజాతె - బేవా", "బర్ఖారుత్", "హుబ్బే - వతన్", చుప్‌కీదాద్" మొదలగునవి సర్వోత్తమ రచనలుగా పరిగణింపబడును. వీనిని చదువుట వలన హాలీయొక్క సహృదయత మఱియు గంభీరత తెలియుటయే కాక ఆనాడు భారతదేశమున సంస్కారోన్నతుల పట్ల చూపబడుచున్న ఉత్సాహమును దృష్టిగోచర మగును. అతడు కవిత్వము ద్వారమున దేశమును మేల్కొలుప దలచిన సంగతి తన కవితలలో పలుచోట్ల వెల్లడించెను. హాలీ మధ్యమ వర్గపు ముసల్మానులకు చెందినవాడు. అప్పుడు ఈ వర్గము నెదుర్కొనుచున్న క్లిష్ట పరిస్థితులు అనేకములు. ప్రాచీన సంప్రదాయముల నుండి విడివడి క్రొత్త ఆర్థిక క్షేత్రమున ప్రవేశించి క్రొత్త శిక్షణ పొందవలెనని వారును కోరుచుండిరి. క్రాంతిగల దృక్పథము లేనందున ఈ అభివృద్ధి భావము సంస్కారవాదముగానే పరిమితమై పోయెను. కనుక హాలీ కూడ ద్వైధీభావమున చిక్కుకొనినట్లే కనిపించును. అతడు దేశభక్తుడును, రాజభక్తుడును కాదలచెను. ఆనాడు రాజభక్తి ద్వారముననే పురోగమించు అవకాశ ముండెననుటలో సందియము లేదు. ఏలయన విప్లవము తరువాత ముసల్మానులలో కలిగిన నైరాశ్యమును తప్పించు

కొనుటకై నవ్య జీవనమును స్వీకరించి, ఆంగ్లేయులతో పోరాడి ప్రయత్నించుట మేలని తలంపబడెను.

'హాలీ' కవిత్వము ద్వారమున జాగృతీ సందేశ మీయదలచెను. అపుడు కావ్యరచన పతనావస్థలో నుండెను. కేవలము శబ్దాడంబరము, అలంకార ప్రయోగము మఱియు చమత్కార భాషణమే కవిత్వోద్దేశ్యమని తలంపబడుచుండెను. అట్లగుట 'హాలీ' కవితకు వ్యతిరేకతయే లభించెను. అతని రచనలు పరిహసింపబడెను. అతని దృక్పథము నిశితముగా విమర్శింపబడెను. అయినను హాలీ తన పట్టుదల వదలలేదు. తన మార్గము తప్పలేదు. ఉన్నతికి సంబంధించిన శక్తులు అతని వెంట నంటి యుండెను. కనుక మద్యమ వర్గపు విద్యావంతులు అతని కవితలను మహదానందముతో పఠించుచుండిరి. 'హాలీ' స్వభావతః ఉపదేశకుడు. శిక్షకుడు. సురుచిరము. సుందరము, మనోహరము కాని కవిత ఉపదేశమును శిక్షణను వహింపజాలదు. హాలీ తన కవితలో సౌందర్యమును మనోరంజకత్వమును కలిగించుటలో అప్పుడప్పుడు కృతకృత్యుడు కాజాలకుండెను. కనుక అతని ఉపదేశములను సహింపని వారు అతని కవిత నీరసమని నిరసించిరి. అతని హృదయములోని భావములే అతని నోటినుండి వెలువడుచుండెను. అతని హృదయమున ప్రజ్వరిల్లుచుండిన జ్వాలను గ్రహించినవారు కడు కొలదిమంది. అతడు తన దూరదర్శిత్వముచే ఎట్టి భవిష్యత్తును ప్రత్యక్షము చేసికొన గల్గెనో దాని రూపురేఖలను ఊహింప గల్గిన వారే లేకుండిరి. కనుక అనేకులు అతని కవితను ఉపదేశముల సంగ్రహమని మాత్రమే తలచిరి.

'హాలీ' కవియే కాక గొప్ప విమర్శకుడు. అతడు అంతవఱకు ప్రచారమున నున్న కావ్యరచనా శైలి ననుసరించి చౌకరకపు కీర్తిని పొందుటకు ఇష్టపడకుండెను. నూత్న కావ్యరచనా శైలిని ఆవిష్కరింప సమకట్టెను. కనుక వ్యతిరేకతను, విమర్శలను లెక్కింపక తన ఉద్దేశ్య ప్రచారమునకు అనువైన కావ్యశైలిని ప్రచారము చేసెను. అతని భాష సరళము. భావములు గంభీరమైనవి. శైలి నవీనము. అతడు జీవితమునకు సాహిత్యమునకు గల సంబంధము నెఱిగిన వాడు – కనుక కావ్యరచన కొఱకే ఎన్నడును కవితలు అల్లలేదు. ఆధునిక కాలమున ఈ దృక్పథమునే 'ఆదర్శము' అను చున్నారు. కాలము గడచిన కొలది అతని గౌరవాదరములు పెఱుగుచున్నవి. అతడు నవ్యకావ్య రచనకు నాంది పలికినవాడు. అతని కవితలో కొన్ని లోపములు లేకపోలేదు. అయినను అతని పురోగమన భావములు అవిశ్వాస

మునను సందిగ్ధమునను పడి కొట్టు మిట్టాడునట్టి వారికి నేటికిని మార్గదర్శకము లగుచున్నవి. అతని కవిత లెన్నియో ఇతర భాషలలో పరివర్తింపబడినవి.

ఇచట కొన్ని పద్యపాదములు ఉదాహరణ కొఱకు ఈయబడుచున్నవి. "మునాజాతె - బేవా" అనుకవితలో అత డిట్లనును :—

రేత్ కీసీ నీవార్ హై దున్యా
ఓఛే కాసా ప్యార్ హై దున్యా
సాథ్ సొహాగ్ ఔర్ సోగ్ హై యాంకా
నావ్ కాసా సంయోగ్ హై దున్యా.
హార్ కభీ ఔర్ జీత్ కభీహై
ఇస్ నగరీ కీ రీత్ యహీహై
తేరే సివా యాఁ ఐ మేరే మౌలా
కోయి రహాహై ఔర్ న రహేగా. 1

'ముసద్దస్' లోని రెండు పద్యములు ;—

బస్ ఐనా ఉమ్మీదీ ! నయాఁ దిల్ బురీూ తూ
ఝలక్ ఐ ఉమ్మీద్ ! అప్నీ ఆఖిర్ దిఖా తూ
జిరానా ఉమ్మీదోంకో ధారస్ బంధా తూ
ఫసుర్దా దిలోంకే దిల్ ఆఖిర్ బఢా తూ
తెరే దమ్‌సే ముర్దోమ్మే జానేఁ పడీహైఁ
జలీ ఖేతియాఁ తూనే సర్సబ్జ్ కీ హైఁ. 2

1. ప్రపంచము ఇసుక గోడ వంటిది- నీచుని ప్రేమ వంటిది.
ఇందు శుభమును, శోకమును కలిసియున్నవి- నావలోని సంయోగము వంటిది.
ఒకప్పుడు ఓటమి- ఒకప్పుడు జయము- ఇచటి విధానమే ఇంత-
ఓ ప్రభువా ! నీవు తప్ప ఎవరును లేరు- ఉండబోరు.

2. ఓ నైరాశ్యమా ! హృదయము నిక కృంగదీయకుము- చాలును.
ఆశా ! నీ కాంతి ఇక ప్రసరింపజేయుము.
నిరాశపడిన వారిని ఆశ్వాసింపుము. - అణగారిన హృదయములను ఉత్సాహపఱచుము. నీ వలనే మృతులలో జీవములుపడినవి. నీవేకాలిపోయిన పొలములను సస్యశ్యామలముచేసితివి.

బొహత్ డూబ్తోంకో తిరాయాహై తూనే
బిగడ్తోంకో అక్సర్ బనాయాహై తూనే
ఉఖడ్తే దిలోంకో జమాయాహై తూనే
ఉజడ్తే ఘరోంకో బసాయాహై తూనే
బొహత్ తూనె పస్తోంకో బాలా కియాహై
అంధేరేమె అక్సర్ ఉజాలా కియాహై. 1

గజలులనుండి మూడు చరణములు వినుడు :—

హై జుస్తజూకి ఖూబ్ సే హై ఖూబ్ తర్ కహాఁ
అబ్ ఠైర్తీ హై దేఖియే జాకర్ కహాఁ. 2

* * * *

ఖఫస్ మే జీ నహీ లగ్తాకిసీ తర్హా
లగాదో ఆగ్ కోయీ ఆష్యాఁ మే. 3

* * * *

ఖలఖ్ ఔర్ దిల్కా సివా హోగయా
దిలాసా తుమ్హారా బలా హోగయా. 4

* * * *

---

1. మునిగిపోవు వారి నెందఱనో నీవు తరంపజేసితివి.
చెడిపోవు వారి నెందఱనో నీవు సరిచేసితివి.
జారిపోవు గుండెలను నీవు కుదుటబడజేసితివి.
విచ్ఛిన్నములగు ఇండ్లను నీవు పొందించితివి.
నిగ్నమతుల నెందఱకో ఉన్నతి కల్గించితివి.
చీకటిలో బహుధా వెలుగు కల్గించితివి.

2. ఉత్తమముకంటె ఉత్తమ తరమైన దానిని గుఱించి అన్వేషించుచుంటి. దృష్టి ఎందు నిలువ గలదో చూడవలెను,

3. ఏ విధముగానైనను చెఱలో మనస్సు లగ్న మగుటలేదు. గూటికి అగ్ని పెట్టుడు.

4. వీ ఆశ్వాసనము అపత్కారమే ఆయినది. హృదయ వ్యథ అధికమైనది.

'హాలీ' బాహాటముగా భారతదేశపు రాజకీయాలలో పాల్గొనలేదు. తన కవిత్వములో రాజకీయ సమస్యలను స్పష్టముగా వర్ణింపనులేదు. సమయము గడచిన కొలది భారతదేశములోని జీవితమునకు మఱియు కళలకు గల సంబంధము, బాహాటముగా రాజకీయ పరిస్థితులను ఉల్లేఖించునంత వఱకును వాస్తవికము కాజాల దని స్పష్టమయ్యెను. నవచైతన్య పరిణామ స్వరూపముగా క్రీ. శ. 1885 వ సంవత్సరమున కాంగ్రెసు జన్మించెను. ఇది అణగారిన నిప్పు రవ్వవంటి దైనను ఆర్థిక దుర్దశ మఱియు సామాజిక దుర్దశ అను వాయువులచే ప్రజ్వరిల్లి జ్వాల అయ్యెను. కొలది కాలముననే భారత ప్రజలందఱును దాని వైపు ఆశాపూర్ణ దృక్కులతో చూడసాగిరి. అప్పటికి దానికి ఉచ్చవర్గీయుల సానుభూతి సంపూర్ణము లభింపకుండెను. నిమ్న వర్గీయులందు చేరకుండిరి. బ్రిటిష్ ప్రభుత్వ ప్రేరణవలన సాంప్రదాయక సంస్థలును రూపొందుచుండెను. ఇరువదవ శతాబ్దారంభమున 'ముస్లిమ్ లీగ్' మఱియు 'హిందూమహాసభ' తమ సాంప్రదాయకములగు పతాకల గొని రంగమున ప్రవేశించెను. ఇది ఆంగ్లేయుల ఘన విజయము. ఏలయన దీని వలన ఒక వైపు రాష్ట్రీయ భావము సన్నగిల్లుచుండెను. ఇంకొక వైపు జన సమూహము తన ఆర్థిక, సామాజిక సమస్యల పరిష్కారము ఈ ధార్మిక సంస్థల ద్వారముననే చేసికొన జూచుచుండెను. ఇరువదవ శతాబ్దారంభపు భారతదేశ పరిస్థితిని చూచినచో, రాజనీతి మఱియు సాంప్రదాయకతను కలిపి సంస్కారోన్ముఖముగా చేయబడు ప్రయత్నము రాష్ట్రీయ భావమును దృఢపఱచుటకు చేయబడు ప్రయత్నము వలెనే సాగుచుండెనని తెలియును. ఇచట ఇంకొక విషయము జ్ఞాపకముంచుకో వలెను. అదేమన ధార్మిక భావములు కలిగి యుండుటలోను సాంప్రదాయిక భావములు కలిగి యుండుటలోను చాల అంతరము కలదు. ఈ అంతరమును చూపు ఉదాహరణలు భారతదేశ చరిత్రలో ఎన్నెని కలవు. ధార్మికసంస్థ లెన్నియో విదేశీయ ప్రభుత్వమునకు విరుద్ధముగా స్వాతంత్ర్య సమరమున పాల్గొనెను. కాని సాంప్రదాయిక సంస్థలు ఏదోవిధముగా ఆంగ్ల ప్రభుత్వమునకు బాసటగానే నిలిచెను. ఉర్దూ కవితలో స్వాంత్ర్య భావలహరి ఉద్ధృతముగా లేచినది. సాంప్రదాయికత పేలవముగనే ఉన్నది. ఈ యుగమున మతమును జీవితపు ముఖ్యాంగముగా భావించు ఇరువురు మహాకవులు 'షిబ్లీ', మఱియు 'అక్బర్' అను వారు ఆంగ్ల ప్రభుత్వమునకు వ్యతిరేకముగా భావప్రకటన చేయుటలో ఎవరికిని తీసిపోవు వారు కారు.

మోలానా షిబ్లీ ఉర్దూ ఫారసీ భాషలలో మహాకవి. అతనిని గూర్చి గద్య రచయితల భాగమున వ్రాయబడును. 'ముస్లిమ్ లీగ్' ఏర్పడి ముసల్మానులను రాష్ట్రీయతకు దవ్వుల నుంచుటకై ప్రయత్నించుచుండెను. మోలానా షిబ్లీ తన అనేక కవితలలో అత్యుత్సాహముతో 'లీగు'ను విమర్శించెను. అతడు ఆంగ్ల ప్రభుత్వమును వ్యతిరేకించుట మతధర్మమని భావించెను. ముసల్మానులను మేల్కొల్పి దాస్య శృంఖలములను త్రెంచుకొనుటకై ప్రబోధించెను. అతని కవితలో వ్యంగ్యము అతి మాత్రముగా ఉండును. శత్రువులపై దెబ్బ తీయుటలో వ్యంగ్యము మంచి సాధనము. అతని ఈ శైలినే కొన్ని దినముల తరువాత మోలానా జఫరలీఖాఁ చాల మెఱుగవెట్టి వందలకొలది కవితలలో ఆంగ్ల ప్రభుత్వమును, దాని అన్యాయములను అక్రమములను నిశితముగా విమర్శించి పలుతడవలు జైలుకు వెళ్ళెను. మోలానా షిబ్లీ కవితలు అధికముగా వ్రాయలేదు. వ్రాసినంత వఱకు అతని కావ్యసంగ్రహము పఠన యోగ్యము. అతడు "సుబహె ఉమ్మీద్" అను ఒక మస్నవీ వ్రాసెను. అందలి విషయము హాలీ వ్రాసిన 'ముసద్దసు'ను పోలియుండును. అతని కవితలలో "అదలె-జహాంగీరీ" మఱియు "షహరె-ఆషోబె-ఇస్లామ్" అనునవి ప్రఖ్యాతములు. ఉదాహరణ కొఱకు కొన్ని పద్యములు; ఆంగ్లేయులను సంబోధించి ఇట్లనుచున్నాడు.

కోయీపూఛేకి ఐ తహజీబె-ఇన్సానీకె ఉస్తాదో !
ఏజుల్మారాయి యాఁ తాకై, యె హశ్ర్ అంగేజియాఁకబ్ తక్.

యెమానా తుమ్‌కొ తల్వారోంకి తేజీ ఆజ్మానీహై
హమారీ గర్దనోం పర్ హోగా ఇస్కా ఇంతెహాఁ కబ్ తక్.
యెమానా ఖిస్సయే గమ్‌సే తుమ్హారా జీ బదల్తా హై
సునాయేఁ తుమ్‌కో అప్నే దర్దె-దిల్‌కీ దాస్తాఁ కబ్ తక్ 1

1. మానవ సభ్యతకు ఆచార్యులారా! ఈ దురంతములు, ఈ అన్యాయములు ఎంతవఱకు? మీ కత్తుల పదును పరీక్షించుట అవసరమే అని ఒప్పికొందుము. కాని, ఈ పరీక్ష మా కంఠములపై ఎంత వఱకు?

వ్యధిత హృదయాల గాథ వినుట వలవ మీ హృదయము మాఱునని ఒప్పకొందుము కాని, మా వ్యథాభరితమగు గాథ మీకు వినిపించుట ఎంతవఱకు?

సమఝ్‌కర్ యేకి ధుంద్లేసే నిషానే-రఫ్తగాం హమ్‌హై
మిటావోగే హమారా ఇస్‌తహ్లానామో-నిషాం కబ్‌తక్. 1

'సయ్యద్ అక్బర్ హుస్సేన్' 'అక్బర్' ఇలాహాబాదీ హాస్యరసమును ఆదరించిన మహాకవి. అతడు క్రీ. శ. 1846 వ సంవత్సరమున ఇల్హాబాదలోని తాలూకాయగు 'బారా'లో జన్మించెను. ప్రాథమిక పాఠశాలలోనే ప్రాథమిక విద్య నేర్చెను. క్రీ. శ. 1846 వ సం.న 'ముఖ్తారీ' పరీక్షలో ఉత్తీర్ణుడై 'నాయబ్-తహసీల్దారు'గా నియమింపబడెను. క్రీ. శ. 1870 వ సంవత్సరమున హైకోర్టులో ఒక స్థానము దొఱకెను. అప్పుడే న్యాయవాద పరీక్షయందు ఉత్తీర్ణు డయ్యెను. కొంత కాలము న్యాయవాదిగా పనిచేసి పిదప 'సబ్‌జడ్జి' పదవి పొందెను. క్రీ. శ. 1903 వఱకు ఏదోవిధముగా కోర్టుకు సంబంధించియే ఉండును. ఈ మధ్యకాలమున అతనికి 'ఖాన్-బహాదుర్' ఉపాధిలభించెను. అతడు ఇలాహాబాద విశ్వవిద్యాలయమున ఫెల్లో'గా కూడ ఎన్నుకోబడెను. క్రీ. శ. 1921 వ సంవత్సరమున మరణించెను.

అతడు "వహీద్" ఇలాహాబాదీ శిష్యుడు. తొలుత గజలులే వ్రాసెను. అతని గజలులలో సూఫీతత్త్వము అచటచట కాన్పించును. అయినను మొత్తము మీద అతని కవితపై లఖ్నో శైలి ప్రభావమే గోచరించును. యౌవనమున అతనికి సంగీత శాస్త్రమునందు అభిరుచి కల్గెను. అప్పుడే కొందఱు మిత్రుల సహవాసము వలన చెడు అలవాట్లు కలిగెను. అయినను అతని స్వభావములోని మతాభిరతి వలన త్వరలోనే ఆ అలవాట్ల నుండి విముక్తి పొందగలిగెను. హాస్యప్రియుడైనను మతమును, మతసిద్ధాంతములను ఎల్లప్పుడు గౌరవించుచుండెను. అక్బరు క్రీ. శ. 1866 వ సంవత్సర ప్రాంతము నుండి కావ్యరచన ప్రారంభించెను. అతని జీవిత కాలమునందే అతని కావ్య సంగ్రహములు మూడు పలుతడవలు ప్రకాశితము లయ్యెను. నాలుగవ సంగ్రహము ఇప్పుడు అచ్చయినది. ఇంక కొన్ని కవితలు అతని వంశీయుల కడ కలవు.

అక్బరు యుగము భారతీయ జీవనమున మహా పరివర్తనములు కలిగించిన యుగము. ఆ నాటి వివిధ సంఘర్షణలను గ్రహించి స్వల్పము లయినను అధికము

---

1. మమ్ము మా పూర్వులకు గుఱుతులుగా మాత్రమే భావించి మా పేరును చిహ్నములః చెఱిపివైవ జేయుట ఎంతవఱకు ? అని ఎవరేని ప్రశ్నింపవలెను.

లయినను ఆ సంఘర్షణలను తన కవితా వస్తువులుగా స్వీకరించుటయే అక్బరు ఘనత. అతడు ప్రతిదినము జరుగుచుండెడి సన్నివేశములను హాస్యరూపమున, వ్యంగ్యాత్మకముగా సుందరములగు కవితలలో వర్ణించి కృతకృత్యు డయ్యెను. అదొక క్రొత్త రకపు వాస్తవికత.

అక్బరు యౌవన కాలమున భారతదేశము సంపూర్ణముగా ఆంగ్లేయుల అధికారమునకు లోబడెను. సిపాయీల విప్లవము తరువాత మధ్యమ వర్గపు ముసల్మానులు ఆంగ్ల ప్రభుత్వముతో రాజీ పడిరి. అక్బరు కూడ ప్రభుత్వోద్యోగము చేయుచుండెను. అయినను అతడు ఇతరులవలె కనులు మూసికొనలేకపోయెను. దేశపు దుర్దశను చూడలేక పోయెను. నవజీవనపు క్లిష్ట సమస్యలను చూచి అతడు వానికి విముఖుడై భూతకాలమువైపు మఱలి అందులోనే ఒకప్పుడు తన్మయుడగుచుండెను. మఱొకప్పుడు నవజీవనము ముందు ఓడిపోయినట్లయి నైరాశ్యమును ప్రకటించుచుండెను. ఆరంభమున అతని కవితలో వ్యంగ్యమును, హాస్యమును కాన్పించవు. క్రీ. శ. 1885 నుండి అతడు ఆ రెంటినే అవలంబించెను. ఆ నాటి సమస్యలను సమగ్రముగా అర్థము చేసికోదగినంతటి శిక్షణ అతడు పొంది యుండలేదు. అతడు మెలగుచుండిన పరిసరములును అందుకు అనువైనవి కావు. కనుక అతడు జ్ఞానమును కాక ఆంతరంగిక ప్రేరణను విశ్వసించి తన విచారముల ననుసరించియే నవజీవనపు సమస్యలను విడదీయ సమకట్టెను. అతడు ప్రాక్పశ్చిమములను తన భావముల కనుకూలముగా విభజించుకొనెను. ధార్మికత మఱియు నైతికత అంతయు అతనికి ప్రాగ్దేశములందే కాన్పించెను. అతని భావముల ననుసరించి పశ్చిమ దేశములు తమ పశు బలముచే ప్రాగ్దేశముల గొంతు నులుము చుండెను. పాశ్చాత్యులు ఈ దేశపు భౌతిక సాధనములనేకాక ఆధ్యాత్మికతను కూడ నష్టపఱచు చున్నారని శంకించెను. అతడు తన లేఖినిలోని సమస్తశక్తిని, భావములలోని ఆవేశమును, శబ్దములలోని విషమును వినియోగించి ప్రాగ్దేశములను పాశ్చాత్యదేశములకు దూరముగా ఉంచుటకై ప్రయత్నించెను. వ్యావహారిక జీవనమున పాశ్చాత్య దేశముల నుండి దిగుమతియైన ఆలోచనలచే లాభము పొందుట అనివార్యమనిపించుటచే అక్బరు ఈ "తూఫాను" ఆపరానిదని తలంచెను. కనుక అతని భావములు చాల వఱకు ప్రతిక్రియావాదుల భావములతో పొత్తుగూడెను. నూత్న భావములు విజ్ఞానమును లాభదాయకమని అతడేలాగును నమ్మువాడు కాడు. ఇది ఆధ్యాత్మిక దృక్పథము యొక్క పరిణామ స్వరూపమగు ఒకరీతి ఆదర్శవాదమే. అతనిలోని సూఫీ

భావములును అతనిని ఆదర్శవాదిగా చేసెను. అతడు జీవితములోని పరివర్తనములను తుచ్ఛములుగా భావించెను. నవచైతన్యమునకు సహకరించువారు నైతిక సిద్ధాంతములకు గొప్ప ఆఘాతము కలిగించుచున్నారని భావించెను. ఇట్టి భావముల పరిణామ మేమయినదనగా అతడు ఆంగ్ల విద్య, విజ్ఞాన శాస్త్ర పరిచయము, స్త్రీ విద్య, స్త్రీ స్వాతంత్ర్యము మెషీనులు మొదలగు ప్రతి విషయమునకు శత్రువయ్యెను. డార్విన్ స్పెన్సర్, మిల్ మొదలగు తాత్త్వికులను పరిహసించెను. అదృష్టమును నమ్మిన వాడగుట మారుచున్న పరిస్థితులను వైజ్ఞానిక దృష్టితో అనుసంధానింప గలుగకుండెను. అతని అంతిమాశ్రయము మతము. ఆ మతమునకు దేని నుండి ఆఘాతము కలుగు నను భయముండినను దానిని వ్యతిరేకించి వ్యంగ్యాత్మకములగు బాణములు వదలుచుండెను.

అక్బరు ఆంగ్ల ప్రభుత్వపు ఆర్థికములగు దోపిళ్లను గ్రహించెను. వారి సభ్యత యొక్క పైతళుకులను కృత్రిమమని తలంచెను. సాంప్రదాయకతను కలిగించుటకై వారు చేయు ప్రయత్నమును దుయ్యబట్టెను. ఇట్లు హాస్యమును అడ్డు చేసికొని అతడు ఆంగ్ల ప్రభుత్వముపై విషలిప్తములగు అమ్ములు ప్రయోగించెను. రాజకీయోద్యోగి యైనను నోటికి వచ్చిన మాటలాడుటకు వెనుదీయకుండెను. ఎదలోని మాటను స్పష్టముగా చెప్పుటవలనుపడదని అతడెఱుగును. ఒక పద్యపాదమున ఇట్లనెను.

మద్ఝూలయే గవర్నమెంట్ 'అక్బర్' అగర్ నహోతా
ఉస్కో భీ ఆప్పాతే గాంధీకె గోఫియోఁమే. 1

అక్బరు కవితను బాగుగా గ్రహించుటకై ముసల్మానుల మతమును, వారి సంస్కృతిని, భారతదేశ చరిత్రను, ఇరువదవ శతాబ్దపు రాజకీయములును, సామాజికములును అగు సన్నివేశములను గ్రహించుట చాల అవసరము. ఏలయన హాస్యరూపముననె అతడు సంకేత పఱచు విషయములను తెలిసికొనకుండ అతని కవితలోని వ్యంగ్యము వలన ఆనందము పొందజాలము. అతడు అరబీ, ఫారసీ మఱియు హిందీ శబ్దములను చాల స్వతంత్రించి ప్రయోగించుచుండెను. తన మనసులోని

---

1. 'అక్బరు' రాజకీయోద్యోగియే కానియెడల అతనిని మీరు గాంధిగారి గోపికలలోనే చూచియుందురు.

మాటను హాస్యరూపముననే వెలువరించుచుండెను. అతడు ఉర్దూలో ఒక మహాకవి. హాస్యరసమును పోషించినవారిలో అందఱికంటె గొప్పకవి.

ఉదాహరణకొఱకు కొన్ని పంక్తులు :—

హర్‌చంద్‌కి కోట్ భీహై పత్లూన్ భీహై
బంగ్లాభీహై పాట్‌భీహై సాబూన్ భీ హై
లేకిన్ మై తుఝ్‌సే పూఛ్తా హూఁ హిందీ !
యూరప్‌క తెరీ రగోమ్మే కుఛ్ ఖూన్ భీహై ? 1

* * * *

గోల్యోంకే జోర్‌సే కర్తే హైఁ వో దున్యాకో హజ్మ్
ఇస్‌సే బెహతర్ ఇస్ గిజాకె వాస్తే చూరణ్ నహీ. 2

* * * *

క్యా కహూఁ ఇస్కో మై బద్బఖ్తీ యే-నేషన్ కే సివా
ఇస్కో ఆతా నహీ అబ్ కుఛ్ ఇమిటేషన్ కే సివా. 3

* * * *

ఖౌమ్‌కే గమ్‌మే డినర్ ఖాతే హైఁ హుక్కామ్‌కే సాథ్
రంజ్ లీడర్‌కో బొహత్ హై, మగర్ ఆరామ్‌కే సాథ్. 4

* * * *

---

1. కోటుకలదు. పట్లాముకలదు. బంగ్లా (భవనము) కలదు, పాత్రలు (పాట్) సబ్బు మొదలగు నవన్నియు కలవు. కాని ఓ భారతీయుడా ! నీ రక్తనాళములలో ఐరోపా రక్తమేమైనకలదా ?

2. వారు గోళీలు (మందుగుండ్లు-మందుగోళీలు) ఉపయోగించి ప్రపంచమును జీర్ణించుకొందురు. ఈ ఆహారమునకు అంతకు మించిన చూర్ణములేదు. (అరగుటకై)

3. దీనిని జాతియొక్క దురదృష్టమనక ఏమందురు. దీనికిపుడు అనుకరణ తప్ప ఇంకేదియు రాదు. (ఇందలి ఆంగ్లపద ప్రయోగము చూడవలసినది.)

4. జాతి యెడగల వ్యథను పురస్కరించుకొని అధికార్లతో కలిసి విందులు గుడుతురు. నాయకులకు విచారము విశేషముగా కలదు. కాని ఆ విచారము సౌఖ్యముతో కూడినది.

హమ్ క్యా కహేఁ అహ్బాబ్ క్యా కారే-నుమాయాఁకర్ గయే
బి. ఎ. హోవే, నౌకర్ హువే, పెన్షన్ మిలీ, ఔర్ మర్ గయే. 1

*　　*　　*　　*

కోఠీమే జమా హై న డిపాజిట్ హై బ్యేంక్స్ మే
ఖల్లాస్ కర్ దీయా ముఝే దో చార్ థ్యాంక్స్ మే. 2

*　　*　　*　　*

కర్ దియా కర్జన్ నే జన్ మర్దోంకి సూరత్ దేఖియే
ఆబ్రూచెహరేకీ సబ్ ఫైషన్ బనాకర్ ఛీన్ లీ. 3

*　　*　　*　　*

పాకర్ ఖితాబ్ నాచ్ కాభీ జోఖ్ హోగయా
"సర్" హోగయేతో "బాల్" కా భీ షోక్ హోగయా. 4

*　　*　　*　　*

ఇరువదవ శతాబ్దారంభము తరువాత ఎందఱో కవులును రచయితలును దర్శనమిత్తురు. వారిలో కొందఱను గూర్చి మాత్రమే వ్రాయబడును. రాజకీయ, సామాజిక, దార్శనిక కవితలతో పాటు క్రొత్తరకపు గజలులును వ్రాయబడు చుండెను. కొందఱు ప్రముఖ కవులు గజలుల ద్వారముననే జీవన సమస్యలను విరచించిరి. వారి దృక్పథమును వారి భావములును వెనుకటి కవుల కంటె భిన్న

1. మిత్రులే యే ఘనకార్యములు సాధించిరో ఏమని చెప్పవలెను. బి.ఎ. చదివి ఉద్యోగులై పెన్షనుపొంది చివరికి మరణించిరి.

2. డబ్బు భవనమున నిలువలేదు. బెంకులలో నిలువలేదు. మూడు నాలుగు 'థ్యాంక్స్' చెప్పి (ఆమె) నన్ను డబ్బులేనివానిగా జేసివైచెను.

3. కర్జన్ మగవారిని ఆడవారుగా జేసెను. ఫైషనను మిషచే ముఖగౌరవమును నశింపజేసెను.

4. ఉపాధి లభించినంతనే నృత్యముపై అభిలాష కలిగెను.

సర్ (ఇంగ్లీషు Sir అను ఉపాధి మఱియు ఉర్దూలో తల) అయినంతనే బాల్ (ఇంగ్లీషు Ball మఱియు ఉర్దూలో వెంట్రుకలు) అభిలాష కలిగెను.

మైనవి. కాని గజలులలో కలుగు పరివర్తనములు స్పష్టరూపమున తెలియవు. అయినను ఆధునిక కాలపు గజలులను చదువునప్పుడు క్రొత్త వాణి వినిపించును. జీవన సమస్యల పట్ల క్రొత్త దృక్పథము కనిపించును. ఇచట ప్రముఖులయిన కొందఱను గుఱించియే వ్రాయబడును. ఈ కాలపు కవులలో అనేకులు గజలులే కాక ఇతర విధముల రచనలలోను నిపుణులు. అయినను వారి ఖ్యాతికి కారణము ఏదో ఒక విధమగు రచనయే - పండిత రతన్‌నాథ్ "సర్షార్" కవి కూడ. అయినను అతడు గద్య రచయితగానే ప్రఖ్యాతుడు. ఇట్లే మున్షీ దుర్గాసహాయ "సురూర్", పండిత బ్రజనారాయణ "చక్బస్త్" మఱియు డా. ఇక్బాల్ మొదలగు వారు అందమగు గజలులు వ్రాసిరి. అయిన వారి రచనా వైశిష్ట్యము ఇతర కవితలలోనే గోచరించును.

దుర్గాసహాయ "సురూర్" జహానాబాద నివాసి. అతని ఇంట చిరకాలము నుండి వైద్యమే వృత్తి. అచట అరబీ, ఫారసీ, ఉర్దూ సాహిత్య చర్య జరుగుచుండెడిది. అతడు క్రీ. శ. 1873 వ సంవత్సరమున జన్మించెను. అతని ఆర్థికస్థితి మంచిదికాదు. అయినను ఆత్మగౌరవము కలవాడగుట అతడు ఆ స్థితిలోనే సంతృప్తుడై యుండెను. అతడు బాల్యమునుండియే కవితలు వ్రాయుచు ప్రసిద్ధములగు పత్రికలలో ప్రచురించుచుండెను. మద్యపానమునకు అలవాటు పడి ఆరోగ్యమును కోల్పోయెను. ముప్పదేడేండ్ల వయముననే క్రీ. శ. 1910 లో మరణించెను.

"సురూర్" కవితలు కరుణారస ప్రధానమైనవి. దేశభక్తికి సంబంధించిన భావములను ప్రకటించుపట్ల లేదా విషాద సన్నివేశములను చిత్రించుపట్ల అతని భావుకత ప్రబలముగా ప్రదర్శితమగును. అతడు మత సంబంధములును ఐతిహాసికములును అగు విషయముల గూర్చియు వ్రాసెను. ప్రకృతి చిత్రణమును చేసెను. 'సురూర్' ఆంగ్లభాషాజ్ఞానము అతిసామాన్యము. అయినను అతడు సుమారు ఇరువది ఆంగ్ల కవితలకు మూలమునకు హాని వాటిల్లకుండ పద్యానువాదము చేసెను. అతడు సర్వకాల సర్వావస్థలయందు కావ్య రచనయందే మగ్నుడై యుండువాడు. కనుక స్వల్పకాలముననే అనేక రచనలు చేసెను. "జామె - సురూర్" మఱియు "ఖుమ్ఖానయే - సురూర్" అను రెండు కావ్య సంగ్రహములు ప్రకాశితములైనవి. ఉర్దూ కవితయొక్క నూతన శైలిని పురోగమింప జేయుటలో, దేశభక్తి భావములను ప్రోత్సహించుటలో 'సురూర్' కవితలు చాల పాల్గొనెను - బాల్యమున ఫారసీ

బాగుగా చదివినవాడగుట అతని భాష ఫారసీ పద భూయిష్ఠమైనది. అలంకార ప్రయోగము ఇంకను కాఠిన్యము కలిగించినది.

మున్షీజ్వాలా ప్రసాద్ 'బర్ఖ్', మహారాజా కిషన్ ప్రసాద్ 'షాద్', పండిత అమర్‌నాథ్ 'సాహిర్' మొదలగువారు ఈ యుగమునకు చెందినవారే. అయినను 'చక్బస్త్' మఱియు 'ఇక్బాలు' లకు కలిగిన మహత్వము ఇంకెవరికిని కలుగలేదు. పండిత బ్రజ్‌నారాయణ 'చక్బస్త్' ఒక కాశ్మీర బ్రాహ్మణ కుటుంబమునకు సంబంధించిన వాడు. అతడు క్రీ. శ. 1882 వ సం॥న జన్మించి క్రీ. శ. 1905 లో కేనింగ్ కాలేజీ నుండి బి. ఏ. లో ఉత్తీర్ణుడై క్రీ. శ. 1908 నుండి (వకాలతు) న్యాయవాద వృత్తి ప్రారంభించెను. కొలది కాలములోనే అత డచటి ప్రముఖ న్యాయవాదులలో లెక్కింపబడెను. క్రీ. శ. 1926 లో అకస్మాత్తుగా అతడు దివంగతుడయ్యెను. 'చక్బస్త్' బాల్యము నుండియు కవిత్వము వ్రాయుచుండెను. ఆతిష్, గాలిబ్ మఱియు అనీసుల కవితలను శ్రద్ధాభిమానములతో పఠించుచు వారిచేతనే ప్రభావితుడయ్యెను. ఆనాడు భారతదేశము లోని రాజకీయాందోళనము మఱియు స్వాతంత్ర్య సమరమునకు 'చక్బస్త్' కవిత ప్రతీకవంటిది. అప్పటికి రాష్ట్రీయత పొడుకొనినది. కాని ఆంగ్లేయుల నుండి రాజ్యము లాగికొని వారిని దేశమునుండి బహిష్కరింప జేయు నంతటి స్వాతంత్ర్య భావన ఉత్పన్నము కాలేదు. కనుక చక్బస్త్ తన కవితల ద్వారమున ఆంగ్ల ప్రభుత్వ చ్ఛాయలోనే "హోమ్‌రూల్" ప్రాప్తినొందుటకై ఉపదేశించెను. అతని కవితలు హిందూ ముస్లిముల సమైక్యతా మఱియు దేశభక్తి భావములతో నిండియున్నవి. ఈ రెండు భావముల నతడు అతి సామర్థ్యముతో ప్రకటించెను. నేటివఱకు అట్లు ప్రకటించుటలో అతనికి సమానులనదగిన వారు అరిది. గొప్ప గొప్ప దేశనాయకులు బంధితులైనప్పుడు మఱియు మరణించినప్పుడు అతడు హృదయమును కరగించునట్టి కవితలు వ్రాసెను. దేశ గౌరవమును కాపాడుటకై దేహత్యాగము చేయుటకైన వెనుదీయరాదని ప్రబోధించెను. అతడు ఆలోచనా స్వాతంత్ర్యము నారాధించువాడు. ఆనాడు రచనలపై ఉపన్యాసములపై విధింపబడిన ఆంక్షను దృఢముగా వ్యతిరేకించెను. మత సంబంధములును నైతిక సంస్కరణకు సంబంధించినవియును అగు కొన్ని కవితలు వ్రాసెను. ఆనాటి పరిస్థితుల ననుసరించి చూచినచో అతడు గొప్ప విప్లవ కవియని రూఢియగును – దేశపు ప్రాచీన గౌరవమును తెలిపి, వర్తమాన కాలపు ఆర్థిక దుర్దశను ప్రదర్శించి, భావికాలపు స్వరాజ్యమును సూచించి దేశీయులను పురోగమింపజేయ ప్రయత్నించెను. అతనిది లఖ్నోలోని

శిష్టవ్యావహారిక భాష. "చక్బస్త్" గొప్ప గద్యరచయిత కూడ. అతని గద్యరచనల సంగ్రహము ప్రకాశితమైనది. దానివలన అతని జ్ఞానము, ఆలోచనా శక్తి, చారిత్రక, సామాజిక దృక్పథము విశదమగును. మరణించుట కంటె కొన్ని దినములు ముందే తన కావ్య సంగ్రహము "సుబహె - వతన్" అను పేర ప్రకాశించుటకై పంపును. కాని అది అతని మరణానంతరము ప్రకాశితమైనది. అది దేవనాగరి లిపిలోను అచ్చయినది. భారతవర్ష ప్రశంసలో అతడు వ్రాసిన ఒక కవితలోని కొన్ని భాగములు చూడుడు :—

ఐఖాకె-హింద్ తేరీ అజ్మత్‌మేఁ క్యా గుమాఁ హై
దర్యాయె-ఫైజె-ఖుద్‌రత్ తేరేలియే రవాఁ హై
తేరీ జబీఁసె నూరే-హుస్నే-అజల్ అయాఁ హై
అల్లాహరె జేబొ-జీనత్ క్యా ఓజె-ఇజ్జో-షాఁ హై
హర్ సుబహ హై యె ఖిద్మత్ ఖుర్షీదె-పుర్-జియాకీ
కిరణోంసే గూంధ్తా హై జోటీ హిమాలయాకీ
గౌతమ్‌నె ఆబూర్దీ, ఇస్ మాబదే-కుహఁ కో
సర్మద్‌నె ఇస్ జమీఁపర్, సద్కే కియావతఁ కో
అక్బర్‌నె జామె-ఉల్ఫత్ బఖ్షా ఇస్ అంజుమఁ కో
సీంచా లహూసే అప్నే రాణానె ఇస్ చమఁ కో
సబ్ సూర్ వీర్ అప్నే ఇస్ ఖాక్‌మేఁ నిహాఁ హై
టూటేహువే ఖణ్డ్హర్ హైఁ, యా ఉన్కీ హడ్డియాఁ హై
బర్సోంసే హోరహా హై బర్హామ్ సమాఁ హమారా
దున్యాసె మిట్‌రహా హై నామో-నిషాఁ హమారా
కుఛ్ కమ్ నహీ అజల్‌సే ఖ్యాబే-గిరాఁ హమారా
ఇక్ లాషె-బేకఫఁ హై హిందూస్తాఁ హమారా

ఇస్కే ఖరే ఖజానే బర్బాద్ హోరహే హైఁ
జిల్లత్ నసీబ్ ఖ్వాబే-గఫ్లత్‌మె సోరహే హైఁ 1

ఉర్దూ సాహిత్యమున వర్తమాన కాలము గద్యయుగ మనదగినది. అయినను దర్శన. తర్క, చారిత్రక, సామాజిక విజ్ఞానముల ద్వారమున జీవన సమ్యసలను అర్థముచేసి కొనుటకు ప్రయత్నించు కవులను ఈకాలమే జన్మింపజేసినది. ఆలోచనా పరులగు రచయితలు తర్క-వితర్కముల అనంతరము సిద్ధాంతరూపమున వ్యాస ములు వ్రాసిన విధముగా ఈ కవులును మానవ జీవితమునకు సంబంధించిన ఆర్థిక, సామాజిక భావములను ఉల్లేఖింతురు. కవికి కల్పన మఱియు భావుకత ఆలంబనము. దాని ద్వారమున అతడు హృదయపు లోతులో ప్రవేశించి మానవజాతిలో సమాజము మఱియు ప్రకృతి వలన కలుగు అన్యాయమునకు విరుద్ధముగా చెలరేగిన ఆంతరంగిక సంఘర్షణమును పసికట్టును. ఇట్టి సర్వోత్కృష్టమగు సుందర వర్ణన "ఇక్బాలు" కవితలో లభించును. అనేక కారణముల వలన "ఇక్బాలు" రచనలు వివాదగ్రస్థ విషయములైనవి. ఏలయన ప్రతిక్రియావాదులగు ముసల్మాను లొకవైపు అతనిని లాగుకొందురు. రెండవవైపు అభ్యుదయవాదులు అతని రచనలలో మానవతను గూర్చిన శ్రేష్ఠములును ఉత్తమములును అగు ఉపదేశములను దర్శింతురు. ఆ ఉపదేశ

---

1. ఓ భారతావనీ ! నీ శ్రేష్ఠత పట్ల అనుమాన మెక్కడిది. భగవదనుగ్రహము అనునట్టి నది నీ కొఱకే ప్రవహించుచున్నది. నీ ఫాల భాగమున ఆదికాలపు కాంతి ప్రజ్వరిల్లుచున్నది. ఆహా! నీ విలాసమెంత గౌరవాస్పదమై అతిశయిల్లుచున్నది! ప్రకాశమానుడగు భాస్కరుడు అహరహము ప్రభాతకాలమున హిమాలయ మనబడు నీ జడను కిరణములచే ముడుచుట యందు నియుక్తుడు. గౌతముడు ఈ పురాతన మందిరమునకు ఇతోధికమగు మాన్యత కలిగించెను. సర్మద్ (ఔరంగజేబు కాలమున భారత భూమికి వచ్చిన ఒక పర్షియా సూఫీ భక్తుడు) ఈ భూమి కొఱకు తన జన్మ భూమిని త్యజించెను. ఈ సమాజమునకు అక్బరు ప్రేమ పాత్రను అందించెను. ఈ యుద్యానమున రాణాప్రతాపుడు తన రక్తముచే సేచనము చేసెను. మన శూరులు, వీరులు ఈ భూమిలోనే అణగి యున్నారు. ఇప్పుడు శిథిలములు మఱియు ఎముకలే మిగిలి యున్నవి. చాల కాలము నుండి మన పరిస్థితి తల్లకిందు లగుచున్నది. మన పేరు ప్రతిష్ఠలు ప్రపంచమునుండి లోపించి పోవుచున్నవి. మన గాఢ నిద్ర మృత్యువుకంటె తక్కువది కాదు. హిందూదేశము 'కఫను' (శవముపై కప్పు గుడ్డ) లేని శవమువలె నున్నది. పరిపూర్ణములగు దీని నిధులు వినష్టమగుచున్నవి. అదృష్ట హీనులు దౌర్భాగ్యులు అగు మనవారు ప్రమత్తత అను నిద్రలో మునిగియున్నారు.

ములను ఎట్టి ప్రత్యేక మతమునకు అంటగట్టరాదని వారు తలంతురు. మూడవ వైపు అతనిని కవిగా భావించవలెనా లేక దర్శనశాస్త్రవేత్తగా భావించెవలెనా అను అంశముపై తగాదా జరుగును. ఇచట ఈ వాదోపవాదములతో పనిలేదు. ఏలయన "ఇక్బాలు" రచనలలో ధార్మిక, సామాజిక, ఐతిహాసిక, దార్శనిక భావప్రవాహము లనేకములు సంగమించును. కనుక వానిని విడదీసి పరిశీలించుట నాలుగైదు పుటలలో సంభవమగు పనికాదు. అతని కవితకు మూలాధారములగు అంశములను అతని కవితలోని విశేషములను మాత్రము ఇచట చర్చించుట సంభవము. 'ఇక్బాలు' ను గుఱించి ఆంగ్లభాషలోను ఉర్దూలోను శతాధిక గ్రంథములు రచింపబడినవి. 'ఇక్బాలు'ను అధ్యయనము చేయదలచినవారు చాల చదువవలసియుండును.

"ఇక్బాల్" క్రీ. శ. 1874 వ సంవత్సరమున సియాల్‌కోట (పంజాబు) లో జన్మించెను. అతని పూర్వీకులు కాశ్మీర బ్రాహ్మణులు. ఈ విషయమును "ఇక్బాలు" తన కవితలలో సగర్వముగా చెప్పికొనెను. అతడు ప్రాథమిక విద్య సియాల్‌కోటతోనే పడసి తరువాత లాహోరుకు వెళ్ళెను. విద్యార్థి దశయందే అతడు తాను చదువుచున్న విద్యాలయములోని సర్వోత్తమ విద్యార్థిగా పరిగణింపబడెను. తత్త్వ (దర్శన, శాస్త్రమున ఎం. ఏ. పట్టము పొంది అతడు విశేష విద్యకై లండనునగరమునకు వెళ్ళెను. అచట అతడు బ్యారిస్టరీలో ఉత్తీర్ణుడై జర్మనీనుండి దర్శనశాస్త్రమున ఎ. ఎచ్. డి. పట్టము పొందెను. ఐరోపా యాత్ర అతని జీవితమున విప్లవాత్మకమైనది. ఆ యాత్ర వలన రాజనీతి మఱియు ఇతర విషయముల యెడ అతని దృక్పథము పూర్తిగా మారిపోయెను. మాతృదేశమునకు తిరిగి వచ్చి అతడు లాహోరులో బ్యారిష్టరీ చేయసాగెను. కొంత కాలము కొఱకు ఒక కళాశాలలో అధ్యక్ష పదవికూడ నిర్వహించెను. పంజాబు రాజకీయాలలోను కొంత కొంత పాలు గొనుచుండెను. క్రీ. శ. 1931 వ సంవత్సరమున ముసల్మానుల ప్రతినిధిగా "రౌండు టేబిల్ కాన్ఫెరెన్సు" లో పాల్గొనుటకై లండను వెళ్ళెను. అతని స్వాస్థ్యము మాటి మాటికి చెడిపోవుచుండెను. క్రీ. శ. 1936 వ సంవత్సరమునుండి ఆరోగ్యము పూర్తిగా చెడిపోయెను. క్రీ. శ. 1938 వ సంవత్సరము ఏప్రిల్ మాసమున మరణించెను.

ఇక్బాల్ జీవితములో ఎత్తుపల్లము లంతగా లేవు. కాని ఆలోచనాపరుడగుట వలన లోలోన విపరీతమగు పరివర్తన పొందుచు ప్రతి సన్నివేశము వలన ప్రభావితుడయ్యెను. మతముపై అధికాసక్తిగల అతని తండ్రి బాల్యమునుండియు ఫారసీలోని

మతగ్రంథములను అతనిచే చదివించి వానిలోని రహస్యార్థములను గూర్చి చర్చ చేయువాడు. అతని గురువులును అతనిపై ప్రబల ప్రభావము చూపునట్టివారే లభించిరి. "ఇక్బాల్" మధ్యమ వర్గ ముసల్మాను కుటుంబమున జన్మించెను. జీవిత సమస్యలన్నిటిని ఆ దృష్టితోనే చూచెను. భారతదేశమున పెద్ద పెద్ద సంఘటనలు జరుగుచుండెను. గొప్ప గొప్ప పరివర్తనలు కలుగుచుండెను. ముసల్మానులలో ఒక విధమగు జాగృతి కలిగెను. వారు పలుదెసల ఆకృష్టులగుచుండిరి. భారతదేశము వెలుపల గల ముసల్మాను రాజ్యముల మీద వినాశమేఘములు ఆవరించుచుండెను. దరిదాపు అన్ని దేశములును ఐరోపా పదసంఘట్టనచే నష్టపడుచుండెను. ఐరోపీయ సభ్యత ఆశియా సభ్యతను నశింపజేయుచుండెను. నైతిక గుణములను పొందదగిన శక్తి మానవజాతినుండి లుప్తమై పోయినట్లు అనిపించుచుండెను. ఇక్బాల్ పరిస్థితు లన్నిటిని గ్రహించెను. ఐరోపాలో నివసించుచు అచటి అధికారవర్గపు భావములను తెలిసికొను అవకాశము కలిగినప్పుడు అతడు ఏవిధముగా ఐరోపా ఆశియా రక్తము నంతటిని పీల్చుటకై ఉంకించుచున్నదో తన కనులతో చూచెను. ఆశియా మఱియు అన్యదళిత దేశములపై అధికారము పొందుటతో సౌలభ్యము ఏర్పడుటకై ఐరోపా తన సభ్యతా ప్రచారమను మిషచే ఆయా దేశముల ఆత్మశక్తిని నష్టపఱచుట ఆవశ్యక మని తలంచుచుండుటయు "ఇక్బాల్" తెలిసికొనెను. భారతదేశమున అభివృద్ధిచెందు చున్న జాతీయ భావమును చూచి ఆదిలో అతడు ముగ్ధుడయ్యెను. కాని ఐరోపా పర్యటనము వలన అతని విచారములు మార్పు చెందెను. రాష్ట్రముల మధ్యగల పరస్పర ద్వేషభావమును చూచి జాతీయతపట్ల ఖిన్నహృదయుడై సంకీర్ణతతో కూడిన దేశభక్తి మఱియు జాతీయత మానవజాతియొక్క ఐక్యతను వికాసమును నష్టపఱచునవియే అని తలంచెను. ఇందుకు ఎన్నియో కారణములు కలవు. కాని అతడు ఎట్టి పరిస్థితులలో ఈ భావమును ప్రకటించెనో వాని వలన అతనికి విరుద్ధ ముగా అనేకములగు భ్రాంతులు కలుగుటకు అవకాశ మేర్పడెను. రానురాను అతడు ప్రతిక్రియావాదులగు ముసల్మానుల నాయకుడుగా భావింపబడెను. ఏలయన అతని ఆలోచనలు ముసల్మానుల ఏదో విధముగా భారతదేశములోని ఇతర జాతులకు వేరు చేసి అన్యదేశీయులగు ముసల్మానులతో సంబంధింపజేయు నట్టివిగా తోచెను. అతడు తన ఆలోచనలను తాత్త్విక రూపమున వెల్లడించెను. ఎవరిని ప్రతిఘటింపక దళిత జాతులను, ముఖ్యముగా ముసల్మానులను సర్వవిధముల అన్యాయములనుండి కాపాడుటకై అతడు బద్ధకంకణుడైనట్లు విశదమయ్యెను. అందువలన భారతదేశపు

స్వాతంత్ర్య సమరముపట్ల అతని అభిప్రాయ మెట్టిదో చెప్పుట కష్టము. స్వాతంత్ర్య సిద్ధికై జరుగుచున్న ఎట్టి ఆందోళనమునందును అతడు బాహాటముగా పాల్గొన లేదనుటలో సందేహములేదు. అయినను మానవజాతియొక్క ఆత్మస్వాంత్ర్యమును గుఱించి అతడు మహోదాత్తములును, ఉత్తమములును అగు భావములనే ప్రకటించెను.

చారిత్రక దృష్టితో ఇక్బాలు రచనలను పరిశీలింతుమేని అతడు సర్ సయ్యద్ మఱియు హాలీల సంస్కరణోద్యమము వలన రూపొందిన సంప్రదాయమునే పురోగమింప జేయుచుండెనని తెలియును. అతని కవితలో అక్బర్ అలహాబాదీని స్మరింపజేయు శైలియు కొంత కలదు. ఉర్దూ కవులందఱవలె అతడు ప్రారంభమున గజలులు వ్రాసి దిద్దుటకై దాగ్ మహాకవికి చూపించెను. కాని కొలది నాళ్ళలోనే అతడు తన స్వంత శైలిని ఏర్పఱచుకొని క్రీ. శ. 1899 లో మొదటి మహత్తర కవిత "హిమాలయా" అనునది వ్రాసెను. ఆపైన ప్రకృతి సౌందర్యము, హిందూ ముస్లిముల ఐక్యత, ఆంతరంగిక సంఘర్షణ మొదలగు వానిని గూర్చి సుందరము లగు రచనలు చేసెను. వీనిలో నలువైపుల దృశ్యమానమగు సౌందర్యమును చూచి నప్పుడు సహృదయునిలో కలుగు ఆశ్చర్యము, మఱియు ప్రతిపదార్థమునందు జీవిత రహస్యాన్వేషణ చేయు ఉత్సుకత ప్రకటింపబడెను. ఆదిలోని ఈ ఆశ్చర్యమే రాను రాను దార్శనికమును, ఆధ్యాత్మికమును అగు వృత్తాంతముగా రూపొంది ఇక్బాలును ఉర్దూలోని సర్వాధికుడగు తాత్త్విక కవిగా చేసెను.

ఇక్బాలు యొక్క విశిష్టత యేమన అతడు ప్రాక్పశ్చిమముల దర్శన, ధర్మ శాస్త్రములను వైజ్ఞానిక శాస్త్రమును చరిత్రను రాజకీయ పరిస్థితులను సంపూర్ణముగా ఎఱిగినవాడు. అతనిని అర్థము చేసికోవలెనన్న ఇస్లాము మతవిచారముల పరిజ్ఞానము మాత్రమే సరిపోదు. ఇతర సమస్త మతములను, సిద్ధాంతములను, విజ్ఞానశాస్త్ర మును తెలిసికొనుట అవసరము – ప్లేటో, నిట్‌షో, బర్గ్‌సాఁ మఱియు ఐన్‌స్టయిన్, లను గుఱించి బాగుగా తెలిసికొననివారు ఇక్బాలు కవితను గ్రహింపలేరు. అనగా అతడు కేవలము సుప్రసిద్ధ తత్త్వవేత్తల భావములనే కావ్యరూపమున ప్రకటించి నాడని అనుకోగూడదు. వారిని అతడు కొన్నిపట్ల వ్యతిరేకించెను. విమర్శించెను. తన దృక్పథమునకు పుష్టి కలిగింపజాలు సిద్ధాంతములను మాత్రమే స్వీకరించెను. అతని దృక్పథ మెట్టిది? ఈ ప్రశ్నకు సంక్షిప్తముగా జవాబు చెప్పుట కష్టము – పరిచయము కొఱకై స్థూలముగా ఇట్లు చెప్పవచ్చును. అతడు ఇస్లామీయ సిద్ధాంత

ములపై ఆధారపడినది. ఐక్యతను ప్రబోధించునది, మానవజాతిలో ఎట్టి భేదభావములకును ఎడమీయనిది అగు వ్యవస్థను, అనుశాసనమును వాంఛించెను. ఇంక "మానవుడు ఈ ప్రపంచముననే కాదు. చంద్ర, సూర్య నక్షత్ర మండలములలో అధికారము పొందవలెను. అతని అంతరాత్మ పవిత్రమైనదిగా ఉండవలెను. అతడు ప్రపంచములోని ఎట్టి భౌతికశక్తి ముందును తలవంచ గూడదు. మానవుడు తన ఇచ్ఛానుసారముగా జీవితము గడపు కొనుటకు సమర్థుడై యుండవలెను. కాని భగవదాజ్ఞలను ఎన్నడును జవదాట గూడదు. మానవుని ఆత్మశక్తి అనంతమయినది. మానవుడు ఆత్మశక్తిని గుర్తెఱిగి, ఆత్మసంయమనము ద్వారమున దానిని వికసింప జేసికొనినచో అతడు ఈశ్వరుని రచనాత్మక కార్యక్రమమున సహాయపడుటకును సమర్థుడగును. ఏలయన ఈశ్వరుడు మానవుని మించిన వస్తువేడియు సృష్టించలేదు. సృష్టిని కూడ మానవుని కొఱకే నిర్మించినాడు - అనియు చెప్పెను. ఈ ఆత్మశక్తిని గుఱించి అతడు చాల చాల చెప్పినాడు. అదంతయు అప్పుడప్పుడు ఆధ్యాత్మిక కల్పన అనిపించును. దానిని సాధించు మార్గములు కాన్పించవు - ఇదియే ఇక్బాలును యథార్థవాదులకు దూరముచేసి ఆదర్శవాదులకు దగ్గఱగా చేసిన విషయము - అతడీ పరివర్తన మంతయు వాస్తవికమగు భౌతిక జీవనమున కాక కాల్పనికమగు జీవితమున అభిలషించుచుండెనేమో అనిపించును. అహంకారమును నశింపజేసికొనుటే ఈశ్వర సాయుజ్యమునకు మూలమను సూఫీ సిద్ధాంతమును ఇక్బాలు నిశితముగా ఖండించెను. మానవుడు తనలోని శక్తులన్నిటిని ఉపయోగించుకొని భగవదంశ తనలో కలిగించుకొనినప్పుడే ఈశ్వరుడు చేరువకు రానిచ్చునని అతడు భావించెను. అయినను ఆధునికకాలపు ఆధ్యాత్మిక భావమనబడు ఒక క్రొత్తరకపు "తసవ్వుఫ్" అతనిలో లేకపోలేదు. ఇక్బాలు జీవితమునకు సంబంధించిన ప్రతి గంభీర విషయమును స్పృశించెను. అతడు తడవని విషయములు క్వచిత్తుగా ఉండును. ముఖ్యముగా ఆత్మశక్తి, మానవజ్ఞానము, సకలగుణ సంపన్నుడగు అలౌకిక పురుషుడు,[1] ప్రకృతిపై మానవుని విజయము, వ్యక్తికి మతము మఱియు సమాజముతో గల సంబంధము- ప్రాక్పశ్చిమ తత్త్వ శాస్త్రములు, ఈ మొదలగు విషయముల గూర్చి ఫారసీ, ఉర్దూ భాషలలో అతడు అనేక కవితలు వ్రాయుటే కాక తన ఆంగ్లోపన్యాసములలో గంభీరభావములను వెల్లడించెను.

1. స్థిత ప్రజ్ఞుడు.

"ఇక్బాల్" ఉర్దూ కావ్య సంగ్రహములు నాలుగు. "బాంగే-దరా", "బాలె-జిబ్రీల్", "జర్బే-కలీమ్" మఱియు "అర్మగానె-హిజాజ్" అనునవి. అతని ఫారసీ రచనలనేకము. అవి ఉర్దూ రచనలకంటె శ్రేష్ఠతరములు. అతని భాష సరళమైనది కాదు. కాని అతని భావ ప్రకటనకు ఆ భాషయే సమంజసమైనది. కావ్య సౌందర్య దృష్టితో అతని రచనలు ఉర్దూ ఫారసీ భాషలలోనే కాక ప్రపంచ భాషలన్నిటిలోను ఉన్నత స్థానమును పొందుటకు అర్హమైనవి. "ఇక్బాల్" మానవుని శక్తిపై సంపూర్ణ విశ్వాసము కలవాడు - మానవుని భవిష్యన్నిర్మాణమును గూర్చిన గీతములు ఆలపించెను. వానిని చదువువారు అతని భావమయసంగీత ప్రవాహమున తేలిపోదురు. అతని కవితలు సంపూర్ణముగా వ్రాయుటకు వీలులేదు. ఆయా కవితలనుండి కొన్ని చరణములు మచ్చుతునకలుగా ప్రదర్శింపబడును :—

కోయీ అబ్ తక్ నయే సమ్ఝా, కి, ఇన్సాఁ
కహాఁ జాతాహై, ఆతాహై కహాఁ సే 1

దిల్ మె కోయీ ఇస్ తరహకీ ఆర్జూ పైదాకరూఁ
లోట్ జాయె ఆస్మా మేరే మిటానేకేలియే 2

న పూఛో ముఝ్ సే లజ్జత్ ఖానుమాఁ-బర్బాద్ రహ్నేకీ
నషేమన్ సైఁకడోఁ మైనే బనాకర్ ఫూంక్ దాలే హైఁ 3

శక్తిభీ శాంతీభీ భక్తోంకే గీత్ మే హై
ధర్తీకే బాసీయోంకీ ముక్తీ ప్రీత్ మే హై. 4

---

1. మానవుడు ఎచటి నుండి వచ్చెను? ఎచటికి వెళ్ళును? అను సంగతి ఇంత వఱకు ఎవరును తెలిసికొనలేదు.

2. ఆకాశము నన్ను నశింపజేయ నుద్యమించునట్లు మనస్సులో నేదేని సంకల్పము చేయుదు గాక.

3. గృహవినాశము వలన కలుగు సంతుష్టిని గూర్చి అడుగకుడు. ఇంతవఱకు ఎన్నియో గూళ్లు నిర్మించుకొని నశింపజేసితిని.

4. భక్తుల గీతములలో శక్తి కలదు, శాంతి కలదు. ఇహలోక వాసులకు ప్రేమమూలముననే ముక్తి కలదు.

ఉరూజే ఆదమే ఖాకీసె అన్జుమ్ సహామె జాతే హైఁ
కి, యే టూటా హువాతారా మహేకామిల్ న బఞజాయే. 1

* * * *

న, తూ జమీఁకె లియే హై, నఁ ఆస్మాఁకె లియే
జహాఁ హైఁ తేరే లియే, తూనహీ జహాఁకెలియే. 2

* * * *

సితారోంసే ఆగే జహాఁ ఔర్ భీ హైఁ
అభీ ఇష్కకే ఇమ్తెహాఁ ఔర్ భి హైఁ. 3

* * * * *

ఇరువదవ శతాబ్దమున ఉర్దూ సాహిత్య చరిత్రలో స్థానము పొందదగిన కవులెందఱో జన్మించిరి. కొందఱిగూర్చి ఇదివఱకే వ్రాయనైనది. మఱికొందఱినుగూర్చి ఈ సంక్షిప్త చరిత్రలో సవిస్తరముగా వ్రాయుట అసంభవము. అనగా వారి రచనలు చదువ తగినవి కావని తాత్పర్యము కాదు. "షాద్" అజీమా బాదీ, జ్వాలా ప్రసాద్ "బర్క్", నౌబత్ రాయ్ "నజర్", మహారాజ బహదూర్ "బర్క్", జగత్ మోహఞలాల్ "రవాఁ" "అమర్‌నాథ్" సాహిర్, "రియాజ్" ఖైరాబాదీ, మోలానా "సఫీ", "ఫానీ", "అజీజ్", "సాఖిబ్". "సాయెల్", "ఆర్జూ" "సీమాబ్", "అసర్" గోండ్వీ, "జరీఫ్", "హస్రత్" మోహానీ, మొదలగు కవులు కీర్తిశేషులు. త్రిలోక చంద్ "మహరూమ్", పండిత్ "కైఫీ", "జిగర్", "మురాదాబాదీ", "యగానా", "చంగేజీ", "అసర్", "లఖ్నవీ", "జోష్" మలిస్యానీ, మొదలగువారు జీవితులు.[4]

---

1. మట్టితో నిర్మింపబడిన ఈ మానవుని అభివృద్ధిని చూచి, రాలిన ఈ నక్షత్రము పూర్ణ చంద్రముడయి పోవునేమో అని చుక్కలు భయపడుచున్నవి.

2. నీవు భూమి కొఱకు కాదు, ఆకాశము కొఱకు కాదు. నీవు సృష్టికొఱకును కావు. సృష్టియే నీ కొఱకు.

3. నక్షత్రముల అవతల ఇంకను ప్రపంచములు కలవు. ఇంకను ప్రేమ పరీక్షలు కలవు.

4. ఇట జీవితులని పేర్కొనబడిన వారిలో "కైఫీ" "జిగర్" మొదలగువారు ఈ అనువాదము నాటికి కీర్తిశేషులు.

కాని వారిని కొన్ని కారణముల వలన క్రీ.శ. 1930 వఱకు గల కవులలో లెక్కింప దగును. వీరి కవితలో ఆధునిక కాలపు నవ్యత కలదు కాని విప్లవముతో సహాయ కారి యగు చైతన్యము కాని, సంప్రదాయములను ఉల్లంఘించు సాహసము కాని అంతగా లేదు. ముందటి అధ్యాయమున ఈ యుగపు వ్యాకులతను, ఉద్విగ్నతను, విచారమును, స్వప్నమును మఱియు ఆశను చిత్రించిన కవులను గూర్చి వ్రాయ బడును. పైన పేర్కొనబడిన కవులలో అనేకులు గజల్ మఱియు అన్యప్రకారముల కవితలు వ్రాసినవారు. తమ యుగపు సంప్రదాయములను నవ్యత వైపు మరలించుటలో పాల్గొనినవారు. వారిలో కొందఱు సంప్రదాయములకు కట్టువడి యుండియు తమ వ్యక్తిత్వమును నిలుపుకొని సాహిత్య చరిత్రలో తమ స్థానమును పొందినవారును కలరు.

"షాద్" అజీమా బాదీ, బీహారు ప్రాంతపు ప్రథమశ్రేణి కవులలో లెక్కింప బడును. అతడు గొప్ప విద్వాంసుడు. పూర్వ సంప్రదాయములను కూలంకషముగా గుర్తించినవాడు. అయినను నవ్యతను వ్యతిరేకించువాడు కాడు. అతడు తన గజలు లలో విశేషముగా వాస్తవిక భావములను, భావ పూర్ణములగు ప్రేమానుభూతులను ఉల్లేఖించెను. దీర్ఘాయువు పొంది అతడు క్రీ. శ. 1927 లో పరలోకగతుడయ్యెను. అతడు అనేక గ్రంథములు వ్రాసెను. అతని మరణానంతరము అతని కావ్య సంగ్రహము "నగ్మయే - ఇల్హామ్" అను పేర ప్రకాశితమైనది. అతని కవిత సుందరమైనది. మాధుర్యగుణము కలది,

రెండు మూడు పద్య పాదములు చూడుడు :—

మై ఔర్ సైరె లాల-వొ-గుల్ హిజ్రెయార్ మేం
కైసీ బహార్, ఆగ్ లగాదో బహార్ మే 1

* * * *

తమన్నా నోమ్మే ఉల్ఝాయా గయాహూం
ఖిలోనే దేకె బహెలాయాగయా హూం 2

---

1. ప్రియా వియోగమున ఉద్యాన విహారమేమిటి? ఇట్టి వసంతమునకు చిచ్చుపెట్టుడు.

2. వాంఛలలో చిక్కుకొన జేయబడినాను. ఆటవస్తువ లిచ్చి ఓదార్చ బడినాను.

ఏ బజ్మే-మై హై యాఁకౌతాహ దస్తీ మేహై మహరూమీ
జొ బఢ్‌కర్ ఖుద్ ఉఠాలే హాథ్‌మే మీనా ఉసీకాహై. 1

జ్వాలా ప్రసాద్ "బర్ఛ్" సీతాపూర్ నివాసి. 'జడ్జి' పదవి నిర్వహించుచు క్రీ. శ. 1911 లో దివంగతుడయ్యెను. అతడు గద్య పద్య రచనలలో నిపుణుడు. సరళభాషలో భావ ప్రకటనచేయుట అతనికి తెలిసిన విద్య. వసంతర్తువును గుఱించి సుందరమగు ఒక మస్నవీ రచించెను. అతని ప్రసిద్ధికి మాత్రము గజలులే కారణము. నౌబత్ రాయ్ "నజర్" (1899–1923) లఖ్నోలో నొకప్రసిద్ధకవి. అనేక పత్రికలకు సంపాదకుడుగా పనిచేసెను. అతని జీవితమంతయు గష్టములలో గడచెను. ఆరోగ్యము సరిగా ఉండునదికాదు. కుటుంబ వ్యథలును అతనిని విడిచిపెట్టునవి కావు. "నజర్" గద్యరచనలోను, పద్యరచనలోను గణనీయుడు. లఖ్నోయొక్క కృత్రిమ శైలిని తొలగించి కవితను సంస్కరించుటకై సఫల ప్రయత్న మొనర్చినవాడతడు. బాహ్య సౌందర్యము కాక ఆంతరంగిక వ్యథలను చిత్రించుటయే కవిత్వమని భావించువాడు.

అతని రెండు మూడు పద్యములు :—

అభీ మర్నా బొహత్ దుష్వార్ హై గమ్‌కీ కషాకష్‌సే
అదాహో జాయెగా యే ఫర్జ్ భీ ఫుర్సత్ అగర్ హోగీ. 2

* * * *

అబ్‌నాహీ మాలూమ్ క్యా దున్యామె హై రంగే-బహార్
ఇక్ జమానా హోగయా ఛూటే హువే గుల్జార్ సే 3

* * * *

1. ఇది మద్యపానోత్సవము. ఇచట చేతులు ముడుచుకొని యున్నవారు వంచితులగుదురు. ముందున కరిగి చేతగొను వానిదే మధు కలశము.

2. ఈ కష్ట పరంపరలో మరణించుట కూడ కష్టమే. ఎప్పుడేని తీఱిక కలిగినచో ఆ విధియు నెఱవేర్చుకోబడును.

3. ఇపుడు వసంతశోభ యెట్లుండునో తెలియదు. పుష్పవాటికను విడిచిపెట్టి చాల కాలమయ్యెను.

యూఁ తో దిల్‌కో కభీ ఖరార్ న థా
అబ్ బొహత్ బేఖరార్ రహతా హై. 1

* * * *

వెనుకటి అధ్యాయమున చెప్పబడినట్లు ఆ యుగపు కవులందఱును ఏదో విధముగ పూర్వశైలిని సంస్కరించుటకే ప్రయత్నించుచుండిరి. ముఖ్యముగా లఖ్నో శైలిలో విశేష పరివర్తనము జరుగుచుండెను. ఆనాటి కవులు పూర్వ సంప్రదాయములను పూర్తిగా పరిత్యజించుచుండిరని తాత్పర్యముకాదు. కాని వారు కవితను కేవలము శబ్దాడంబరమే కానీయక తద్ద్వారమున గంభీర విషయములను ప్రకటించుట ఆవశ్యకమని భావించుచుండిరి. "సాహిర్", "సాయల్", "బేఖుద్" మొదలగు కొందఱు ప్రాచీన సంప్రదాయములను ఏమాత్రము ఉల్లంఘించుటకును ఇష్టపడకుండిరి. అయినను వారి కవితలను పరిశీలింతుమేని పూర్వకవులకంటె వారిలో కొంత నూత్నచైతన్య ముండెననియే తెలియును. ఆనాటి కవులు, ప్రాచీన కవులలో 'మీర్', 'గాలిబ్', 'ఆతిష్' మఱియు 'అనీస్' మొదలగువారిని నవ్యులలో 'హాలీ', 'ఇక్బాల్' మఱియు 'సురూర్' ప్రముఖులను అనుసరించుచుండిరి. మహారాజ్ బహాదుర్ "బర్ఖ్" (1884-1936) వంశమున తరతరముల నుండి కావ్యరచన చేయబడుచుండెను. అతడు ఆంగ్ల కవుల చేతను 'సురూర్' జహానాబాదీ చేతను ప్రభావితుడు. గజలులు స్వల్పముగా వ్రాసి అతడు ఇతర విధములగు కవితలనే అధికముగా వ్రాసెను. అతని భాష కఠినము. ఫారసీ పద బహుళము. అతని కవితా సంగ్రహములు రెండు ప్రకాశితములైనవి. గజలుల నుండి రెండు చరణములు:—

జర్ఫ్-మై టూట్‌కే భీ హోనేన పాయే బేకార్
హో షికిస్తా కోయీ షీషాతో వొ పైమాన బనే. 2

* * * *

1. హృదయమునకు ఏనాడును స్తిమితము లేదు. అయినను ఇప్పుడు మఱియు వ్యాకులత పొందియున్నది.

2. మధు కలశము పగిలిపోయి వ్యర్థము కాకూడదు; విఱిగిన గాజుబుద్దితో పానపాత్ర చేసికోవలెను.

ఖుల్తీ నహీ హఖీఖతె - దున్యాయె-బేసబాత్
ఇక్ ఖ్వాబ్‌సాహై బీదయే-హైరాంకె సామ్నే. 1

*　　*　　*　　*

'సఫీ' లఖ్నవీ (1863-1950) లఖ్నోలోని సుప్రసిద్ధ కవి. అతడు నాలుగేండ్ల క్రిందట మరణించెను. అయినను అతనిని ఆ యుగముననే చేర్చుచున్నాము. అతడు ఫారసీ అరబీ భాషలలో గొప్ప విద్వాంసుడు. ఆంగ్ల భాష నెఱిగినవాడు. లఖ్నో కావ్యశైలిలో గొప్ప పరివర్తనము తెచ్చినవాడు. అతడు సుమారు అరువదేండ్ల వఱకు అన్ని రీతుల కవితలు వ్రాసెను. కావ్యశాస్త్ర పారంగతుడు. స్వభావతః నమ్రత కలవాడు కనుక, అతనిని కలిసిన వారందఱును లాభము పొందిరి. అతడు గజలులేకాక భారతదేశము నందలి ప్రసిద్ధ నగరములను సుదీర్ఘములగు కవితలలో సుందరముగా వర్ణించెను. కొన్ని కవితలలో అతడు "హాలీ"కి సన్నిహితుడుగా కాన్పించును. అతడును హాలీవలెనే సంస్కారము ద్వారమున జీవితమును అభివృద్ధి పఱుప ప్రయత్నించెను. అతని కవితా సంగ్రహములు అనేకములు. కాని కొన్ని మాత్రమే ప్రకాశితము లైనవి. అతడు వ్రాసిన ఒక మస్నవీకి 'హిందూస్థాని - అకాడమీ' పురస్కారము లభించినది. చివరి కాలమున అతడు" ఉమరె-ఖయ్యామ్" రుబాయీలను ఉర్దూలో అనువదించి వానికి పరిశోధ నాత్మకమగు వ్యాఖ్యానము వ్రాసెను. అతడు పూర్వ సంప్రదాయమునకు చెందినవాడే అయినను నవ్యతను ఆదరించి స్వీకరించు ప్రయత్నము చేసెను.

ఉదాహరణకు అతని పద్య పాదములు కొన్ని :

దిల్‌మే రహరహకే ఖటక్ హోతీహై
ఖలిషే-దర్దె-మొహబ్బత్ హోగీ. 2

*　　*　　*　　*

---

1. మాయారూపమగు ప్రపంచ సత్యము తెలియదు. చకిత నేత్రముల సమ్ముఖమున అదొక స్వప్నము వంటిది.

2. హృదయమున ఉండి యుండి 'కలుకు' మను చున్నది. ఇది ప్రేమ వ్యధ కావచ్చును.

ఆకర్ జోనహీజాతీవోహై షబె-తన్హాయీ
జాకర్ జోనహీ ఆతీవో ఉమ్రె-గురేజాఁహై, 1

*    *    *    *

కల్‌హమ్ ఆయీనేమే రుఖ్‌కీ ఝుఱ్ఱియాఁ దేఖాకియే;
కార్వానే-ఉమ్రెరఫ్తా కే నిషాఁ దేఖాకియే
జోర్‌హీ క్యాథా జఫాయే బాగ్బాఁ దేఖాకియే
ఆషియాఁ ఉజ్దాకియా హమ్‌నాతబాఁ దేఖాకియే, 2

*    *    *    *

మిర్జా మొహమ్మద్‌హాదీ "అజీజ్" (1880-1935) లఖ్నోలోని ప్రసిద్ధ కవులలో ఒకడు. అచటి కవితలో భావుకత చేర్చి నూత్నత్వము కలిగించిన వారిలో ప్రముఖుడు. అతడు మీర్ మఱియు గాలిబుల అనుయాయి. వారివలెనే గంభీరము లగు విషయములను భావపూర్ణముగా ప్రకటించువాడు. గజలులేకాక ఉచ్చశ్రేణికి చెందిన ఖసీదాలు కూడ వ్రాసెను. అతని ఖసీదాలు మతప్రవక్తల ప్రశంసాత్మ కములు. "గుల్-కదా" మఱియు "సహీపయే-విలా" అను రెండు కావ్య సంగ్ర హములు ప్రకాశితములైనవి. షిబ్లీ, అక్బర్, షరర్, ఇక్బాల్ మొదలగు వారు అతని గజలులను కొనియాడిరి.

రెండు మూడు పద్య పాదములు ఉదాహరణకు;

పహిలె ఆయీన ఇక్ నజర్ దేఖా
ఫిర్ మెరాదిల్ మేరా జిగర్ దేఖా 3

*    *    *    *

---

1. వచ్చిపోకుండ ఉండునది విరహనిశి. పోయి, రాకుండ ఉండునది పరుగిడుచున్న జీవితము.
2. నిన్న అద్దములో ముఖము మీది ముడుతలు చూచితిమి.
కడచిన జీవితపు పదాంకములు చూచితిమి. శక్తి చాలనందున తోట కాపు చేయుచున్న అన్యాయ క్రౌర్యములను చూచితిమి. గూడు కూలిపోవుచుండగా బలహీనులము మేము చూచితిమి.
3. తొలుత ఒక చూపు అద్దమును చూచి మరల నా హృదయమును చూచును.

హాయ్ మజ్బూరియాఁ మొహబ్బత్‌కీ
చాహియే జోనథా కియామైనే 1

*  *  *  *

బిజిల్‌సీ ఎక్ సామ్నే ఆకర్ నికల్ గయీ
కాం దేఖ్తేహి దేఖ్తే దునియా బదల్ గయీ 2

*  *  *  *

అప్నే మర్కజ్‌కి తరఫ్ మాయిలె-పర్వాజ్‌హై హుస్న్
భూల్తాహీ నహీ ఆలమ్ తేరీ అంగ్డాయీకా, 3

మిర్జా జాకిర్ హుస్సేన్ "సాఖిబ్"(1869–1946) లఖ్నోలోని ప్రఖ్యాత కవి. తండ్రి వెంట ఉద్యోగ వశమున అలాహాబాద, భూపాల్ మఱియు ఆగ్రాలలో వసించెను. కాని అధిక సమయము లఖ్నోలోనే గడపెను. ఎప్పుడును కావ్యరచనలలో తన్మయుడై యుండువాడు. అధికముగా అతడు గజలులే వ్రాసెను. మీర్ మఱియు గాలిబ్‌ల మార్గమున నడచుటయే గర్వకారణమని తలంచువాడు. అతని కవితలో కొంత కొంత లఖ్నో యొక్క కృత్రిమశైలి కాన్పించును. అయినను హార్దిక భావ చిత్రణమే అధికముగా కలదు. అతని కావ్య సంగ్రహము "దీవానె-సాఖిబ్" అనుపేర ప్రకాశితమైనది.

కొన్ని చరణములు :

బాగ్బాఁనే ఆగ్‌దీ జబ్ ఆష్యానే కో మేరే
జిన్‌పెతక్యాథా వహీ పత్తే హవా దేనే లగే. 4

*  *  *  *

1. ప్రేమ వలని పరాధీనతచే నేను చేయకూడని వన్నియు చేసితిని.

2. మెఱుపువలె ఎదుటికి వచ్చి కదలిపోయినది. చూచుచుండగనే ప్రపంచము మాఱిపోయినది.

3. సౌందర్యము తన కేంద్రము వైపు లేచి పోవుటకు సన్నద్ధమయ్యెను. నీవు ఒడలు విఱిచిన దృశ్యము మఱవలేను.

4. నా గూటికి తోటకాపు అగ్ని తగిలించి నప్పుడు నా గూటికి ఆధారములైన ఆకులే గాలి వీచెను.

తడ్పాదియాహై దిల్‌కో, షాబాష్, హమ్-సఫీరో
యూఁహీ ఫిర్ ఇక్ సదాదో టూటాఖపస్, చలామై. 1

* * * *

దువాయేఁ దేఁ మెరేబాద్ ఆనెవాలే మేరీ వహషత్‌కో
బహూత్ కాంటేనికల్ ఆయే మెరే హమ్‌రాహ్ మంజిల్‌సే. 2

* * * *

అస్గర్ హుస్సేన్ "అస్గర్" గోండ్వీ (1884-1936) వర్తమానకాలపు కవులలో తన సూఫీ తత్త్వరచనల వలన సువిఖ్యాతుడు. బాల్యమున సరియైన శిక్షణ పొందలేదు కాని స్వంత పరిశ్రమచే గొప్ప విద్వాంసులలో చేర్చ దగినంత విద్య గడించెను. సూఫీ తత్త్వము పట్ల అభిమాన ముండుట వలన తన కవితలో ఆ గూఢ విజ్ఞానమునే వెల్లడించెను. అప్పుడప్పుడు వచనమును వ్రాసెను. ఉర్దూ భాషలోని ప్రసిద్ధ మస్నవీ "గుల్జారెనసీమ్" అతని టీకా సహితముగా ప్రకాశిత మైనది. గజలులే అధికముగా వ్రాసెను. భాష ఫారసీ శబ్దభూయిష్ఠమైనను అతని గజలు లన్నియు సరసమైనవి. సుందరమైనవి. "నిషాతె-రూహ్" మఱియు "సరోదె-జిందగీ" అను రెండు చిన్న కవితా సంగ్రహము లతనివి ప్రకాశితము లైనవి. అతని రెండు పద్య పాదములు చదువుడు.

జోషో-జునూఁ మే ఛూట్‌గయా ఆస్తాన యార్
రోతా హుఁ ముహ్‌పె దామనే సహరా లియేహువే. 3

* * * *

---

1. తోడి ప్రయాణీకులారా! నా హృదయమును తల్లడిల్ల జేసితిరి. ఇట్లే ఇంకొక పిలుపు పిలువుడు - దాన చెఱ కూలిపోగలదు. నేను ముక్తుడనై వెళ్ళిపోగలను.

2 నా తరువాత వచ్చువారు త్రోవలోని ముండ్లు చాల వఱకు నాతోనే వచ్చినవి.

3. ఉన్మాదావేశమున ప్రియురాలి గడప విడిపోయినది. ఎడారి కొంగు మొగముపై కప్పుకొని ఏడ్చుచున్నాను.

మై క్యా కహూఁ కహాఁ హై మొహబ్బత్ కహాఁ నహీ
రగ్‌రగ్‌మే దౌడీ ఫిర్తీహై నష్తర్ లియే హువే. 1

షౌకతలీ అను పేరుగల 'ఫానీ' బదాయూనీ ఆ కాలపు ప్రఖ్యాత కవి. ఎల్. ఎల్. బి. చదివి లఖ్నో, ఆగ్రా మఱియు అటావాలలో ప్లీడరీ చేసెను. హైదరాబాదుకు వెళ్లి జీవితాంతము అచటనే వివిధములగు ఉద్యోగములు చేసెను. బాల్యము నుండియు సర్వతీ సన్నిధానమున తల వాల్చి ఇరువదేండ్ల వయము వచ్చునప్పటికి కావ్య సంగ్రహము సిద్ధపఱచుకొనెను. అతడు 'మిల్టన్' మఱియు ఇతర కవుల రచనలను అనువదించెను. కాని ఎటులో అతని రచన లన్నియు నష్టమయ్యెను. ఆ తరువాత వ్రాసిన దంతయు "కుల్లియాతె-ఫానీ" అను పేర ప్రకాశితమైనది. అతడు తన జీవితము నంతటిని గొప్ప ఆవేదనలో గడపెను. ఈ కారణముననే అతడు పెద్ద నిరాశావాది యగు కవి యయ్యెను. అతని కావ్యశైలి మీర్ మఱియు గాలిబుల శైలిని పోలి యుండును. కొంత కొంత లఖ్నో ప్రభావమును కద్దు. అయినను అతని కవితలో దార్శనిక తత్త్వమును భావపూర్ణమగు వాస్తవికతయు అనూనముగా ఉన్నవి. అతడు ప్రథమ శ్రేణికి చెందిన కవి యనుటలో ఎట్టి సందేహమును లేదు. అతని దృష్టిలో జీవితము ఒక బాధ. మానవ జాతి మరణించియే ఆ బాధనుండి విముక్తి పొందును.

అతని కావ్యశైలి ఇట్టిది :

అదాసె ఆడ్‌మే ఖంజర్‌కి ముహ్ చిఫాయెహువే
మెరీ ఖజాకో వో లాయే దుల్హన్ బనాయె హువే. 2

ఎక్ ఫిసానా సున్‌గయే ఇక్ కహ్‌గయే
మైజో రోయా ముస్కురాకర్ రహ్‌గయే. 3

---

1. ప్రేమ ఎచట కలదని ఎచట లేదని చెప్పవలెను. ప్రతి రక్తనాళమును సూదులవలె పరుగెత్తుచున్నది.

2. ఒయ్యారముగ కత్తిచాటున ముఖము దాచుకొని ఆమె నా మృత్యువునే వధువువలె అలంకరించి తెచ్చెను.

3. ఒక గాథ విని ఒకటి చెప్పి ఆమె వెడలిపోయెను. నేను ఏడ్చినంత ఆమె మందహాసము చేసెను.

వో హైఁ ముఖ్తార్ సజా దే కి జజా దే 'ఫానీ'
దో ఘడీ హోష్‌మే ఆనేకె గునహగార్ హైఁ హమ్. 1

*　　*　　*　　*

బిజిలియా టూట్‌పడీఁ జబ్ వో ముఖాబిల్‌సే ఉఠా
మల్‌కె పల్టీథీఁ నిగాహేఁ కె ధుఁవాఁ దిల్ సే ఉఠా. 2

*　　*　　*　　*

న ఇబ్తిదాకి ఖబర్‌హై, న ఇంతిహామాలూమ్
రహాయె వహమ్‌కి 'హమ్‌హైఁ' సొ, వోభీక్యామాలూమ్. 3

*　　*　　*　　*

అజీజ్ లఖ్నవీ శిష్యులలో సుప్రసిద్ధుడు జగత్ మోహన్ లాల్ "రవాఁ" (1889-1934). అతడు "ఉన్నావ్" నివాసి. లఖ్నోలో ఎం. ఏ., ఎల్. ఎల్. బి., దాక శిక్షణపొందెను. ఉన్నావ్‌లో విజయవంతముగా ప్లీడరీచేయుచు కావ్యక్షేత్రమున కూడ ప్రఖ్యాతిగాంచుచుండెను. "రూహె-రవాఁ" అను కావ్యసంగ్రహమును "నబ్దె-రవాఁ" అను ఒక మస్నవీయును ప్రకాశితములైనవి. అతడు కొన్ని కవితలు అసమగ్రముగా విడిచెను. అవి అతని బంధువుల కడ సురక్షితములై ఉన్నవి. అతడు గజలులును రుబాయీలును చాల మనోహరముగా ప్రభావసహితమగు శైలిలో వ్రాసెను. అతని కవితలు గంభీరమైనవి.

---

1. ఆమె శిక్షించుటకును క్షమించుటకును అధికారిణి.
రెండు గడియలు స్పృహపొంది నందుకు నేను దోషిని.

2. ఆమె సమక్షమునుండి లేచినంత పిడుగులు పడినవి. దృష్టి కలిసి విడిపోయినంత హృదయమునుండి పొగ వెడలినది.

3. ఆది తెలియదు. అంతము తెలియదు. మనము ఉన్నాము అను (అస్తిత్వ) భ్రాంతి మాత్రమున్నది. ఇదియేమో ఎవరికి తెలియును?

రెండు మూడు పద్యములు చూడుడు :—

హఁసే భీ, రోయెభీ లేకిఁ న సమ్ఝే
ఖుషీ క్యా చీజ్ హై, దున్యామె, గమ్ క్యా. 1

*   *   *   *

రవాఁ ! సచ్ హై మొహబ్బత్‌కా అసర్ జాయానహీ హోతా
వొ రోదేతేహైఁ అబ్ భీ జిక్ర్ ఆతాహై జహాఁ మేరా 2

*   *   *   *

పై హమ్‌దియే వొ రంజ్‌కే ఇన్సాఁ బనాదియా
మిన్నత్ పిజీర్ హూఁ సితమె రోజ్‌గార్‌కా, 3

*   *   *   "

కిసీ తరఫ్ నజరే యాస్ కర్‌కె రోదేనా
మెరీ జుబాఁ మె ఇసీకో ఫుగాఁ భీ కహ్తె హైఁ. 4

*   *   *   *

సయ్యద్ మఖ్బూల్ హుస్సేఁ "జరీఫ్" లఖ్నోలో హాస్య ప్రసిద్ధకవి. అతడు రాజకీయ, సామాజిక, ధార్మిక విషయముల గూర్చి తన ప్రత్యేక శైలిలో కవితలు వ్రాసెను. వాని వలన అతని సామాజిక చైతన్యము విశదమగును. నవ్వించుచునే అతడు జీవిత సంస్కారమునకు పనికివచ్చు సంగతులెన్నియో చెప్పెను. అతని కావ్యసంగ్రహము "దివాఁజీ" అను పేర ప్రకాశితమైనది.

---

1. నవ్వితిమి. ఏడ్చితిమి. కాని ఈ ప్రపంచమున సుఖమననేమో దుఃఖమననేమో తెలిసికొనలేక పోతిమి.

2. ప్రేమ ప్రభావమూరకపోదు. నేటికిని ఎటనేని నన్ను ప్రస్తావింతురేని ఆమె ఏడ్చును.

3. ప్రాపంచిక బాధలకు కృతజ్ఞుడను. అంతులేని ఆ బాధలే నన్ను మనుష్యుడుగా చేసినవి.

4. ఒకవైపు నిరాశ దృక్కుల జూచి ఏడ్చుటయే నా మాటలలో పరిణయ వ్యధా ప్రకటనము అనబడును.

అతని కవిత యిట్టిది :—

వహషిత్‌మె హర్ ఇక్ నక్షా ఉల్టా నజర్ ఆతాహై
మజ్నూ నజర్ ఆతీహై, లైలా నజర్ ఆతాహై. 1

* * * *

ముహ్ఁ ఫులాకర్ తిష్నకామానే-మొహబ్బత్ కో హుజూర్
షర్బతే-దీదార్‌కా పూరా ఘడా దేనే లగే. 2

* * * *

కొన్ని మాసముల వ్యత్యాసముతో ఉర్దూ కవులు ముగ్గురు పరలోక గతులైరి. దిసంబరు, క్రీ. శ. 1950 వ సం॥న "సీమాబ్", ఏప్రిల్, క్రీ. శ. 1951 వ సం॥న "ఆర్జూ", మే, క్రీ. శ. 1951 వ సం॥న 'హస్రత్' మోహానీ ఇహలోక యాత్ర చాలించిరి. 'సీమాబ్' (1880-1950) ఆగ్రాలోని ప్రసిద్ధ కవులలో ఒకడు. ప్రారంభమున 'దాగ్' కు తన కవితలు చూపించెను. కొంతకాలము ఇటనట ఉద్యోగములు చేసి తరువాత సాహిత్య సేవలోనే జీవితము గడపెను. గద్యములో పద్యములోను చిన్నవి పెద్దవి కలిపి సుమారు మూడు వందల రచనలు చేసెను. అతడు చాల వ్రాసెను. అన్ని ప్రకారముల కవితలును అతి త్వరితగతిని వ్రాయగలవాడు. అతడు "ఆగ్రా స్కూల్" అను పేర ఒక కవితా సంస్థ నడపుటకు ప్రయత్నించెను. అతని కావ్యసంగ్రహములలో "కారె-ఇమ్రోజ్" "కలీమె-అజమ్", "షేరె-ఇన్ఖిలాబ్" మఱియు "సిదురతుల్-ముంతాహ్" అనునవి పేర్కొనదగినవి. అతని శైలి ప్రత్యేకమైనది కాదు. అయినను భాషపైనను కావ్యశాస్త్రముపైనను సంపూర్ణాధికారము కలవాడు కనుక అప్పుడప్పుడు క్రొత్త సమస్యలను గూర్చియు ఉల్లేఖించెను. అతని శిష్యులు వేనవేలు - వారు భారత దేశమంతటను కలరు.

---

1. భయభ్రాంతిలో అన్ని చిత్రములు తల క్రిందులుగా కాన్పించును. మజ్నూ (స్త్రీవలె) కన్పించును. లైలా పురుషునివలె కన్పించును.

2. ప్రేయసి కోపవశమున ముఖము ఉబ్బించుకొని ప్రేమ పిపాసువులకు దర్శనామృతపు కడవనే ప్రసాదించుచుండెను.

గజలుల నుండి రెండు మూడు పాదములు చూడుడు :—

బదల్ గయీం వో నిగాహేం యె హాదసా థా అఖీర్
ఫిర్ ఇస్కె బాద్ కోయీ ఇన్కిలాబ్ హోన సకా. 1

*　　*　　*　　*

కహానీమేరి రూదాదే-జహాం మాలూమ్ హోతీహై
జో సున్తాహై ఉసీకీ దాస్తాం మాలూమ్ హోతీహై
చమన్‌కే సానహేకో ముద్దతేం గుజ్‌రీ మగర్ అబ్ భీ
చమక్తీహైజో బిజలీ ఆషీయాం మాలూమ్ హోతీహై. 2

*　　*　　*

హర్ చీజ్‌పర్ బహార్, హర్ ఇక్ షై పె హుస్న్ థా
దున్యా జవాన్ థీ మెరే అహదే-షబాబ్ మే. 3

సయ్యద్ అన్వర్ హుస్సేన్ 'ఆర్జూ' (1872-1951) లఖ్నో లోని సుప్రసిద్ధ కవి. అతని తండ్రికూడ ఉత్తమకవి. 'ఆర్జూ' తొలుత 'జలాల్' శిష్యుడు. కాని కొలది కాలముననే కావ్యశాస్త్ర పారంగతుడగుట వలన గురువు తన ఇతర శిష్యులను ఇతనికే అప్పగించెను. 'జలాల్' మరణించిన తరువాత 'ఆర్జూ' అతని పీఠము నధిష్ఠించెను. అతని జీవితము చాలవఱకు కష్టములలో బాధలలో గడచెను. కలకత్తా మఱియు బొంబాయి థియేటర్లకొఱకు డ్రామాలు, మఱియు ఫిల్ములకొఱకు గీతములు వ్రాసెను. అతడు గొప్ప భాషా శాస్త్రవేత్త- లఖ్నో భాషయందు అసమానమగు

---

1. ఆమె చూపులు మాఱినవి. అదియే చివరి సంఘటన. ఆ తరువాత ఎట్టి పరివర్తనమును జరుగలేదు.

2. నా కథ జగత్కథ అనిపించును. వినువారి ఆత్మకథ అనిపించును. తోటలోని సంఘటన చాల కాలమైనది. కాని ఇప్పటికిని పిడుగుపాటుచే మెఱపు దోచినచో గూడు కనుల దిరుగును.

3. సమస్త పదార్థములపై వసంతము కలకలలాడు చుండెను. అన్ని వస్తువలు సుందరములయి యుండెను. నా యౌవనమున ప్రపంచ మంతయు యువాస్థలో నుండెను.

ఎఱుకగలవాడు. "పుగానె-ఆర్జూ" "జహానె-ఆర్జూ", "బయానె-ఆర్జూ" మఱియు "సురీలీ బాంసురీ" అను నాల్గు కావ్యసంగ్రహము లతనివి ప్రకాశితములైనవి. అవి కాక వ్యాకరణమునకు అలంకార శాస్త్రమునకు సంబంధించిన అతని పుస్తకము లనేకములు ప్రచురింపబడినవి. అతడు అరబీ ఫారసీ పదములులేని శుద్ధ హిందూస్థానీ భాషలోను కొన్ని కవితలు వ్రాసెను. అట్టి సరళభాషలోను అతడు మనోభావములను అతి నిపుణతతో ప్రకటించుట ఆశ్చర్యము గొలుపును. ఇఖ్నో శైలిని సంస్కరించిన వారిలో ఆర్జూ ఒకడు.

ఉదాహరణకై కొన్ని పద్యపాదములు :—

చాహత్‌కాఫల్ ఐసాహై జైసే జల్‌జాయే ఖేతీ బోయీహువీ
క్యా హోతాహై ఆన్సూపోంఛ్నే సే, ఛిప్తీనహీం ఆంఖేంరోయీహువీ. 1

*  *  *  *

హై ఏక్‌హీ హోనాతో యే అణ్బణ్‌నహీ అచ్ఛీ
మేరా సానబణ్‌తో ముఝే అప్నాసా బనాదే ! 2

*  *  *  *

తారాటూఠ్తే సబ్‌నే దేఖా, యే నహీ దేఖా ఏక్‌నేభీ
కిస్కీ ఆంఖ్‌సే ఆంసూ టప్కా, కిస్కా సహారా టూటాహై. 3

*  *  *  *

జో దేఖేగా రోతే ముఝ్‌కో, తుమ్‌కో హన్‌స్తే
మేరీ బాత్ ఛోడో తుమ్హే క్యా కహేగా, 4

1. పైరు చల్లి పెంచిన చేను కాలిపోయినట్టిది ప్రణయ ఫలితము.
అశ్రువులు తుడిచికొని నందున ఏమగును. ఏడ్చిన కనులు దాచినను దాగవు.

2. ఏకమై పోవలసిన మనకీ పొరపొచ్చములు తగవు.
నావలె కావేని నీవలె నన్ను మార్చుకొనుము.

3. చుక్క రాలిపోవుట అందఱును చూచిరి. కాని ఎవరికంట కన్నీరొలికెనో ఎవరి ఆశ్రయము తెగిపోయెనో ఎవరును చూడరైరి.

4. ఏడ్చుచుండు నన్ను నవ్వుచుండు నిన్ను ఎవరేని చూచెదరేని నామాట విడువుము; నిన్ను గుఱించి ఏమి భావింతురు.

భారతదేశపు ప్రసిద్ధ రాజకీయ నాయకుడు, ప్రముఖ కవి అగు సయ్యద్ ఫజల్ హసన్ "హస్రత్" మోహానీ (1875-1951) ఉన్నావ్ జిల్లాలోని మోహాన్ వాస్తవ్యుడు. అతడు అలీగర్ నుండి బి.ఏ. పట్టముపొంది అప్పటినుండియే స్వాతంత్ర్య సమరమున పాల్గొనెను. అతడు సంపూర్ణ స్వరాజ్యమును వాంఛించిన సాహసికుడు. అనేక పర్యాయములు జైలు యాత్రచేసి అధిక కవితలు జైలు వాసముననే వ్రాసెను. జైలునుండి విడివడినంతనే సాహిత్య పత్రికలు నడపుచు పూర్వకవుల కావ్య సంగ్రహములను ప్రకాశింపజేయువాడు. ఇది మఱచిపోగూడని మహత్కార్యము. "హస్రత్" గొప్ప సాహిత్య విమర్శకుడు. కవితయొక్క మంచి చెడ్డలను గూర్చి అనేక గ్రంథములు వ్రాసెను. ఆధునిక యుగమున సర్వోత్తముడగు గజలు రచయితగా అతనిని అందఱును ఒప్పుకొందురు. మనోభావములను సరళశైలిలో హృదయంగమ మగురీతి అతనివలె చెప్పినవారు లేరనుటలో సందేహములేదు. అతని జీవితములోని సారళ్యము, సత్యము, గాంభీర్యము అతని కవితలలోను ప్రతిబింబించును. అతని కవితలో దార్శనిక గాంభీర్యము కాని ఆలోచనా వైవిధ్యము కాని లేవనుట సత్యమే. కాని కృత్రిమతలేని నిరాడంబరతయే హృదయముల దూసికొనిపోవును. అదియే అతని విశిష్టత. విచిత్రమగు నరళరీతి ప్రేమ భావములను యౌవనకాలపు అనుభూతులను అతడు వెల్లడించునప్పుడు అవన్నియు ఎల్లర హృదయములలోని భావములే అనిపించును. ప్రాచీన, నవీనకావ్యశైలులు రెండును ఏకమైన శైలిఅతనిది. అతని కావ్యసంగ్రహము పదమూడు చిన్నచిన్న భాగములలో ప్రకాశితమైనది. అన్నియుకలిపి "కుల్లియాతె హస్రత్ అనుపేర ప్రచురింపబడినది కాని అదినేడు లభించదు.

ఈ కవులందఱును ఈ యుగమునకు చెందినవారే కాని, తీవ్రగతితో నడచుచున్న ఈనాటి జీవనమును చూచినప్పుడు వీరి వాణియు కొంత పురాతనమైనదే అనిపించును. వీరు నేడు లేరు. కాని వీరి కవితలు జీవితమును గ్రహించు ఇచ్ఛ పఠితలకు కలిగించుచునే ఉన్నవి. వీరి వీరి శిక్షణను పారివారిక జీవనమును అనుసరించి వీరి రచనలలో ప్రభావితులజేయు శక్తి ఒక్కరీతిగా లేదు. వీరిశైలిని చైతన్యమును అనుసరించి చూచిన వీరందఱు విభిన్న సంప్రదాయములచే ప్రేరితులు కనుక వీరిని ఒక్కచో చేర్చి చదువుట సరియైన పద్ధతి కాదని కొందఱు విమర్శకులు భావింతురు. అయినను చరిత్రలో వీరు జన్మించిన యుగముననే చేర్చవలసియుండును. వీరు సమకాలీన జీవనముచే ఎంతవఱకు ప్రభావితులై రచనలుచేసిరో ఆ విషయము

విమర్శకులు ఆలోచింపవలసినది. వీరు రూఢివాదులయినను లేదా సంప్రదాయములను విడిచిపెట్ట దలచినవారే అయినను అందుకు గల కారణములను గూడ చూడవలసి యుండును. రాబోవు చరిత్రకారులు వీరెంతటి మహత్వముకలవారో నిశ్చయింతురు. ఏదో రూపమున ఈ సముదాయమునకు సంబంధించి ఇప్పటికి జీవితులైయున్న కొందఱిని గూర్చి సంక్షేపముగా ఇప్పుడు వ్రాయబడును.[1]

పండిత బ్రజమోహన దత్తాత్రేయ కైఫీ "క్రీ. శ. 1866 వ సంవత్సరమున జన్మించెను. ఉర్దూ, ఫారసీ భాషలు ఇంటిలోనే చదివి, 'సేంట్ స్టీఫెన్స్' కాలేజీలో ఆంగ్ల విద్య నభ్యసించెను. అతడు ఐరోపా యాత్ర కూడ చేసెను. పూర్వ సంప్రదాయములకు సంబంధించిన వాడే అయినను ఉదార హృదయముతో నవీన భావములను కూడ స్వీకరించెను. హాలీ మఱియు ఆజాదుల పరిచయము కలవాడతడు. బహుభాషలలో గొప్ప పండితుడు. ఉర్దూ భాషలో అసమానమగు విద్వత్తకలవాడు. గద్య పద్య రచనలలో నైపుణ్యము కలవాడు. గొప్ప గొప్ప రచనలు అనేకము చేసినవాడు. అతడు చాల కవితలును వ్రాసెను. కాని అతని కవితలో రసములేదు. మనోహరములగు భావములును లేవు. అతని గద్య రచనలే ఆలోచనాత్మకములైనవి. మహత్తరమైనవి. ఇప్పటికి ఏదో వ్రాయుచునే ఉన్నాడు. వ్రేళ్ళమీద లెక్కించ దగిన ఉర్దూ విద్వాంసులలో అతడొకడు.

పండిత లబ్భూరామ్ "జోష్" మలిస్యానీ, క్రీ.శ. 1883 వ సం॥న పంజాబులో జన్మించెను. మహాకవి 'దాగ్' శిష్యుడు. భాషను, కావ్యశాస్త్రమును కూలంకషముగా ఎఱిగిన పండితుడు. అతని కావ్యసంగ్రహమొకటి ప్రకాశితమైనది. ఇంకనుఅముద్రిత రచనలు చాల ఉన్నవి. అతడు అధికముగా గజలులే వ్రాసెను. అప్పుడప్పుడు ఇతర కవితలును వ్రాయును. గద్య రచనలో అతడు కావ్య సమీక్షచేయును. కొంత కాలము క్రిందటనే గాలిబ్ కవితలకు వ్యాఖ్యానము వ్రాసెను. దానివలన అతని భాషాజ్ఞానము విశదమగును.

త్రిలోకచంద్ "మహరూమ్" క్రీ. శ. 1885 వ సం॥న సర్హదీ ప్రాంతమున జన్మించెను. బి. ఏ. వఱకు చదివి విద్యాశాఖలో ఉద్యోగియయ్యెను. పండ్రెండు పదమూడేండ్ల వయమునుండియే కావ్యరచన ప్రారంభించి ఇప్పటికి చాల వ్రాసెను.

1. వీరిలో కొందఱు ఈ అనువాదకాలమునాటికి కీర్తిశేషులైరి.

''గంజె - మఆనీ'' అనుపేర అతని కావ్యసంగ్రహ మొకటి ప్రకాశితమైనది. జీవితులగు పురాతన కవులలో అతడు ఆదరణీయుడు. అతని కవితలో దేశభక్తి మఱియు మతసామరస్యమునకు సంబంధించిన భావములుండును. గజలులు తక్కువగా వ్రాసెను. వ్రాసినంత వఱకు చాల సరసముగా వ్రాసెను. కొన్ని కవితలు బాలుర కొఱకే వ్రాసెను. 'కైఫీ' మఱియు 'జోష్' మలిస్యానీల వలె అతడును ఇల్లు వాకిలి విడువవలసిన వాడై దిల్లీలో నివసించుచున్నాడు.

''యాగానా'', ''జిగర్'' మఱియు ''అసర్'' అను ముగ్గురు ఈనాటి మేటి కవులు. అయినను పైన చూపిన కారణముల ననుసరించి వారిని నవజాగృతికి సంబంధించిన కవులలో చేర్చుటకు వీలులేదు. తమ కవితావిశేషముల వలన వర్తమాన యుగమును కూడ వారు ప్రభావితము చేయుచున్నారు. కాని జీవితమును, సాహిత్యమును గుఱించిన వారి దృక్పథము నూత్న రచయితలవంటిది కాదు. అనగా వారి రచనలు మానవ జీవితపు వివిధ చిత్రములను ప్రదర్శించునవి కావని తాత్పర్యము కాదు. వారి దృష్టి గంభీరము, మన స్తత్త్వ పరిశీలనము విస్తారము, కనుకనే ఏదో విధముగ వారి ప్రభావము నేటి ఉర్దూ సాహిత్యముపై పడుచున్నది.

మిర్జా వాజిద్ హుస్సేన్ "యగానా" చంగేజీ క్రీ. శ, 1884 వ సంవత్సరమున పట్నాలో జన్మించెను. అచటి గొప్ప విద్వాంసుల దగ్గఱ, కవుల దగ్గఱ విద్యాభ్యాసము చేసెను. ఫారసీలోనే కాక ఆంగ్లభాషలోను మంచి జ్ఞానము సంపాదించెను. ప్రారంభమున "యాస్" అను ఉపనామముతో కవితారచన చేసెను. క్రీ.శ. 1905 లో లఖ్నోకు వెళ్ళి అచటి సారస్వత జీవితమున కలిసిపోయి అచటివాడే అయ్యెను. సాహిత్య క్షేత్రమున ఒకనితో కలహించెను. ఒకనిని ఓడించెను. వేఱొకనితో చెలిమి చేసెను. ఈ విధముగా నేటికి తన వ్యక్తిత్వమును 'అహము'ను నిలుపుకొనినాడు. అతని కవితలు చదువుటవలన మానవ జీవితపుశక్తి బోధపడును. స్వతంత్రత, ఉద్ధతి, సబలత అతని విచారములలో విశిష్టగుణములు. అప్పుడప్పుడు సామాన్యములగు వ్యాహారిక భాషా శబ్దములను కూడ అతడు ప్రయోగించును. అతడు "గాలిబ్" వ్యతిరేకమున చాల వ్రాసెను. ఇతర మహాకవుల యెడలను అతనికి సద్భావము లేదు. గద్యరచనలతో పాటు "ఆయాతె-వాజిదీ" అను అతని పద్య సంగ్రహ మొకటి ప్రకాశితమైనది.

అతని కొన్ని పద్యపాదము లివి :—

ఇసీ ఫరేబ్‌సే మారాకి కల్‌హై కిత్నీదూర్
ఇస్ ఆజ్ కల్‌మే అబస్ దిన్ గవాఁయేఁ హై క్యాక్యా.
పహాడ్ కాట్నేవాలే జమీఁసె హార్‌గయే
ఇసీ జమీఁమే దరియా సమాయె యేఁ హై క్యాక్యా.
ఖుషీమె అప్నే ఖదమ్ చూమ్‌లూఁ తో జేబాహై
వొలగ్జిషోంపె మెరీ ముస్కురాయె హైఁ క్యాక్యా.
ఖుదాహి జానె 'యగానా' మై కోఁహూఁ క్యాహూఁ
ఖుద్ అప్నీ జాత్‌పె షక్ జిల్‌మె ఆయెహైఁ క్యాక్యా. 1

* * * *

కైసే కైసే ఖుదా బనాడాలే
ఖేల్ బందేకా హై ఖుదా క్యాహై. 2

* * * *

మిర్జా జాఫరలీ ఖాఁ 'అసర్' క్రీ. శ. 1885 వ సంవత్సరమున లఖ్నోలో జన్మించెను. అతనిది అచటి సుప్రసిద్ధమగు విద్వత్కుటుంబము – ధనిక కుటుంబము కూడ – 'అసర్' మంచి విద్య పొందెను. క్రీ. శ. 1909 లో అతనికి 'డిప్టీకలెక్టరీ'

---

1. తేపు ఎంతదూరమను భ్రాంతివలననే నష్టపడితిని. ఈ నేడు తేపు అను చర్చలో ఎన్నియో దినములు వమ్మయ్యెను.

పర్వతమును తొలచువారు భూమికి ఓడిపోయిరి. ఈ భూమిలోనే ఎన్నెని నదులు కలవు.

ఆనంద పారవశ్యమున నా అడుగులను నేనే ముద్దిడుకొనుట ఒప్పును. నా తప్పుడడుగులపై ఆమె ఎంతయో మందహాసము చేసెను.

నేనెవడనో ఏమో భగవానుడే ఎఱుగును. నా అస్తిత్వమును గూర్చియే ఎన్నియో సంశయములు పొడమినవి.

2. భక్తులు ఏ యే దేవతలను సృష్టించిరి.
దేవుని అస్తిత్వము భక్తుల ఆట మాత్రమే!

లభించెను. క్రీ. శ. 1944 వఱకు అతడు పదవిలోనే ఉండెను. బాల్యమునుండి కవితలు వ్రాయుచు "అజీజ్" లఖ్నవీ శిష్యుడయ్యెను. అతడు ఆంగ్లభాషలోను, ఫారసీభాషలోను మహావిద్వాంసుడు. లఖ్నో భాషలోని మెలకువలు తెలిసినవాడు. ఎంతటి కవియో అంతటి విమర్శకుడు. అతని విమర్శ గ్రంథము లెన్నియో ప్రకాశితములైనవి. అతనికి "మీర్" కవితమీద అత్యంతాభిమానము. మహాకవులందఱను చక్కగా అధ్యయనము చేసి ఎఱిగినవాడే కాని "మీర్"ను గుఱించి అతడు చేసిన రచనలు అతని ఆలోచనా గాంభీర్యమును వెల్లడించును.

"అసర్" అన్ని విధముల కవితలు వ్రాసెను. అధికముగా గజలులే వ్రాసెను. ఇతర కవితలును విశేషముగా ఉన్నవి. అన్యభాషలలోని శ్రేష్ఠ కావ్యములను అతడు ఉర్దూ పద్య రూపమున అనువదించెను. అతని భగవద్గీతానువాదము "నగ్మయే–జావేద్" అను పేర ప్రకాశితమైనది. అది ఉచ్చశ్రేణికి చెందిన కవిత. "అసరిస్తాన్" మఱియు "బహారాఁ" అను గజలుల సంగ్రహములు రెండు ప్రకాశితములైనవి. ఇవికాక ఇంకను అనేక సంగ్రహములు ప్రకాశితములైనవి. మఱికొన్ని కానున్నవి. "అసర్" గజలులు నిరాడంబరమై సొగసుగా ఉండును. అతని భాష సరళము–మధురము–అత డప్పుడప్పుడు సూఫీ తాత్త్విక భావములను ప్రకటించును. అయినను ప్రేమభావ ప్రకటనలోనే అతని కవిత సరసమనిపించును.

ఉదాహరణకొఱకు ఈ పద్యపాదములు చూడుడు :—

భూల్నే వాలేసే కోయీ పూఛ్తా
మై తుఝే దిల్ సే భులావూఁ కిస్ తరహ. 1

*　　*　　*　　*

హమ్‌నే రోరోకె రాత్ కాటీ హై
ఆంసువోమ్మే యె రంగ్ తబ్ ఆయా. 2

---

1. నన్ను మఱచిన వారిని నేనెట్లు మఱవవలెనో ఎవరేని అడుగవలెను.

2. మేము ఏడ్చి ఏడ్చి రాత్రము గడపితిమి. అట్లగుట అశ్రువులకు ఇట్టి వర్ణము కలిగినది.

ఝిల్ మిలాతే హువే తారే క్యా హైఁ
ముర్ఝాజే ఫూల్ తెరే బిస్తర్ కే. 1

*　　*　　*　　*

కుఛ్ రోజ్ యేభీ రంగ్ రహా ఇంతెజార్ కా
ఆంఖ్ ఉఠ్ గయీ జిధర్ బస్ ఉధర్ దేఖ్తే రహే. 2

*　　*　　*　　*

తేరీ ఆంఖోంకా కుఛ్ ఖుసూర్ నహీ
హాఁ ముఝీకో ఖరాబ్ హోనాథా. 3

*　　*　　*　　*

బతావో క్యా తుమ్హారే దిల్పే గుజ్‌రే
అగర్ కోయీ తుమ్హీసా బేవఫా హో. 4

*　　*　　*　　*

ఆ, కి, తుఝ్ బిన్ ఇస్ తరహ ఐ దోస్త్ ! ఘబ్రాతాహుఁ మై
జైసే హర్ షైమే కిసీషై కీ కమీపాతాహుఁ మై. 5

*　　*　　*　　*

లేకె ఖత్ ఉన్కా కియా జబ్త్ బొహత్ కుఛ్ లేకిన్
థర్ థరాతే హువే హాథోన్నే భరమ్ ఖోల్ దియా. 6

---

1. తళతళలాడు చుక్కలు నీ పూసెజ్జమీది వాడిన పూలు.
2. కొంత కాలము దృష్టి ఎటు మఱలిన నటే చూచుచు నిరీక్షించితిమి.
3. నీ కనుల దోష మెద్దియు లేదు. ఔను. నేనే పాడుకావలసి యుంటిని.
4. నీవలెనే ఎవరేని విశ్వాసఘాతకులైన యెడల నీ హృదయ మెట్లుండునో చెప్పుము.
5. ఓ మిత్రమా ! రమ్ము. నీవు లేనందున ప్రతి వస్తువలో నేదో వస్తువ వెలితియైనట్లు భయ పడుచున్నాను.
6. ఆమె ఉత్తరమును చేతగాని వ్యధను అణచిపెట్టుకొనుటకు చాల ప్రయత్నించితిని. కాని గజగజలాడుచున్న చేతులు రహస్యము వెల్లడించెను.

సావన్‌కీ రైన్ అంధేరీ, తన్హాయీయోంకా ఆలమ్
ఘూలే హువే ఫిసానే అబ్ యాద్ ఆరహే హైం. 1

* * * *

సాఖీ కీ హర్ నిగాహ్ పె బల్‌ఖాకె పీ గయా
లహరోంసే ఖేల్తా హువా లహరాకే పీ గయా. 2

* * * *

దేఖోన ఆంఖ్ భర్‌కె కిసీకీ తరఫ్ కభీ
తుమ్‌కో ఖబర్ నహీ జో తుమ్హారీ నజర్‌మెహై 3

* * * *

కుఛ్‌దేర్ ఫిక్రె ఆలమె-బాలాకీ ఛోడ్‌దే
ఇస్ అంజుమన్ కా రాజ్ ఇసీ అంజుమన్‌మెహై 4

* * * *

"జిగర్" మురాదాబాదీ, ఈ నాటి లోకప్రియకవి. అతనిపేరు అలీ సికందర్. క్రీ. శ. 1890 వ సంవత్సరమున మురాదాబాదలో జన్మించెను. అతని తండ్రి కూడ కవియే. 'జిగర్' బాల్యమునుండి కవితా రచన చేయుచుండెను. ప్రారంభమున 'దాగ్' కు తన కవితలు చూపుచుండెను- 'అస్గర్' గోండ్వీచే ప్రభావితుడైన పిదప తన కవితలు అతనికే చూపించెను. "దాగె-జిగర్" మఱియు "షోలయే-తూర్" అను రెండు కావ్య సంగ్రహములు ప్రకాశితము లయ్యెను. అతని కవితలు విశేష

---

1. శ్రావణమాసపు చీకటి రేయి. ఏకాంతము. మఱచిన గాథలు స్మృతికి వచ్చుచున్నవి.

2. "సాఖీ" (మధుబాల) చూపులకు తట్టుకొనలేక మెలికలుతిరిగి త్రాగితిని. అలలతో ఆడుచు అల్లాడి త్రాగితిని.

3. నీ చూపులలో నేమి కలదో నీవెఱుగవు. కనుక ఎవ్వరిని దృష్టిసిలిపి చూడకుము.

4. కొంత తడవు పరలోక విచారమును విడువుడు. ఈ సమావేశ రహస్యము ఈ సమావేశముననే కలదు.

ప్రకారమగు ప్రేమ భావములు కలవి. అతని గజలులలో రసమును మాదకతయు గోచరించును. కొంతకాలము మద్యపానము అతని జీవితమున ముఖ్యాంగమయ్యెను. అప్పటి అతని కవితపై దాని ప్రభావమే పడెను. అప్పుడప్పుడు అతడు సూఫీ తత్త్వమును ప్రకటించెను. కాని ప్రేమ భావములుకల అతని కవితయే శ్రేష్ఠమైనది. అతడు సౌందర్యోపాసకుడు. ప్రేమ భావములుకలవాడు. సౌందర్య ప్రేమ భావములను సురుచిర శైలిలో ప్రకటించుట వలననే అతని గజలులు ఆకర్షవంతములైనవి.

అతని కొన్ని పద్యపాదములు :—

దిల్కో బర్బాద్ కర్కే బైఠాహూఁ
కుఛ్ ఖుషీభీహై, కుఛ్ మలాల్ భీహై 1

* * * *

హంనే-బేపర్వాకో ఖుద్‌బీనో-ఖుదారా కర్ దియా
క్యా కియామైనేకి ఇజ్‌హారే-తమన్నా కర్‌దియా 2

* * * *

నహీ ఆతీతో యాద్ ఉస్కీ మహీనోఁ తక్ నహీ ఆతీ
మగర్ జబ్ యాద్ ఆతేహైఁ తో అక్సర్ యాద్ ఆతేహై 3

* * * *

బర్ఖ్‌కో అబ్ర్ కే దామన్‌మే ఛిపా దేఖాహై
హమ్‌నే ఉస్ షోఖ్‌కో మజ్బూరె హయాదేఖాహై 4

* * * *

1. హృదయమును నశింపజేసికొంటిని. కొంత విచారమును, కొంత సంతోషమును కలదు.

2. స్వీయసౌందర్య పరిజ్ఞానములేని ప్రేయసిని స్వీయాభిమానము కలదిగాజేసితిని. నా వాంఛను ప్రకటించి నేనెట్టి పని చేసితిని !

3. ఆమె జ్ఞాపకము కలుగకుండిన నెలల తరబడి కలుగనే కలుగదు. కాని జ్ఞాపకము కల్గుట మొదలయ్యెనేని తఱచుగా కలుగును.

4. మెఱపును మబ్బుచాటున దాగియుండగా చూచితిమి.
లజ్జావశీవందయగు ఆమెను చూచితిమి.

పర్దేసె ఇక్ ఝలక్ జోవో దిఖ్లాకెరహ్ గయే
ముష్తాఖె-దీద్ ఔర్ భీ లల్చాకె రహ్‌గయే 1

*   *   *   *

హమ్‌సె హర్ చంద్ వో జాహిర్‌మెఖఫాహైం లేకిఽ
కోషిసే-పుర్షిషె-హాలాత్ చెలీ జాతీహై 2

*   *   *   *

దిలే-ము జ్తర్ కీ సాదగీ దేఖో
ఫిర్ ఉన్హీసే సవాల్ కర్తాహై 3

*   *   *   *

లాఖోఁహై తేరీ దీద్‌కే ముష్తాఖ్ మగర్ హమ్
నాచార్ తుఝే జీసె భులానేమె లగేహైం 4

*   *   *   *

హై మష్కె-సుఖుఽ జారీ, చక్కీ-కి మషఖత్‌భీ
ఇక్ తుర్ఫా తమాషాహై హస్రత్‌కీ తబీయత్‌భి 5

*   *   *   *

---

1. తెరచాటునుండి ఆమె మెఱపువలె దృగ్గోచరమయ్యెను. దిదృక్షువులు చూచుటకై ఇంకను ఉబలాటపడిరి.

2. పైకి జూడ ఆమె మా మీద కోపించి యున్నది. కాని మా యోగక్షేమము లరయుచునే ఉన్నది.

3. ఉద్విగ్న హృదయపు బేలతనము చూడుడు. మఱల ఆమెలోనే వాంఛ ప్రకటించుచున్నది.

4. లక్షల కొలది జనులు నిన్ను చూడ వాంఛించి యున్నారు. కాని మేము విధిలేక నిన్ను మఱవ జూచుచున్నాము.

5. కావ్య రచనాభ్యాసముతోపాటు తిరుగలి విసరు పరిశ్రమయు సాగుచున్నది. హస్రత్ స్వభావము వింతయైనది. ఈ పద్యము చెఱసాలలో చెప్పినది. (నోటు)

స్థలాభావము వలన స్మరింపలేక వదలిన కవుల సంఖ్యయు అల్పము కాదు. నేడు ఈ లోకమున లేనివారిలో "ఇస్మాయిల్" మీరఠీ, "ముహసిన్" కాకోర్వీ, "రియాజ్" ఖైరాబాదీ, మోలానా మొహమ్మదలీ "జోహర్", "జలీల్" మానిక్ పూరీ, "అజాద్" అన్సారీ, "సాయిల్" దహిల్వీ మొదలగువారిని గుఱించి వ్రాయ వలసియుండెను. కాని వీలుకాలేదు. ఇట్లే జీవితులగువారిలో "అఖ్తర్" హైదరాబాదీ, "దిల్" షాహజహాన్‌పూరీ, "నూహ్" నారవీ, "బేఖుద్" దహిల్వీ, "వహషత్" కలకత్తవీ, మఱియు "అఫ్సర్" మీరఠీ మొదలగు వారిని గుఱించి కొంత కొంత వ్రాయవలసి యుండెను. కాని సంభవము కాలేదు. వీరిని గుఱించి తెలిసికో దలచిన వారు వీరి సంగ్రహములను సంపాదింపగలరు.

ఈ యుగమున బహుముఖ చైతన్యము ప్రకటమయినది. కాని హాలీ, షిబ్లీ, అక్బర్, సురూర్, చక్బస్త్ మఱియు ఇక్బాలులు స్థాపించిన సంప్రదాయములను అనుకరించుచున్నవారే. ఇప్పుడు చాల పురోగమించి తమ కవితలచే క్రాంతి కలిగించుటయే తమ సామాజిక కర్తవ్యమని భావించుచున్నారు. వారిని గూర్చి చివరి అధ్యాయమున వ్రాయబడును.



## పదవ అధ్యాయము

# నవ జాగృతి మఱియు నవ్య సాహిత్యము

### గద్యము :—

వర్తమాన యుగమును గద్యయుగ మనవచ్చును. గద్యము జీవిత శక్తిని సంఘర్షణమును సతార్కికముగా ఉల్లేఖించును. గద్యము భావరహితము కాదు. విచారముల పరస్పర సంఘర్షణవలన అది జన్మించును. గద్యము ద్వారమున జీవనోద్దేశ్యముల వర్ణన స్పష్టముగా చేయవచ్చును. అట్లగుట భారతదేశ జీవనము ఒక క్రొత్త మూసలో పడుచున్నపుడే ఉర్దూ గద్యము ఉన్నతిచెందినది. ఆ పరివర్తనను గూర్చి వెనుకటి అధ్యాయమున తెలుపబడినది. కనుక దానిని మఱల తెల్పుట అనవసరము. కాని ఈ అధ్యాయమును చదువునప్పుడు, భారతదేశములోని వివిధ వర్గముల ముందు వివిధ పరిస్థితులను నిలిపి, విచారములను క్రొత్త త్రోవ పట్టించిన సమస్యలను విస్మరింపగూడదు. దరిదాపు విప్లవకాలమువఱకు గల గద్యరచయితలను వారి రచనలను గూర్చి ఏడవ భాగమున సంక్షేపముగ వ్రాయనైనది. ఉన్నత వైజ్ఞానిక విషయములు లేక, గాంభీర్యము లేక నీరసమైయున్న ఉర్దూ గద్యమును తమ శక్తి వంతములగు రచనలచే పరిపుష్టము చేసి, ఉర్దూ సాహిత్యపు స్వర్ణయుగమును అవతరింప జేసిన రచయితలను గుఱించి ఈ అధ్యాయమున వ్రాయబడును. ఈ యుగమును సాధారణముగా సర్ సయ్యద్ యుగ మందురు. ఏలయన అతని సంపర్కమున నున్న మహారచయింత లందఱును అతనిచే ప్రభావితులైరి. అతనికి దూరమున నున్న వారును అతడొనర్చు ఆందోళనమును ఆమోదించియో, విరోధించియో అతని ప్రభావమును అవచేతన రూపమున స్వీకరించిరి.

సయ్యద్ అహ్మద్ ఖాఁ : (క్రీ. శ. 1817 – 1898) సయ్యద్ అహమద్ ఖాఁ దిల్లీలో జన్మించెను. అతని పూర్వీకులు దిల్లీ దర్బారునందు చిరకాలము ఉన్నత పదవులలో ఉండిరి. అతని తల్లి వంక వారు ప్రసిద్ధ విద్వాంసులు. అతని మాతామహుడు గొప్ప గణితశాస్త్రజ్ఞుడు – జ్యోతిష వేత్త. తల్లివంక వారును తండ్రివంక వారును దిల్లీ దర్బారులోను, ఈస్టిండియా కంపినీలోను మాన్యతనందినవారు. సర్

సయ్యద్ తల్లి సద్గుణవతి. స్వతంత్ర భావములు గల మహిళ. ఆమె పర్యవేక్షణ లోనే అతని ప్రాథమిక విద్యాభ్యాసము జరిగెను. అతడు దిల్లీలోని గొప్ప గొప్ప విద్వాంసుల సన్నిధిలో సమస్త విద్యలందు చక్కని శిక్షణ పొందెను. కవుల సహ వాసమున మెలగెను. మత గురువుల సమావేశములలో పాల్గొనెను. అతడు యౌవనము విలాసములతో గడపెను. కాని కొలది కాలముననే అతని ప్రవర్తన మారెను. గంభీరము, ఆలోచనాత్మకము అగు ధార్మిక జీవనమును అవలంబించెను. క్రీ. శ. 1838 ప్రాంతమున కంపెనీ ఉద్యోగమున చేరెను. క్రీ. శ. 1841 లో మున్సిపు (మేజస్ట్రీటు) పదవి పొందెను. క్రీ. శ. 1842 లో దిల్లీ అంతిమ చక్రవర్తి "జఫర్" అతని కెన్నియో బిరుదులు ప్రదానము చేసెను. క్రీ. శ. 1855 వ సంవత్సరమున "సదరె-అమీర్" పదవిపై "బిజనోర్" వెళ్ళెను. అచటనే అతని యశస్కాలము మొదలయ్యెను. అంతకుముందే అతడు సుమారు పదొకండు పుస్తకములు రచించెను. అయినను అప్పటికి సాహిత్య వేత్తలకు అతడు రచయితగా పరిచితుడు కాడు. సర్ సయ్యద్ బిజనోర్‌లో ఉండగనే విప్లవము జరిగెను. ఆ విప్లవమున అతడు చాల పాటుపడెను. ఆంగ్లేయోద్యోగులను రక్షించుటయే కాక ఆపదపాలైన ప్రజల కెందఱకో సహాయపడెను. విద్రోహులగు సిపాయీలు అతనిని చంపివైవ జూచిరి. కాని అతడెట్లో తప్పించుకొనెను. దిల్లీచేరి తన ఇల్లు నష్టమై యుండుట చూచెను. అయినను ధైర్యము వీడక ఆంగ్లేయులకును, భారతీయులకును 'రాజీ' కుదుర్చుటకై ప్రయత్నించెను. క్రీ. శ. 1858 వ సంవత్సరమున "సదరుస్సుదూర్" పదవిపై మురాదాబాదకు వెళ్ళెను. అచట అనేక గ్రంథములు వ్రాసెను. తరువాత "గాజీపూర్" వెళ్ళెను. అచట "సాయింటిఫిక్-సొసాయిటీ" స్థాపించెను. క్రీ. శ. 1866 లో అలీఘర్ చేరెను. సొసాయిటీని వెంటగొనియే వెళ్ళెను. అచట అనేక ఆంగ్ల గ్రంథములు అనువదింపజేసెను. క్రీ. శ. 1866 లోనే "బ్రిటిష్-ఇండియన్-అసోసియేషన్" స్థాపించెను. ఆంగ్లులనుండి మైత్రివలన అధికారములు పొందుటకై ఆ సంస్థ ఉద్దేశింపబడినది. అప్పుడే అలీఘర్ నుండి ఒక పత్రిక నెల కొల్పెను. అది ఉర్దూ సాహిత్యమున చాల పేర్గాంచిన పత్రిక. క్రీ. శ. 1867 లో ఒక ఉర్దూ విశ్వ విద్యాలయము స్థాపించు ఉద్దేశ్యము ప్రభుత్వము ముందు వెల్లడించెను. కాని ఫలితము కలుగలేదు. ఆ సంవత్సరమే 'హోమ్యోపతీ' చికిత్సను ప్రచారముచేయు ఉద్యమము లేవదీసెను. ఆ కాలముననే బనారసులో హిందీ ఉర్దూ వివాదము ప్రారంభమయ్యెను. దౌర్భాగ్యవశమున అది నేటికిని సాగుచున్నది.

సర్ సయ్యద్ ఉర్దూ పక్షమువహించి చాల వ్రాసెను. క్రీ. శ. 1869 లో తన కుమారునితో లండను వెళ్ళెను. అచట ఐరోపాలోని విద్యా ప్రణాళికను బాగుగా పరిశీలించి అట్టి కాలేజీ ఒకటి స్థాపించవలెనను ఉద్దేశముతో తిరిగివచ్చెను. క్రీ. శ. 1870 లో అతడు సుప్రసిద్ధ పత్రిక "తహజీబుల్ - అఖ్లాక్" ప్రారంభించెను. అది ఉర్దూలోని నవీన గద్యశైలికి మొదటి నమోనా. క్రీ. శ. 1875 సం॥న సర్ సయ్యద్ అలీఘర్‌లో ఒక విద్యాలయము స్థాపించెను. క్రీ. శ. 1878 వ సం॥న అందు కాలేజీ తరగతులు తెరువబడెను. క్రీ. శ. 1883 వ సం॥ నుండి ఈ కాలేజీలో సమస్త ప్రకారముల ఉన్నత విద్య బోధింపబడుచుండెను. ఈ కాలముననే అతడు వైస్రాయి కౌన్సిల్‌లో సభ్యుడుగా ఎన్నుకోబడెను. క్రీ.శ. 1886 లో "మొహమ్మడన్-ఎడ్యుకేషనల్ కాన్ఫరన్స్" నెలకొల్పెను. సర్ సయ్యద్ ముసల్మానులు కాంగ్రెసులో చేరుట ఇష్టపడని వాడు. అతడు ప్రభుభక్తి కల వ్యక్తులను, సంస్థలను మాత్రమే ఆదరించుచుండెను. ముసల్మానులు విప్లవములోనే నష్టపడినవారు కనుక మఱల వారికి ఏదేని ఆపద సంభవించినచో వారు పూర్తిగా నశించిపోదురని అతడు అభిప్రాయ పడు చుండెను. మొదట అతడు హిందూ ముసల్మానులు ఏక రాష్ట్రీయులనియు, హిందూస్థాన నివాసులందఱును హిందువులనబడ వలయుననియు భావించుచుండెను. హిందూస్థానీయులకు ఉన్నత పదవులు లభించవలయుననియు, వారిలోను ఆంగ్లేయుల లోను అన్నివిధముల సమానత ఉండవలయుననియు వాదించుచుండెను. కాని రాను రాను ఈ భావములు మాఱినవి. సర్ సయ్యద్ బహు పరిశ్రమతో కూడిన జీవితము గడపి క్రీ. శ. 1898 వ సంవత్సరమున మరణించెను.

సర్ సయ్యద్ ఈ యుగమున మహా పురుషుడు. అతడు భారతీయ జీవన మును, ముఖ్యముగా ముసల్మానుల జీవనమును అధికముగా ప్రభావితముచేసెను. అతని ప్రభావమును పూర్తిగా వివరించి చెప్పుటకు ఇది అదనుకాదు. ఆంగ్లేయుల మైత్రి ద్వారమున భారతదేశమును పురోగమింపజేయ దలచెను. ఆంగ్ల శిక్షణను, ఆంగ్ల సభ్యతను ఆశ్రయించనిదే భారతదేశము పురోభివృద్ధి చెందగలదని అతడొక క్షణమైనను ఆలోచించువాడు కాడు. అతని అట్టి ఆలోచనల వలన ఆనాడు జీవితమున ప్రవేశించుచున్న నవజాగృతికి లాభమును కలిగెను. నష్టమును కలిగెను. అతడేపని చేసినను సంస్కార బుద్ధితోనే చేసెను. సర్ సయ్యద్ నిర్భీకుడు. చైతన్యవంతుడు. అలసత నెఱుగని సంస్కర్త. విద్యావంతుడు. కార్యశూరుడు. అతని కార్య రంగము లను తిలకింతుమేని అతడు ఒకడే అనేకులు చేయవలసిన పరిశ్రమ చేయగలవాడని

తెలియును. అతడు జీవించినంత కాలము వ్యతిరేకించువారికి లొంగలేదు. మరణించిన తరువాత పలువురు అతని గుణములను దోషములను ప్రచురించిరి.

సర్ సయ్యద్ చిన్నవి పెద్దవి ముప్పది గ్రంథములు వ్రాసెను. ఉపన్యాసములు, ఉత్తరములు మఱియు వ్యాసముల సంగ్రహములు వేరే. మొట్టమొదట అత డన్నియు మత సంబంధములగు రచనలే చేసెను. మొదటి గొప్ప రచన, "ఆసారు – స్సనాదీద్" అనునది. అందు దిల్లీలోని చారిత్రక భవనములు, వీధులు మఱియు ప్రసిద్ధ వ్యక్తుల గూర్చి పరిశోధనాత్మకములగు విషయము లనేకము పొందుపఱచెను. అంతఱ కెవరును గ్రహింపని చారిత్రకాంశముల నెన్నిటినో పరిశ్రమ చేసి సేకరించి వ్రాసెను. ఐరోపీయ భాషలలోను దాని అనువాదము చేయబడినది. జిల్లా బిజనోర్ చరిత్ర, బిజనోర్‌లో విప్లవము నాటి పరిస్థితులు, విప్లవ కారణములు అను పుస్తకములును "లాయల్ మొహమ్మదన్స్ – ఆఫ్ – ఇండియా" అను పుస్తకమును అయిదేండ్ల కాలములోనే రచింపబడినవి. తరువాత అతడు బైబిల్ వ్యాఖ్యానమును, ఖురాను వివరణమును వ్రాసెను. ఆ దినములలో అతడు వ్రాసిన గ్రంథములు, వ్యాసములు అన్నియు ముసల్మానులకును, క్రైస్తవులకును సఖ్య సంబంధములు కలిగించుటకు ఉద్దేశింపబడినవే. విప్లవ కాలమున ముసల్మానులకు ఆపాదింపబడిన కళంకమును తొలగించుకొనుటకై అతడు ఈ మార్గమును అవలంబించెను. ఇది అతని రాజకీయ దృక్పథములోని లోపము.

అతని సర్వప్రసిద్ధ రచన "ఖుతుబాతె–అహమదియా" అనునది. ఈ గ్రంథమున క్రైస్తవ రచయితలు ముసల్మానుల పైగంబరులపై ఆరోపించిన నేరములకు సతార్కికములగు సమాధానములు చెప్పబడినవి. దాని ఆంగ్లానువాదము కూడ ప్రకాశితమైనది. సర్ సయ్యద్ ఇట్లే ఇస్లాము మత విశిష్టతను తెలుపు అనేక గ్రంథములు వ్రాసెను.

సాహిత్యమున వ్యాసరచనకు జన్మదాత సర్ సయ్యదే. అతడు స్వంత పత్రిక యగు "తహజీబుల్–అఖ్లాఖ్" లో ప్రచురించిన వ్యాసములు ఆద్యములే కాక శ్రేష్ఠమైనవి. అతని ఆంగ్లభాషా జ్ఞానము అత్యల్పము. అయినను మంచి మంచి ఆంగ్ల వ్యాసములను చూచి తన పత్రికను ఆ శైలిలో నడపుటకు ప్రయత్నించెను. ఈ వ్యాసములలో ఆనాటి సమస్త సమస్యలు చర్చింపబడినవి. ఒకచోట వాదవివాదములు, ఒకచోట వ్యంగ్యము, ఇంకొకచోట ఆధ్యాత్మికములగు ప్రశ్నలకు వైజ్ఞానిక సిద్ధాంతముల

ద్వారమున సమాధానములు కలవు. ఈ వ్యాసముల వలన సర్ సయ్యద్ గొప్ప తనము బోధపడును.

క్రీ. శ. 1837 నాటికి అనగా సర్ సయ్యద్ రచనలు ప్రారంభించు నప్పటికి ఉర్దూ గద్యమున పూర్వశైలియే ప్రచలితమైయుండెను. కనుక అతడు తన మొదటి పుస్తకమగు "ఆసారు-స్సనాదీద్"ను ఆ శైలిలోనే వ్రాసెను. కాని దానిని రెండవ సంస్కరణమున నూత్నశైలిలో మార్చి వ్రాసెను. సాధారణముగా అతనికి తన ఉద్దేశ్యములను ప్రకటించుట యందే శ్రద్ధకాని బాషాసౌందర్యముపట్ల లేదు. ఉద్దేశ్యములను ప్రకటించుటలోను అతడు ఉత్సాహముగా హృదయ గత భావములను వివరించువాడు కనుక, అతని గద్యరచన గంభీరమై ప్రతిభావంతమై ఉండును. సర్ సయ్యద్ ఆలోచనల వలన భారతదేశమునకు అధిక లాభము కలుగకున్నను అతని రచనల వలన ఉర్దూసాహిత్యమునకు విశేషలాభము కలిగినదనియే చెప్పవచ్చును.

మౌలానా మోహమ్మద్ హుస్సేన్ 'ఆజాద్' ఒక మహావిద్వాంసుడును మత గురువును అగు మొహమ్మద్ బాఖిర్ కొడుకు. అతడు క్రీ. శ. 1833 వ సంవత్సరమున దిల్లీలో జన్మించెను. అతడు జన్మించిన మూడేండ్లలోనే అతని తండ్రి దిల్లీ నుండి మొదటి ఉర్దూ ప్రతిక తీసెను - "ఆజాద్" అరబీ ఫారసీలలో ఉన్నతవిద్య పొంది కవిత్వము నేర్చుకొనుటకై "జోఖ్" శిష్యత్వము చేసెను. అతడు దిల్లీ కాలేజీలోకూడ విద్యనేర్చెను. విప్లవమున ఆజాద్ తండ్రి ఆంగ్లేయులచేత మరణించెను. ఇల్లు వాకిలి నష్టపడెను. తన గురువుగారగు 'జోఖ్' హస్త లిఖిత కావ్యసంగ్రహమును చేతగొని దిల్లీని విడిచి జీవనోపాధికై లఖ్నో మఱియు హైదరాబాదలకు వెళ్ళెను. క్రీ. శ. 1864 లో లాహోర్ చేరి శిక్షావిభాగమున నెలకు పదునేను రూపాయల వేతనముపై ఉద్యోగియయ్యెను. అచట పాఠ్య గ్రంథములు వ్రాసి పేరొందెను. శిక్షావిభాగములో పనిచేయు ఆంగ్లేయులును భారతీయులును అతని విజ్ఞతవలన, అతని రచనల వలన చాల ప్రభావితులైరి. అతడు 'కాబూలు' మఱియు 'ఈరాను' దేశముల యాత్రచేసి వర్తమాన ఫారసీ భాషను అధ్యయనము చేసెను. ఆంగ్లేయుల అనుమతితో పంజాబులో 'అంజుమనె-పంజాబ్' ఒక సంస్థను స్థాపించెను. ఆ సంస్థలో ఉర్దూలోని నూతన కావ్యములు కొన్ని జన్మించెను. 'ఆజాద్' అనేక పత్రికలకు సంపాదకుడై క్రమక్రమముగా ఉర్దూ సాహిత్య రత్నములలో ఒకడుగా ఖ్యాతిగాంచెను. గవర్నమెంటు కాలేజి లాహోరులో అరబీల ప్రొఫెసరుగా నియుక్తుడయ్యెను కాని, ఆ పదవిపై

చిరకాలము నిలువ లేకపోయెను. క్రీ. శ. 1887 లో అతనికి "షమ్సు-ఉలెమా" (విద్వాదాదిత్యుడు) అను ఉపాధి లభించెను. క్రీ. శ. 1888 లో అతకి మనశ్చాంచల్యము కలిగెను. అది ఆమరణాంతము నిలిచెను. ఆ ఉన్మాదావస్థలో అతడు అనేక గ్రంథములు ఆధ్యాత్మిక విషయప్రధానములైనవి వ్రాసెను. కాని అందలి అధికభాగము అర్థముకాదు. క్రీ. శ. 1910 వ సంవత్సరమున లాహోరులోనే అతడు మరణించెను.

'ఆజాద్' రచనలు అనేకములు. వానిలో "ఆబె-హయాత్", "దర్బారె-అక్బరీ." "నైరంగే-ఖయాల్" మఱియు "సుఖన్-దానె-ఫారసీ" అనునవి ప్రసిద్ధములు-"అబె-హయాత్" మొదటి ఉర్దూ సాహిత్యచరిత్ర. అందు కవి జీవితములు పరిశోధనాత్మకముగా చిత్రింపబడినవి. సామాజికమగు భూమికలో భాషోత్పత్తి మఱియు సాహిత్యాభివృద్ధి వర్ణింపబడినవి. పూర్వకవులు కావ్యరచన చేసిన వాతావరణము మనోహరముగా ప్రదర్శింపబడినది. చాలమంది విమర్శకులు "ఆజాద్" అభిప్రాయములను తఱచుగా వ్యతిరేకింతురు. సమయము గడచిన కొలది, ప్రాతపుస్తకములు లభించిన కొలది అతని అభిప్రాయములు సరి అయినవే అని తేలుచున్నది. "ఆబె-హయాత్" వలన అతని సాహిత్యవిమర్శనాపాటవము తేటపడును. "దర్బారె-అక్బరీ"అక్బరు పాదుషా విచిత్రజీవితకథ. అందుఆనాటి సభ్యతసజీవముగా గోచరించును. ఆ సభ్యత హిందూ ముస్లిమ్ సమైక్యతకు నిదర్శనము - "నైరంగె-ఖయాల్" అను గ్రంథమున మొట్టమొదట ఆంగ్లేయుల 'అలీగరీ' (Allegori) ని ఉర్దూలో ప్రవేశపెట్టు ప్రయత్నము జరిగినది. ఈ గ్రంథము అతని రచనా సామర్థ్యమునకు నిదర్శనము. ఆజాద్ గొప్ప భాషాతత్త్వవేత్త. అతడు తొలుదొల్త ఉర్దూ శబ్దముల సంస్కృతమూలములను ఫారసీ మూలములను గుర్తించి వ్రాసెను. అతడే నూత్న ఫక్కీలో నాటకమును వ్రాసెను. కాని అది అసమగ్రము.

ఆజాద్ తన జీవితము నంతటిని విద్యార్థివలె సదాభ్యాసమున గడపెను. అతడు సర్ సయ్యద్ లేవదీసిన ఆందోళనకు సంబంధించిన వాడు కాడు. కాని నూత్నవిద్యవలన జీవితరంగము లన్నిట ప్రకాశించుచున్న నవ్యతను ప్రచారము చేసెను. ఎట్టి విమర్శకులైనను "ఆజాద్" వచన రచనను ప్రశంసింపక తప్పదు. ఏలయన అతని రచనలోని ఆవేగము, ప్రవాహము, సౌందర్యము, చమత్కృతి, భావప్రకటనాపద్ధతి ఇంకెచటను కన్పింపదు. బహుభాషలు తెలిసినవాడు కనుక హిందీశబ్దములను ఉచిత రీతి ప్రయోగించెను. అతని శైలికృతముకాదు. అతని

శైలికృతకముకాదు. అతని భావము లెట్టివైనను ఆ శైలిలో రాణించినవి. అతని శైలిలో అలంకారయుతమగు సారళ్యము, క్రొత్తందనము మఱియు సారస్యము కలవు. ఆ కాలమున ఆంగ్లశబ్దములను ప్రయోగించు వ్యామోహము విరివిగా ఉండెను. కాని అజాద్ ఆ త్రోవ త్రొక్కలేదు. శబ్దజాలము అతనికి ఇంద్రజాలికునకువలె వశవర్తిని – మెట్టుకు "ఆజాద్" ఉర్దూలోని ఉద్దండ రచయితలలో ఒకడు. విప్లవానంతరము భారతదేశమున ఉద్భవించిన నవజాగృతికి ప్రతినిధి.

ఖ్వాజా అల్తాఫ్‌హుస్సేన్"హాలీ"(1836–1914)జీవితచరిత్ర వెనుకటి ఆధ్యాయములోను వ్రాయబడినది. అతడు నూతన యుగమున ఎంతటి కవియో అంతటి గద్య రచయిత. ఏబదేండ్లకాలమున సమకూడిన ఉర్దూగద్యసాహిత్యమున"హాలీ"పాలు అధికము. అతడు క్రీ.శ. 1867 ప్రాంతమునుండి గద్యరచనప్రారంభించెను. మొదటిపుస్తకము మత సంబంధమైనది. తరువాత వ్రాసిన కొన్ని రచనలు అంత గొప్పవికావు. క్రీ. శ. 1874 లో స్త్రీ విద్యనుగూర్చి "మజాలిసున్నిసా" అను పుస్తకము వ్రాసెను. అది చాల మెప్పువడసెను. అతని ప్రఖ్యాత రచనలలో మొదటిదగు "హయాతె–సాదీ" క్రీ. శ. 1882 లో వ్రాయబడెను. అందు పారసీ కవులలో సర్వశ్రేష్ఠుడగు "సాదీ" జీవితమును రచనలను గూర్చి సమాలోచన చేయబడెను. "హాలీ" తన నవ్యకవిత సంగ్రహమునకు ప్రస్తావన వ్రాయ ప్రారంభించెను. అది పెఱిగిపెఱిగి కొన్ని వందల పుటల వఱకు సాగి గొప్ప పరిశోధనాత్మకమైన రచనగా పేరొంది పలుసార్లు ప్రత్యేక పుస్తకరూపమున ప్రకాశితమైనది. దానిపేరు, ''మొఖద్దమా–షేరొ–షాయిరీ". ఉర్దూ సాహిత్యమున దానికి ఆంగ్లభాషలో 'కోల్రిడ్జ్' మఱియు 'వర్డ్సువర్త్' ల రచనలకు గల స్థానము కలదు. ఉర్దూ కవితలోని గుణదోషములను శాస్త్రీయముగా విమర్శించిన మొదటి గ్రంథమదియే. 'హాలీ' సామాజిక, నైతిక సంస్కరణ చేయదలచిన వాడు. కనుక ఉర్దూ కవితలోని గుణములు అల్పముగా దోషములు అధికముగా ఎత్తి చూపినాడు. అయినను ఉర్దూ కవితయొక్క విశేషములను గ్రహింపదలచిన వారికి ఆ పుస్తకము చాలతోడ్పడగలదు. 'హాలీ' రచించిన మూడవ సుప్రసిద్ధ గ్రంథము "యాద్‌గారె–గాలిబ్" అనునది. అందు అతడు మహాకవి గాలిబ్ జీవితమును అతని కవిత్వమును సమీక్షించినాడు. ఉర్దూ సాహిత్యమున ఉద్గ్రంథమది. గాలిబ్‌ను గుఱించి ఎన్నిమో గ్రంథములు వ్రాయబడినవి. కాని అన్నిటిలో నేటికిని శ్రేష్ఠమైన గ్రంథ మదియే. సర్ సయ్యద్ మరణించిన కొన్నినాళ్ళ తరువాత "హాలీ" అతని జీవిత చరిత్రమును "హయాతె–జావీద్"

అను పేర వ్రాసెను. అతని వ్యాసములును ఉత్తరములును అనేక సంగ్రహముల రూపమున ప్రకాశితములైనవి.

"హాలీ" కూడ సర్ సయ్యద్‌వంటి రాజకీయాభిప్రాయములు కలవాడేకాని అంతకంటె ప్రగతిశీలుడు. అతడు నిరాడంబరమగు సరళ భాషలో పరిస్థితులను గుర్తించి తదనుకూలముగా జీవితము గడపవలసినదిగా ప్రజలకు ప్రబోధించెను. అతడును పాశ్చాత్య సభ్యతలోని జ్ఞానవిజ్ఞానములే భారతదేశమును పురోగమింపజేయ గలవని విశ్వసించెను. కాని సర్‌సయ్యద్‌వలె మతమును, ఆచారవ్యవహారములను ఆంగ్ల సభ్యతకు అనుకూలముగా మార్చుటకై ఎన్నడును ఆలోచించలేదు. అతని హృదయమునను భారతీయులు, ముఖ్యముగా ముసల్మానులు పొందుచున్న పతనదశ పట్ల బాధ కలుగుచుండెను. కాని గంభీరతతోనే వారిని ఆ ఊబినుండి పైకెత్తుటకై ప్రయత్నించుచుండెను. ఇట్టి ఆలోచలతోనే అతడు కవితలోను, జీవన చరిత్ర రచనలోను భాషా సమీక్షలోను నూత్నమార్గములు అన్వేషించెను. అతడు ప్రథమ శ్రేణికి చెందిన జీవిత చరిత్రకారుడు. ప్రప్రథమ కావ్యతత్త్వ విమర్శకుడు. అతని జీవితములోని సారళ్యము, అమాయకత అతని రచనలలోను ద్యోతకమగును. అతడు తాను సత్యమని నమ్మిన విషయమును దృఢ విశ్వాసముతో ఇతరుల మనస్సును నొప్పించకుండ వ్రాయువాడు. కనుక అతని రచనలు వాస్తవిక జీవన సమస్యలకు సన్నిహితములైనవి. అతని భాష అత్యంత సరళము. ఉర్దూ నేర్చికొనుటకై హిందీ మఱియు ప్రాకృత భాషలను నేర్చుట అవసరమని అతడు భావించెను. తన రచనలలో కొన్ని ఆంగ్ల శబ్దములను అనుచితముగా ప్రయోగించెను. అవి నేడు బాగనిపించవు. నైతిక సంస్కరణాభిప్రాయముల వలనకే అతని దృక్పథము పరిమితమైనది కనుక అందందు అతని భావములు అవాస్తవికములగు ననుటలో సందేహములేదు. అయినను సాధారణముగా అతని అభిప్రాయములు హెచ్చుతచ్చులు లేక యధార్థ వాదమునకు సమీపములై యుండును. ఉర్దూలోని నవ్యసాహిత్యమును బాగుగా గ్రహించుటకై "హాలీ" గద్య పద్య రచనలను పరిశీలనాత్మకముగా అధ్యయనము చేయుట అత్యంతావసరము. అతడు ఒకవైపు భవిష్యన్నిర్మాణముపై దృష్టినిలిపి రెండవ వైపు పూర్వసంప్రదాయములతో పూర్తిగా సంబంధము త్రెంచుకొనలేక క్రొత్త ప్రాతల మేలు కలయికకు కారణభూతుడయ్యెను.

డా. నజీర్ అహమద్ (1836–1912) బిజనోర్‌లో జన్మించెను. అరబీ ఫారసీ భాషల ప్రారంభిక విద్య అచటనే పొంది ఆపైన దిల్లీకి వెళ్ళెను. అచట

అతి దీనావస్థలో మస్జిదునందు విద్య నేర్చెను. ఒకసారి ఢిల్లీ కాలేజీలో ఏదో ఉత్సవము జరుగుచుండగా అచటికివెళ్ళి ఎట్లో ప్రిన్సిపాలును చూడగల్గెను. ఆంగ్లేయుడగు ఆ ప్రిన్సిపాలు అరబీ భాషా సాహిత్యముల గూర్చి అతనిని కొన్ని ప్రశ్నలడిగి అతని భాషా జ్ఞానమునకు ముగ్ధుడై కాలేజీలో చేర్చికొనెను. నజీర్ అహమద్ ఆ కాలేజీలోనే నిజమైన విద్యను, సహనశీలతను, భావస్వాతంత్ర్యమును, రాజభక్తిని నేర్చికొనినట్లు వ్రాసెను. ఎనిమిది సంవత్సరముల తరువాత కాలేజీ విడిచి ఉద్యోగ వశమున పలుచోట్లు తిరిగెను. విప్లవానంతరము అతడు "డిప్యూటీ" ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్‌గా నియుక్తుడయ్యెను. స్వప్రయత్నమున ఆంగ్ల భాష నేర్చి కొలది కాలముననే "డిప్యుటీ కలెక్ట" రయ్యెను. అతని అనుభవమును విజ్ఞానమును గూర్చి వినిన హైదరాబాద రాష్ట్రము అతనిని క్రీ. శ. 1877 లో నెలకు (1,700) మాసిక వేతనముపై ఆహ్వానించెను. అటనుండి క్రీ. శ. 1883 వ సంవత్సరమున ఉపకార వేతనము పొంది ఢిల్లీకి తిరిగి వెళ్ళెను. శేషజీవితమును గ్రంథరచనలో గడపెను. ఎడింబరా విశ్వవిద్యాలయము మఱియు పంజాబ్ విశ్వవిద్యాలయము అతనికి ఎల్. ఎల్. డి. ఉపాధిని మఱియు డి. ఓ. యల్. ఉపాధిని ప్రధానము చేసెను.

డా. నజీర్ అహమద్ గొప్ప రచయిత – గొప్ప వక్త. అతని స్వరము దృఢ గంభీరము. గొప్ప గొప్ప సభలలో అతడు మాటలాడునప్పుడు నిశ్శబ్దత ఆవరించుచుండెడిది. అతడు హాస్యప్రియుడు. వినోదముల వలన చిట్టి కథల వలన సభలోని వారిని ఆకర్షించుచుండెను. అతని ఉపన్యాస సంగ్రహము ప్రకాశితమైనది. దాని వలన అతనికి గల విజ్ఞానము విశదమగును. అతడు సర్ సయ్యద్ అభిప్రాయములను చాల వఱకు సమ్మతించి అతని విద్యా యోజనకు ప్రచారకుడుగా పని చేసెను. కాని మత విషయములలో మాత్రము వ్యతిరేకించెను. ప్రభుత్వోద్యోగి అగుట వలన ఎల్లప్పుడును ఆంగ్ల ప్రభుత్వమును ప్రశంసించుచు ఆంగ్లుల భాషా జ్ఞానమును, రాజనీతిని మఱియు ఔదార్యమును సదా కీర్తించుచుండెను.

అతడు అనేక గ్రంథములు వ్రాసెను. న్యాయ శాస్త్రములను అనువదించెను. అందు "ఇండియన్ పీనల్‌కోడ్" (Indian Penal Code) మఱియు "ఎవిడెన్స్ ఆక్టు" (Evidence Act) అనువాదములు అతని అనువాద శక్తికి నిదర్శనములు. అతడు ఖురానును కూడ ఉర్దూలో అనువదించెను. అతనికి అజరామర మగు కీర్తిని తెచ్చినవి కొన్ని నవలలు. ఆ నవలలు ఆపదలో నున్న మధ్య వర్గపు ముసల్మానులను గుఱించిన సంస్కార భావములే ఇతివృత్తముగా గలవి. అతని మొదటి నవల

"మెరాతుల్-ఉరూస్" అనునది క్రీ. శ. 1869 వ సంవత్సరమున వ్రాయబడెను. అతడే మొట్టమొదటి నవలా రచయిత. దాని నతడు ప్రచురించుట కొఱకు కాక తన కుమార్తె చదువుకొనుటకై వ్రాసెను. దానిని ఒక ఆంగ్లేయుడగు కలెక్టరు చూచి ప్రచురించుటకుకై ప్రోత్సాహపఱచి రచయితను గొప్పగా పురస్కరించెను. ఆ తరువాత అతడు క్రమముగా ఏడు నవలాలు వ్రాసెను. వానిలో పెక్కింటికి బహుమతులు లభించెను. "మేరాతుల్-ఉరూస్" మఱియు "బెనాతుల్-నషా" అను రెండు నవలలో బాలికలు సత్ప్రవర్తన కలవారై విద్య నేర్చి అత్తవారిండ్లలో మంచి జీవితము గడపవలయునను ప్రబోధము చేయబడినది. ఈ నవలలు బాలబాలికలు ఆసక్తితో చదువదగిన మనోహర కథల రూపమున వ్రాయబడినవి. టెక్నీకు ననుసరించి అతనిని నవలలలో లోపములు కలవు. నడుమ నడుమ మతమును నీతిని గుఱించిన ఉపన్యాసములు కలవు. పాత్రలన్నియు ఆదర్శవాదమునకు అనుగుణ మైనవి. అతని మూడవ నవల యగు "తోబత-న్నుసూహ్" (క్రీ. శ. 1877) అన్నిటికంటె ఆకర్షకమైనది. అందు నష్టప్రాయమగు దిల్లీలోని ముస్లిమ్ కుటుంబ ముల చిత్రములు కలవు. నిజమైన ధార్మిక భావములు లేనిదే జీవితము సఫలము కాదను భావమును అందులో ప్రకటింపబడినది. అతని ఇతర నవలలలో "ఇబ్నుల్-వక్త్"అనునది ప్రసిద్ధిగాంచినది. అందు ఆంగ్లేయుల ఆచార వ్యవహారములను అనుకరించు భారతీయులను అవహేళన చేయబడినది. నజీర్ అహమద్ కవి కూడ. అతని కావ్యసంగ్రహము ప్రకాశితమైనది.కాని కావ్యచరిత్రలో దానికి పేరుకలుగలేదు. అతడెంతటి విద్వాంసుడో అంతటి రచనలు చేయలేదనియు, నవలారచన అతని మహోనతకు విరుద్ధమగు సాహిత్య ప్రక్రియయే అనియు చాలమంది విమర్శకుల అభిప్రాయము. ఆనాటి మధ్య తరగతి ముసల్మానులను వ్యాకుల పఱచుచున్న సామాజిక సమస్యలను పరిష్కరించి సంస్కరించు ప్రయత్నము సర్ సయ్యద్ విద్యాక్షేత్రమునను 'హాలీ' మఱియు ఆజాదులు తమ ఉద్దండ రచనల ద్వారమునను చేయుచుండిరి. నజీర్ అహమద్ తన నవలల మూలమున ఆ పరిష్కార మార్గము లనే అన్వేషింప జేయుచుండెను. ఈ విషయమును విమర్శకులు విస్మరింతురు. అతని నవలలు పలుతడవలు ప్రకాశితము లైనవి. బహు భాషలలో అనువదింప బడినవి. అతని సంస్కార ప్రయత్నము లెంత వఱకు ఫలవంతము లైనవో దీని వలన తెలియును.

నజీర్ అహమద్ గద్యశైలి విశిష్టమైనది. దిల్లీ వ్యావహారికము, జాతీయములు మఱియు నానుళ్ళపై అతనికి అధికారముండెను. కనుక సజీవమగు భాషలో ధారాళముగా రచనలు చేసెను. అరబీ విద్వాంసు డగుట వలన అచటచట అనుచిత రీతి అరబీ శబ్దములను కూడ వాడెను. అట్లే సందర్భోచితములు కాని జాతీయములు కూడ వాడెను. అయినను అతని శైలి సుందరమైనదే. హాస్యరసముతో కూడియున్నందున అతని వాక్కులు ఆకర్షకమైనవి. తన వ్యాఖ్యానములలో అందందు ఆంగ్ల శబ్దములను కూడ సందర్భశుద్ధి లేకుండ ప్రయోగించెను. స్త్రీల సమస్యలను గూర్చి ఆలోచించుటయే కాక వారిపట్ల సానుభూతి చూపిన మొదటి ఉర్దూ రచయిత అతడే. అతడు మత సిద్ధాంతములను గూడ వైజ్ఞానిక (సైంటిఫిక్) పద్ధతిలో వ్రాయుటకు ప్రయత్నించి కఠిన సమస్యలను సరళ శైలిలో తేల్చి చెప్పెను. అతడు మొట్టమొదటి నవలా రచయితయే కాక నవయుగ సాహిత్యపు పునాదులను దృఢపఱచి భవిష్యన్మార్గములను చూపిన రచయితలలో ఒకడని నిస్సంశయముగా చెప్పవచ్చును.

సుప్రసిద్ధ రచయితయగు మౌలానా "షిబ్లీనోమానీ" (1857-1914) పైన పేర్కొనబడిన రచయితలలో వయమున పిన్నవాడు. అతడు ఆజమ్‌గఢ్‌లో జన్మించెను. అరబీ, ఫారసీ, ధర్మశాస్త్రము దర్శన శాస్త్రము, మొదలగునవి గొప్ప గొప్ప విద్వాంసుల వలన నేర్చెను. అతని తండ్రి వకీలు. కొడుకును కూడ వకీలుగా చేయదలచెను. "షిబ్లీ" వకాలతు చదివి కొంతకాలము పని చేసెను. కాని ఆ వృత్తిలో మనస్సు లగ్నము కాలేదు. తండ్రి రెండవ వివాహము చేసికొనుట వలన కుటుంబములోను అశాంతి ప్రబలెను. కనుక క్రీ. శ. 1882 లో "షిబ్లీ" అలీఘుర్ చేరి అచటి కాలేజీలో ఫారసీ భాషా ధ్యక్షుడయ్యెను. అచట అనేక రచనలు చేసెను. అతనికి అచట సర్‌సయ్యద్, మౌలానా హాలీ, మొహసినుల్ముల్కు, ప్రొఫెసర్ ఆర్నాల్డు ప్రభృతుల పరిచయము కలిగెను. అతని విజ్ఞానము విస్తృతి పొందెను. భారతదేశపు నవ్యచైతన్యమును నవనిర్మాణ దృక్పథమును అచటనే గ్రాహ్యము లయ్యెను. బహుమూల్యమగు సర్ సయ్యద్ గ్రంథాలయము నుండి లాభము పొందు అవకాశము కలిగెను. అతని ఆదేశము ననుసరించియే ఇస్లాము మహాపురుషుల జీవిత చరిత్ర వ్రాయుటకు పూనుకొనెను. షిబ్లీ తొలుత కవితలే అధికముగా వ్రాసెను. గద్యరచన ప్రారంభించిన కొలది నాళ్ళలోనే గొప్ప రచయితలో లెక్కింపబడెను. ఆర్నాల్డ్ వెంట అతడు

ఈజిప్టు, షామ్ మొదలగు దేశములలో పర్యటించి తాను వ్రాయనున్న గ్రంథములకు కావలసిన సామగ్రిని సేకరించుకొనెను. అతడు క్రొత్త ప్రాతల కూడలి. సర్‌సయ్యద్ బ్రతికియున్నంత కాలము అతని అభిప్రాయములకు సహకరించి అతని మరణానంతరము వ్యతిరేకించెను. క్రీ. శ. 1898 లో కాలేజీ ఉద్యోగము విరమించి ఆజమ్‌గఢ్ వెళ్ళి అచట "నేషనల్ స్కూల్" స్థాపించెను. కొన్ని యేండ్ల తరువాత హైదరాబాదులోని కళాసాహిత్య నిర్మాణ శాఖలో ఒక మంచి పదవి పొందెను. అచట "షిబ్లీ" అనేక గ్రంథములు వ్రాసెను. ఆ కాలముననే మతాచార్యులు కొందఱు "నదవతుల్-ఉలెమా" అను అరబీ పాఠశాల స్థాపించిరి. "షిబ్లీ" దానిపట్ల చాల అభిమానము చూపుచుండెను. కాని నవీన భావములు కల అతనిని మతాభిమానము కలవారు నిరసన భావముతో చూచుటవలన ఆ పాఠశాలతో సంబంధము త్రెంపుకోవలసి వచ్చెను.

క్రీ. శ. 1907 లో ఒక గొప్ప దుర్ఘటన సంభవించెను. ఆజమ్‌గఢ్‌లోని ఇంటిలో అతడు కూర్చుండి వ్రాసికొనుచుండగా అతని కుటుంబమునకు చెందిన ఒక స్త్రీ ఆ సమీపమున గల తుపాకిని అచటినుండి తొలగించుటకై తీసెను. అంతలో ఆ తుపాకి ప్రేలి అతని కాలొకటి పూర్తిగా చెడిపోయెను. అయినను అతనికెట్టి ఆటంకము కలుగలేదు. మరణించు వఱకు చదువుచు వ్రాయుచునే గడపెను. ఆజమ్‌గఢ్‌లోనే అతడు "దారుల్ ముసన్నఫీన్" అను ఒక సాంస్కృతిక సంస్థను స్థాపించెను. అది నేటివఱకు నడచుచున్నది. 'షిబ్లీ' 57 సంవత్సరములే జీవించెను. అతని రచనలు అనేకములు. అతడు కేవలము ధార్మికనేతయే కాక రాజకీయముల తోను ప్రగాఢ సంబంధముకలవాడు. షిబ్లీ ముస్లిమ్‌లీగును తిరస్కరించి కాంగ్రెసునే స్వాతంత్ర్య సిద్ధికై పోరాడు సంస్థగా విశ్వసించెను. అతడు నిర్భీకుడు. ప్రతిభాశాలి. తన అభిప్రాయములను గట్టిగా ప్రకటించువాడు.

పైన చెప్పబడినట్లు దర్శనములు, చరిత్ర, జీవన చరిత్ర, సాహిత్యము మొదలగు అనేక విషయములుగల అనేక గ్రంథములను షిబ్లీ రచించెను. అతని చిరకీర్తికి కారకములగు గ్రంథము లివి; "అల్మామూన్", "అల్ఫారూఖ్, "సీరతున్నబీ", "ఇల్ముల్ - కలామ్", "షేరుల్ - అజమ్", "మువాజినయే - అనీస్-వ-దబీర్". షిబ్లీ చారిత్రకదృష్టిని, అతని మతసంబంధములగు విచారములను అతని స్వమతస్థులే వ్యతిరేకించిరి. అయినను సాహిత్య దృష్టితో అతని రచన లన్నియు ఉత్కృష్టమైనవి. అతని సాహిత్యవివేచనమునందును కొన్ని దోసగులు

కలవు. ఎట్లయినను అతని సాహిత్య గౌరవము నిరాకరింపరానిది. 'షిబ్లీ' విమర్శ 'సైంటిఫిక్' పద్ధతిలో లేదు. కాని సాహిత్యమువలన కవితవలన ఆనందము పొందుటకు ఎన్నియో మార్గములు చూపించును. షిబ్లీ వ్రాసిన దార్శనిక రచనలలోను లోపములు కలవు. కాని అతనికంటె ముందు పూర్వ పశ్చిమ విద్వాంసుల ఆలోచనములను క్రోడీకరించి వానిని ముసల్మానుల దర్శన శాస్త్రదృష్టితో పరికించి వ్రాసినవారెవరును లేరు. అదియే అతని గొప్పదనము. మౌలానా 'షిబ్లీ' భాష ధారాళమైనది. సరసమైనది. సుందరమైనది. అతడు ఉర్దూయొక్క మహారచయితలలో లెక్కింపబడును. ఏలయన అతడు విజ్ఞానక్షేత్రము నందలి ప్రతి రంగమును స్పృశించెను. అతని వ్యాస సంగ్రహములును, ఉత్తరముల సంగ్రహములును చదువదగినవి. వానివలన అతని జీవిత విశేషములును అతడొనర్చిన కార్యములును తెలియును.

నవజాగృతికి సంబంధించిన ఈ యుగము ఎందఱో రచయితలను జన్మింపజేసినది. వారందఱను గూర్చి విస్తారముగా వ్రాయుట సంభవము కాదు. సాహిత్య నిర్మాణములో అధికముగా పాల్గొనిన వారిని గుఱించి వ్రాయకుండుటయు అనుచితమే. మౌలానా జకావుల్లా సుమారు నూరు పుస్తకములు వ్రాసెను. వానిలో అధికము చరిత్ర మఱియు గణితశాస్త్రమునకు సంబంధించినవి. అతడు గొప్ప విద్వాంసుడు. పేర్గాంచిన రచయిత. కాని అతని గద్యశైలిలో ఎట్టి క్రొత్తదనమును లేదు. 'మొహిసినుల్ముల్క్' చాల కొలదిగనే వ్రాసెను. అయినను అతడు వ్రాసినదంతయు ఉచ్చశ్రేణి రచన. సయ్యద్ అలీ బిల్గ్రామీ, ఫారసీ, అరబీ, సంస్కృతము, ఆంగ్లము, ఫ్రెంచి మఱియు ఇతర భాషలలో మీను మిగిలిన విద్వాంసుడు. అతడు ఫ్రెంచి భాషలోని రెండు గ్రంథములను స్వంతరచన లనుకొనునట్లు అనువదించెను. హైదరాబాదలో ఉన్నతపదవిపై నుండి ఉర్దూ సాహిత్యాభివృద్ధికై అతడు చాల రచనాత్మకమగు కృషి చేసెను. మౌలానా షిబ్లీ మిత్రుడగు మెహదీ 'ఇఫాదీ' కొన్ని వ్యాసములను, పత్రములను వ్రాసెను. అతని రచనలు ప్రభావ సహితములైనవి కమక, ఏ సాహిత్య చరిత్రలోనైనను అతని పేరు విస్మరింపబడదు. అతని శైలి సజీవము. నాసిర్ అలీ దహెల్వీ, దిల్గీర్ అక్బరాబాదీ, నాసిర్, నజీర్ మఱియు ఫిరాఖ్ అనువారుకూడ గొప్ప గద్య రచయితలలో లెక్కింపబడుదురు. సంగ్రహింపబడిన రచనలు వారివి చాల తక్కువ.

ఈ యుగమున నవలా రచన చాల అభివృద్ధి చెందినది. మోలానా నజీర్ అహమద్ నవలాలను గుఱించి ఈ వఱకే వ్రాయబడినది. అతనిని మొదటి నవలా రచయిత అందురు. కాని ఆంగ్లనవలా శైలి ననుసరించి మొట్టమొదట ఉర్దూలో వ్రాసినవారు పండిత రతన్నాథ్ "సర్షార్" మఱియు మౌలానా అబ్దుల్ హలీమ్ "షరర్" - నవల ఐరోపాలోను వర్తమాన యుగముననే జన్మించినది. భారతవర్షపు అన్య భాషల్కు దానిని అచటినుండియే గ్రహించెను. ఉర్దూలో కథలు వ్రాయబడు చుండెను, వాని వృత్తాంతము వాని వాని యుగములలో తెల్పనైనది. కాని మానవ జీవితపు యథార్థ చిత్రణముచేసిన నవలలు ఈ యుగముననే పుట్టుటకు అవకాశము కలిగినది. నజీర్ అహమద్ నవలలలో ఎన్ని లోపములున్నను, యెన్నియో గుణము లున్నవి. అప్రాకృతికములు అస్వాభావికములు అగు సన్నివేశములనుండి తప్పించు కొను ప్రయత్నము మొట్టమొదట అతని నవలలోనే జరిగినది. ఈ విధముగా ఉర్దూనవల క్రీ. శ. 1867 న ప్రారంభింపబడినది. తరువాత సర్షార్, షరర్, ఆజాద్ హుస్సేన్, మిర్జారుస్వా మొదలగు వారు ఆ పునాదిపై విశాల భవనము నిర్మించిరి.

పండిత రతన్నాథ్ సర్షార్ (1846-1902) లఖ్నోలోని ఒక కాశ్మీర పరివార మున జన్మించెను. అతడు అరబీ, ఫారసీ మఱియు ఆంగ్లభాషలలో మంచిశిక్షణ పొందెను. అతని మాతృభాష శుద్ధమగు ఉర్దూ. మొదట అతడు ఒక స్కూలులో అధ్యాపకుడయ్యెను. అచటినుండి తన రచనలను వివిధ పత్రికలకు పంపించుచుండెను. కొలదికాలము తరువాత అతడు లఖ్నోలోని ప్రసిద్ధ పత్రికయగు "అవధ్ అఖ్బార్"కు సంపాదకుడుగా నియుక్తుడయ్యెను. అందులోనే తన సుప్రసిద్ధ పుస్తకము "ఫిసానయే-ఆజాద్" ధారావాహికగా వ్రాసెను. అచటి నుండి వెళ్ళి అలహాబాద కోర్టులో అనువాదకుడయ్యెను. కాని స్వతంత్ర స్వభావుడగుటవలన అచట ఉండలేకపోయెను. క్రీ. శ. 1895 లో అతడు హైదరాబాదకు వెళ్ళెను. అచట అతనికి చాల గౌరవము కలిగెను. అత్యంతమగు అతని మద్యపానాభిలాషయే అతనిని మృత్యుద్వారమున చేర్చెను. క్రీ. శ. 1902 లో అతడు దివంగతుడయ్యెను.

'సర్షార్' మంచి కవి కూడ. లఖ్నోలోని మంచి కవులలో లెక్కింపబడు చుండెను. కాని నేడు మాత్రము గొప్పగద్యరచయిత అగుటవలననే ఉర్దూ సాహిత్య చరిత్రలో ప్రముఖస్థానము పొందియున్నాడు. నేటి ప్రజలు అతని కావ్యములతో పరిచయము కలవారు కారు. అతడు మిక్కిలి తీవ్రమైన బుద్ధికలవాడు- వ్యథాకలిత హృదయుడు. ఏదేని పనిని ఒకేసారి స్థిరచిత్తముతో చేయువాడు కాడు. కనుక

అతని రచనలలో అక్కడక్కడ విచ్ఛిన్నత గోచరించును. మద్యపానము అతిగా చేయుట వలన అతనికి ప్రతి వస్తువపై అలక్ష్యభావము కలిగెను. దీని ప్రభావము అతని జీవితముపైననే కాక అతని రచనలపైనను పడినది. అతడు వ్రాసినది అధికమే కాని అందు విలువైన భాగములు కొన్నియే. అతని రచనలలో కొన్ని అనువాదములు కలవు. స్వంత రచనలు చాలకలవు. వానిలో "ఫిసానయే-ఆజాద్", "జామే-సర్షార్", "సైరె-కోహ్‌సార్", "కామినీ", "ఖిఛడీ-దుల్హన్", "పీకహాఁ", "కుడ్‌మఝ్", అనునవి ప్రసిద్ధములు. 'అలిఫ్‌లైలా' కథలనుకూడ అనువదించెను. "డాన్‌క్విక్‌జోట్"ను "ఖుదాయీ - ఫౌజ్‌దార్" అను పేర ఉర్దూలో పరివర్తన మొనరించెను.

నిజమునకు ఫిసానయే-ఆజాద్‌కుగల విశిష్టత మఱి ఏ నవలకునులేదు. వేలకొలది పుటలుగల ఆ పుస్తకమును పఠితలు ఉత్సుకతతో ఉల్లాసముతో చదువుదురు. "సర్షార్" అవథ్ అక్బార్‌కు సంపాదకుడుగా ఉన్నకాలముననే ఈ రచన ప్రారంభించెను. ఆ నవలకు రూపురేఖలు దిద్దు విషయమున అతడంత శ్రద్ధ వహించలేదు. మఱి ఆ కథ ఐదువేల పుటలవఱను వ్యాపించగలదని ఊహించనులేదు. నవాబీ నశించినను ఒక సంప్రదాయరూపమున నిలిచియున్న ఆనాటి లఖ్నో జీవితమును చిత్రించుటకు ప్రయత్నించెను. సర్షార్ ఆ జీవితమును సమగ్రముగా ఎఱిగినవాడు. ప్రతి వర్గపు ప్రజలతో పరిచయము కలవాడు. అందఱి సంభాషణ శైలి తెలిసినవాడు. కనుక వాస్తవిక రూపమున అచ్చటి సభ్యతను చిత్రింప గల్గెను. అతడు సర్‌వైన్టిజ్ (Cervantse) వలన ప్రభావితుడు. అతని పెద్దనవల లన్నిటిలో ఆ ప్రభావము గోచరించును. "ఫిసానయే-ఆజాద్" లోని పాత్రలన్నియు కార్టూనులవంటి వికృతరూపములు. నాల్గు భాగముల వఱకు సాగదీసిన ఈ కథ కొన్ని పుటలలో వ్రాయుటకు వీలైనదే. అందలి అధికాంశము కథలోని భాగము కాకున్నను ఆవశ్యకమైనది. అనగా అది తొలగించితిమేని పుస్తకములోని చమత్కారమే లోపించును. దానిని హిందీలో సంక్షిప్త రూపమున ప్రేమచంద్ ప్రకాశింపజేసెను. కాని అందలి భాషా మాధుర్యము సాధారణమగు హిందీ శైలిలో నిలువలేదు. ఈ మాట ఏదో ఒక పుస్తకమున స్వయముగా సర్షారే అన్నాడు. "జామె-సర్షార్" మఱియు "సహరె-కోహసార్" అను నవియు చదువ దగిన గ్రంథములే. కాని వానిలోను మంచి నవలకు కావలసిన కథ లేకుండుట ఒక లోపము.

'సర్షార్' గొప్ప కళావేత్త-అనుభవజ్ఞుడు- కాని అతని రచనలోని చమత్కార మేమన తన హృదయ గతాభిప్రాయములను ఎచ్చటను వెల్లడికానీయడు. ఆ సభ్యత లోని ఏయే మౌలిక సిద్ధాంతములను అతడు అభిమానించెనో, ఏవి నశించినందువలన అతడు బాధపడకుండెనో ఆ సంగతి తెలిసికొనలేము. భాషపై అతనంతటి అధికారము కల రచయితలు అరిది.

ఈ యుగపు ప్రసిద్ధ నవలా రచయితలలో రెండవయతడు మోలానా అబ్దుల్ హలీమ్ 'షరర్' (1860-1926). అతడు లఖ్నోలో జన్మించెను. తొమ్మిదేండ్ల వయమున కలకత్తాకు వెళ్ళెను. అతని పరివారమువారు అవధ్ చివరి పాదుషా యగు "వాజిదలీషా" తో మటీయా బుర్జులో నివసించుచుండిరి. "షరర్" అచటనే అరబీ, ఫారసీ అభ్యసించెను. ఆంగ్లము చదివెను. కవిత్వము చెప్పుటకు ఉపక్రమించెను. ఇరువదేండ్ల వయమున అతడు లఖ్నోచేరి విద్యాభ్యాసమును సాగించెను. అప్పుడు "అవధ్ అఖ్బార్" పేరెన్నిక గన్నది. 'షరర్' తన సారస్వత వ్యాసములను ఆ పత్రికలోనే ప్రకటించెను. కొలది కాలముననే అతని కీర్తి దూరదూరములకు వ్యాపించెను. మొదటినుండియు అతడు ఛందోమయమైన వచనమే వ్రాయుచుండెను. అట్టి శైలి ఉర్దూలో క్రొత్తది కనుక అందఱి దృష్టిని ఆకర్షించెను. స్వల్ప కాలముననే 'షరర్' అట్టి కవిత్వమును పోలిన వచనము ధారాళముగా వ్రాయగలుగుచుండెను. సాధారణముగా ఉర్దూ రచయితలు ఆ శైలినే అవలంబించిరి. 'షరర్' కొన్ని నాళ్ళ కొఱకు హైదరాబాదకు వెళ్ళెను. అచట చాల గౌరవము పొందెను. క్రీ. శ. 1887 వ సం॥ న అతడు తన ప్రసిద్ధ పత్రిక "దిల్‌గుదాజ్" స్థాపించెను. తన నవలలను అధ్యాయముల క్రమమున అందులోనే ప్రచురింపసాగెను. ఆ పత్రిక సత్వరముగా ప్రజాభిమాన పాత్రమయ్యెను. 'షరర్' ఎన్నియో నవలలనే కాక వేలకొలది వ్యాసములను ప్రకటించుకొనెను. అతనికి ముసల్మానుల చరిత్రయందు అభిమానమధికము. అప్పుడప్పుడు చారిత్రక గ్రంథములు వ్రాసెను. క్రీ. శ. 1891 లో హైదరబాదకు వెళ్ళెను. అచటినుండి ఒక ధనవంతుని వెంట పదునేను మాసముల కొఱకు ఇంగ్లాండు దేశమునకు వెళ్ళెను. అచట ఫ్రెంచిభాష నేర్చికొనెను. క్రీ. శ. 1898 లో హైదరాబాదకు తిరిగి వచ్చి చాల సంవత్సరములు హైదరాబాద మఱియు లఖ్నోలకు ప్రయాణములు చేయుచుండెను. క్రీ. శ. 1904 వ సంవత్సరమున లఖ్నోచేరి మరణించువఱకు అచటనే నివసించెను.

మౌలానా 'షరర్' (65) సంవత్సరముల ప్రాయమున వ్రాసినన్ని రచనలు వ్రాయగలిగిన వారు చాల అరుదు. అతడు తొమ్మిది వారపత్రికలు మఱియు దిన పత్రికలు తీసెను. అందుకొన్ని కొద్దికాలమే వెలువడినవి. మఱికొన్ని చాలకాలము వెడలినవి. చిన్నవి, పెద్దవి మొత్తము (102) పుస్తకములు వ్రాసెను. అందు నవలలే అధికము. అవికాక అతని వ్యాసములు ఎనమిది భాగములలో ప్రకాశితము లైనవి. అతని వ్యాసములలో సాహిత్య, సాంస్కృతిక, సామాజిక, దార్శనిక కల్ప విషయములు చర్చింపబడినవి.

'షరర్' నవలలు చాలవఱకు ముసల్మానుల ప్రాచీన జీవితమునకు సంబంధించినవే. వానిలో ముసల్మానుల వీరత, ఉదారత మఱియు ధర్మనిష్ఠమొదలగు సద్గుణములగూర్చి అతడు ప్రచారకునివలె అప్పుడప్పుడు వ్రాయును. అతని నవలలన్నియు ఒకే రీతిలో ఒకే శైలిలో వ్రాయబడినవి. ఒక నవలలోని పాత్రలనే ఇంకొక నవలలో చేర్చినను అంతగా భేదము కలుగదనిపించును – నవయువకులకు, అనుభవహీనులగు 'రొమాంటిక్' స్వభావము కలవారికి, గాంభీర్యరహితములగు 'షరర్' నవలలు ఆనందప్రదములే అగును కాని, నవల లనగా జీవితపు మూలాదర్శములను, గొప్ప భావసంఘర్షణమును చిత్రించు సాహిత్యరూపములని భావించు వారికి మాత్రము అతని నవలలు ఆనందము కలిగింపజాలవు – అతడు గ్రహించు ఇతివృత్తము – పాత్రలు నిర్జీవమైనవి. ఉద్దేశ్యము సామాన్యము. అతని రచనలలో అన్నిటికంటె ప్రసిద్ధమైనది "ఫిర్దోసె-బరీఁ" అను నవల. అదికాక, "అయ్యామె-అరబ్", "హుధ్నకాడాకూ", "మన్సూర్-మోహనా", జవాలె-బొగ్దాద్" మొదలగు నవలలు కూడ పేరు గాంచినవే. బంకిమచంద్ర చటర్జీ బెంగాళీ భాషలో వ్రాసిన "దుర్గేశనందిని" ని ''షరర్'' ఉర్దూలో తర్జుమా చేసెను. అతడు కొన్ని నాటకములు వ్రాసెను. కాని "షహీదె-వఫా" అను నాటకము తప్ప ఇంకేదియు పేరు గాంచలేదు. అతడు కొన్ని కవితలును వ్రాసెను కాని, ప్రజలు వానిని మఱచి పోయినారు. సారాంశమేమన, షరర్ గొప్ప రచయితయే కాని అతని రచనలలో కొన్ని మాత్రమే కాలమను సానరాయిపై నిలువగలవి. అతడు లఖ్నోలోని ఒక మాననీయుడగు ప్రతిభాశాలి. బ్రదికినంతకాలము సాహిత్యప్రచారమునకు కేంద్రమన దగియుండెను.

అనాడు ఉర్దూ వార్తా పత్రిక లెన్నియో వెలువడి సాహిత్యగౌరవమునంది యుండెనని వెనుకటి అధ్యాయములో తెలుపబడినవి. క్రీ. శ. 1877 వ సంవత్సర

మున సుప్రసిద్ధ హాస్యపత్రిక."అవధ్-పంచ్"వెలువడెను. దాని మొదటి సంపాదకుడు సజ్జాద్‌హుస్సేన్. ఏ పత్రికకును లభించనంతమంది ప్రఖ్యాతరచయితలు ఆ పత్రికకు లభించిరి. "అవధ్‌పంచ్" రాజకీయముగా కూడ ప్రగతిశీలమగు పత్రిక. నవ్వు పుట్టించు మాటలలోనే ఆంగ్లప్రభుత్వపు దమననీతిని, ఆర్థిక ప్రలోభమును నిశితముగా విమర్శించుచుండెను. కాంగ్రెసుయొక్క ఆదర్శములను ఆదరించుచు రాష్ట్రీయాందోళమునకు సహకరించుచుండెను. కాని ఆ పత్రిక సాహిత్యక్షేత్రమున ఎట్టి నవ్యతను ఉచితమని భావించునవి కాదు. మౌలానా "హాలీ" నవ్యకవితాశంఖమును పూరించినంతనే "అవధ్‌పంచ్" అతని వెంటపడెను. ఆ పత్రిక ఆనాడు రాష్ట్రీయ సమైక్యతా దృష్టితో రాష్ట్రీయములు, అంతర్‌రాష్ట్రీయములు అగు సమస్యలను హాస్యరూపమున చర్చించుచుండెను. "అవధ్-పంచ్" భాష లఖ్నోలోని వ్యావహారికము. దాని రచయితలందఱును భాషావ్యవహారమున దక్షులు. ఆ పత్రిక మూలమున ఉర్దూలో హాస్యరసమయమగు సారస్వతమునకు సమకూడెను. అప్పుడే ఉర్దూలో ఈ రకపు గద్యసాహిత్యము రూపొందెనని రూఢిగా చెప్పవచ్చును. పండిత త్రిభువన్‌నాథ్ "హిజ్రా", మున్షీ జ్వాలాప్రసాద్ "బర్క్" మున్షీ అహమదలీ, 'అక్బర్' ఇలహాబాదీ, పండిత్ రతన్‌నాథ్ "సర్షార్", పండిత బ్రిజ్‌నారాయణ్ 'చక్‌బస్త్', మొదలగువారు అవధ్-పంచ్‌కై వ్రాయువారు. వారందఱును సాహిత్య ప్రపంచమున ప్రముఖస్థానము కలవారే. వారిలో కొందఱను గూర్చి వెనుకటి అధ్యాయములలో ఆ యాసందర్భములందు వ్రాయబడినది.

"అవధ్-పంచ్' సంపాదకుడు మున్షీ సజ్జాద్ హుస్సేన్ (1856-1915) లఖ్నోలో జన్మించి అచటనే విద్యనేర్చెను. ఇంటర్ మీడియెట్ దాక ఇంగ్లీషు చదువు చదివెను. సైనికులకు ఉర్దూ బోధించు పనిలో నియుక్తుడయ్యెను. కాని అతనికి ఆ పనిలో మనస్సు లగ్నము కాలేదు. క్రీ. శ. 1877 లో "అవధ్-పంచ్" పత్రిక తీసెను. కొలది కాలములోనే ఆ పత్రిక భారత దేశములోని ప్రముఖ పత్రికలలో ఒకటయ్యెను. సజ్జాద్‌హుస్సేన్ క్రీ. శ. 1887 లో కాంగ్రెసులో చేరి దాని ఆదర్శముల ప్రచారము తన పత్రిక ద్వారమున లలితమైన హాస్యముతో మేలవించి చేయసాగెను. వ్యాసములు కాక అతడు నవలలును వ్రాసెను. వానిలో "హాజీ బగ్లోల్", "కాయాపలట్" "మీఠీఛురీ" మఱియు "అహమఖుల్-లజీమ్" అనునవి ప్రసిద్ధమైనవి. ఇవన్నియు హాస్యరసప్రధానములు. అన్నిటిలో "హాజీ బగ్లోల్", గొప్పది. 'సర్షార్' వ్రాసిన "ఫిసానయే-ఆజాదు" ను పోలిన రచన అది. అందులో

అతడును లఖ్నో సభ్యతలోని హాస్యజనకములగు పద్ధతులను నిపుణతతో వర్ణించెను. అతని భాష లఖ్నో వ్యావహారికము. నానుడ్లు, లోకోక్తులు మఱియు జాతీయములు సుందరముగా ప్రయోగింపబడుట వలన అతని వాక్యములన్నియు మనోహరమైనవి. ఉర్దూలోని హాస్యసాహిత్యము వ్రాయునప్పుడు దాని ప్రారంభకులలో సజ్జాద్ హుస్సేన్‌కు ఉన్నతస్థానము ఈయవలసియుండును. అప్పటివఱకు హాస్యరచయితలు ఒక విశేష సామాజిక దృష్టిలేక ఏదోరీతి వ్యక్తుల లోపములను ఎత్తిచూపుచు సంస్కారబుద్ధితో సూచనలు చేయుచుండిరి. వారు స్పష్టముగా ఎట్టి చైతన్యమును ప్రదర్శింపరైరి. సర్షార్ మఱియు సజ్జాద్‌హుసేనులు క్రొత్త ప్రాతల నడుమగల సంఘర్షణను చక్కగా చిత్రించిరి.

ఈ యుగపు మఱియొక నవలారచయిత "మీర్జా మొహమ్మద్ హాదీ" "రుస్వా" (1858–1931) అలవోకగా మూడు నాలుగు నవలాలు వ్రాసినందున అతనికి ఉర్దూ సాహిత్యచరిత్రలో ఉన్నతస్థానము లభించెను. అదొక ఆకస్మిక సంఘటన. 'రుస్వా' వంటి విద్వాంసుడు, విజ్ఞాని ఎన్నో శతాబ్దముల కొకడే జన్మించును. అతడు అనేక భాషలు నేర్చెను. సర్వ శాస్త్రములలో ఎవరి సహాయమును, ఎట్టి శిక్షణయు లేక స్వయం కషివలననే గొప్ప నైపుణ్యము సంపాదించెను. తర్క దర్శనము లతని అభిమాన శాస్త్రములు – గణితశాస్త్రము లతనికి ప్రీతి పాత్రములైనవి. పూర్వపశ్చిమముల సమస్త విద్యలతనికి పరిచితములు. గంభీరాధ్యయనముచేసి ఏ విషయమును గుఱించియైనను సాధికారముగా మాటలాడువాడు. మతసంబంధములగు శాస్త్రములను తఱచితఱచి చదివి అనేక మతగ్రంథములను దార్శనిక దృష్టితో వ్రాసెను. అవి నేటికిని ప్రకాశితములు కాలేదు.

మీర్జా 'రుసువా' తన ప్రాథమిక విద్య తండ్రి దగ్గఱనే నేర్చెను. అచిర కాలముననే చాల విద్య గడించెను. ఇంగ్లీషులో ఎంట్రెన్సు వఱకు చదివి ఆపైన ఇంజనీరింగు పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను. కొంతకాలము ఉద్యోగము చేసెను. ఆ కాలముననే రసాయనశాస్త్రముపై అభిరుచికలిగెను. తన సర్వస్వమును విక్రయించి ఇంగ్లాండునుండి వైజ్ఞానిక యంత్రములు తెప్పించెను. ప్రైవేటుగా బి.ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడై అమెరికానుండి పి. హెచ్.డి. డిగ్రీ తెప్పించుకొనెను. కొంతకాలము లఖ్నో పాఠశాలలలో అధ్యాపక వృత్తి చేసెను. కాని అధికకాలము చదువుటలో వ్రాయుటలోనే గడపెను. అతడు మంచికవి. సంగీత శాస్త్రజ్ఞుడు. అంతేకాక అతడు దర్శన, తర్క, ధర్మశాస్త్రముల గుఱించి పెక్కు గ్రంథములు వ్రాసెను. సాహిత్య

దృష్టితో అతని కవితలును నవలలును గొప్పవి. కవితలలో "మురక్ఖయే-లైలా మజ్నూ" మఱియు మస్నవీ "ఉమ్మీద్-వ-బామ్" అనునవి ప్రసిద్ధమైనవి. నవలలో "ఉమ్రావ్‌జాన్-అదా", "షరీఫ్‌జాదా" మఱియు "జాతే-షరీఫ్" అనునవి ప్రఖ్యాతమైనవి. అతడు చివరికాలమున హైదరాబాదలో ఉద్యోగముచేయుచు అనేక గ్రంథములు అనువదించెను. కాని అతని విజ్ఞానమును పాండిత్యమును అతనికి సాహిత్యమున స్థానముసంపాదించలేదు. ఆస్థానము అతని నవలల వలననే కలిగినది.

"షరీఫ్-జాదా" అను నవలలో అతనివంటి స్వభావమే కల ఒక వ్యక్తి జీవిత కథ వ్రాయబడినది. కొందఱు అది అతని ఆత్మ కథయే అందురు. ఈ రచన ఎచటను కృత్రిమ మనిపించక సరళమును మనోరంజకమును అగు శైలిలో వ్రాయబడినది-"జాతె-షరీఫ్"లో ఉన్నత శ్రేణి ప్రజల జీవితము చిత్రింపబడినది. విప్లవము తరువాతి అవధ్ దుర్దశ కన్నులకు కట్టినట్లు ప్రదర్శింపబడినది. అతని సర్వశ్రేష్ఠమగురచన"ఉమ్రావ్-జాన్-అదా"-అదొక వేశ్య జీవితకథ. ఆమె నోటనే చెప్పించబడినది. ఆమె సామ్రాజ్యకాలపు జీవితమును చెఱుచుటలోనుఉద్ధరించుటలోను పాల్గొనిన వేశ్య. అయినను ఆ విషయమును చేపట్టుటకును, పవిత్రమగు విశాల సాహిత్య సౌధమున ఆమెను ప్రవేశ పెట్టుటకును అంత వఱకు ఎవరును సాహసింపరైరి. "రుస్వా"ఆ వేశ్య నోట ఆమె జీవితమును, విశేష సంకటములకు కారణములైన సన్నివేశములను చెప్పించెను. ఈ రచన వలన తెలియున దేమన రుస్వాకు సమాజ సంస్కారమునకు సంబంధించిన ఎట్టి స్పష్టమగు ఆలోచనయు లేకుండెను. అతడెఱిగిన లఖ్నో జీవితపు సర్వాంగములను ఒక కళావేత్తవలె ప్రదర్శించుటయే అతడు చేసిన పని. ఆ ప్రదర్శించుటయు పతితలను తన్మయులుగా జేయునంతటి సహజత్వముతో-ఈ రచన వలన అతని లక్ష్యమేమో బోధపడదు. వాస్తవికతా దృష్టితో అది గొప్ప నవల అని అందఱును అంగీకరింతురు. ఒక వేశ్య జీవితపు తెర మఱుగున అన్ని వర్గములకు చెందినవారును కాన్పింతురు. ఇరువదవ శతాబ్దమున నశించిపోవుచున్న లఖ్నో మన దృష్టి గోచరమగును. అందు ఆ కాలపు సభ్యత, సాహిత్య జీవనము, సామాజికవ్యవస్థ, ధార్మిక వ్యవస్థ, పల్లెల ఆర్థిక దుస్థితి, దోపిళ్ళు మొదలగునవియేకాక అనుపమ ప్రేమభావనలును కలవు. చివరి భాగమున "రుస్వా" ఉపదేశకునివలె ప్రచారము సాగించును. అదియే ఈ నవలలో బలహీనమైన భాగము. ఐనను ఈ నవల సాంతము వ్యాకులత మఱియు ఉద్విగ్నతలతో కూడిన జీవితమును ప్రదర్శించును.

"రుస్వా" కావ్యబద్ధమగు ఒక నాటకమును వ్రాసెను. ఐరోపీయ నాటకము వంటి కావ్య బద్ధములగు నాటకములను ఉర్దూలోను వ్యాప్తికి తేదలచెను. కాని అందు కృతకృత్యుడు కాలేకపోయెను. అతడు లైలా-మజ్నూల ప్రసిద్ధ ప్రేమ గాధను నాటక రూపమున రచించెను. కాని వచన నాటకములకు కల్గినంత ఆదరము దానికి కలుగ లేదు.

ఈ కాలపు కథకులలో మోలానా రాషిదుల్ ఖైరీ కూడ సుప్రసిద్ధుడు. అతడు డా. నజీర్ అహమద్ మార్గము ననుసరించి స్త్రీ జనోద్ధరణము లక్ష్యముగా కరుణా రసాత్మకములగు కథ లెన్నియో వ్రాసెను. అతని రచనలో విషాదమే అధికమగుట వలన అతనిని "ముసవ్వి రె-గమ్" (దుఃఖ చిత్రకారుడు) అనుచుండిరి. అతని దృష్టిలో దార్శనిక గాంభీర్యము లేదు. సాధారణ సన్నివేశములనే శోకమయ వాతావరణమున ముంచి చిత్రించును. అతని భాష శుద్ధమును సరళమును అగు దిల్లీ వ్యావహారికము. అతడు మధ్యవర్గపు ముసల్మానుల జీవితములను, కలతలను అతి విజ్ఞతతో ఉల్లేఖించి లోకాదరణ పాత్రుడగు రచయిత అయ్యెను.

రాషిదుల్ ఖైరీ ఈ ఉద్దేశ్యములతోనే రెండు పత్రికలు వెలువరించెను. అందు స్త్రీల సంబంధములగు వ్యాసములు మఱియు కథలే వ్రాయబడుచుండెను. ఈ రెంటిలో "ఇస్మత్" చాల ప్రసిద్ధమైనది. అది అతని మరణానంతరము కూడ వెలువడుచుండినది. అతడు కొన్ని చారిత్రక నవలలను వ్రాసి కొన్ని చిన్న కథల సంగ్రహములు తయారు చేసెను. అతని నవలలలో "సుబహే - జిందగీ", "షామె-జిందగీ", "షబె-జిందగీ", "మాహె-అజమ్", "నౌబతె-పంజ్ రోజా" "మనాజిలు-స్ససాయెరా", ఉరూసె-కర్బలా" అనినవి పేర్కొనదగినవి. అవన్నియు పలుతడవలు ప్రకాశితములైనవి. ఇప్పటికిని మధ్యవర్గపు ముసల్మాను స్త్రీలు అతని నవలలను ఉత్సుకతతో చదువుదురు.

ఈ సంక్షిప్త చరిత్రలో ఆ నాటి నవలా రచయిత లందఱినుగూర్చి వ్రాయుట సాధ్యము కాదు. కొందఱి పేర్లు మాత్రము తెలిపెదము. మొహమ్మదలీ "తబీబ్", జ్వాలా ప్రసాద్ "బర్ఖ్", అబ్బాస్ హుస్సేన్ "హోష్", "షాద్" అజీమాబాదీ, ఖారీ సర్ ఫరాజ్ హుస్సేన్, మిర్జా మొహమ్మద్ సయీద్, పండిత కిషన్ ప్రసాద్ కౌల్ మొదలగువారు సాహిత్య గౌరవము, కళాగౌరవమును కల ఒకటి అఱ నవలలు వ్రాసిన వారే.

పందొమ్మిదవ శతాబ్ది మధ్య భాగమున "అమానత్" వ్రాసిన "ఇంద్రసభ"తో నాటక రచన మొదలయ్యేనని తెల్పబడినది. ఆ తరువాత కొంత కాలము నాటకములు రచింపబడలేదు. మౌలానా మొహమ్మద్ హుస్సేన్ "ఆజాద్" "అక్బర్" అను నాటక రచన కుపక్రమించెను. కాని అది సమాప్తము కాలేదు. పందొమ్మిదవ శతాబ్దాంతమున దేశములో వ్యాపారదృష్టి ప్రబలెను. మనోరంజన మూలముగను ధనము సంపాదింపదలచిన బొంబాయిలోని పారసీలు కొందఱు ఆంగ్ల నాటకములచే ప్రభావితులై క్రొత్త రకపు నాటకపు కంపినీలు స్థాపించిరి. భారతదేశమున "నౌటంకీ", "రహస్" మఱియు "లీలా"ల సంప్రదాయము ఉండెను. అవి సంస్కృత నాటకముల వికృత రూపములు-క్రొత్త రకపు రంగస్థలములు మఱియు నాటక సమాజములు దేశీయ సంప్రదాయములకు కాక ఐరోపీయ సంప్రదాయములకు సంబంధించినవి. రంగస్థలములతో పాటు నాటకములును ఉన్నతిచెందెను. కేవలము ధన సంపాదన కొఱకే స్థాపింపబడిన అట్టి రంగస్థలములు దేశమంతట వ్యాప్తి చెంద లేదు. ఆ నాడు రచింపబడిన నాటకములు విదేశీయ నాటకములను, లేదా కథలను అనుకరించుచు వ్రాయబడినవి. కొన్ని భారతీయ జీవితమును సామాన్య శైలిలో మాత్రమే చిత్రింప గలిగినవి. ఈ నాటక సమాజముల కొఱకు "రౌనఖ్ బనారసీ", "హుసేనీమియాఁ జరీఫ్", "అహమద్ అబ్దుల్లా", "మిర్జా నజీర్ బేగ్", "తాలిబ్ బనారసీ", "అహసన్ లఖ్నవీ", "పండిత బేతాబ్", మఱియు "గులామలీ దీవానా" మొదలగువారు డ్రామాలు వ్రాసిరి. వినాయక్ ప్రసాద్ "తాలిబ్" అనేక ఆంగ్ల నాటకములను అనువదించెను. అహసన్ లఖ్నవీ "షేక్స్పియర్" డ్రామాలను తర్జుమా చేసెను. అతడు అచటచట అనువదించినను మొత్తముపైన ఆ నాటకములకు ఉర్దూ ఆకారమే ఇచ్చెను. అతని నాటకములు సజీవములు-సరసమైనవి. పండిత్ నారాయణ ప్రసాద్ "బేతాబ్" హిందువుల ధార్మిక గాథలను నాటకములుగా మార్చి "తాలిబ్" మఱియు "అహసను"ల వలెనే అతడును నాటక కళను చాల ఉద్ధరించెను.

క్రీ. శ. 1920 దాక వ్రాయబడిన నాటకములలో సాహిత్య దృష్టి లేకుండెను. అవి రంగముపై హృదయాహ్లాదము కలిగించుటకే ఉద్దేశింపబడినవి. సామాజికము లగు డ్రామాలు చాల అరిదిగా వ్రాయబడెను. దేశ ప్రేమను మఱియు నైతికాదర్శములను పురస్కరించుకొని కడు కొద్దిగా వ్రాయబడెను. ప్రేమపేర వికృత మగు ఇతివృత్తము గల నాటకములు ఆడబడుచుండెను. నైతిక విషయములైనను

కృత్రిమముగా అతిసామాన్యముగా ప్రదర్శింపబడుచుండెను. పాటల పైననే అతి శ్రద్ధ చూపబడుచుండెను. రంగస్థలము ఇంకను అభివృద్ధి చెందనందున దృశ్యములు అసహజముగా ప్రదర్శితము లగుచుండెను. క్రమక్రమముగా "అల్ఫ్రెడ్" మఱియు "ఎల్ఫింస్టన్" కంపెనీలు రంగస్థలమును అభివృద్ధి పఱచెను. అప్పుడే మంచి రచయితలును లభించిరి.

ఆల్ఫ్రెడ్ కంపెనీలో 'ఆగా హషర్ కాశ్మీరీ' అను నొక నటుడు ఉండెను. అతడు నాటకములు వ్రాయ మొదలిడి అల్పకాలముననే అత్యుత్తమ నాటక రచయితగా పేరొందెను. అతడును షేక్స్పియర్ నాటకములను ఉర్దూ రూపకములుగా మార్చి పౌరాణిక గాథలను నాటకములుగా వ్రాసెను. అతడు ఉర్దూ, ఫారసీ మఱియు ఆంగ్ల భాషలలోనే కాక హిందీ భాషయందును మంచిప్రవేశము కలవాడు. అట్లగుట హిందీ శబ్దములను హిందీ గీతములను సముచితరీతిని తన నాటకములలో ప్రవేశపెట్టెను. అతని కొన్ని నాటకములు ఉర్దూలోను కొన్ని హిందీలోను మఱి కొన్ని మిశ్ర భాషలోను కలవు. అతడు సామాజిక విషయములకును నాటకములలో స్థానము కలిగించెను. అతని సుప్రసిద్ధ నాటకములు, 'సుఫేద్ ఖూన్', 'తుర్కీహూర్', 'ఆంఖ్‌కానషా', ఔరత్‌కాప్యార్', 'సూర్‌దాస్' 'బిళ్వమంగళ్', 'శ్రవణ్ కుమార్', 'సీతా-బన్‌బాస్', అనునవి. అతని నాటకములు నేటికిని ఉత్సాహముతో చదువబడుచున్నవి. అతడు నాటక రచనలో క్రొత్త శైలిని ప్రవేశపెట్టెననుటలో సందేహములేదు. ఆ శైలిని ఇతరులు సాగదీసిరి.

రంగస్థలము దృష్టితోనే కాక కొన్ని నాటకములు కేవలము సాహిత్య దృష్టితో వ్రాయబడినవి. మౌలానా షరర్, అబ్దుల్ మజీద్ దర్యాబాదీ, పండిత 'కైఫీ' మొదలగువారు అట్టి నాటకములు వ్రాసిరి. ఉమ్రావ్ అలీ మఱియు కిషన్ చంద్ "జేబా", రాజకీయ విషయములు గల డ్రామాలు వ్రాసిరి. ఆగా హషర్ శిష్యుడగు హకీమ్ అహమద్ షుజా నాటకములు, నాటకసమాజములలో చాల ఆదరణ పొందినవి. డా. ఆబిద్ హుస్సేన్, డా. ఇస్తియాఖ్ హుస్సేన్, మొహమ్మద్ ఉమర్, నూరె ఇలాహీ, "ఆర్జూ" మొదలగు వారును మంచి మంచి నాటకములు వ్రాసిరి. ఇమ్తియాజ్ అలీ "తాజ్" తన సుప్రసిద్ధ నాటకము "అనార్కలీ"ని కేవల సాహిత్య దృష్టితో వ్రాసెను. అది సర్వ శ్రేష్ఠమైన నాటకమని పలువురు విమర్శకుల అభిప్రాయము. ఇరువదైదేండ్లనుండి ఉర్దూలో ఏకాంకికల సంప్రదాయము ప్రబలినది. అవి వ్రాయువారు అనేకులు. ఏకాంకికలలోను కథలలోవలె జీవిత

సమస్య లన్నియు ప్రదర్శితములైనవి. వానిలో కొన్ని నాటికలు రేడియోల కొఱకు వ్రాయబడినవి. కొన్ని సారస్వత దృష్టితోనే వ్రాయబడినవి. అట్టి వానిని రంగస్థలముపై ప్రదర్శింపవలయు నన్న చాల మార్పులు చేయవలసియుండును. ఉపేంద్రనాథ్ "అష్క్", "సాదత్ హసన్", "మంటూ", రాజేంద్రసింగ్ "బేదీ", కృష్ణచంద్ర్, ఖ్వాజా అహమద్ అబ్బాస్ ప్రముఖులు తమ నాటకములలో వర్ణభేదము, సామాజికా న్యాయము, ఆకలి, అసమాన వివాహములు, ధనిక పారిశ్రామిక సంఘర్షణము, స్వాతంత్ర్య సమరము మొదలగునవియే కాక మఱి యితర సమస్యల నెన్నిటినో సుందరముగా కళాత్మక నైపుణితో చిత్రించినారు.

ఈ కాలమున పత్రికల చలామణియు అధికమయ్యెను. వాని స్థాయి కూడ పెఱిగెను. రాజకీయ వాదోపవాదములే కాక సాహిత్య, సామాజిక, చారిత్రక, వైజ్ఞానిక, ఆర్థిక విషయములను గూర్చిన వ్యాసములును, ఆనాటి ఆవశ్యకములకు అనుకూలముగా పత్రికలలో ప్రచురితములగు చుండెను. సర్ సయ్యద్ కాలమున ప్రారంభమయిన ఈ పరంపర సమయముతో పాటు వ్యాపకము చెందుచుండెను. మోలానా అబుల్ కలామ్ ఆజాద్, ఖాజా హసన్ నిజామీ, మోలానా మొహమ్మదలీ, జఫరలీ ఖాన్ మొదలగు పత్రికా రచయితలు సాహిత్యమునందును గొప్ప స్థానము కలవారు. మోలానా ఆజాద్ "అల్ - హిలాల్" మఱియు "అల్ - బిలాగ్" అను రెండు పత్రికలు నడపెను. అతడు క్రొత్తరకపు పత్రికారచనకు జన్మదాత. ఇట్లే మోలానా మొహమ్మదలీ నడిపిన ఆంగ్ల, ఉర్దూ పత్రికల ఉదంతము సాహిత్య చరిత్ర లన్నిటిలో కలదు.

మోలానా ఆజాద్ వచనము అరబీ, పారశీ శబ్దములతో నిండి అలంకారయుతమై అలరారును. అందు కవిత్వమును, చమత్కృతియు గోచరించును. శక్తివంతమును సబలమును అగు అతని వచన రచన ధారాళమై పఠితలను పరవశుల చేయును. అత దెంతటి విద్వాంసుడో అంతటి వక్త. అట్టి రచయిత. అతడు ఉర్దూలో ఉద్గ్రంథము లెన్నియో వ్రాసెను. అతని తొలినాటి రచన యగు "తజ్‌కిరా" ప్రశస్తమైనది. అందు తన పూర్వుల చరిత్రమును సురుచిరమగు శైలిలో వ్రాసికొనెను. ఖురాన్ షరీఫ్‌ను టీకా సహితముగా అనువదించెను - అదొక విజ్ఞాన పేటిక. ఇస్లామ్ విచారములను, విజ్ఞానమును తెలిసికొనగోరువారికి ఆ అనువాదము చాల తోడ్పడును. క్రీ. శ. 1942 నాటి ఖైదు కాలమున అతడు తన మిత్రునకు కొన్ని ఉత్తరములు వ్రాసి భద్ర పఱచెను. అవి కొన్ని యేండ్ల క్రిందట "గుబారె -

ఖాతిర్" అను పేర ప్రకాశితములైనవి. అందు అతని తొలినాళ్ళ గద్యశైలి కలదు. అతడు రాజకీయములలో నిమగ్నుడై యుండియు సమయము చిక్కినప్పుడు ఏదేని వ్రాసిన అది సాహిత్యమే అగుచుండును.

మోలానా మొహమ్మదలీ రచయితయే కాక కవికూడ. కాని అతడు విశేష రచన యేదియు చేయలేదు. అతని వ్యాసములు మఱియు ఉత్తరములు అనేక సంగ్రహములుగా ప్రకాశితములైనవి. అందు ఉత్తమ వచన శైలి, ఉత్తమ జ్ఞానము నిక్షిప్తము - ఇట్లే జఫరలీ ఖాన్ పద్య గద్య రచన లనేకము చేసెను. అతని గద్య రచనలు, ముఖ్యముగా ఆంగ్ల గ్రంథముల అనువాదములు మహత్తరమైనవి.

నేడు ఎనుభయవ పడిలో ఉన్న ఖాజాహసన్ నిజామీ దిల్లీలోని ప్రఖ్యాతుడగు సూఫీ. అతడు చిన్ననాటి నుండియు సూఫీ తత్త్వము, మతము మఱియు సాహిత్యమునకు సంబంధించిన రచనలు చేయుచునే ఉన్నాడు. ఇప్పటికి చిన్నవి పెద్దవి కలిసి నూటికి పైగా అతని రచనలు కలవు. అతని రచనల విషయములు సర్వ విధములవి. అతడు తన స్వీయ చరిత్రమును విపులముగా వ్రాసికొనెను. అతని రచనలలో "మొహఱ్ఱమ్ - నామా", "కృష్ణబీతీ", "సేపారయే - దిల్ మఱియు పండ్రెండు భాగములలో నవలా రూపమున వ్రాసిన భారతదేశ విప్లవ కథ ప్రసిద్ధి గాంచినవి. అతని భాష సరళమును, సరసమును అగు వ్యావహారికము. చిన్న మాటలలో పెద్ద పెద్ద విషయములు చెప్పుటలో అతడు నేర్పరి. అతడు హిందీ శబ్దములను చక్కగా ప్రయోగించును. "భాష" (హిందీ) లో అతడు అనువదించిన ఖురానును గాంధీ మహాత్ముడు చాల ప్రశంసించెను. అతడెన్నియో పత్రికలు నడపెను. వానిలో తఱచు అతని రచనలే పడుచుండెను. అతడు నిజాముద్దీన్ ఔల్యా అను నొక విఖ్యాత యోగీశ్వరుని వంశమునకు చెందినవాడు. కనుక ముసల్మానుల ఒక శాఖ అతనిని చాల గౌరవించును.

ఇరువదవ శతాబ్దారంభమున నవలలేకాక కథలును వ్రాయబడెను. సర్ అబ్దుల్ ఖాదర్ లాహోరునుండి 'మఖ్జన్' అను పత్రిక తీయుచుండెను. అందు అప్పుడప్పుడు విదేశీయ కథలు అనువాదములు పడుచుండెను. కాన్పూరు నుండి "జమానా" అను పత్రిక వెలువడుచుండెను. అందును కథలు పడుచుండెను. మొట్టమొదటి కథ ఎప్పుడు వ్రాయబడెనో చెప్పుట కష్టము కాని క్రీ. శ. 1907 ప్రాంతమున "ప్రేమచంద్" తన మొదటి కథ "దున్యాకా సబ్ సే అన్మోల్ రతన్" అనుదానిని "జమానా" పత్రికలో

ప్రచురించెనని నిశ్చయముగా చెప్పవచ్చును. ప్రేమచందునుగూర్చి ముందటి అధ్యాయమున వ్రాయబడును. అప్పుడు వ్రాయబడుచుండిన కథలు అనువాదములు లేదా ప్రేమ మఱియు రొమాన్సుకు సంబంధించినవి. రచయితల దృష్టి సామాజిక విషయములపై లేకుండెను. వారు ప్రజాభిరుచి ననుసరించి వ్రాయుచుండిరి. అట్టివారిలో సజ్జాద్ హైదర్ యల్దర్మ్, నియాజ్ ఫతేపూరీ మఱియు సుల్తాన హైదర్ "జోష్" పేర్కొన దగినవారు. యల్దర్మ్ తుర్కీ భాషలోని అనేకములగు నవలలను, నాటకములను, కథలను అనువదించెను. అతని రచనలలో "జాహెరా", "సాలిస్-బిల్ ఖైర్", "జలాలుద్దీన-ఖ్వార్ జిమ్‌షా", "ఖయాలిస్తాన" మఱియు "హికాయాతొ - ఎహాతె సాసాత్" ప్రసిద్ధమైనవి- అతని రచన సుందరమైనది. భావపూర్ణమైనది. సామాజిక విషయములకు బదులు అతడు మనోభావములు చిత్రించుటకే ప్రాధాన్యము చూపెను. అతని రచనలలో లలిత హాస్యమును ఉండుటవలన పఠితలను ఆకర్షించును. ఒక విధముగా అది ఉర్దూ సాహిత్యమున రొమాంటిక్ యుగము. అందు రచయితలు నూత్న దిశలవైపు పురోగమించుచుండిరి. వారి భావములలోను శైలిలోను నవ్యత ఉండెను. కాని వారి సమ్ముఖమున ఎట్టి ఉన్నతాదర్శనమును లేకుండెను. ఈ యుగమే మార్పుచెంది రాజకీయ చైతన్యము గల యుగ మయ్యెను. దానిని గూర్చి ముందు ముందు వ్రాయబడును.

నియాజ్ ఫతేహ పూరి వయస్సునేడు అరువదైదేండ్లు. అతడు తొలుత ఇట్టి శైలిలోనే వ్రాయువాడు- కాని ఇప్పుడు సమస్యలు జటిలములైనందున అతని దృష్టి కూడ మాఱినది. నవజాగృతిచే ప్రభావితుడై అతడును క్రొత్త విషయములను స్వీకరించుచున్నాడు. కాని యౌవనములో అతడు వ్రాసిన, "ఏక్‌షాయర్ కా అంజామ్", "షహాబ్ కీ సర్ గుజిష్త్", "నిగారిస్తాన", "జమాలిస్తాన" అను గ్రంథములే అతనికి సాహిత్య చరిత్రలో స్థానము కలిగించినవి. నియాజ్ గొప్ప విద్వాంసుడు. ప్రవాహ వేగమున వ్రాయగలవాడు. అరబీ, ఫారసీ భాషలలో మంచి పండితుడు. హిందీలోను ఆంగ్లమునందును గొప్ప ఎఱుక కలవాడు. క్రీ. శ. 1922 నుండి "నిగార్" అను మాస పత్రిక నడపుచున్నాడు. దాని మూలమున క్రొత్త రచయితలనేకులకు భావ స్వాతంత్ర్యమును, బుద్ధివాదమును అలవఱచు చున్నాడు. అతడు మతమును బుద్ధియను ఒరపిడిఱాతిపై గీసి సతార్కికముగా తన సిద్ధాంతములను ప్రతిపాదించును. అతనికి కఠినమైన వ్యతిరేకతయే లభించినది. అయినను తన భావములను ప్రకటించుపట్ల అతడెన్నడును సంకోచింపడు. నియాజ్‌ను ప్రగతిశీలుడను

టకును వీలులేదు. కాని కొన్నేండ్లక్రిందటనే అతడు తన భావస్వాతంత్ర్యము వలన రూఢివాదులకు వేరుగా నిలిచెను.

నియాజ్ చరిత్రలు, నవలలు, నాటకములు, కథలు, విమర్శలు మొదలగు పలుతెఱగుల రచనలు చేసెను. అతని కథలు సుందరమైనవి. ప్రేమ సంబంధమైనవి. మనోహరమైనవి. అందు సామాజిక వాతావరణము ఉండదు. మనోభావముల చిత్రణమే ప్రధానమైయుండును. అతడు ఆలోచనాత్మకములగు వ్యాసములు వ్రాయుచున్నాడు. ప్రతిభావంతముగ సాహిత్యవిశేషములను ప్రదర్శించుచున్నాడు. అతని దృష్టి సౌందర్యాలాలసము. అతని భాషలో మొదట ఉద్వేగము, ఉత్సాహములతోపాటు అరబీ, ఫారసీ శబ్దము లధికముగా ఉండునవి. ఇప్పుడతని భాష సరళమైనది. అయినను అందలి సౌందర్యము, చమత్కృతి తగ్గలేదు. అతడు హిందీలోని, ముఖ్యముగా బ్రజభాషలోని మంచి మంచి దోహాలను "జబ్బాతె-భాషా" అను పేర టీకా సహితముగా ప్రకటించెను.

హాలీ, ఆజాద్ మఱియు సర్ సయ్యదుల తరువాత ఉర్దూలో సాహిత్య సమీక్షల పద్ధతి పెఱిగిపోయెను- విమర్శకులు పలురకములవారు- కొందఱు పరిశీలనాత్మకముగ పూర్వగ్రంథములను చూచి టిప్పణములు వ్రాసి దీర్ఘములగు పీఠికలతో ప్రకాశింపజేతురు. మఱికొందఱు "హాలీ" వలె సారస్వతములోని మంచి చెడులను పరిశోధింతురు. ఇంక కొందఱు సాహిత్యములోను కవితలోను సౌందర్యమును అన్వేషించి తాము పొందిన ఆనందాను భూతిని వివరింతురు. కొందఱు వ్యాకరణమును మఱియు శబ్దప్రయోగమును మాత్రమే చూచెదరు- విమర్శకులు అసంఖ్యాకులు. అందఱను గుఱించి వ్రాయుట అసంభవము. అయినను వర్తమానయుగపు సాహిత్యోన్నతిని గ్రహించుటకై కొందఱు ప్రసిద్ధులగువారినిగుఱించి తెలిసికొనుట అవసరము. ఈ అధ్యాయమున ప్రస్తావింపబడు వారిలో పలువురు సామాజిక విశ్లేషణచేయువారు కారు. వారుకేవలము కవుల జీవితము, జననము, మరణము, కాలము, స్వల్పములగు విశేషములు, రచనల సంఖ్య, ఇతర సాహిత్య వేత్తలతో సంబంధము ఈ మొదలగు విషయములనే చర్చింతురు. ఈ విషయములును సాహిత్య చరిత్ర వ్రాయుటకు అవసరమైనవే కాని ఇవియే సమస్తము కావు. ఎంతవఱకు జీవితమును, సాహిత్యమును సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులకు అనుబంధించి పరిశీలించమో అంతవఱకు వాని ప్రగతి చరిత్ర సంపూర్ణముగా గ్రహించుట సాధ్యము కాదు. ఈ దృష్టితో విమర్శించిన వారిని గూర్చి చివరి అధ్యాయమున వ్రాయబడును.

ఈ అధ్యాయమున పురాతన విమర్శలకు అద్యతన విమర్శలకు మధ్యస్థులై హాలీ నడపిన ఉద్యమముననే అవచేతనారూపము దృఢపఱచిన వారినిగుఱించి వ్రాయబడును.

మౌలానా అబ్దుల్ హక్, మౌలానా సులేమాన్‌నద్వీ, మౌలానా అబ్దుల్ మాజిద్ దర్యాబాదీ, లాలా శ్రీరాం, హాఫీజ్ మొహమ్మద్ షీరానీ, పండిత్ "కైఫీ", సయ్యద్ అహమద్ దహిల్వీ, మొహమ్మద్ హుసేన్ "అదీబ్", నసీర్ హుస్సేన్" "ఖయాల్", అందలీబ్" షాదానీ, మసూద్ హసన్ రిజ్వీ "అదీబ్", డాక్టర్ మోహన్‌సింహ "దీవానా", రషీద్ సిద్దీఖీ, డాక్టర్ "జోర్", నాసిరొద్దీన్ హాష్మీ మఱియు డాక్టర్ అబ్దుల్లా అనువారు ఆధునిక కాలపు ఉర్దూ సాహిత్యమును లోకప్రియమును, వ్యాపకమును చేయుటలో పాల్గొనిన విమర్శకులు. వీరిలో ఐదారుగురు తప్ప అందఱును నేటికిని రచనలు చేయుచున్నారు. వీరిని గూర్చి విశేషముగా వ్రాయుట అసంభవము- అయినను వీరి అనేక రచనలు హాలీ, ఆజాద్ మఱియు షిబ్లీల రచనల వలె మహత్తరమైనవని తెలిసికోవలెను.

క్రొత్త సాధనములు చేకూరుటవలన ఈ రచయితలు దర్శన, తర్క, చరిత్ర, విజ్ఞానముల సహాయమున సాహిత్యమును విస్తృతమొనర్చిరి. అయినను పైన చెప్పినట్లు వీరిలో పలువురు సామాజిక చైతన్యమును దృష్టియందిడుకొని సాహిత్యప్రగతిని పరిశీలించువారు కారు. ఎనుబది నాలుగేండ్ల వయముగల మౌలానా అబ్దుల్ హక్[1] గొప్ప విద్వాంసుడు. అతడు ప్రాచీన కావ్యములను అన్వేషించుటలో వానికి టీకాలు వ్రాసి ప్రకాశింప జేయుటలో ఉర్దూ భాషను శక్తివంత మొనర్చుటలోనే తన జీవితమును గడపెను- హైదరాబాదలోని పెక్కు కళాశాలలలో ప్రిన్సిపాలుగా, అధ్యక్షుడుగా పనిచేయుచు అధిక రచనలు అచటనే చేసెను. అతని రచనలలో "మరాఠీ పర్ ఫారసీకా అసర్", నుస్రతీ" "మర్హూమ్ దహిలీ కాలేజీ" అనునవి ప్రసిద్ధమైనది, ఇవికాక అతని పరిశోధనాత్మకములగు వ్యాసముల సంపుటములు "మొఖద్దమాతె అబ్దుల్ హఖ్" "తన్కీదాతె - అబ్దుల్ హఖ్", "చంద్‌హమ్ అసర్" అనుపేర ప్రకాశితములు. అతడు తన అన్వేషణవలన ఎందఱో ప్రాచీన కవులను రచయితలను జీవింపజేసెను. అలసట యెఱుగని పరిశ్రమచే ఉర్దూ భాషను లోకాదరణపాత్ర మొనర్చుటకు అతడు పాటుపడెను. అతని రచనల కంటె అనేక రచయితలకు రచనాత్మక కార్యక్రమములో ఇచ్చిన ప్రోత్సాహమే గొప్పది. అతడు "హాలీ" వలె

1. అనువాద కాలమున డా. అబ్దుల్‌హక్ కీర్తిశేషుడు.

సరళవచనమునే వ్రాసెను – అనుచితములగు ఫారసీ అరబీ పదములచే భాషను క్రుంగదీయలేదు. కాని క్రీ. శ. 1936 నుండి అతని దృష్టిలో కొంత సంకీర్ణత కలిగినది. అతని ప్రోత్సాహము వలననే ఉర్దూ హిందీ వివాదము పెఱిగినది. ఇప్పుడతడు పాకిస్తానులో "అంజుమనె–తరక్కియే–ఉర్దూ" స్థాపించి భారతదేశమున ప్రారంభించిన కార్యక్రమము సాగదీయుచున్నాడు.

లాలా శ్రీరామ్ దహిల్వీ (1875–1929) ఢిల్లీలోని ఒక ఉన్నత కుటుంబము నకు చెందినవాడు. ఆ కుటుంబమున ఉత్తమ రచయితలు జన్మించిరి. లాలా శ్రీరామ్ ఫారసీ, అరబీ, ఆంగ్ల భాషలను బాగుగా చదివెను. క్రీ. శ. 1907 లో అస్వస్థత కారణముగ ఉద్యోగము విరమించుకొని ఒక్కరిని విడువకుండ ఉర్దూ కవులందఱి చరిత్ర వ్రాయ సంకల్పించెను. "ఖుమ్‌ఖానయే–జావీద్" అను పేర సుప్రసిద్ధమైన ఆ చరిత్ర నాలుగు భాగములు ప్రకాశితములైనంతనే అతడు స్వర్గస్థుడయ్యెను. అతని చరిత్రలో అందందు కొన్ని దొసగులు దొరలినను అది చాల పరిశోధించి వ్రాయబడినదే. దాని నిర్మాణమునకై అతడు వేనవేలు గ్రంథములు సేకరించి పరిశీలించెను. కొన్ని గ్రంథములు ప్రపంచములో మఱెక్కడను లేనివి. అతని మరణానంతరము అతని గ్రంథాలయము మఱియు అతని రచన కాశీ విశ్వ విద్యాలయమునకు ఈయబడెను. అసమాప్తమగు ఆ చరిత్రను పండిత "కైఫీ" సమాప్తముచేయ పూనుకొనెను. ఐదవ భాగము "కైఫీ" సంకలనము చేసెను. పండిత "కైఫీ" స్వయముగా గొప్ప విద్వాంసుడు. భాషా తత్త్వవేత్త. అతని కవితలను గుఱించి వ్రాయబడినది. నిజమునకు అతడు గద్యరచయితగా ఉర్దూ సాహిత్య చరిత్రలో చిరస్మరణీయుడు. అతడు నాటకములు వ్రాసెను. అతని సర్వశ్రేష్ఠమగు రచన "కైఫియా"–అది భాషా జ్ఞానమునకు సంబంధించిన అసమాన మగు కోశము. ఎనుబదైదేండ్ల వయస్సు వచ్చినను అత డింకను రచనలు చేయు చున్నాడు[1].

నవ్వాబ్ నసీర్ హుస్సేన్ "ఖ్యాల్" (1882–1934) పట్నాలోని ప్రసిద్ధ రచయిత. అతడు ఉర్దూ భాషోత్పత్తి మఱియు దాని అభివృద్ధిని గూర్చి అనేక పరిశోధనాత్మకములగు రచనలు చేసెను. వానిలో "దాస్తానె–ఉర్దూ" మఱియు "మొగల్–ఔర్–ఉర్దూ" అనునవి పేరుగల రచనలు – అతని శైలి మోలానా

1. అనువాద కాలము నాటికి పండిత బ్రిజమోహన దత్తాత్రేయ "కైఫీ" స్వర్గస్థుడయ్యెను.

మొహమ్మద్ హుస్సేన్ ఆజాద్ శైలిని పోలియుండును. అతడు శబ్దములను సుందరముగా ప్రయోగించును. ఏ శబ్దమును ఏ స్థానమున ఎట్లు ప్రయోగింపవలెనో అతనికి బాగుగా తెలియును. అతని శైలి సుందరమైనదే కాక గాంభీర్యము కలది.

మౌలానా "షిబ్లీ" ఆజమ్‌గడ్‌లో స్థాపించిన "దారుల్ ముసన్నిఫీన్" అను సంస్థకు చెందిన రచయితలు పలువురు అతడు ప్రారంభించిన రచనా కార్యక్రమమును కొనసాగించిరి. మౌలానా సులేమాన్‌నద్వీ, అబ్దుల్ సలామ్‌నద్వీ, సయీద్ అన్సారీ, రియాసతలీనద్వీ, షాహ మొయినుద్దీన్ నద్వీ అను వారు మంచి రచయితలు. సులేమాన్ నద్వీ అందఱిలో శ్రేష్ఠుడు. అతడు షిబ్లీ వారసుడు. అతడు వ్రాసిన గ్రంథములు కొన్ని షిబ్లీ మిగిలించినవి. కొన్ని స్వంత రచనలు. అతని పుస్తకములు అధికముగా మత సంబంధమైనవి. సాహిత్య దృష్టితో "నుఖూషె-సులేమానీ" మఱియు "ఖయ్యామ్" అనునవి రెండు పేర్కొనదగినవి. ఈ రెండును సుందర మగు వచనమున గొప్ప భావములతో కూడి యున్నవి. అతడు మహా విద్వాంసుడు. కనుక అతని రచనలు గంభీరమైనవి. పరిశోధనాత్మకమైనవి. ఈ విషయము "ఖయ్యామ్" నందేకాక "అరబ్-ఔర్-హింద్ కే తాల్లుఖాత్" అను గ్రంథము నందును విశదమగును. అతడు పాకిస్థానమునకు వెళ్ళి అచ్చటనే క్రీ. శ. 1953 లో మరణించెను. మౌలానా అబ్దుల్ సలామ్ వ్రాసిన "షేరుల్-హింద్" అను ఉర్దూ కావ్య చరిత్ర తెలిసికొనుటకు అధికముగా తోడ్పడును. ఈ సంస్థకు చెందిన ఇతర రచయితల రచనలు మత సంబంధమైనవే అయినను సాహిత్యగౌరవము కలవి.

మౌలానా అబ్దుల్ మాజిద్ దర్యాబాదీ నేటి సుప్రసిద్ధ విద్వద్రచయితలలో ఒకడు. అతని జీవితము ఎత్తు పల్లములతో కూడుకొనినది. అతడు ఆంగ్లవిద్య నభ్యసించు నపుడు నాస్తిక భావములకులోనై ఇస్లాము మఱియు ఇతర మతములను బుద్ధి వాదముతో పరిశీలించి విమర్శించెను. అదే సమయమున అతడు ఐరోపా దర్శన శాస్త్ర సంబంధములగు అనేక గ్రంథములను అనువదించెను. ఆంగ్లములోను ఉర్దూ లోను పెక్కు రచనలు చేసెను. తరువాత అతడు మారిపోయెను. క్రమక్రమముగా అతడు తిరిగి మత సంబంధములగు విషయములను ప్రచారము చేయసాగెను. ఇప్పుడతనికి ప్రపంచములోని ప్రతి సన్నివేశమును ఇస్లామ్ మత దృష్టితో చూచు నంతటి సంకీర్ణత కలిగినది. ఈ దృక్పథము కేవలము అతనిదే. అతడు మహోదాత్తమగు శైలిలో కొన్ని సారస్వత వ్యాసములు వ్రాసెను. అతని వ్యాససంపుటములు "మఖాలాతెమాజిద్" మఱియు "మజామీనె-మాజిద్" అను పేర ప్రకాశితము

లైనవి. ఇవికాక అతని రచనలు మఱియు అనువాదములలో "ఫల్సఫే-జజ్బాత్", "ఫల్సఫయే-ఇజ్తిమా", "తసవ్వుఫ్-ఔర్-ఇస్లామ్", "తారీఖె-ఇఖ్లాకె-యూరుప్" మఱియు "మొహమ్మదలీకీడైరీ" అనునవి ప్రసిద్ధమయినవి. అతడు ప్రగతిశీల భావము లన్నిటిని వ్యతిరేకించుటయే తన కర్తవ్యమనుకొనును. అతని శైలి సుందరము మనోహరము. కనుక అతని సాంప్రదాయిక భావములైనను చదువుటకు ఇంపుగా నుండును.

ఆధునిక ఉర్దూ సాహిత్య నిర్మాతలలో వహీదుద్దీన్ సలీమ్ పానీపతీ కూడ గొప్పవాడు. పద్య గద్య రచన లతనివి ప్రశంసనీయములు. అతడు బహు భాషలలో పండితుడు. భాషా విజ్ఞానము మఱియు పారిభాషిక పదముల అనువాదమును గూర్చిన అతని రచనలు పేర్కొనదగినవి. అతడు జీవితమంతయు జ్ఞానోపార్జనము చేయు విద్యార్థివలె గడపెను. అతని జీవితము అతి సామాన్యము. చాలకాలము హైదరాబాదలోనే నివసించెను. అచటి సాహిత్యవేత్త లనేకులు అతనిచే ప్రభావితులైరి. పద్య సంగ్రహములే కాక "ఇఫాదాతె-సలీమ్" మఱియు "వజే-ఇస్తెలాహాత్" అను రెండు వచన గ్రంథములును ప్రకాశితములైనవి. మొదటి గ్రంథము వ్యాస సంపుటి. అందలి ప్రతి వ్యాసమును అతని ప్రజ్ఞా పాటవములను ప్రదర్శించునట్టిది. రెండవది పారిభాషిక శబ్ద నిర్మాణమునకు సంబంధించిన గ్రంథము. దానిలో నేటికిని ఎట్టి కూర్పులు చేర్పులు జరుగలేదు. సలీమ్ క్రీ. శ. 1916 లో మరణించెను.

డాక్టర్ అబ్దుల్ రహమాన్ బిజనోరి, అజ్మతుల్లా ఖాన్ మఱియు సజ్జాద్ అన్సారీ అను ముగ్గురు ప్రఖ్యాతులు కాకముందే దివంగతులైన విషుర్శకులు. ముగ్గురును అల్ప వయస్సుననే మరణించిరి. వారు కవులును రచయితలును - అజ్మతుల్లాఖాన్ హిందీ కావ్యశాస్త్రమును బాగుగా చదివెను. ఉర్దూ కవితలో నవ్యత కలిగించుటకై ప్రయత్నించెను. ఆ ప్రయత్నము ఉర్దూ కావ్య చరిత్రలో చిరస్మరణీయ మైనది. అతని కావ్య సంగ్రహము "సురీలే-బోల్" అను పేర ప్రకాశితము. గద్యములోని అతని గ్రంథములు రెండు అచ్చుపడినవి. వానిని చదువునప్పుడు, అతడు బ్రదికియుండిన ఇంక నెంతటి గొప్ప రచనలు చేసియుండునో అనిపించును. "బిజనోరీ" రచనలు రెండు - ఒకటి "బాఖియాతె-బిజనోరీ" అను పేరుగల వ్యాసంపుటము. రెండవది "మీర్జాగాలిబ్ కవితల గూర్చిన తాత్త్విక సమీక్ష - అది "మహాసినె-కలామె-గాలిబ్" అనుపేర ప్రకాశితమైనది. అతడు ఐరోపాలోని అనేక భాషలు తెలిసినవాడు. దర్శన శాస్త్రమున గొప్ప విద్వాంసుడు. కనుక అతని

రచనలు దార్శనిక భావములతో నిండియున్నవి. అతని కవితలు కొన్ని "మహాషరె - ఖ్యాల్ అనుపేర ప్రకాశితమైనవి. వానివలన అతని బుద్ధి తీవ్రత, కళాత్మక శక్తి మఱియు ఆలోచనా స్వాతంత్ర్యము విదితమగును. అతని రచన సజీవము. దర్శనములపై, మతముపై స్వతంత్ర చర్చ చేసినవాడతడు. సౌందర్యోపాసన మఱియు నవ్యతమీది ప్రేమ ఈ ముప్వురిలో సమానగుణములు.

పరిశోధనాత్మక సాహిత్య వేత్తలలో "హాఫిజ్ మొహమ్మద్ షిరానీ" ప్రఖ్యాతుడు. అతడు ఉర్దూ భాషోత్పత్తిని గూర్చి "పంజాబ్‌మే ఉర్దూ" అనునొక ఉద్గ్రంథము వ్రాసెను. అందు ప్రారంభ దశలోని పంజాబీ మఱియు ఉర్దూ భాషల సమానతను స్థాపించెను. 'పృథ్వీరాజ్ రాసో'ను గూర్చియు అతడొక పుస్తకము వ్రాసెను. అదియు ప్రకాశితమైనది. అతడు పురాతన రచయితల రచనలలోను సమకాలీనుల రచనలలోను దోషములను ఎత్తి చూపుటయందు అభిలాష కలవాడు. వేలకొలది పుస్తకములను పరిశీలించి కొట్టివేయుటకు వీలుకాని విధముగా దోషములను ప్రదర్శించెను. మౌలానా 'ఆజాద్' మఱియు 'షిబ్లీ'ల రచనలలో ఎన్నియో తప్పులు వెదకెను. అతని విమర్శలు కొన్ని పుస్తక రూపమున ప్రకటింపబడినవి. అతడు అరబీ, ఫారసీ, హిందీ భాషలలో ఉద్దండ పండితుడు. అతని గద్యము నిస్సారము - నీరసము నాలుగైదేండ్ల క్రిందటనే మరణించెను. అట్టి రచనలు చేసిన వారిలో ఇప్పుడును కొందఱు పేర్కొనదగినవా రున్నారు. వారిలో డా. అబ్దుల్ సత్తార్ సిద్దీఖీ, డా. అబ్దుల్లా, ఖాజీ అబ్దుల్ వదూద్ మఱియు ఇమ్తియాజలీ "అర్షీ" అనువారు ముఖ్యులు. వారినిగూర్చి వ్రాయుట పడదు.

పండిత మనోహర్‌లాల్ జ్యోతిషి, మీర్జా మొహమ్మద్ "అస్కరీ", మౌల్వీ మహేష్ ప్రసాద్, జాఫరలీఖాన్ "అసర్" మఱియు నాసిరుద్దీన్ "హాష్మీ" అనువారు ఉర్దూ సాహిత్య నిర్మాణమున చాల కృషిసల్పిరి. వారు ఎన్నియో ప్రాచీన రచనలను వెలికితీసి విజ్ఞాన క్షేత్రమును విస్తృత పఱచిరి. వారి రచనలను గూర్చి వ్రాయుటకు వీలుకాదు. ఉర్దూ సాహిత్యపు వర్తమాన యుగ చరిత్రను విస్తార రూపమున పఠింపదలచినవారు ఈ రచయితలను గూర్చి బాగుగా తెలిసికొనవలసి యుండును.

భారతదేశ విశ్వ విద్యాలయములలో ఉన్నత శిక్ష విషయముగా ఉర్దూ స్థానము పొందిన నాటినుండి అధ్యాపకులు తద్వ్యాప్తికై చాల కృషిచేయుచున్నారు.

వారిలో ఆధునిక సామాజిక చైతన్యమువలన ప్రభావితులైన వారిని గుఱించి తరువాతి అధ్యాయమున వ్రాయబడును. ప్రాచీన సాహితీపరుల శైలి ననుసరించియే సాహిత్య నిర్మాణము చేయుటయందే విశ్వాసము కల్గియున్న వారిని గూర్చి ఇట చర్చింపబడును. వీరు ఏదోరీతి ఆధునిక సాహిత్య ప్రయోగముల పట్ల అవిశ్వాసము ప్రకటింతురు. వీరిలో మసూద్ హసన్ రిజ్వీ "అదీబ్", రషీద్ అహమద్ సిద్దీఖీ, సయ్యద్ జామిన్ అలీ, డా. హాఫీజ్ సయ్యద్, డా. జోర్, ప్రొఫెసర్ అబ్దుల్ ఖాదర్ "సర్వరీ", డా. అందలీబ్ షాదానీ మఱియు డా. అబ్దుల్లా ప్రముఖులు స్మరింపదగినవారు.

మసూద్ హసన్ రిజ్వీ క్రీ. శ. 1954 వఱకు లఖ్నో విశ్వవిద్యాలయమున ఉర్దూ, ఫారసీ శాఖల అధ్యక్షుడుగా పనిచేసెను. అతడు ప్రాచీన కవులను, రచయితలను గుఱించియే ఎక్కువగా పరిశోధన జరిపెను. అయినను నవ్య సాహిత్యము నెఱిగినవాడు. మర్సియాల గూర్చి విశేష పరిశోధన జరిపి తత్సంబంధమున ఒక మహా గ్రంథమును వ్రాయుచున్నాడు. ప్రకాశితములైన అతని గ్రంథములలో "హమారీ - షాయిరీ", "రూహె - అనీస్", "దీవానె - ఫాయిజ్", "ఫైజెమీర్", "మజాలిసె - రంగీన్" మఱియు "ముతఫర్రికాతె - గాలిబ్" అనునవి ప్రసిద్ధి గాంచినవి. అతని రచనలు పరిశోధనాత్మకమైనవి. అతడు నూత్నశైలిలో కూడ సమీక్షచేయును. "హమారీ - షాయిరీ" అను గ్రంథము ఉర్దూ కావ్య విశేషములను గ్రహించుటలో తోడ్పడును. అతని భాష గంభీరము - అయినను సారళ్యము కలదే. ప్రస్తుత మతడు ఉర్దూ నాటకారంభము మఱియు "వాజిదలీషా" సాహిత్య సేవను గుఱించి వ్రాయుచున్నాడు.

రషీద్ అహమద్ సిద్దీఖీ, అలీఘర్ ముస్లిమ్ విశ్వ విద్యాలయమున ఉర్దూ భాషాధ్యక్షుడు. అతడు ముఖ్యముగా హాస్యరస పూరితములగు వ్యాసములు వ్రాయును. అప్పుడప్పుడు విమర్శనాత్మకములగు రచనలును చేయుచుండును. కాని అందును హాస్యము ద్యోతకమగును. అతని అనేక రచనలు ప్రకాశితములైనవి. వానిలో "మజామీనె - రషీద్", "ఖందాం", "గుంజ్‌హాయ్ - గిరాం మాయ", "తనజీహాతో - ముజహికాత్" మఱియు "షైఖ్‌నియజీ" పేర్కొనదగినవి. ఉర్దూలో హాస్యరస సంప్రదాయమును గూర్చి ఒక పుస్తకము వ్రాసినాడు. ఉర్దూభాషలో అట్టి శైలిలో వ్రాయబడిన గ్రంథము అదొక్కటే. "సిద్దీఖీ" వ్యంగ్యము మఱియు గాఢ సంకేతములు అతని కళాత్మక శైలిని గంభీరముగా, దార్శనికముగా తీర్చి దిద్దును.

అతడు వర్తమాన యుగపు సర్వోత్తమ హాస్యరచయిత అనుటలో సందేహములేదు. అతడు నవ్వించుటకొఱకు కాక ఆత్మ సంయమమునకు శిక్షించుటకు వ్రాయును.

సయ్యద్ జామిన్ అలీ, అలహాబాద విశ్వవిద్యాలయమున ఉర్దూ భాష ప్రొఫెసరుగా పనిచేసెను. అతడు కవి-రచయిత-కవితలో ప్రాచీనుల కావ్యశైలినీ అనుసరించును. అయినను నూత్నశైలియొక్క విశిష్టతను ఆమోదించును. అతడు అధిక సమయము ప్రాచీనకావ్యపరిశీలనమున ముఖ్యముగా మర్సియాల పరిశోధనలో గడపెను."వాఖియాతె-కర్బలా" మఱియు "ఉర్దూజుబాన్-ఔర్-అదబ్"అను రెండు పుస్తకములే అతనివి ప్రకాశితములైనవి. ఇంకను అచ్చుకానున్నవి అనేకములు.

డా. హాఫీజ్ సయ్యద్ అలహాబాద విశ్వవిద్యాలయమున ఉర్దూభాషాధ్యక్షుడుగా పనిచేసెను. అతడు "ఖ్వాజా మొహమ్మద్ బహరీ"ని గూర్చి విశేషపరిశోధన చేసి అతని కావ్యసంకలనమును ప్రకాశింప జేసెను. అదికాక గౌతమ బుద్ధుడు మఱియు అశోకుని గూర్చిన అతని రచనలు ప్రకాశితములైనవి. మత, దార్శనిక, సాహిత్యవిషయములను గూర్చి అనేక రచనలు చేసెను. అతని గద్యశైలి సామాన్యము మఱియు నీరసము.

డా. మొహియుద్దీన్ ఖాదిరీ "జోర్" హైదరాబాదలోని ప్రముఖ రచయితలలో నొకడు. అతడు ఐరోపా దేశముననుండి భాషాతత్త్వశాస్త్రమును బాగుగా అధ్యయనము చేసెను. అప్పుడే ఉర్దూ, ఉంగ్లీషు భాషలలో అనేక రచనలుచేసెను. అచటి గ్రంథాలయములలో లభించు అనేక గ్రంథములను పరిశీలించెను. అతని ప్రకాశిత గ్రంథములు అనేకములు. "రూహె- తన్ఖీద్", తన్ఖీదీ - మఖాలాత్", "హయాతె-ఖులీఖుతుబ్షా" "దాస్తానె-అదబె-హైదరాబాద్" అనునవి అతని ప్రసిద్ధ రచనలు. అవికాక అతడు ఎందఱోకవుల కావ్యసంగ్రహములను'టీకా సహితముగా ప్రకాశింపజేసెను. 'జోర్'దక్కనీ భాషాసాహిత్యమునందు విశేషజ్ఞానము కలవాడు. అతడు హైదరాబాదలో ఉర్దూ సాహిత్య పరిశోధనకై ఒక సంఘమును ఏర్పాటు చేసెను. అదినేటికిని పరిశోధనలుజరుపుచున్నది. జోర్ రచన సామాన్యము-నీరసము.

అబ్దుల్ ఖాదిర్ సర్వరీ ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఉర్దూభాషాధ్యక్షుడు. "జదీద్ ఉర్దూ షాయిరీ", "దున్యాయె అఫ్సానా", "ఉర్దూ మస్నవీకా ఇర్తిఖా", మొదలగు అతని అనేక రచనలు ప్రకాశితములు. ఇవికాక అతడు ఇతర భాషలలోని గల్పికలను అనువదించి కవుల కావ్యసంగ్రహములపై టీకాలు వ్రాసెను. సమకాలీనులగు దాక్షిణాత్యవిమర్శకులలో విశిష్టస్థానము కలవాడతడు.

డా. అందలీబ్ షాదానీ, ఢాకా విశ్వవిద్యాలయములో ఉర్దూ ఫారసీ భాషల ప్రొఫెసరు. అతని పరిశోధనాత్మక విషయము ఫారసీ భాష అయినను ఉర్దూలోను విశేషముగా వ్రాసినాడు. అతడు విమర్శకుడే కాక కవి కూడ. అతని కథల సంగ్రహములును ప్రకాశితములైనవి. అతడు అధికముగా ఉర్దూ కవితలోని లోపములనే సూచించు రచనలు చేసెను. అతని వ్యాసములన్నియు, "తహాఖీఖాత్" అను పేర ప్రకాశితములు.

డా. అబ్దుల్లా పంజాబ్ విశ్వవిద్యాలయమున ఉర్దూ భాష ప్రొఫెసరు. అతడు అధికముగా ఫారసీలోనే పరిశోధనలు జరిపెను. అయినను ఉర్దూలోను చాలవఱకు వ్రాసెను. ఉర్దూ గద్యమును గూర్చి ఆంగ్లమున ఒక గ్రంథము వ్రాసెను. ఆ విషయమునే విపులముగా అనేక వ్యాసముల రూపమున కూడ రచించెను. ఫారసీలో వ్రాసిన హిందూరచయితలను గుఱించియు అతడొక పుస్తకమును వ్రాసి ప్రచురింపజేసెను. అతడును క్రొత్తరకపు విమర్శలు చేసెను. కాని ప్రాచీన సాహిత్యపరిశోధనయందే అతనికి అభిరుచి అధికము. "బహాసో-నజర్" అను పేరుగల అతని వ్యాస సంపుటి ప్రకాశితమైనది.

ఇంకను అనేకుల పేర్లు విడిచి పెట్టబడినవి. వ్రాసినంతవఱకైనను సమగ్రము కాదు. అంతకుమించి వ్రాయుటయును సంభవము కాదు. వ్రాసినంత వఱకు చదివినచో ఆంగ్లభాషా ప్రభావము వలన ఉర్దూ గద్యపద్యరచనలో ఎంతటి మహత్తర పరిణామములు జరిగెనో విశదమగును. ఆలోచనా విధానముపైనను, శైలిపైనను ఆ ప్రభావము పడెను. భాషావిస్తృతికై ఎన్ని అవసరమో అన్ని విషయములలో సర్ సయ్యద్ కాలమునుండి నేటి వఱకు కృషి జరుగుచున్నది. ఆంగ్లభాషను స్వీకరించుట మఱియు బహిష్కరించుట అనుద్వయభావము తోడ్తోన సాగినవి. అయినను చారిత్రక కారణములవలన సమస్త ప్రపంచముమీద పైవ్యాపించియున్న నవయుగమునకు ఉర్దూసాహిత్యము సందేశహారియైనది. భారతదేశపు సామాజిక, రాజకీయ చైతన్యము ననుసరించి ఉర్దూ సాహిత్యమున నవీన విషయములను గ్రహించు శక్తి కలిగినది. ఉర్దూ సాహిత్యము ఈ విధముగ సమస్త జీవనముపై ఆక్రమించినదో ఆ వృత్తాంతము ముందటి అధ్యాయమున వివరింపబడును.



# పదునొకండవ అధ్యాయము

## నూత్నదిశలు – మఱియు భవితవ్యము

ఇప్పటివఱకు వర్తమాన యుగమునకు సంబంధించి ఏయే కవులను, రచయితలను గుఱించి వ్రాయబడినదో వారి సామాజిక చైతన్యము మఱియు సారస్వత దృక్పథము పరస్పర విభిన్నమైనది. ఐనను వారు తయారుచేసిన భూమి కను వారు సృష్టించిన వాతావరణమును గ్రహింతుమేని దానివలన ఉర్దూ సాహిత్యము ఏ దిశవైపు పయనించుచుండెనో తెలిసికొనగలము – చారిత్రక కారణముల ననుసరించియు, ఉత్పాదనయొక్క ఆర్థికరూపముల ననుసరించియు సాహిత్య సంప్రదాయములు తారుమారగుచుండును. కనుక భారతదేశమున కలుగుచున్న పరివర్తనములను పరిశీలించుట ఆవశ్యకము.

మొదటి ప్రపంచ యుద్ధము తరువాత అనేక దేశములలో స్వతంత్రత మఱియు విప్లవమునకు సంబంధించిన తరంగములు లేచినవి. యుద్ధకాలముననే రష్యాలో సామ్యవాదము నెలకొనెను. ఆశియాలో జాగృతి కలుగుచుండెను. వైజ్ఞానిక ప్రగతి వలనను, పారిశ్రామిక ప్రగతి వలనను మానవ స్వాతంత్ర్యము మఱియు ఉన్నతికి సంబంధించిన కల్పన లన్నియు యథార్థములగు ననుపించు చుండెను. కాబట్టి క్రీ. శ. 1919 వ సంవత్సరమున ఆంగ్ల ప్రభుత్వము కొన్ని విధానములను సంస్కరించినప్పటికి ఇచటి మధ్యమవర్గము కూడ దానివలన సంతుష్టి పొందలేదు. యుద్ధ సమయమున భారతదేశము ఐరోపాకు చాల సన్నిహితమయ్యెను. అచటి ప్రేరణచే తన భవిష్యన్నిర్మాణమునకు పూనుకొనెను. అందుచే కాంగ్రెసు మఱియు ఇతర రాజకీయ సంస్థలు శక్తివంతము లగుటకై క్రొత్త క్రొత్త యోచనలు చేయ సాగెను. కాని నిమ్నవర్గములను సంపూర్ణముగా వెంటగొనని కారణమున సంస్కార పథమున కొంతదవ్వరిగి నిలిచిపోవలసి వచ్చుచుండెను. రచయితలలోను విమర్శకుల లోను ఉత్పన్నము లగుచుండిన విప్లవ భావములును కాల్పనికములై కేవల భావుకములై పోవుచుండెను. అవి వాస్తవికతతో సంబంధములేనివి. సారాంశ మేమన అభ్యుదయ వాంఛ కేవలము భావములలోనే పరిమితమై యుండెను. విదేశీయుల పాలనకు చిక్కియున్నందున దేశపుదుర్దశను తొలగించుటకై ఎట్టి నిశ్చితమగు

మార్గమును కనుగొన బడకుండెను. తుదకు గాంధీ మహాత్ముడు రాష్ట్రీయతను ఆలంబముగా గొని అభ్యుదయమునకు సంబంధించిన నూత్న దిశలను సూచించుచు ఆందోళనము లేవదీసెను. మార్గము దృగ్గోచర మైనంతనే రాష్ట్రము ముందునకు సాగెను.

సంస్కారమునుండి ఒక మార్గము విప్లవమునకు వెడలును. సంస్కారము అసంభవమని తోచినప్పుడు విప్లవభావమే కలుగును. భారతీయ యువకులకు ఈ మార్గమే కాన్పించెను. వారు ప్రపంచములోని ఇతరవిప్లవాందోళనములచే ప్రేరితులై సంస్కారవాదుల కంటె చాల ముందు నడచుచు విదేశీయులను వెంటనే దేశమునుండి బహిష్కరింప దలచిరి. వారు అత్యుత్సాహముతో జనతంత్రమునకు, సమాజ వాదమునకు సంబంధించిన భావములను ప్రకటింపసాగిరి. భావుకతా బాహుళ్యము వలనను చైతన్యలోపము వలనను వారు అప్పుడప్పుడు ఆటంకవాదు లనిపించు చుండిరి. ఇదొక విధముగా విప్లవముయొక్క 'రోమానీ' ఆకృతి అనవచ్చును. సారాంశమేమన నవీనమగు సామాజిక రాజకీయ పరిస్థితులు నవ్య చైతన్యము కలిగించెను. నవ్య చైతన్యము నవ జీవనమును, నవ్య సాహిత్యమును జన్మింప జేసెను. ఈ సాహిత్యమున భారతదేశపు హృదయ స్పందన విననగును. భవిష్య ద్రూప రేఖలు కననగును.

క్రీ. శ. 1930 వ సంవత్సరము నాటికి దేశమున రాజకీయాందోళనము తీవ్ర రూపము దాల్చెను. కాంగ్రెసు సంపూర్ణ స్వరాజ్య నినాదముచేసెను. రాజకీయ దృక్పథమున మెల్లమెల్లగా ఆర్థిక స్వాతంత్ర్య భావములు సమ్మిశితము లగు చుండెను. సంపూర్ణ స్వరాజ్య వాంఛ కూడ దానిరూపమే అనవచ్చును. ఈ స్వాతంత్ర్య ఘోష సంస్కార వాదమునకు ఒక అఘాతము. ఇది భారతదేశము పురోగమింప వలసిన దిక్కును సూచించుచుండెను. ఈ స్వాతంత్ర్య సమరము బహుముఖమైనది. ఈ సమరము విదేశీయ పరిపాలకుల వ్యతిరేకముననే కాక ఇచటి రాజులు మఱియు జమీందారుల వ్యతిరేకమునను సాగుచుండెను. కనుక వర్గసంబంధ మగు దృక్పథము ననుసరించి ఇచట రచయితలు మఱియు ఆలోచకుల చైతన్యము విభిన్నమై యుండెను. కాంగ్రెసులోనే భిన్న దృక్పథము గలవారుండిరి. కొందఱు చాల పురోగమింప దలచుచుండిరి. కొందఱు మెల్లమెల్లగా స్వాతంత్ర్యము పొంద గోరు చుండిరి.

దేశముయొక్క ఈ ఆర్థికస్థితి మఱియు ఈ స్వాతంత్ర్య భావములు నిమ్న వర్గీయులను కూడ మేల్కొలిపెను. కర్షకులు పలుతావుల ఆయత్తులై యుండిరి. క్రీ. శ. 1928 వ సంవత్సరమున కార్మికుల ఆందోళనము కూడ ప్రారంభమయ్యెను. దాస్యమునుండి విముక్తి పొందుటకై ఇవన్నియు అవశ్యము జరుగవలసియే యుండెను. దేశ పరిస్థితులు మఱియు అంతర్ రాష్ట్రీయ సంఘటనలు సమాజవాద భావములను, సామ్యవాద భావములను దృఢపఱచుచుండెను. భారతదేశ సమస్యల పరిష్కారము విప్లవము ద్వారముననే ఆలోచింపబడుచుండెను. ఇచటి రాజభక్తులగు సంస్కారవాదులు కొందఱు ఈ భావములను విదేశీయములనియు, హింసాత్మకములనియు నిరసించిరి. విదేశీయములగు భావములును, సాహిత్య రూపములును ఏదేశమునందైనను వానిని స్వీకరింపదగిన పరిస్థితు లేర్పడనిదే వ్యాపింపజాలవను సంగతి మఱవరానిది. రాష్ట్రీయత, అంతర్ రాష్ట్రీయత, బుద్ధివాదము, క్రాంతి వాదము, యథార్థవాదము మఱియు సమాజవాదము అనునివి విదేశీయ పారిభాషిక శబ్దానువాదములే, విదేశ చరిత్రకు సంబంధించినవే. కాని పరివర్తనము చెందుచున్న భారతదేశమున ఇవికూడ స్థానము పొందినట్టివే. ఈ శబ్దములును, ఈ భావములును ఇచటి భూమిలోను సంస్కృతిలోను వికాసము పొందిన తరువాతనే ఇచట ప్రయోగింప బడినవి. ప్రారంభమున సమాజవాద మొక కాల్పనిక భావమునకు సమానమయియే యుండెను. కాని కొలది కాలముననే ప్రజలయొక్క జాగృతి, రాష్ట్రీయాందోళనమును దానిచే ప్రభావితము చేసెను. శుద్ధ సంస్కారవాదులు కూడ తమ భావములలో దానిని సమన్వయపఱచ సాగిరి. ఇందుకు ఇంకొక పెద్ద కారణము కూడ కలదు. క్రీ. శ. 1930 తరువాత ఐరోపాలో "ఫాసిజమ్" ప్రబలమగుచుండెను. ఇటలీ మఱియు జర్మనీ దేశములు అభ్యుదయ భావములన్నిటిని అడుగంట ద్రొక్కివైచు ననిపించుచుండెను. కనుక ప్రపంచ మంతటిలో స్వాతంత్ర్యము, శాంతి మఱియు అభ్యుదయములను ఉపాసించువారు ఎందెందు ఉండిరో అందందు "ఫాసిజమ్" విరుద్ధ ప్రచారము మొదలయ్యెను. భారతదేశములో అభ్యుదయ శక్తులన్నియు అందుకు సహకరించెను. కాబట్టి ఈ దేశమున దినదినము సమాజవాదము పట్ల ప్రేమయు "ఫాసిజమ్" పట్ల ఏవగింపును బలపడుచుండెను. క్రీ. శ. 1936 వ సంవత్సరమున "ఫాసిజమ్" విరోధమునను సంస్కృతీ రక్షణ కొఱకును జరిగిన అంతర్ రాష్ట్రీయ సమ్మేళనపు ప్రతిధ్వని ఇచటకూడ వినిపించెను. ఇచటి వివిధ భాషల రచయితలు, కవులు, వైజ్ఞానికులు మఱియు విద్వాంసులు సచేతనులై

నిలిచిరి. ఆనాటినుండి నేటివఱకు భారతదేశము మఱియు దాని బయట జరిగిన సంఘటన లన్నిటివలన అన్ని భాషలవలె ఉర్దూ భాషయు ప్రభావిత మయ్యెను. అంతే కాదు ఉర్దూభాష తన అభ్యుదయ దృక్పథము సహాయమునను, ఆలోచనాత్మక దృక్పథము వలనను రాష్ట్రీయతకు అపాయము కలిగించుచున్న పొరపాట్లను కూడ సూచించు చుండెననుట సమంజసము. సాహిత్య దృష్టితో జూచినచో ఇట్టి జాగృతివలన ఒక గొప్ప పరిణామము కలుగుట విశదమగును. అదేమన దేశము లోని గొప్పభాష లన్నిటిలో అభ్యుదయ రచయితల సంఘము లేర్పడెను. వారు జీవితమును, సాహిత్యమును సమీపమునకు తెచ్చుటకై సర్వవిధముల ప్రయత్నించిరి.

వెనుకటి కమ్మలలో చర్చింపబడిన పరివర్తనము రెండు రూపముల వ్యక్త మయ్యెను. ఒకటి నవీనత, రెండవది ప్రగతిశీలత. ఈ రెంటిని అభిమానించిన రచయితలును నవ్యసాహిత్యమును స్వీకరించుటకు ప్రయత్నించిరి. కాని పరిశీలించి చూచినచో ఈ రెంటికి చాల భేదమున్నట్లు తెలియును. ఈ అధ్యాయమున పై రెండు తెగలకు చెందిన రచయితలను గుఱించి వ్రాయబడును. ఎవరు ఏ తెగకు చెందినవారో సూచింపబడును.

పైన చెప్పబడినట్లు వర్తమాన యుగమున సమస్త సారస్వత విశేషములు అభివృద్ధి చెందెను. ప్రతిరంగమున నూత్న ప్రయోగములు జరిగెను. కనుక రచయితల సంఖ్యయు కవుల సంఖ్యయు చాల పెరిగి పోయెను. ప్రతి రచయితను గుఱించి వ్రాయుట కాని అతని రచనల ఉదాహరణ లిచ్చుటకాని అసంభవము. ఏలయన పలువురు కవులు వివిధ శైలులలో వ్రాసిరి. ఒక శైలికి సంబంధించిన మచ్చు తునకలు చూపినప్పటికిని వారి ఇతర శైలులను గుఱించి అనుమానించుటకు వీలుండదు. అయినను ఆధునిక కాలపు సాహిత్యోన్నతికి సంబంధించిన ఒక చిత్రము కనుల వ్రేలునట్లు చేయుటకై ప్రయత్నింపబడును. పైన పేర్కొనిన పరిస్థితుల ననుసరించి రచయితల ఆలోచనలు కొన్ని యెడల స్పష్టములైనను, చైతన్యపు అస్పష్టత వలన కొన్ని యెడల యథార్థవాదమునకును ఆదర్శవాదమునకును నికటములై సందిగ్ధ కారణము లగును.

ఈ యధ్యాయపు భూమిక ననుసరించి మొట్టమొదట పేర్కొనదగిన కవి "జోష్" మలీహాబాదీ. ఇప్పుడు దరిదాపు ఏబదెనిమిదేండ్ల వయస్సు గల అతని పూర్తి పేరు "షబ్బీర్ హుస్సేన్ ఖాన్". అతడు మలీహా బాద (లక్నో) నివాసి.

అతని తండ్రి, తాత, మఱియు ముత్తాత కవులుగా కీర్తి గాంచిన వారు. వారి కావ్య సంగ్రహములు ప్రకాశితము లైనవి. "జోష్" తొమ్మిది వర్షముల ప్రాయము నుండియే కవితా రచన ప్రారంభించెను. అతడు తన ప్రాథమిక విద్య ఇంటిలోనే పొంది, లఖ్నో, సీతాపూర్, ఆగ్రా మఱియు అలీఘర్‌లలో ఆంగ్ల విద్యను అభ్యసించెను. పితృమరణము వలన కుటుంబ భారము మీద పడెను. విద్యాభ్యాసము అసమగ్రముగా ముగిసెను. స్వంత జమీందారీకి సంబంధించిన తగాదాలకు, బంధువుల అప్రియ వ్యవహారమునకు భయపడి "జోష్" ఇల్లు విడిచి హైదరాబాదలో ఉద్యోగము సంపాదించెను. క్రీ. శ. 1934 వ సంవత్సరమున రాజకీయముల పట్ల గల తన స్వతంత్ర భావముల కారణమున అటనుండి రాష్ట్ర బహిష్కారము చెందెను. కొంతకాలము ఢిల్లీలో ఒక పత్రిక నడపుచు, సినిమాలకు కథలు, పాటలు వ్రాయుచు గడపెను. ప్రస్తుతము "ఆజ్‌కల్" అను ప్రభుత్వ పత్రికకు సంపాదకుడు.[1]

జోష్ కావ్యసంగ్రహములు సుమారు 14 ప్రచురితము లైనవి. "రూహె-అదబ్" అను మొదటి కావ్యసంగ్రహము క్రీ. శ. 1921 వ సంవత్సరమున ప్రచురింపబడినది. తరువాతి సంగ్రహములు క్రీ. శ. 1935 నుండి ప్రకాశితములైనవి. ఇప్పుడతడు "హర్ఫె-ఆఖిర్" అనునొక మహాకావ్యము రచించుచున్నాడు. అది ఎన్నియో భాగములలో ప్రకాశితము కానున్నది. అందలి విషయము మానవ చైతన్య వికాసము యొక్క వైజ్ఞానిక విశ్లేషణ. "నఖ్ష్-వ-నిగార్", "షోల-వ-షబ్నమ్" "ఫిక్రో-నిషాత్", "హర్ఫొ-హికాయత్", "రామిషో-రంగ్", "సుంబులో-సలాసిల్", "సరోదొ-ఖరోష్", "సుమూమొ-సబా", మొదలగునవి అతని ఇతర కావ్యసంగ్రహములు. అతడు గద్యములో కొన్ని రచనలు చేసెను. ఒక శబ్దకోశము తయారు చేసెను. అయినను అతడొక మహా కవి. కవిగానే జీవింపగలవాడు.

జోష్ ప్రారంభ కవితలు నవ్యత కలవైనను సంప్రదాయ బద్ధములే. ఆ కవితలలో భావుకత మఱియు శృంగార దృష్టి గోచరించును. అచటచట భావ గాంభీర్యమును పొడకట్టును. ఆ కాలమున అతడు రహస్యవాద భావముల ప్రభావము కొంత కలవాడు. టాగోరు మఱియు ఇక్బాలుల కవితలచే ప్రేరణ పొందినవాడు. ప్రకృతి చిత్రణపట్ల మక్కువ కలవాడు. రోమాంటిక్ కవులందఱవలె అతడును

---

1. ఈ అనువాదకాలమున "జోష్" పాకిస్థానులో నివసించుచున్నాడు.

సౌందర్యోపాసకుడు. ఆ సౌందర్యము ప్రకృతిలో నున్నను లేదా మానవ జీవితములో నున్నను అతడు దర్శించి ఆనందించువాడు. ఎచట లేకున్నను తన భావనలో కల సౌందర్యమును కాంచియే ముగ్ధుడగువాడు. అతని ప్రారంభ కవితలలో స్వీయ ప్రేమ స్వల్పము. విశ్వ ప్రేమ మఱియు ఈశ్వర ప్రేమకు సంబంధించిన భావములే విశేషము. హైదరాబాదకు వెళ్ళిన పిదప అతని కవితలో శృంగార భావములు అధికమయ్యెను. దేశప్రేమ భావములు అతిశయించెను. రాజకీయ విషయములు క్రమముగా కవితా వస్తువ లయ్యెను. ఆ సమయముననే అతనికి మధుపాన వ్యామోహము కలిగెను. కవిత ఆ చర్చలతోనే నిండిపోయెను. దర్శన శాస్త్రముల పట్ల అభిరుచియు ఆ కాలముననే కల్గెను. పదేండ్ల కాలముననే ఈ విషయము లన్నిటి గూర్చి అత్యంతోత్సాహముతో కవితలు వ్రాయుచు ఇక్బాలు తరువాత ఉర్దూలో అతడే మహాకవిగా పరిగణింపబడెను. తొలుత అతనిని "షాయెరె-ఫిత్రత్" (ప్రకృతి కవి) అనిరి. ఇప్పుడు. "షాయెరె-షబాబ్" (యౌవన భావ కవి) అనియు "షాయెరె-ఇన్ఖిలాబ్" (విప్లవ కవి) అనియు అనుచున్నారు. ఈ మూడు పేర్లు క్రమముగా అతని భావ పరివర్తనమును తెలియజేయును.

"జోష్"కు ప్రాకృతిక, శృంగార, రాజకీయ కవితలు వ్రాయుటలో సమానాధికారము కలదు. భారత దేశపు రాజకీయ జీవితములోని సమస్త సన్నివేశములను గూర్చి అతడు కవితలు వ్రాసెను. రాష్ట్రీయత, హిందూ ముస్లిమ్ ఐక్యత, దేశప్రేమ, జన తంత్రము, శాంతి, భావస్వాతంత్ర్యము మొదలగునవి అతనికి అభిమాన పాత్ర మైనవి. ఈ విషయములనే అతడు తన వేలకొలది కవితలలో ఉత్తేజకరముగా, మనోహరముగా వర్ణించెను. అతని శబ్దములలో అగ్నికి గల వేడిమి, భావములలో జ్వాలాముఖి వంటి శక్తి ఉండును. కనుక అతని కవితలో అప్పుడప్పుడు ఆలోచనా పరుడగు కవిలో ఉండవలసిన గంభీరత కాన్పించదు. క్రీ. శ. 1930 వ సంవత్సర ప్రాంతమున అతనిలో విప్లవ భావములు పెచ్చు పెఱిగినప్పుడు మొట్టమొదట మతమును విమర్శించి భావస్వాతంత్ర్యమును గూర్చి ప్రచారము చేసెను. కాని క్రమక్రమముగా అతడు రాజకీయ విప్లవముపైపే అధిక శ్రద్ధ చూపెను. దర్శన శాస్త్ర దృష్టితో అతడు మానవుని వివశతను అంగీకరించును. కాని ఈశ్వరుని అస్తిత్వమును నిరాకరించును. మానవుని స్వాతంత్ర్యము మఱియు ప్రగతికి సంబంధించిన గీతములు ఆలపించును. అతని భావములోని విషమతకు కారణ మేమన అతడు సామాన్య ప్రజలను, వారి కోరికలను ప్రేమించువాడే కాని వారి

జీవితముతో సాన్నిహిత్యము లేనివాడు. పరిచయమును లేనివాడు. భావము మఱియు క్రియలకు గల ఈ దూరమే అతనిని ఒకప్పుడు ఆటంకవాదిగాను, ఒకప్పుడు శృంగార భావుకుడుగాను, ఒకప్పుడు ప్రతిక్రియావాదిగాను చేసెను. ఈ యన్నిటికి మూలము అతని వర్గజీవితమున శోధింపదగినది.

జోష్‌కు శబ్దప్రయోగముపై అసాధారణమగు అధికారము కలదు. అలంకారములను ఉర్దూలో ఇంత సుందరముగా ప్రయోగించు కవి ఇంకొకడు లేడు. కాలము సమస్త ఉర్దూ సాహిత్య చరిత్రలో అతని కొక ఉన్నత స్థానము నొసగగలదనుటలో సందియము లేదు.

ఉదాహరణ కొఱకు అతని పద్యపాదములు కొన్నియు ఒక కవితయు ఈయబడుచున్నవి:—

అర్జో - సమా కో సాగిరో - పైమానా కర్ దియా
రిందోన్నే కాయెనాత్‌కో మైఖానా కర్ దియా !
కుఛ్ రోజ్ తక్ తో నాజిషె - ఫర్ జాఁగిరహీ
ఆఖిర్ హుజూమె - అఖల్‌నే దీవానా కర్ దియా ! 1

జంగల్ హై, ఆబ్జూ హై, షబే - మాహతాబ్ హై
ఐసేమే ఉన్కో ఢూంఢ్ కే లాయేఁ కహాఁసే హమ్. 2

సమఝ్తి హై మఆలే - గుల్ మగర్ క్యా జోరె - ఫిత్రత్ హై
సహర్ హోతేహి కలియోంపర్ తబస్సుమ్ ఆహిజాతాహై. 3

1. మద్యపానరతులు భూమ్యాకాశములను మధుకలశము మఱియు మఱియు మధుపాత్రలుగా జేసికొనినారు. వారు సమస్త విశ్వమును పానశాలగా మార్చినారు. కొంత కాలము జ్ఞానము వలని గర్వము ఉండినది. తుదకు జ్ఞానము అధికమై పిచ్చివానినిగా చేసివైచినది.

2. అరణ్యము, నదీతీరము, వెన్నెలరేయి అన్నియు అమరియున్నవి. ఇట్టి సమయమున ఆమె నెచటినుండి వెదకి తేగలము !

3. పుష్ప వినాశము తెలియును. ప్రకృతి శక్తి యెంతటిది. తెల్లవారగనే మొగ్గలు సుస్మితములగును.

యూఁ జబ్ ఆవేజిష్‌హి ఠహెరీహైతో జత్ట్రేఛోడ్‌కర్
ఆద్మీ ఖుర్షీద్‌పే దస్తో - గరీబాఁ క్యోం నహో. 1

* * * *

వో గరీబ్ దిల్‌కో సబఖ్ మిలే కి ఖుషీకె నామ్‌సె డర్‌గయా
కభీ తుమ్‌నే హంస్‌కే జో బాత్‌కీతో హమార చెహరా ఉతర్‌గయా 2

"షికస్తే - జిందాఁ కాఖ్వాబ్" (చెఱసాల విఱిగిపోయిన కల) అను పేర గల ఒక కవిత చూడుడు:—

క్యా హింద్‌కా జిందాఁ కాంప్‌రహాహై, గూంజ్‌రహీహైఁ తక్బీరేఁ
ఉక్తాయేహైఁ షాయెద్ కుఛ్ ఖైదీ, ఔర్ తోడ్‌రహేహైఁ జింజీరేఁ।
దీవారోంకే నీచే ఆ ఆకర్, యూఁ జమాహువేహైఁ జిందానీ
సీనోమ్మేఁతలా తుమ్ బిజ్లీకాఁ ఆంఖోమ్మేఁ ఝులక్తీ షష్మీరేఁ।
భూకోంకీ నజర్‌మే బిజ్లీహై, తోపోంకే దహానేఁ ఠండేహైఁ
తఖ్దీర్‌కే లబ్‌కో జుంబిష్‌హై, దమ్‌తోడ్ రహీహైఁ తద్బీరేఁ।
ఆంఖోమ్మేఁ గదాకీ సుర్ఖీహై, బేనూర్‌హైఁ ఆంఖేఁ సుల్తాఁ కీ
తఖ్‌రీబ్‌నే పర్‌చమ్ ఖోలాహై, సిజ్దేమే పడీహైఁ తామీరేఁ।
క్యా ఉన్కో ఖబర్‌థీ జోరో - జబర్ రఖ్తేథే జో రూహే మిల్లత్‌కో
ఉబ్లేంగే జమీఁ సే మారె సియాహ్, బర్సేంగీ ఫలక్‌సే షష్మీరేఁ।
క్యా ఉన్కో ఖబర్‌థీ సీనోంసే జో ఖూఁ చురాయా కర్తేథే
ఇక్ రోజ్ ఇసీ బేరంగీసే ఝుల్‌కేంగీ హజారోఁ తస్వీరేఁ।

---

1. సంఘర్షణమే ఆవశ్యకమైనప్పుడు అణువులతో నేల మానవుడు సూర్యునితోనే సంఘర్షణ పడవలయును.

2. ఈ పేద యెదదపొందిన అనుభవ మెట్టిదన సంతోషము పేరు వినినంతనే భయపడును. ఎప్పుడేని నీవు నవ్వుచు మాటలాడుదువేని నా ముఖము వెలవెల పోవును.

క్యా ఉన్కో ఖబర్ థీ హోంటోంపర్ జో ఖుఫ్ల్ లగాయా కర్తే థే
ఇక్ రోజ్ ఇసీ ఖామోషీసే టప్కేంగి దహక్తీ తఖ్రీరేఁ।
సంఖ్లోంకి వోజిందాఁ టూట్‌గయా, ఋఫ్టోంకీ వోఖైదీ ఛూట్‌గయే
ఉఠ్ఠోంకి వో బైఠీఁ దీవారేఁ, దౌడోంకీ వో టూటీ జంజీరేఁ. 1

ఈ యుగమున రఘుపతీ సహాయ్ "ఫిరాఖ్ చాల పెద్దకవి. విమర్శకుడు - రచయిత. అతడు గోరఖ్‌పూర్ నివాసి. అలహాబాద విశ్వవిద్యాలయమున ఆంగ్ల భాషాధ్యాపకుడు. అతని తండ్రి "ఇబ్రత్" కూడ ఆనాటి మహాకవి. "ఫిరాఖ్" స్వభావము బాల్యమునుండియు గంభీరమైనది. విచారశీలమైనది. అనవరత గ్రంథాధ్యయనము వలన అతని ఆలోచనాశక్తి ప్రబలమైనది. చైతన్యము ప్రకాశవంతమైనది. ఎం. ఏ. పట్టముపొందిన తరువాత అతనికి డిప్టీ కలెక్టరీ దొరకెను. కాని స్వాతంత్ర్య సమరములో పాల్గొని ఆ యుద్యోగమును విడిచి జైలుకు వెళ్ళెను.

"ఫిరాఖ్" కవితా రచన ప్రారంభించిన కాలమున "అమీర్ మీనాయీ" మఱియు "దాగ్" మహాకవుల కీర్తి దేశమంతట వ్యాపించి ఉండెను. తొలుత

---

1. జయనినాదములు (అల్లాహో అక్బర్ మొదలగు నినాదములు) మిన్నుముట్టు చున్నవి. హిందూదేశపు చెఱసాల అల్లలాడుచున్నదా యేమి? కొందఱు ఖైదీలు వినిగి వేసారిరి కాబోలు- సంకెళ్ళను త్రెంచుచున్నారు. గోడల నీడలలో నినాదములు చేయువారు గుమిగూడుచున్నారు. ఎడదలలో మెఱుపులవంటి కల్లోలము చెలరేగుచున్నది. కనులలో కత్తులు మెఱయు చున్నవి. శతఘ్నుల నోళ్లు చల్లవడినవి. అదృష్టపు పెదవులు కదలుచున్నవి. ప్రయత్నములు ప్రాణావశిష్టము లగుచున్నవి. భిక్షుకుల కనులలో రక్తిమ పొడకట్టుచున్నది. ప్రభువు ముఖము కాంతిహీనమైనది. వినాశము ధ్వజమెత్తినది. నిర్మాణశక్తి భూమిపై తలమోపుచున్నది. జాతీయతను అస్తవ్యస్తము చేసివైచిన వారికి ఒకనాడు భూమినుండి నల్లత్రాచులు ఉబికి రాగలవని, ఆకసమునుండి కత్తులు కురియగలవని ఏమి తెలియును? హృదయములనుండి రక్తము దొంగిలించిన వారికి ఒకనాడు ఈ వివర్ణహృదయములలోని అనేక దృశ్యములు చూడనగునను సంగతి ఎట్లు తెలియును? ప్రజల పెదవులను బంధించిన వారికి ఈ నిశ్శబ్దతనుండియే ఒకనాడు మహోజ్జ్వలములగు ఉపన్యాసములు వెలువడగలవని ఎట్లు తెలియును? చెఱసాల మార్మోగుచున్నది. జాగ్రత్తపడుడు. ఖైదీలు విడివడి పోవుచున్నారు. వెన్నంటుడు. గోడలు పడిపోవు చున్నవి. లెండు లెండు. సంకెళ్ళు తెగిపోవుచున్నవి. పరుగెత్తుడు.

"ఫిరాఖ్" "అమీర్ మీనాయీ"చే ప్రభావితుడయ్యెను. ఇతర కావ్యములు చదివిన తరువాత అతని కవిత మార్పు చెందెను. అతనికి ఒక ప్రత్యేకమైన శైలి అలవడెను. అతడు పుట్టుకతో భావుకుడు. దృఢమైన ఆలోచన కలవాడు. జీవితములోని విషమతను మఱియు ఆంతరంగికమగు సంఘర్షణమును అతడు నూత్నశైలిలో ప్రకటింపజేసెను. అతని వాణిలో నమ్రతతోపాటు శక్తి గోచరించును. కరుణతోపాటు మానవజీవితముపై విశ్వాసము వెల్లడియగును. జీవితములోని సమస్త గంభీర విషయములను కవితా వస్తువుగా గ్రహించునట్టి అభ్యుదయవాదులగు రచయితలలో "ఫిరాఖ్" ఒకడు. మొదట అతని భాష ఫారసీ మిశ్రితము. ఇప్పుడు హిందీ శబ్దములను సుందరముగా ప్రయోగించుచున్నాడు. "ఫిరాఖ్" అధికముగా గజలులు వ్రాసెను. "రూహే-కాయెనాత్" అను నజముల సంగ్రహమును "రూప్" అను రుబాయీల సంగ్రహమును ప్రకాశితములైనవి. గద్యరచనలో అతని గ్రంథములనేకములు వెలువడినవి. అయినను అతనికిగల విశేషమహత్వమునకు అతని గజలులే కారణము. "షోలయే-సాజ్", "మిష్-అల్", "రమ్జో-కినాయాత్" మఱియు "షబ్నమిస్తాన్" అనునవి అతని గజలుల సంగ్రహములు.

కొన్ని పద్యపాదము లివి :—

షామ్‌భీ థీ ధుఁవాఁ - ధుఁవాఁ, హుస్న్‌భీథా ఉదాస్ - ఉదాస్
దిల్‌కో కయీ కహానియాఁ యాద్ సీ ఆకె రహ్‌గయీఁ, 1

* * * *

దిల్ దుఃఖ్‌కే రహ్‌గయా యె అలగ్ బాత్‌హై మగర్
హమ్‌భీ తేరే ఖయాల్‌సే మస్రూర్ హోగయే. 2

* * * *

1. సాయంకాలము మసక మసకగా ఉండెను. సౌందర్యము విన్నబోయి యుండెను. హృదయమునకు ఎన్నియో కథలు జ్ఞాపకమునకు వచ్చినట్లయినవి.

2. హృదయము వ్యథ చెందినది. అది వేరు విషయము. కాని మేము కూడ నీ భావనలో ఆనందము పొందితిమి.

కబ్ అప్నే హోష్‌మే షబేగమ్ కాయెనాత్ హై
ఐ దర్దే హిజ్ర్ తూహి బతా కిత్నీ రాత్ హై. 1

* * * *

గరజ్‌కి కాట్ దియే జిందగీకే దిన్ ఐ దోస్త్
వో తేరీ యాద్‌మే హోం యా తుఝే భులానేమే. 2

థర్థరీసీహై ఆస్మానోమ్మే
జోర్ కిత్నాహై నాతవానోమ్మే. 3

* * * *

రఫ్తరఫ్తా ఇష్క్ మానూసే జహాం హోనేలగా
ఖుద్‌కో తేరే ఇష్క్‌మే తన్హా సమఝ్ బైఠేథేహమ్.  4

* * * *

న సమఝ్నేకీహైం బాతేం న యే సమ్ఝానే కీ
జిందగీ ఉచ్టీహువీ నీంద్ హై దీవానే కీ. 5

పంజాబులోని మహాకవులలో "హాఫీజ్" జాలంధరీ ఒకడు. అతడు అభ్యసించిన విద్య సామాన్యము. అతడు స్వభావతః కళావేత్త. ఇప్పుడు అతని వయస్సు సుమారు ఏబదినాలుగు సంవత్సరములు. అతడు ఎన్నియో పత్రికలకు

---

1. విశ్వము విరహవిశ్రాంతి నెన్నడు స్పృహ కలిగియున్నది? ఓ విరహతాపమా! రాత్రి ఎంత శేషించియున్నదో నీవైన తెల్పుము.
2. మిత్రమా? నీ స్మృతిలోనో లేక నిన్ను మరచుటలోనో జీవిత కాలము ఎటులైన నేమి గడపితిమి.
3. ఆకాశము కంపించుచున్నట్లున్నది. బలహీనుల కెంతటి బలము కలదో!
4. నే నొకడనే నీ ప్రేమలో మగ్నుడ ననుకొన్నాను. ప్రేమ క్రమ క్రమముగా ప్రపంచ మంతట తెలిసిపోయినది.
5. ఈ మాటలు గ్రహింపదగినవి కావు. గ్రహింపజేయదగినవి కావు. జీవితమనగా పిచ్చివాని కలతనిద్ర.

సంపాదకుడుగా పనిచేసెను. అతని కవితా సంగ్రహములు ఎన్నియో ప్రకాశితములు. వానిలో "సోజో-సాజ్" మఱియు "తల్ఖాబయేషీరీఁ" అనునవి ప్రసిద్ధములు- ప్రారంభమున హిందీ పోలికలుగల తీయని సరళ భాషలో గీతములు రచించెను. అతని కీర్తి నలుగడల వ్యాపించెను. తరువాత ముసల్మానుల చరిత్రను దీర్ఘమగు కావ్యముగా "షాహనామయే-ఇస్లామ్" అనుపేర రచించెను. దాని నాలుభాగములు ప్రకాశితములైనవి. ఆ కావ్యమువలన అతనికి ముస్లిమ్ సమాజములో విశేష గౌరవము లభించెను. "హఫీజ్" అభ్యుదయ కవులలో లెక్కింపబడడు. కాని సామాజిక, రాజకీయ విషయములకు సంబంధించిన కొన్ని కవితలు కలవు.

అతని ఒక ప్రసిద్ధ గీతములోని కొంతభాగము ఉదాహరణ ప్రాయముగా ఈయబడు చున్నది :

అప్నే మన్ మే ప్రీత్ బసాలే
అప్నే మన్ మే ప్రీత్
భారత్ మాతాహై దుఃఖియారీ - దుఃఖియారే హైఁ సబ్‌నర్‌నారీ
తూహీ ఉఠాలే సుందర మురళీ - తూహీ బన్‌జా శ్యామ్‌మురారీ
తూ జాగేతో దున్యాజాగే - జాగ్ ఉఠే సబ్ ప్రేమ్ పూజారీ
జాగ్ ఉఠే సబ్ ప్రేమ్ పూజారీ
గాయేఁ తేరీ గీత్
బసాలే, అప్నే మన్ మే ప్రీత్. 1

"సాగిర్" నిజామీ హిందీ పఠితలకును పరిచితుడే. అతని కావ్యసంగ్రహములలో ఒకటి దేవనాగర లిపిలో ప్రకాశితమైనది. అతడు "మీరఠ్" నివాసి. "సీమాబ్" అక్బరాబాదీ శిష్యుడు. తొలుత గీతములు, గజలులు మఱియు ప్రేమ కవితలు వ్రాసెను. తరువాత దేశభక్తిలో మగ్నుడై ఆవేశపూరితములగు సుందర కవితలు రచించెను. క్రమక్రమముగా రాజకీయములలో దిగి స్వతంత్రత, సమాజ

1. నీ హృదయమున ప్రేమ నించుకొనుము. భారతమాత దుఃఖితురాలై ఉన్నది. స్త్రీ పురుషులందఱును దుఃఖితులై యున్నారు. నీవే సుందరమగు మురళిని చేగొనుము. నీవే కృష్ణుడవు కమ్ము. నీవు మేల్కొనినంతనే ప్రపంచము మేల్కొనును. ప్రేమారాధకులు మేల్కొందురు. నీ గీతములే పాడుచుందురు. ప్రేమనించుకొమ్ము.

వాదము మఱియు ప్రజాహితమును గూర్చి వ్రాయసాగెను. దేశప్రేమకు హిందూ ముస్లిమ్ ఐక్యతకు స్వాతంత్ర్యసమరమునకు సంబంధించిన చక్కని కవితలు వ్రాసెను. హిందీశబ్దముల కలయికవలన అతని కావ్యశైలి నవీనమనిపించును. అతని కవితలోని సంగీతపు పోకడలు ఆనందముకూర్చును. అతడు గద్యరచనలును చేసెను. ఎన్నియో పత్రికలకు సంపాదకుడుగా పనిచేసెను. అతని కావ్యసంగ్రములు మఱియు గద్య రచనలు చాల ప్రకాశితములైనవి. వానిలో "బాదయే-మష్రిఖ్", రంగ్-మహల్", "మోజొ-సాహిల్" అనునవి ప్రసిద్ధమైనవి.

సువిఖ్యాతములగు అతని రాష్ట్రగానములలో ఇదొకటి :—

సోనే వాలోంకో ఇక్ దిన్ జగాదేంగే హమ్
రస్మొ - రాహే - గులామీ మిటాదేంగే హమ్
తేరే బైరీకే టుక్డే ఉడాదేంగే హమ్
ఆస్మానోం జమీంకో హిలాదేంగే హమ్
కోన్ కహెతాహై కమ్‌జోర్ నిర్బల్ హై తూ
హర్ తరఫ్ ఖూం కే దర్యా బహాదేంగే హమ్
జిస్ తరఫ్‌సే పుకారేగా హిందూస్థాఁ
ఉస్ తరఫ్ హీ వఫాకీ సదాదేంగే హమ్
ఐ వతఁ, ఐ వతఁ, ఐ వతఁ
సర్‌సే బాంధేహువేహైం తిరంగా కఫఁ
ఐ వతఁ, ఐ వతఁ, ఐ వతఁ
జానెమఁ, జానెమఁ, జానెమఁ. 1

---

1. నిదురించు వారి నొకనాడు మేల్కొలుప గలము. దాస్యవిధానమును తుదముట్టించగలము. నీ శత్రువులను ముక్కలుగా చీల్చివైవగలము. భూమ్యాకాశములను అల్లాడించగలము. నీవు అబలవని ఎవరనగలరు? అన్ని దిశల రక్తనదులు ప్రవహింప జేయగలము. హిందూస్థానమేవైపు మమ్ము పిలుచునో ఆ వైపు విశ్వాసపూర్ణముగ బదులు పలుకగలము.
ఓ జన్మభూమీ! త్రివర్ణ పతాకమున "కఫను" వలె శిరమునకు చుట్టుకొని యున్నాము.
ఓ జన్మభూమీ! నా ప్రాణమా!

"అఖ్తర్" షీరానీ 'టోంక్' నివాసి. రొమాంటిక్ కవులలో ప్రథముడగు ఇతడు యౌవనముననే మరణించెను. అతని ప్రేమ కవితలు మధురమైనవి. అవి వినునప్పుడు సుందర సంగీతము వినినట్లనిపించును. ప్రేయసీప్రియులు హాయిగా సవిలాసముగా, సరాగముగా వెన్నెలరేలు గడుప ననువైన ఒక ప్రేమ ద్వీపమును కల్పనల సహాయమున సృష్టింపదలచిన యువకవి అతడు. స్త్రీ ప్రేమకు సంబంధించిన సుందర సుకుమారభావములు అతని కవితలో ఉన్నట్లు ఇంకెవరి కవితలోను లేవు. అతడు ప్రేమ మఱియు దేశభక్తి అను రెంటికొఱకే సర్వస్వత్యాగము చేయదలచెను. ఈ రెండు శబ్దములతోనే అతడు సువిశాలమగు ఊహా సౌధమును నిర్మించెను. అతని శైలిలో సరళత కలదు. మాదకతకలదు. అతని కవితలు పఠితలను రసములో, రంగులో ముంచివైచును. అతని రాజకీయ కవితలు ప్రభావశూన్యములు. నిస్సారమైనవి కూడను. 'అఖ్తర్' షీరానీ కావ్యసంగ్రహములు ఆరేడు ప్రకాశితములైవి. అతడు మంచి గద్యరచయిత. పేరుగల పత్రికా సంపాదకుడు.

ఒక ప్రసిద్ధ కవితలోని కొంతభాగము :—

> ఐ ఇష్క్ ! కహీం లేచెల్, ఇస్ పాప్‌కీ బస్తీసే
> నఫ్రత్ - గహే - ఆలమ్‌సే, లానత్ - గహే - హస్తీసే -
> ఇన్ నఫ్స్ పరస్తోంసే, ఇస్ నఫ్స్ పరస్తీసే
> దూర్ ఔర్ కహీం లేచెల్, ఐ ఇష్క్ ! కహీం లేచెల్.
>
> హమ్ ప్రేమ్ పూజారీహైం, తూ ప్రేమ్ కన్హయ్యాహై
> తూ ప్రేమ్ కన్హయ్యాహై, ఏ ప్రేమ్‌కీ నయ్యాహై.
> యే ప్రేమ్‌కీ నయ్యాహై, తూ ఇస్కా ఖెవయ్యాహై
> కుఛ్ ఫిక్ర్‌నహీ లేచెల్, ఐ ఇష్క్ కహీం లేచెల్. 1

1. ఓ ప్రణయమా! ఈ పాపపు ప్రపంచమునుండి ఇంకెటకేని కొనిపొమ్ము. జుగుప్సాకరమగు లోకమునుండి. నింద్యమైన జీవితమునుండి, ఈ స్వార్థపరులనుండి, ఈ వాంఛాపరతనుండి. ఓ ప్రణయమా! ఎటకేని దూరము కొనిపొమ్ము. మేము ప్రేమారాధకులము - నీవు ప్రేమ కృష్ణుడవు - నీవు కృష్ణుడవు. ఇది ప్రేమ నావ. ఇది ప్రేమ నౌక. నీవు దానికి నావికుడవు. ఇకే విచారమును లేదు. ఓ ప్రణయమా ! కొనిపొమ్ము.

ఇక్ ఐసీ జగ్హే జిస్మే ఇన్సాఁ న బస్తేహోఁ,
యే మక్రో - జఫా - పేషా హైవాఁ న బస్తేహోఁ,
ఇన్సాఁకీ ఖబామే యే షైతాఁ న బస్తేహోఁ,
తో ఖౌఫ్ నహీ లేచెల్, ఐ ఇష్క్ ! కహీఁ లేచల్. 1

"రవిష్" సిద్దీఖీ కూడ వర్తమాన కవులలో ప్రఖ్యాతి కలవాడు. అతడును రొమాంటిక్ భావముల కవియే. ఆశియాలోని జాగృతిచే ప్రభావితుడు. ఫారసీ అరబీ భాషలే కాక హిందీ, ఆంగ్ల, సంస్కృతభాష లెఱిగినవాడు. ఇప్పుడు అతని వయము సుమారు నలుబదైదు సంవత్సరములు. ఇరువదేడు ఇరువది యెనిమిది సంవత్సరములనుండి కావ్యరచన చేయుచున్నాడు. అతడు గజలులు కూడ వ్రాయును. కాని, అతని కీర్తికి కారణమైనవి ఇతర రచనలే. అతని కవితలో కొన్ని రహస్యవాదపు పోలికలు కలవు. భాష ఫారసీ మిశ్రితము. శైలి డా. ఇక్బాల్‌చే ప్రభావితమైనట్లు తోచును. చాల రచనలే చేసినాడు. కాని ఒక సంగ్రహమును ప్రకాశితము కాలేదు.

మచ్చుకు ఒక కవితలోని కొన్ని చరణములు :—

జుల్మో బేదాద్‌కీ బున్యాద్‌కో ఢానేకే లియే
బిజ్లియాఁ ఖ్రసే - గులామీపె గిరానేకే లియే
నక్షె - తజ్వీరె - తమద్దుఁకో మిటానేకే లియే
కిశ్వరే - హింద్‌కో ఆజాద్ బనానేకే లియే
షమయే - బేదారియె - మష్రిఖ్‌కో ఫరోజాఁ కర్‌దే ! 2

1. మనుష్యులు నివసించని చోటికి, క్రౌర్యకాపట్యములు గల జంతువులు లేని చోటికి, మానవాకృతిగల దయ్యాలు లేనిచోటికి, అచట ఏ భయము లేదు కనుక ఓ ప్రణయమా! కొనిపొమ్ము.

2. అన్యాయమును, అక్రమమును పునాదులతో పూడ్చివైచుట కొఱకు, దాస్యతాసౌధముపై పిడుగులు కురిపించుట కొఱకు, బాహ్యమగు సంస్కృతి చిహ్నమును చెఱిపివైచుటకు, భారతదేశమును స్వాధీన మొనర్చుట కొఱకు, ప్రాగ్దిశా జాగృతి దీపమును వెలుగసను ద్రోయుము.

జిస్ తమద్దున్‌మే మసావాత్‌కే అన్వార్ నహీ
జిస్ తమద్దున్‌మే కహీం జల్వాయే ఈసార్ నహీ
జిస్ తమద్దున్‌కా నిగహెబాన్ దిలె - బేదార్ నహీ
జిస్ తమద్దున్‌మే గరీబోంకే లియే ప్యార్ నహీ
ఉస్ తమద్దున్‌కె హర్ ఏవాన్‌కో వీరాం కరదే । 1

ఇంకనొక సువిఖ్యాత కవి "ఎహసాన్" దానిష్ - ఒక బీద కుటుంబమున జన్మించుటవలన అతనికి విద్య నేర్చికొను అవకాశము లభింపలేదు. చిన్నప్పటి నుండియు గ్రంథావలోకన చేయు అభిరుచి యేర్పడెను. ఉర్దూలోని సుప్రసిద్ధ రచయితల రచనలన్నియు చదివెను. జీవికకై పలురకముల చిన్నచిన్న ఉద్యోగములు చేసెను. అతనికి కార్మిక జీవనమునకు సంబంధించిన అనుభవము చాల కలదు. కనుక తన పెక్కు కవితలలో కార్మిక జీవనమును కరుణాజనకముగా చిత్రించెను. అతని కవితలో భావుకత అధికము. చైతన్యము స్వల్పము. అతని దృష్టి గంభీరము కాదు. అయినను సామాన్య జీవనమునకు సంబంధించిన సన్నివేశములను చిత్రించుటలో కృతకృత్యుడయ్యెను. చిన్నవి పెద్దవి ఎనిమిది పది పుస్తకములు ప్రచురించెను. వానిలో "చిరాగాం" మఱియు "ఆతిషె - ఖామూష్" అనునవి ప్రసిద్ధమైనవి. దేశ విభజనకు పూర్వమే లాహోరునకు వెడలిపోయెను.

అతని ఒక హిందీ కవిత :

దీపక్ జాగే, దిన్ ఛుపా, ఘటా పవన్‌కా జోర్
పన్‌ఘట్ సూనాహోచుకా, ఛాయీఘటా ఘన్‌ఘోర్
భూలీ బిసరీ ఆగెయీ, ఫిర్ సాజన్ కీ యాద్
నైనన్ సే, లాగీ ఝడీ, కట్‌నా రైన్ కఠోర్. 2

1. ఏ సంస్కృతిలో సమానత యను కాంతి లేదో, ఏ సంస్కృతిలో త్యాగశీలత లేదో, ఏ సంస్కృతి రక్షకులు వికాసయుక్తమగు హృదయము కలవారు కారో, ఏ సంస్కృతిలో బీదలకై ప్రేమాదరము లేవో ఆ సంస్కృతికి సంబంధించిన సమస్త సౌధములను పాడవడ జేయుము.

2. దీపములు వెలిగినవి. సూర్యుడు అస్తమించినాడు. గాలి వేగము తగ్గినది. నీలాటి రేవు నిర్జనమైనది. దట్టమైన మబ్బులు ఆవరించినవి. మఱల మఱచిన ప్రియుని జ్ఞాపకములు వచ్చినవి. కనులనుండి అశ్రుధారలు స్రవింపసాగినవి. రాత్రి గడచుట దుర్భరము.

కవితయొక్క నూత్న శైలితోను, అది పురోగమించుచున్న నూత్న దిశలతోను లఖ్నో చాల ఆలస్యముగా పరిచితమయ్యెను. ''చక్‌బస్త్'' తప్ప ఇంకెవరును తమ కవితలలో నూత్న సమస్యలను చైతన్యవంతముగా చర్చింపరైరి. "జోష్" మలీహాబాదీ లఖ్నోవాడే. కాని అతని జీవితమంతయు అన్య ప్రాంతములలో గడచినది. అతడు అన్య ప్రాంతములలోనే నూత్న సమస్యలతో పరిచితుడయ్యెను. పండిత్ ఆనందనారాయణ్ ''ముల్లా'' లఖ్నోలో "చక్‌బస్త్" శైలిని కొనసాగించెను. అతని వయము ఇప్పుడు ఏబది సంవత్సరములు. ప్రసిద్ధ కాశ్మీర కుటుంబమునకు చెందిన "ముల్లా" ఉన్నత విద్య నేర్చి ఖ్యాతిగల న్యాయవాదిగా పనిచేసి హైకోర్టు జడ్జిగా నియమితుడయ్యెను. ప్రారంభమున కొన్ని ఆంగ్ల కవితలు వ్రాసెను. కొన్ని ఫారసీ కవితలను ఆంగ్లములో అనువదించెను. తరువాత ఉర్దూ కవితలు వ్రాయుటకు ఉపక్రమించెను. అతడు హార్దిక భావములను చక్కగా చిత్రించును. అతని భావములలో గాంభీర్యము కలదు. కొన్ని 'రొమాంటిక్' కవితలు కూడ వ్రాసెను. కాని అధికముగా రాజకీయములను, సామాజిక పరిస్థితులను తన కావ్య వస్తువులుగా గ్రహించెను. అతని శైలి కళాత్మకమైనది. అతని ప్రతిభా వ్యుత్పత్తులు అసాధారణమైనవి. అతని కవిత కేవలము భావుకతకలదే కాదు. గాఢమగు దేశప్రేమ మఱియు మానవ ప్రేమ అతని కవితయొక్క విశిష్టగుణములు. "జూయె-షీర్" అను నతని కావ్య సంగ్రహము ప్రకాశితమైనది.

ఉదాహరణకు అతని గజలుల చరణములు కొన్ని:—

తడప్ షీషేకె టుక్డేభీ ఉడా లేతేహైఁ హీరేకీ
మొహబ్బత్‌కీ నజర్ జల్దీసే పహచానీ నహీఁజాతీ
నజర్ జిస్కీ తరఫ్ కర్కే నిగాహేఁ ఫేర్‌లేతేహైఁ
ఖయామత్ తక్ ఫిర్ ఉస్ దిల్‌కీ పరేషానీ నహీఁజాతీ. 1

* * * *

1. గాజు ముక్కలు కూడ రత్నపు తళుకును అపహరించును. ప్రేమ దృష్టి ద్వారగా గుర్తింపబడదు. ఎవరివైన ఆమె చూచి చూపు మరల్చుకొనునో వారి హృదయ వ్యథ ప్రళయాంతము వఱకు తీరదు.

అభీషబాబ్ హై కర్ లూం ఖతాయేం జీ భర్ కే
ఫిర్ ఇస్ మఖామ్ పర్ ఉమ్రే - రలాం రహే న రహే. 1

*    *    *    *    *

తుమ్నే ఫేరీ లాఖ్ నర్మీసే నజర్
దిల్ కా ఆయీనే మే బాల్ ఆహీగయా. 2

*    *    *    *    *

అసీల్ ఆంఖేం కహాంసే సైరె - గుల్షన్ కే లియే లాయేం
నజర్ జిత్నీభీథీ సర్ఫే - తలాషే - ఆషియాం కర్ దీ. 3

*    *    *    *

హాం యాద్ హై కిసీ కీ వొ పహెలీ నిగాహె - లుత్ఫ్
ఫిర్ ఖూం కొ యూం రగోమ్మే నదేఖా రవాం కభీ. 4

*    *    *    *

క్రీ. శ. 1935 లో భారతదేశమున అభ్యుదయ రచయితల ఆందోళనము బయలుదేరినప్పుడు యువ కవు లందరును ఏదో విధముగా దానిలో చేరిరి. చాల మంది పూర్వ రచయితలును దానిని సమర్ధించిరి. టాగోరు, పండిత జవాహర్ లాల్ నెహ్రూ, మోలానా అబ్దుల్ హక్, ఆచార్య నరేంద్రదేవ్, శ్రీమతి నాయుడు, ప్రేమచంద్ మొదలగు ప్రథమశ్రేణికి చెందిన రచయితలును, ఆలోచకులును

---

1. ఇంకను యౌవన మున్నది కనుక తనివితీర పాపము లాచరింపనిమ్ము. సాగిపోవుచున్న వయము మరల ఈ చోట నిలువగలదో లేదో.

2. నీవు అతి కోమలముగానే దృష్టి మరల్చుకొనినావు. కాని నా హృదయ దర్పణము నెఱె వెట్టినది.

3. నిర్బంధితులు ఉద్యాన విహారమునకై కనులెచటనుండి తెచ్చికొందురు. ఉన్నతదృష్టి యంతయు గూటిని వెదకుటలోనే వెచ్చింపబడినది.

4. ఒకరి ప్రథమ ప్రణయ వీక్షణము స్మృతియందున్నది. ఆ తరువాత రక్తమంత వేగముగ ప్రవహించుట విన్నడు నెఱుగము.

ఈ అభ్యుదయ మార్గమును ఆదరించుటే కాక ప్రజలను సాహిత్యమునకు సన్నిహితులుగా జేయుచున్న ఈ ఆందోళనమే దేశములోని ఆర్థిక దుర్దశ మఱియు మానసిక దాస్యము నుండి విడివడుటకు ఆవశ్యకమగు సులభ మార్గమును, ఆశాభావమును ప్రకటించిరి. ఆంగ్ల ప్రభుత్వము, తద్భక్తులు మఱియు రూఢివాదులు తప్ప అభ్యుదయవాదమును ఇతరు లెవరును వ్యతిరేకింపరైరి. ఈ రూఢివాదులు మఱియు ప్రతిక్రియా వాదు లెవరనగా ప్రభుత్వమును అంటిపెట్టుకొని యున్నవారు, ధనస్వాములు మఱియు ప్రజా చైతన్యమునకు విరోధులైనవారు. మంచి కవులు మంచి రచయితలు ఈ ఆందోళనములో క్రొత్త శక్తిని, క్రొత్త ప్రకాశమును కాంచిరి. పైన పేర్కొనబడిన 'జోష్' మఱియు 'ఫిరాఖ్' మొదలగు కవులు అభ్యుదయ వాదులకు తోడ్పడుటే కాక వారికి మార్గ దర్శకులు కూడ అయిరి. ఈ అభ్యుదయ యాందోళనము వలననే జన్మించి సాహిత్య క్షేత్రమున స్థానము పొందిన కవులు కొందఱు కలరు. వారి పూర్వచరిత్ర ఏదియు లేదు. వారు ఈ ఆందోళనము వలననే రూపొందిరి. ఇప్పుడు వ్రాయబడు వారందఱును సంపూర్ణముగా అభ్యుదయ భావములు కలవారని కాని అభ్యుదయ రచయితల ఆదర్శములను పాటించువారని కాని అనుకోరాదు. అట్లనుకొనుట పొరపాటు. ఈ సంఘము భారతీయ జీవితపు ఉన్నతికి సంబంధించిన భావములకు కేంద్రమగుచుండుట చూచి మధ్యమవర్గపు దుశ్చింతలలో లీనమైయున్న కొందఱు తమ వ్యక్తిత్వమును నిలుపుకొనుట కొఱకే ఇందు చేరిరి. ఎట్టి సామాజిక సిద్ధాంతమును లేని కొందఱు ప్రతీకవాదము, అస్పష్టవాదము, ప్రయోగవాదము మొదలగు అన్యవాదములను అభ్యుదయ వాదములని భ్రాంతిచెంది ఇందు చేరిరి. ప్రతి కవి మఱియు ప్రతి రచయితయొక్క భావములను, ఆలోచనా విధానమును, వర్గ సంబంధమును, దృక్పథమును గుఱించి ఈ సంక్షిప్త చరిత్ర చర్చించుట అసంభవము. ఇచట వారివారి రచనలు మఱియు ఒకటి రెండు పద్యములను సూచింపబడును.

అభ్యుదయాందోళనము ఉత్తర ప్రదేశమున ప్రారంభమయ్యెను. దాని కాంతి దావాలనమువలె త్వరలోనే దేశమంతటను వ్యాపించెను. ఉర్దూ సాహిత్యముతో సంబంధముగల లాహోరు, దిల్లీ, బొంబాయి, పాట్నా, హైదరాబాద మఱియు ఉత్తర ప్రదేశములోని అన్యనగరములు ఈ ఆందోళనమునకు కేంద్రములయ్యెను. నవీనత, ప్రయోగము, వాస్తవికత అను పేర్లు పెట్టి అశ్లీలతను ప్రవేశపెట్టిన రచయితలును ఈ సంఘములో కొందఱుండి రనుటలో సందేహములేదు. ప్రజల దుర్దశ మఱియు

వారి పునరుద్ధరణము వారు పూర్తిగా విస్మరించిరి. అభ్యుదయాందోళన ప్రారంభ దశలో రచయితలుగా మహోన్నత స్థానమును పొందిన ప్రముఖులు కొందఱు క్రమ క్రమముగా అందుండి విడిపోయిరి. డా. తాసీర్, అహ్మదలీ, అహ్మద్‌షా బుఖారీ "పత్రస్", "అఖ్తర్" రాయెపూరీ మఱికొందఱు ఇట్టివారు. వారిలో ఒక విధమగు సంకీర్ణత ఉత్పన్నమయ్యెను. వారు అభ్యుదయ రచయితలకు వేరయిరి. నేటి రచయితలలో ప్రముఖులగు కొందఱను గుఱించి ఇచట వ్రాయబడును.

పంజాబు కవులలో రచయితలలోను అగ్రగణ్యుడగు ఫైజ్" అభ్యుదయ రచయితలలోను అగ్రగణ్యుడే. ప్రస్తుతము (క్రీ. శ. 1954) అతడు పాకిస్థాన్ బందీగా ఉన్నాడు. అంతకు ముందు అతడు కాలేజీలలో అధ్యాపకుడుగా, సైన్యములో మేజరుగా, పత్రికలకు సంపాదకుడుగా పనిచేసెను. అతడు నిరంతరము వివిధ అభ్యుదయ సంస్థలతో సంబంధము కలిగియుండి వానివలన ప్రేరణపొంది నిర్భయముగా సుందర శైలిలో జనతంత్రము భావస్వాతంత్ర్యము మఱియు శాంతిని సమర్థించుచు కవితలు వ్యాసములు వ్రాసెను. "నక్షె-ఫర్యాదీ" మఱియు "దస్తెసబా" అనుపేర్లుగల అతని కావ్యసంగ్రహములు ప్రకాశితములైనవి. ఈ రెండు కావ్య సంగ్రహములు ప్రజాదరణ పాత్రములైనవి. అతని వాణిలో ప్రాచీనుల గంభీరత మఱియు కళానైపుణ్యము కాన్పించును. అట్లే నూత్నజీవనము యొక్క వ్యాకులత మఱియు విప్లవాత్మకమగు ఉత్సాహమును చూడనగును. అంత్య ప్రాసాదినియమములుకల ప్రాచీన కావ్యసంప్రదాయమును తన భావప్రకటనకు అవసరమైనంత వఱకే ఉల్లంఘించెను. అతడు ప్రయోగములతో కాలము గడపినవాడు కాడు. కరుణాజనకము ఆశాపూర్ణము మఱియు శక్తివంతమగు ఒక నవ్యత అతని కవితలో గోచరించినట్లు ఇంకెవరి కవితలోను గోచరించదు.

ఉదాహరణ కొఱకు ఈ చిన్న కవితను చూడుడు :-

ఫిర్ కోయీ ఆయా దిలే - జార్ ! నహీఁ, కోయీ నహీఁ,
రాహరూ హోగ, కహీఁ ఔర్ చెలా జాయేగా.
ఢల్ చుకీ రాత్, బిఖర్నేలగా తారోంకా గుబార్
లడ్ ఖడానే లగే ఏవానోమ్మే ఖ్వాబీదా చిరాగ్.

సోగయీ రాస్తా తక్ తక్‌కె హర్ ఇక్‌రాహ గుజార్
అజ్నబీ - ఖాక్‌నే ధుంధ్లా దియే ఖదోంకే సురాగ్
గుల్‌కరో షమయేఁ బఢాదో మయో - మినావో - అయాగ్
అప్నే బేఖాబ్ కి వాఢోంకో ముఖప్ఫిల్ కర్‌లో
అబ్ యహా కోయినహీ, కోయినహీ ఆయేగా. 1

* * * *

అసార్రిరుల్ హఖ్ "మజాజ్" అభ్యుదయ కవులలో చాల ప్రజాదరణ పొందినవాడు. అతని వయము సుమారు (40) నలుబది సంవత్సరములు. అలీఘర్‌లో శిక్షణపొంది కొంతకాలము ఆలిండియా రేడియోలో పనిచేసెను. అభ్యుదయ భావములు హెచ్చిన పిదప ప్రభుత్వోద్యోగము విడిచిపెట్టి పత్రికలకు వ్రాయుట ప్రారంభించెను. అతని కావ్యసంగ్రహము "ఆహంగ్" అనుపేర పలుతడవలు ప్రకాశితమైనది. ఇదే సంగ్రహము "షబ్-తాబ్" మఱియు "సాజె-నౌ" అను పేర్లతో కూడ ప్రకాశితమైనది. ప్రారంభమున "మజాజ్ "గజలులే వ్రాసెను. కాని త్వరలోనే తన స్వంత మార్గమును కొనుగొనెను. అతని కవితలలో అభ్యుదయాందోళనకు సంబంధించిన వివిధ దశలు కాన్పించును. ఆదిలో "రోమాంటిక్" భావములు కలవాడు. అతని విప్లవాత్మక భావములును "రోమాంటిక్" కల్పనలతో కూడి యుండెను. అభ్యుదయ రచయితల "చేతన"లో అభివృద్ధి కలిగిన కొలది "మజాజ్" కూడ పురోగమనము చేసెను. అతడు భారతదేశపు నవయువకుల ఆసలను, కల్పనలను, వ్యాకులతతోడి కౌతుకమును చిత్రించు జాగృత కవి యన బడును. అతని శైలి శక్తివంతమైనది. ప్రబలమైనది - సరసమైనది. అత డిపుడు వ్రాయుట తగ్గించినాడు. కాని వ్రాసినంత వఱకు ఉన్నత శ్రేణికి సంబంధించినదే వ్రాసినాడు.

---

1. వ్యధిత హృదయమా! మరల ఎవరైన వచ్చిరా? లేరు, ఎవరును లేరు. బాటసారి కావచ్చును. ఇంకెచటికైన వెడలి పోగలడు. రాత్రి కరచి పోయినది. చుక్కల ధూళి విడిపోయినది. సౌధములలో నిద్రావశములగు దీపములు అల్లల్లాడు చున్నవి. పదచిహ్నము లన్నియు ఎదురు చూచి చూచి విదురించినవి. అపరిచితమగు మృత్తిక పదాంకము లన్నిటిని చెఱిపివైచినది. దీపము ఆర్పివైవుము-మద్యమును, కలశమును పాత్రను ఎత్తికొనుము. వివృతములగు ద్వారమును మూసివైవుము. ఇప్పు డిచ్చటికి ఎవరును రారు. ఎవ్వరును రారు.

అతని ఒక సుప్రసిద్ధ కవితలోని కొన్ని పాదములు చూడుడు:—

షహర్ కీ రాత్ ఔర్ మైఁ నాషాదొ నాకారా ఫిరూఁ
జగ్మగాతీ, జాగ్తీ, సడ్కోంపే ఆవారా ఫిరూఁ
గైర్ కీ బస్తీ హై కబ్ తక్ దర్ బదర్ మారా ఫిరూఁ
ఐ గమేదిల్ క్యా కరూఁ ? ఐ వహషతే దిల్ క్యా కరూఁ ?
ఏ రుపెహలీ ఛాంవ్, యే ఆకాశ్ పర్ తారోంకా జాల్
జైసె సూఫీ కా తసవ్వుర్, జైసె ఆషిఖ్‌కా ఖయాల్
ఆహ్, లేకిన్ కోన్ జానే కోన్ సమ్ఝే జీకా హాల్
ఐ గమేదిల్ క్యా కరూఁ ? ఐ వష్హ తే దిల్ క్యా కరూఁ ?
ఇక్ మహెల్ కీ ఆడ్ సే నిక్లా వో పీలా మాహతాబ్
జైసె ముల్లాకా అమామా, జైసె బన్యే కి కితాబ్
జైసె ముఫ్లిస్ కీ జవానీ, జైసే బేవాకా షబాబ్
ఐ గమే-దిల్ క్యా కరూఁ ? ఐ వష్హతే-దిల్ క్యా కరూఁ ?
ఝిల్మిలాతే ఖుమ్ఖుమోంకీ రాహ్ మే జంజీర్ సీ
రాత్ కే హాథోమ్మే దిన్ కీ మోహినీ తస్వీర్ సీ
మేరే సీనే పర్ మగర్ చల్తీహువీ షమ్షీర్ సీ
ఐ గమే-దిల్ క్యా కరూఁ ? ఐ వష్హ తే దిల్ క్యా కరూఁ ? 1

---

1. పట్టణపు రాత్రిలో నేను మ్లాన హృదయుడనై వ్యర్థముగా తిరుగుదునా. ప్రకాశవంతములగు, జాగృతములగు బాటలపై ఆకతాయివలె తిరుగుదునా - పరాయిచోట ఎంత వఱకు గడప గడప తిరుగుదును.

ఓ హృదయ వ్యథా ! నేనేమి చేయుదును. భయ విహ్వల హృదయమా ! నేనేమి చేతును. ఈ వెండి వెలుగు, ఆకాశముపై చుక్కల వల; సూఫీ భక్తుని ఊహవంటిది. ప్రేమించు వాని భావనవంటిది. అయినను హృదయ స్థితి నెవరు గ్రహింప గలరు-ఓ హృదయవ్యథా! .........పీతవర్ణపు చంద్రుడొక సౌధము వెనుకనుండి వెడలినాడు-"ముల్లా" తలకు చుట్టిన పటకావలె, కోమటి లెక్కల పుస్తకమువలె, దరిద్రుని యౌవనమువలె, విధవ వరుచుదనమువలె; ఓ హృదయ............బాటపై వెలుగుచున్న విద్యుద్దీపముల గొలుసు వలె, రాత్రము చేతిలో పగటి సుందర చిత్రమువలె. కాని నా హృదయముపై కత్తి తిరిగి నట్లు, ఓ హృదయ......... .

"మజాజ్" సమకాలికుడగు మొయీన్ అహసన్ "జజ్బీ" ఇప్పుడు అలీఘర్ యూనివర్‌సిటీలో అధ్యాపకుడు. ప్రారంభమున అతడు "ఫానీ" బదాయూనీకి తన కవితలు చూపుచు అతని విషాద శైలిని అనుకరించెను. అభ్యుదయ రచయితల సంఘముతో సంబంధము కలిగిన తరువాత అతని భావములలో మార్పువచ్చెను. ఆ సంఘమునకు సంబంధించి యున్నను కళావిషయమున అతడు ప్రత్యేక దృక్పథము కలవాడు. అతడు గజలులు అధికముగాను ఇతర కవితలు స్వల్పముగాను వ్రాసెను. అతని కవితలు భావమయములు – మనోహరమైనవి. అతడు మానవ జాతి ఆవేదనను, కష్టమును వ్యక్తి ఆవేదనగా అతి సుందరముగా ప్రదర్శించును. అతని కావ్యసంగ్రహము ఫరోజా" అను పేర ప్రకాశితమైనది.

మూడు నాలుగు పద్య పాదములు చూడుడు :—

జబ్ కిష్తీ సాబిత్ సాలిమ్‌థీ, సాహిల్‌కీ తమన్నా కిస్కోథీ
అబ్ ఐ సీ షికిస్తా కిష్తీపర్, సాహిల్‌కీ తమన్నా కౌన్‌కరే. 1

* * * *

యహీ జిందగీ ముసీబత్, యహీ జిందగీ ముసర్రత్
యహీ జిందగీ హఖీఖత్, యహీ జిందగీ ఫసానా 2

* * * *

అబ్ కహాఁ మై ఢూండ్నే జావూఁ సుకూఁకో ఐ ఖుదా
ఇన్ జమీనోమ్మే నహీ ఇన్ ఆస్మానోమ్మే నహీ 3

* * * *

---

1. నౌక దృఢమై యున్నప్పుడు తీరము చేరవలెనను కోరిక ఎవరికుండెను? ఇప్పు డీ విఱిగి పోయిన నౌకపై తీరము చేరవలెనని ఎవరు వాంఛింతురు?

2. ఈ జీవితమే బాధ – ఈ జీవితమే ఆనందము.
ఈ జీవితమే సత్యము. ఈ జీవితమే గాథ.

3. భగవంతుడా ! ఇప్పుడు హృదయ శాంతి నెచట నన్వేషింతును? ఈ ప్రపంచములలో లేదు. ఈ ఆకాశములలో లేదు.

న ఆయె మోత్ ఖుదాయా ! తబాహీ - హాలీమే
యె నామ్ హోగా గమే రోజ్‌గార్ సహనసకా 4

వర్తమానయుగపు విప్లవ కవులలో అగ్రగణ్యుడగు "మఖ్దూమ్-మొహియుద్దీన్" హైదరాబాద వాస్తవ్యుడు. అతడు ఉస్మానియా విశ్వవిద్యాలయమున విద్యాభ్యాసము ముగించుకొని ఒక కళాశాలలో అధ్యాపక పదవి నిర్వహించెను. కొలది కాలములోనే ఉద్యోగము విడిచిపెట్టి కమ్యూనిస్టు పార్టీలోచేరి నేడొక గొప్ప విప్లవనాయకుడయినాడు. ప్రారంభమున పద్యగద్య రచనలు రెంటిలో ఖ్యాతిగాంచెను. కాని ఇప్పుడు సకృత్తుగా వ్రాయుచున్నాడు. టాగూరునుగూర్చి వ్రాసిన ఒక గ్రంథము మఱియు ఒక కావ్యసంగ్రహము ప్రకాశితములైనవి. మఖ్దూమ్ రచనలు చేతనాపూర్ణమైనవి. అతని శైలి మనోహరము - శక్తివంతము. విప్లవాత్మక భావములను కళాత్మశైలిలో ప్రకటించుటలో అతడు నేర్పరి. ఈ విషయము అతని "సుర్ఖ్ సవేరా" అను కావ్యసంగ్రహము వలన నిరూపితమగును. అతడు కొన్ని ఛందోరహితములగు కవితలును వ్రాసెను.

ఉదాహరణ కొఱకు "మశ్రిఖ్" (తూర్పు) అను శీర్షికగల కవితలోని కొన్ని చరణములు చూడుడు :—

ఝుడ్‌చుకేహైం దస్తోబాజూ జిస్కే ఉస్ మశ్రిఖ్‌కో దేఖ్
ఖేల్తీహై సాంస్ సీనేమే మరీజే - దిఖ్‌కో దేఖ్
ఏక్ నంగీ లాష్ బే - గోరో - కఫన్ ఠిఠరీ హువీ
నగ్రబీ చీలోంకా లుఖ్మా ఖూన్మే లిథడీహువీ
ఏక్ ఖబరిస్తాన్ జిస్మే 'హాం' న 'హాం' కుఛ్ భీనహీ
ఏక్ భటక్తీ రూహ్ హై జిస్కా మకాం కోయీ నహీ

4. ఈ దుర్దశలో మృత్యువు రావలదు. భగవంతుడా ! ప్రపంచ బాధలు సహింపలేకపోయెనను అపఖ్యాతి రాగలదు.

ఇస్ జమీనే-మోత్-పర్వర్దాకో ధాయాజాయెగా
ఇక్ నయీ దున్యా, నయా ఆదమ్, బనాయా జాయెగా. 1

జాన్నిసార్ "అఖ్తర్ అలీఘర్‌లో విద్యాభ్యాసముచేసి గ్వాలియర్ మఱియు భూపాల్‌లోని కాలేజీలలో అధ్యాపకవృత్తి చేసెను. ఇప్పుడు అతని వయసు నలుబది సంవత్సరములు. అతని తండ్రి "ముజ్తర్'' ఖైరాబాదీ కూడ ఆనాటి మహాకవి. "అఖ్తర్" విద్యార్థిదశలో ఇతర కవులవలె 'రోమాంటిక్' కవితలు వ్రాయుచు విప్లవముపైపు మొగ్గెను. అతని కావ్య సంగ్రహము ''సలా-సిల్" అను పేరను శాంతిని గుఱించిన ఒక కావ్యము "అమన్-నామా'' అను పేరను ప్రకాశితములైనవి. ఇంక రెండు గ్రంథములు అచ్చులోనున్నవి. అతని కవితలు సజీవములు, సుందరములు. అతడు అభ్యుదయ కవులలో ఉన్నతస్థానము కలవాడు. కొందఱు రాజకీయ విషయములను గూర్చి వ్రాయదగిన స్తోమత అతనికి లేదందురు.

ఒక కవితలోని కొన్ని చరణములు :—

మై ఉన్కే గీత్ గాతాహూఁ, మై ఉన్కే గీత్ గాతాహూఁ
జో షానేపర్ బగావత్ కా అలమ్ లేకర్ నికల్తే హైఁ
కిసీ జాలిమ్ హుకూమత్‌కే ధడక్తే దిల్‌పే చల్తే హైఁ
మై ఉన్కే గీత్ గాతా హూఁ, మై ఉన్కే గీత్ గాతా హూఁ
జో రక్ దేతేహైఁ సీనా గర్మ్‌తో పోంకే దహానోంపర్
నజర్ సే జిన్కే బిజ్లీ కౌంద్‌తీ హై అస్మానోంపర్
మై ఉన్కే గీత్ గాతాహూఁ మై ఉన్కే గీత్ గాతాహూఁ
ఝులస్ సక్తే హైఁ జో షోలోంసే కుఫ్రో-దీన్ కీ బస్తీ కో

1. చేతులు, తెక్కలు విఱిగిన తూర్పును చూడుము. శ్వాస మాత్రము ఆడుచున్న క్షయ రోగిని చూడుము. ఆచ్ఛాదన వస్త్రము లేక అంత్య సంస్కారము చేయు ఆదరువు లేక ముడుచుకొని పోయిన నగ్నశవము పడమటి గ్రద్దలకు కబళమై నెత్తుట దోగుచున్నది. ఎట్టి సవ్వడియు లేని, ఏమియు లేని శ్మశానము - ఎట్టి ఆవాసమును లేక భ్రమించుచున్న ప్రేతాత్మ - మృత్యువును పోషించుచున్న ఈ భూమి పూడ్చివేయబడును. ఒక నవ ప్రపంచము, నవమానవుడు సృష్టింపబడును.

జో లానత్ జా_న్తే హై ముల్క్_ మే ఫిర్కా_-పర_స్తీ కో
మై ఉన్కే_ గీత్ గాతా హూం, మై ఉన్కే_ గీత్ గాతా హూం
వతన్ కే నౌ జవానోమ్మే నయే జజ్బే జగావూంగా
మై ఉన్కే_ గీత్ గావూంగా, మై ఉన్కే_ గీత్ గావూంగా. 1

అలీసర్దార్ జాఫరీ వర్తమాన యుగమున సర్వ శ్రేష్ఠ విప్లవ కవి. అతడు కమ్యూనిస్టు పార్టీ ఆదర్శములను స్వీకరించి తదనుకూల సాహిత్యరచనలే చేసెను. విప్లవాందోళనములలో పాల్గొనుట వలన అతడు పలు తడవలు జైలుకు వెళ్ళెను. అతడు అలీఘర్, ఢిల్లీ మఱియు లఖ్నోలలో విద్యాభ్యాసము చేసెను. ప్రస్తుతము చాల కాలమునుండి బొంబాయిలో నివసించుచున్నాడు. ప్రారంభమున కొన్ని రొమాంటిక్ కవితలు వ్రాసెను. కాని ఇప్పుడు సమస్త సామాజిక రాజకీయ విషయములను యథార్థవాద దృష్టితో చూచుచున్నాడు. అతనిలో ఈ చైతన్యము దేశ చైతన్యముతో ఉత్పన్నమై దానికి దర్పణప్రాయమై యున్నది. అతని కవిత మానవ ప్రేమతో నిండియున్నది. అతని వాక్కు అన్యాయములకు దురంతములకు విరుద్ధముగా జ్వాలాముఖివలె ప్రజ్వరిల్లును. అతని కవితకు అతని వర్గ చైతన్యమే యథార్థమగు ఆవేశము కలిగించినది. ''ఖూన్ కీలకీర్'', "ఏషియాజాగ్ ఉఠా", "అమన్ కా సితారా" మఱియు "పత్థర్ కీ దీవార్" అనునవి అతని ప్రసిద్ధ కావ్య సంగ్రహములు. "నయీదున్యా కో సలామ్" అను పేర ఒక మహాకావ్యము అతనిది ప్రకాశితమైనది. అది సామ్రాజ్య విరోధి భావములు గలిగి ముక్త ఛ్ఛందస్సులో నడచిన చక్కని కావ్యము. 'జాఫరీ' అభ్యుదయాందోళనమును గుఱించి "తరక్కీ పసంద్ అదబ్" అను పేర ఒక ఆలోచనాత్మకమగు గ్రంథము వ్రాసెను. అందలి కొన్ని భాగములు ఇంకను ప్రకాశితములు కావలసియున్నవి.

---

1. ఎవరు భుజముపై విప్లవ ధ్వజము నెత్తి తిరుగుదురో నేను వారి పాటలే పాడుదును. ఒకానొక క్రూర ప్రభుత్వపు గుండెయల మీద నడువగలరో వారి పాటలే పాడుదును. ప్రజ్వరిల్లుచున్న శతఘ్నుల నోళ్లపై తమ ఱొమ్ములు చాచిన వారి పాటలే పాడుదును. ఎవరి దృష్టి పాతమున ఆకాశముపై మెఱపు తీగలు పారాడునో వారి పాటలే పాడుదును. ధర్మాధర్మయుతమగు ఈ ప్రపంచమును అగ్ని జ్వాలలలో కమరించునట్టి వారి పాటలే పాడుదును. దేశములోని కులమత భేదములను అసహ్యించుకొను వారి పాటలే పాడుదును. నా మాతృ భూమిలోని నవ యువకులలో నూత్నావేశము కలిగించెదను. నేను వారి పాటలే పాడెదను.

అతని ముక్తచ్ఛందమునుండి కొన్ని ఉదాహరణములు :—

జాగ్ హిందూస్థాఁ అప్నే ఖ్వాబె గిరాఁసే
దేఖ్ ఆజాద్‌కీ సుబహకానూర్ ఫైలాహువాహై ।
తేరే బర్సోంకే బిఛడేహువే లాల్ ఘర్ ఆరహేహై
యే గులామీకీ జంజీర్‌కో తోడ్ ఆయే
ఖైద్ ఖానేకే దర్ ఖోల్ ఆయే ।
అప్నీ ఆగోష్‌మే ఇన్కో బఢ్‌కర్ ఉఠాలే
అప్నే దిల్‌మే బిఠాలే,
యే హిమాలా హై, యే వింధ్యాచల్ హై, యే నీలగిరీ హై,
యే తేరే ఖేత్ హైఁ తేరే ఖలియాఁ హైఁ
తేరీ కానేఁహైఁ యే, బాగ్‌హైఁ, యే తేరే కార్ఖానే
యే తేరే సబ్జో - షాదాబ్ మైదాఁ, యే హంస్తీహువీ వాదియాఁ
యే తేరే సాఫోషష్ఫాఫ్ బహ్తీహువీ నదియాఁ
తేరే గోదోంకీ పాలీ బేటియాఁ హై
ఇన్కో అప్నే గలేసే లగాలే
అప్నే పాకీజా ఆంచల్‌కే నీచే ఛిపాలే.

---

1. హిందూ దేశమా : నీ గాఢ నిద్ర నుండి మేల్కొనుము.
చూడుము. స్వాతంత్ర్యము ప్రభాత కాంతి వ్యాపించి యున్నది.
ఎన్నో ఏండ్ల నుండి విడిపోయిన నీ కొడుకులు ఇంటికి వచ్చుచున్నారు.
వీరు దాస్య శృంఖలాలను త్రెంచికొని వచ్చిరి.
చెఱసాలల ద్వారములు తెఱచికొని వచ్చిరి.
ఎదురేగి వీరిని నీ అంకమున చేర్చికొనుము.
నీ హృదయమున నాసీనుల జేసికొనుము.
ఇది హిమాలయము, ఇది వింధ్యాచలము, ఇది నీలగిరి.
ఇవి నీ చేలు, ఇవి నీ కల్లాలు.
ఇవి నీ గనులు, నీ తోట లివి. నీ కర్మాగారములు
ఇవి నీ పచ్చ పచ్చని పచ్చిక బయళ్లు, నవ్వుచున్న లోయ లివి.
ఇవి పాఱుచున్న నిర్మలములగు నీ నదులు.
ఇవి నీ ఒడిలో పెఱిగిన బిడ్డలు.
వీనివి ఆలింగనము చేసికొమ్ము.
నీ పవిత్రమగు పయ్యెద చాటున దాచికొమ్ము.

వర్తమాన యుగపు అభ్యుదయ కవులలో లోకప్రియుడైన కవి "సాహిర్" లుధ్యానీ. అతడును అనేక యువ కవులవలె రోమాంటిక్ కవితలు వ్రాయుచు విప్లవమువైపు మరలినవాడు. అతని ప్రారంభిక కవితలలో ప్రణయ భావములు పఠితలను శృంగార రసార్ణవమున నోలలాడించు నంతటి సుందరమైనవి. ప్రేమ విషయమున గూడ అతడు వర్గ చైతన్యమును దృష్టిలో పెట్టుకొని స్వచ్ఛమగు ప్రేమకు సమాజ మెట్టి ఆటంకములు కలిగించునో అతి కరుణముగా వ్యంగ్యాత్మకముగా వర్ణించెను. ఇప్పుడతడు అధికముగా అభ్యుదయ భావములు గల విప్లవ కవితలు వ్రాయుచున్నాడు. అతని ఉపమానములు సుందరమైనవి. సంకేతములు సూక్ష్మమైనవి. కళాదృష్టితో అతడు ఆధునిక కాలపు ప్రముఖ కవులలో లెక్కింపదగినవాడు. "తల్ఖియాఁ" అను పేరుగల అతని కావ్య సంగ్రహము చాలసార్లు ప్రకాశితమైనది. కొంతకాలమునుండి అతడు సినీ ప్రపంచమున కసిలిపోయినాడు. అతని రచనలు ఇప్పుడు అంతగా కాన్పించవు.

ఉదాహరణకొఱకు ఒక కవితలోని కొన్ని చరణములు చూడుడు :—

జిహాద్ ఖత్మ్‌హువా దౌరే - ఆశ్తీ ఆయా
సంభల్ కే బైఠ్‌గయే మహ్‌మిలోఁమ్మే దీవానే
హుజూమ్ మె - తిష్నలబోంకీ నిగాహ్ సే ఓఝల్
ఛలక్ రహేహైఁ షరాబే - నఫస్ కే పైమానే
యె జష్న్, జష్నె - ముసర్రత్ నహీ తమాషాహై
నయే లిబాస్‌మె నిక్లాహై రహ్‌జనోంకా జులూస్
హజార్ షమయె - ఉఖువత్ బుఝాకే చమ్కేహైఁ
యె తీరగీకె ఉభారే హువే హసీఁ ఫానూస్. 1

అహమద్‌నదీమ్‌ఖాస్మీ పంజాబులోని ఒకగొప్ప అభ్యుదయ కవి. అభ్యుదయ రచయిత. అతడు తనకవితలోను, కథలలోను పంజాబులోనిపల్లెలను సుందరముగా

---

1. యుద్ధము ముగిసినది. శాంతి స్నేహముల కాలము వచ్చినది. తృష్ణాతురుల చూపులకు అందకుండ స్వార్థమదిరా చషకములు నిండి పొరుచున్నవి. ఈ ఉత్సవము ఆనందోత్సవము కాదు. ఇదొక వింత. నూత్న దుస్తులలో దారి దోపిడిగాళ్ళ సమూహము ఊరేగుచున్నది. అంధకారముచే ఉత్తేజపరచబడిన ఈ అందమైన గాజుబుడ్లు సౌభ్రాతృత్వపు దీపములను వేలకొలది ఆర్పివైచి వెలుగుచున్నవి.

చిత్రించినాడు. అతని శైలి విచిత్రమైనది. శబ్ద జాలము తీయనిది. ప్రారంభమున అతడు శృంగార రసాత్మకములగు కవితలే వ్రాసెను. క్రమక్రమముగా దేశపు రాజకీయ చైతన్యముచే ప్రభావితుడై అభ్యుదయ కవితలు వ్రాయసాగెను. అతని కవితలు మానవ ప్రేమను జాగృతమొనర్చునవి. భవిష్యత్కాలపు సుందర స్వప్నములను చిత్రించునట్టివి. అతని అనేక కావ్య సంగ్రహములు ప్రకాశితములైనవి. వానిలో "జలాలో - జమాల్" మఱియు "షోలయే - గుల్" అనునవి ప్రసిద్ధములు.

ఉదాహరణకొఱకు ఒక కవితలోని కొన్ని పంక్తులు చూడుడు :—

ఖయాలో - ఖాబ్‌కీ దున్యాసే భాగ్ ఆయా హూఁ
జవాన్యోంకే చమన్‌జార్ త్యాగ్ ఆయా హూఁ
మై బన్కే రాగ్ గయా, హోకే అగ్ ఆయా హూఁ
షఫఖ్ మే డూబేహువే పర్వతోంపే ఘూమ్‌చుకా
హవామే ఖోయీహుయీ రాగిణీపె ఝూమ్‌చుకా
గులోంకే భీగేహువే ఆరిజోంకో చూమ్‌చుకా
బస్ అబ్ ఉలట్‌కే రహూంగా యే పర్దహోయె ఖదీమ్
కిఅమ్ హోసనకీ తేరీ రహమతోంకీ షమీమ్
కోయీ పుకార్ రహాహై ముఝే నదీమ్ నదీమ్
మై ఆర్జూకో హఖీఖత్ బనాకే దమ్‌లూంగా
మై అప్నీ ఖాక్‌సే నక్షాత్ బనాకే దమ్‌లూంగా
తేరే జహాన్‌కో జన్నత్ బనాకే దమ్‌లూంగా 1

1. స్వాప్నిక జగత్తునుండి. కాల్పనిక జగత్తునుండి పారి వచ్చినాను. యౌవనోద్యానమును వదలి వచ్చినాను. రాగమునై వెళ్ళి అగ్నినై వచ్చినాను.

పర్వతములపై విహరించితిని. గాలిలో లీనమై యున్న రాగములో ఊగితిని. పుష్పముల సిక్త కపోలములను చుంబించితిని. నీ అనుగ్రహ సుగంధము సర్వజనీనము కాకుండుటకై ఈ పురాతన యవనికను ఎత్తి వైచెదను. ఎవరో నన్ను నదీమ్ ! నదీమ్ ! అని పిలుచుచున్నాను. నేను కోరికలను యథార్థముచేసి విశ్రమింతును. నా మృత్తికను సురభిళముచేసి విశ్రమింతును. నీ ప్రపంచమును స్వర్గ మొనరించి విశ్రమింతును.

కైఫీ ఆజమీ కూడ ఒక ప్రఖ్యాత విప్లవ కవి. అతని కావ్య సంగ్రహములు "ఝన్‌కార్" మఱియు "ఆఖిరె - షబ్" అనునవి ప్రకాశితములైనవి. అతడును తొలుత శృంగార కవితలు వ్రాసి తరువాత రాష్ట్రీయత మఱియు స్వతంత్రతను గుఱించి వ్రాయదొడగెను. ఇప్పుడు గొప్ప సామ్యవాద ప్రచారకుడు. తన కవితలో కళాత్మకముగా విప్లవ భావములను ప్రకటించును. అతడు దేశములోను, విదేశముల లోను జరిగిన సంఘటనలను గూర్చి ప్రతిభావంతములగు కవితలు వ్రాసెను. ప్రజల సుఖ దుఃఖములను గూర్చి కళాత్మకముగా రచనలుచేసెను.

అతని ఒక సుందర కవితలోని కొన్ని పంక్తులు :—

కలీకా రూప్ ఫూల్‌కా నిఖార్ లేకే ఆయీథీ
వో ఆజ్ కుల్ ఖజానయే - బహార్ లేకే ఆయీథీ
తమామ్ రాత్ జాగ్నేకే బాద్ చష్మే - మస్త్‌మే
యఖీఁ కారస్, ఉమీద్‌కా ఖుమార్ లేకే ఆయీథీ
బసంతీ సారీమే ఛిపాహువా సావోఁజవాఁ బదన్
జవాఁ బదన్‌పే రేషమీ బహార్ లేకే ఆయీథీ
వో సందలీ కలాయియాఁ, వో సబ్జో - సుర్ఖ్ చూడియాఁ
సొహాగ్ లేకే ఆయీథీ, సింగార్ లేకే ఆయీథీ
మేరీ ఉజాడ్ జిందగీకీ చిల్చిలాతీ ధూప్‌మే
వో గేసువోంకా అబ్రె - ఇత్ర్‌బార్ లేకే ఆయీథీ
ఉదాస్ ఉదాస్ జీస్త్‌కో, సునారహీథీ బాంసురీ
ఘుటే ఘుటే సుకూత్‌మే, సితార్ లేకే ఆయీథీ. 1

1. ఆమె కుట్మలాకృతిని, పుష్పవికాసమును వహించి వచ్చి యుండెను. ఆమె నేడు వసంతశ్రీ నంతటిని కొని వచ్చి యుండెను.

రాత్రమంతయు మేల్కొనిన తరువాత అలస నేత్రములలో విశ్వాస రసమును ఆశా మాదకతను కొని వచ్చి యుండెను.

వసంతీ చీర (ఎఱుపు కలిసిన పసుపుపచ్చ వర్ణముగల చీర)లో తన యౌవన శరీరమును మఱుగుపరచి, యౌవన శరీరమున పట్టు వంటి లావణ్యమును కొని వచ్చి యుండెను. శ్రీగంధపు చెక్కలవంటి ముంజేతులకు పచ్చని, ఎఱ్ఱని గాజులు తాల్చి, ఐదువతనమును, శృంగారమును పూని వచ్చి యుండెను. నా ఎడారి జీవితమను మిడిమిడి ఎండలో, తన శిరోజముల సుగంధాభ్రముతో వచ్చి యుండెను.

నీరసమును నిరీహమును అగు జీవితమునకు మురళీగానము వినిపించుచు ఊపిరి ఆడని నిశ్శబ్దతలో 'సితారు' గొని వచ్చి యుండెను.

క్రొత్త అభ్యుదయ కవులలో "మజ్రూహ్" సుల్తాన్ పూరీ కూడ చాల లోకప్రియుడగు కవి. అతడును ఇతర అభ్యుదయ కవులవలె తొలుత శృంగార కవితలు వ్రాసి వ్రాసి విప్లవ కవితలు ప్రారంభించెను. అతడు అధికముగా గజలులు వ్రాసెను. అతని గజలు లన్నియు "గజల్" అను పేరిట చిన్న సంగ్రహరూపమున ప్రకాశితములైనవి. అధికముగా అతడు సినిమా పాటలే వ్రాయుచున్నాడు. అయినను అతని గజలులలో కావ్యత్వము కలదు. అతనివి అభ్యుదయ భావములుగల సరస కవితలు.

ఉదాహరణకొఱకు కొన్ని పద్యపాదములు చూడుడు :—

దుష్మన్‌కీ దోస్తీహై అబ్ అహ్లే వతన్‌కే సాథ్
హై అబ్ ఖిజాఁ చమన్‌మేన యే పైరహన్‌కే సాథ్
సర్ పర్ హవాయె - జుల్మ్ చలే సౌ జతన్‌కే సాథ్
అప్నీ కులాహ్ కజ్ హై ఉసీ బాంక్పన్‌కే సాథ్
బహ్‌కర్ జమీఁపెహై అభీ గర్దిష్‌మే ఖూఁ మేరా
ఖత్రేవో ఫూల్ బన్తేహైఁ ఖాకే వతన్‌కే సాథ్
కిస్నే కహా కీ టూట్‌గయా ఖంజరే ఫిరంగ్
సీనేపే జఖ్మే - నౌఖీహైదాగే - కుహన్‌కే సాథ్. 1

"వమీమ్" కర్హానీ నవ కవులలో ప్రఖ్యాతుడు. అతడు ఆజమ్‌గఢ్ (యు.పి.) వాస్తవ్యుడు. కొంతకాలము ధార్మిక కవితలును, శృంగార కవితలును వ్రాసి ఆ తరువాత రాష్ట్రీయాందోళనముచే ప్రభావితుడై రాజకీయ కవితలును, విప్లవ

1. ఇప్పుడు నా దేశీయులకు శత్రువులతోడి చెలిమి కలదు. ఇప్పుడు ఆకురాలు కాలము క్రొత్త దుస్తులతో తోటలో ప్రవేశించినది. తలపై క్రౌర్యవాయువులు అనేక ప్రకారముల వీచుచున్నవి. అయినను మా 'టోపీ' అదే ఠీవితో వంగి యున్నది. (టోపీ ఒక వైపు వంగుట వీరలక్షణము). నా రక్తము స్రవించి ఇంకను భూమిపై తిరుగుడువడుచున్నది. నా మాతృభూమి మట్టిలో కలిసినా రక్త కణములు పుష్పము లగుచున్నవి. ఆంగ్లుల కరవాలము విరిగినదని ఎవరందురు. నా యెదదపై పాత మచ్చలతో క్రొత్త గాయము వేరుమ కలదు.

కవితలును వ్రాయుచున్నాడు. అతడు తన కవితలలో ఎడనెడ హిందీ శబ్దములను సుందరముగా ప్రయోగించును. ఇప్పటికి "బర్ఖా - బారాఁ", "రోషన్ అంధేరా", "తరానే" అను మూడు కావ్య సంగ్రహములు అతనివి ప్రకాశితములైనవి. కొంత కాలము నుండి రాష్ట్ర స్వాతంత్ర్య సమరమును గూర్చి ఒక బృహత్ కావ్యము వ్రాయు చున్నాడు.

ఒక రాష్ట్ర గానములోని కొన్ని పంక్తులు చూడుడు :—

హమ్ కామ్‌కే నగ్మే గాతేహైఁ బేకార్ తరానా క్యాజానే
జో సిర్ఫ్ అమల్‌కే బందేహైఁ వో బాత్ బనానా క్యాజానే
రగ్‌రగ్‌మే లహూకో గర్మాతే - జాతేహై వతన్‌కీ జై గాతే
హమ్ అహదే జవానీకే మాతే బూఢోంకా జమానా క్యాజానె
తూఫానోమే కిష్తీ ఖేతేహైఁ కొహ్‌సార్‌సే టక్కర్ లేతేహైఁ
హమ్ జంగ్‌మే సర్‌దేదేతేహైఁ హమ్ పాంవ్ హటానా క్యాజానే.
బే ఖోఫ్ చలే నంగినోంపర్, ఔర్ రోక్‌లే గోలీ సీనోంపర్
లిఖ్ఖాహై హమారీ జబీనోంపర్, హమ్ సర్‌కో ఝుకానా క్యాజానే 1

పండిత్ లబ్భూరామ్ "జోష్" మలిస్యానీ కుమారుడగు బాలముకుంద్ "అర్ష్" మలిస్యానీ స్వయముగా మంచికవి. అతని కవితలలో పురాతన శైలియు, నూతనశైలియు గోచరించును. ఆర్జవము మఱియు సారళ్యము అతని కవితలో మూల సిద్ధాంతములు. అతడు గీతములు, గజలులు మఱియు నజములు అతి నిపుణతతో వ్రాయును. "హప్తరంగ్" మఱియు "చంగో - అహంగ్" అను రెండు కావ్య సంగ్రహములు అతనివి ప్రసిద్ధములు.

---

1. మేము క్రియకు సంబంధించిన పాటలే పాడెదము. వ్యర్థములగు పాట లెఱుగము. కార్యవాదులు మాటలాడుట యెఱుగరు. శరీరములోని ప్రత్యణువున రక్తమును వేడెక్క జేసి మాతృభూమికి జయ పెట్టి పురోగమింతుము. మేము యౌవనోన్మాదము కలవారము. వార్ధక్య కాలము నెఱుగము. తూపానులో నావ నడపుదుము. పర్వతములను ఢీకొందుము. రణములో శీర్ష మర్పింతుము. వెనుదిరుగుట యెఱుగము. కత్తులవలె మొనలు తేలిన రాళ్ళపై నడచుట, మందుగుండును రొమ్ముపై నిలుపుటయే మా నొసట వ్రాయబడినది. మేము తలవంచుట యెఱుగుము.

అతని గజలులోని కొన్ని పద్యపాదములివి :—

జిస్ గమ్‌సే దిల్‌కో రాహత్‌హో, ఉస్ గమ్‌కా మదావా క్యామానీ
జబ్ ఫిత్రత్ తూఫానీ ఠహెరీ, సాహిల్‌కీ తమన్నా క్యామానీ
రాహత్‌మే రంజ్‌కీ ఆమేజిష్, ఇష్రత్‌మే అలమ్‌కీ ఆలాయిష్
జబ్ దున్యా ఐసీ దున్యాహై, ఫిర్ దున్యా దున్యా క్యామానీ
ఖుద్ షేఖో-బిరహమన్ ముజ్రిమ్‌హైఁ ఇక్‌జామ్‌సే దోనోఁపీనసకే
సాఖీకీ బుఖ్ల్ - పసందీ పర్, సాఖీకా షిక్వా క్యా మానీ. 1

జగన్నాథ్ 'ఆజాద్' కూడ పంజాబులోని ప్రసిద్ధ యువకవి. అతడు సుశ్లోకుడగు ఉర్దూకవి తిలోక్‌చంద్ "మహరూమ్'' కుమారుడు. భారతదేశ విభజనానంతరము అతనిలో ఒక విధమగు కరుణారసము పొంగులువారినది. అతని శైలిపై డా. ఇక్బాల్ ప్రభావము కొంత కాన్పించును. అతని రెండు కావ్య సంగ్రహములు "బేకరాఁ'' మఱియు "సితారోంసే జఱ్రోంతక్" అనునవి ప్రకాశితములైనవి. అతని కవితలో అభ్యుదయ భావములు మఱియు మానవ ప్రేమ ఎసలారును.

ఉదాహరణకొఱకు కొన్ని చరణములు :—

బస్ ఏక్ నూర్ ఝలక్తాహువా నజర్ ఆయా
ఫిర్ ఉస్కే బాద్ నజానే, చమన్‌పే క్యా గుజ్రీ 2

1. హృదయమునకు ఆనందము కూర్చునట్టి బాధకు నివారణోపాయము చూచుటలో అర్థమేమి ? స్వభావమే తూపానువలె అల్లకల్లోలమైన దైనప్పుడు తీరమును వాంఛించుటలో అర్థమేమి ? సుఖముతో దుఃఖము, సంతోషముతో విచారము కలిగినదే ప్రపంచమైనప్పుడు ఇట్టి ప్రపంచమునకై పాకులాడుటలో అర్థమేమి ?
ఒకే చషకముతో కలిసి త్రాగరేవందున షేఖు మఱియు బ్రాహ్మణులే నేరస్థులైనప్పుడు పిసినారి యని సాఖీని నిందించుటలో అర్థమేమి ?

2. ఒక ప్రకాశము తళుక్కున కనిపించినది. అపైన ఆరామమున కేమి వాటిల్లినదో తెలియదు.

మై కాష్ తుమ్‌కో భీ అహలే - వతన్ బతా సక్తా
వతన్‌సే దూర్ కిసీ బేవతన్‌పే క్యా గుజ్రీ
మేరే చమన్‌మే భీ ఆయీతో థీ బహార్ మగర్
మై క్యా బతావూఁ కీ అహలే - చమన్‌పే క్యా గుజ్రీ
ఖమూష్ క్యోంహైఁ "ఖతీలో నదీమ్" కుఛ్‌తో కహేఁ
హమారే బాద్ హమారే వతన్‌పే క్యా గుజ్రీ 1

"అఖ్తర్" అన్సారీ ప్రఖ్యాత కవి. మంచి విమర్శకుడు. పేరుగల కథకుడు. అతడు తొలుత "షెల్లీ" మఱియు "కీట్సు"ల కవితచే ప్రభావితుడై నైరాశ్య భావములను కరుణాజనకము లగు భావములను ప్రకటించెను. అభ్యుదయాందోళన ప్రభావము వలన అతడు రాజకీయములగు విషయములను, సామాజిక విషయములను తన కవితా వస్తువలుగా గ్రహించెను. అతని వాక్కు మధురమైనది. శైలి ఉద్వేగ సహితమైనది. అతని కావ్య సంగ్రహములు ఎన్నియో ప్రకాశితములైనవి. వానిలో 'ఆబ్ గీనే', రూహె - అస్ర్" అనునవి ప్రసిద్ధములు.

అతని చిన్న కవితలు రెండు చూడుడు :—

దిల్‌కో బర్బాద్ కియే జాతీహై
గమ్‌బ దస్తూర్ దియే జాతీహై
మర్‌చుకీఁ సారీ ఉమీదేఁ "అఖ్తర్"
ఆర్జూహైకి జియే జాతీహై. (రుబాయి) 2

1. దేశమునకు దూరమున ఒక ప్రవాసి కేమి వాటిల్లినదో, దేశీయులారా! నేను చెప్ప గలిగిన బాగుండును.
నా ఆరామమున కూడ ఆమని అవతరించినది. కాని ఆరామ వాసుల కేమి వాటిల్లినదో ఏమని చెప్పను?
"ఖతీల్" మఱియు "నదీమ్"లు మౌనము ఏల వహించినారు? నేను వెళ్ళిన తరువాత నా దేశమునకు ఏమి వాటిల్లినదో చెప్పవలయును. (వీరిద్దఱును పాకిస్థాన వాస్తవ్యులగు ప్రఖ్యాత కవులు).
2. ఆశ లన్నియు చచ్చినవి. వాంఛ యొకటే జీవించి యుండి హృదయమును పాడుచేయు చున్నది. ఎడతెగని వ్యథను కలిగించుచున్నది.

ఖూఁ భరే జామ్ ఉండేల్తాహూఁ మై
టీస్ ఔర్ దర్ద్ ఝేల్తాహూఁ మై
తుమ్ సమఝ్తేహో షేర్ కహ్తాహూఁ
అప్నే జఖ్మోంసే ఖేల్తాహూఁ మై 1

స్వల్పకాలములోనే ప్రఖ్యాతిగాంచిన కవులలో "వామిఖ్" జోన్పూరీ. ఒకడు అతడు గతయుద్ధపు మధ్యకాలమునుండి గంభీరతతో కావ్యరచన ప్రారంభించెను. కనుక అతని కవిత మీద తత్కాలీన చైతన్యప్రభావము స్పష్టరూపమున కాన్పించును. అతడు అధికముగా రాజకీయ కవితలును, అభ్యుదయకవితలును వ్రాసెను. అప్పుడప్పుడు ముక్తఛందమును ప్రజల భాషలోను వ్రాయుటకు ప్రయత్నించెను. "చీఖేఁ" మఱియు "జరస్" అను రెండు కావ్యసంగ్రహములు ప్రకాశితములైనవి. మొదటి సంగ్రహములోని రచనలన్నియు 1947 లోని హిందూ ముస్లిముల కలహములు మఱియు గాంధీజీ హత్యచే ప్రభావితుడై వ్రాయబడినవి.

ఉదాహరణ కొఱకు కొన్ని చరణములు :—

సుర్ఖ్ దామఁమే షఫఖ్ కే కోయీ తారాతో నహీ
హమ్కో ముస్తఖ్బిలె - జర్రాఁనే పుకారాతో నహీ
దస్తొపాషల్ హైఁ కినారేసే లగా బైఠాహూఁ
లేకిఁ ఇస్ షోరిషే - తూఫాఁనే హారాతో నహీ. 1

దీవానే దీవానే థైరే ఖేల్ గయే అంగారోంసే
అల్లా - పాయీ అబ్ కోయీ పూఛే ఇఁజహానీ బీమారోంసే

1. రక్తముతో నిండిన పానపాత్రలను త్రుమ్మరించుకొనుచున్నాను. వ్యధలను బాధలను పొందుచున్నాను. నేను పద్యము అల్లుచున్నానని నీ వనుకొందువు. నేను నా గాయములను రేపి ఆడుకొనుచున్నాను.

1. సంధ్యారుణాంశుకమున ఏదేని నక్షత్రము లేదుగదా. మమ్ము కాంతివంతమగు భవిష్యత్తు పిలువలేదు గదా. చేతులు కాళ్లు శిథిలములైనవి. ఒడ్డున కూర్చున్నాను. కాని తూఫాను యొక్క అలజడి ఓడిపోలేదు.

కిస్నే బసాయాథా ఔర్ ఇన్కో కిస్నే యూఁ బర్బాద్ కియా
అప్నే లహూఁ కీ బూ ఆతీహై, ఇన్ ఉజ్డే బాజారోంసే. 2

ఇది వఱకు ప్రస్తావింపబడిన కవులలో చాలమంది ఛందోబద్ధమైన కవిత్వము వ్రాసినవారే. అనేకులు నూత్న ప్రయోగములుకూడ చేసిరి. "రాషిద్", "మీరాఁజీ", "ఖాలిద్" మఱియు "సలామ్" ప్రముఖులగు కొందఱు కవులు ప్రాచీన కావ్య శాస్త్రమున చాలమార్పు తెచ్చిరి. భావములను సంపూర్ణముగా ప్రకటించుటకు వీలుగా నుండునట్లు ఛందస్సుయొక్క బంధనము లెన్నిటినో సడలించి ఛందోరహితము లగు కవితలు వ్రాసిరి. తొలుత ఈ పద్ధతి చాల విమర్శలకు గురియయ్యెను - చాల వ్యతిరేకింపబడెను. కాని క్రమక్రమముగా కవులనేకులు ఈ పద్ధతినే అవలంబించిరి. ఈ క్రొత్త ప్రయోగముల మూలముననే అశ్లీలత, అస్పష్టత మఱియు ప్రతిక్రియా వాదములు కూడ కవితలో ప్రవేశించెను. ఇదంతయు అభ్యుదయ వాదుల ఆందోళనమని పలువులు విమర్శించిరి. నిజమునకు అభ్యుదయ వాదులను కవులు అభ్యుదయ భావములను ప్రకటించుట కొఱకే ముక్తఛందస్సును ప్రయోగించిరి. ప్రతిక్రియావాదులు మాత్రము గుప్తములగు తమ నగ్నభావములను అశ్లీల భావములను ప్రకటించుట కొఱకే ప్రయోగించిరి. ఈ కాలపు కవులు అనేకులు ఫ్రాంసు మఱియు అమెరికాలోని పలాయన వాదుల ప్రభావమునకు లోబడిరనుటలో సందేహము లేదు. ఈ ముక్త చందమును మొట్టమొదట ఎవరు ఉపయోగించిరో చెప్పుట కష్టము కాని "రాషిద్" మఱియు "మీరాఁజీ" ఈ శైలిలో ప్రముఖ కవులై దీని వ్యాప్తికి కారకులైరనుట నిశ్చయము. "రాషిద్" "మీరాఁజీ"ని మించిన అభ్యుదయవాది. అప్పుడప్పుడు అతడు సామాజిక విషయములను రాజకీయ విషయములను కూడ స్పృశించెను. "మీరాఁజీ" మాత్రము కేవలము ఫ్రాయెడ్ (Fured) అనుయాయి. అతని సిద్ధాంతములనే "మీరాఁజీ" తన కవితలలోను సుందరగీతములలోను గూఢరచనలలోను వెల్లడించెను. "రాషిద్" కావ్యసంగ్రహము "మావురా" అను నదొకటియే ప్రకాశిత

---

3. పిచ్చివారు పిచ్చివారే కనుక నిప్పుకలతో, చెరలాడినారు. ఈ మానసిక రోగులను పాదములకు బొబ్బలెత్తుట గుఱించి ఎవరైన అడుగవలెను. శిథిలములగు ఈ బాజారుల నెవరు పొందించిరి. ఎవరిల్లు పాడువడ జేసిరి. ఆత్మీయ రక్తపు వాసనయే వీని నుండి వచ్చుచున్నది.

మైనది.'మీరాఁజీ'కావ్యసంగ్రహములు మాత్రము అనేకము ప్రకాశితములైనవి.వానిలో "గీత్_హీ_గీత్", "మీరాఁజీకి నజ్మే" అనునవి ప్రసిద్ధములు. కొన్నినాళ్ళ క్రిందటి వఱకు నవకవులనేకులు అస్పష్టవాదమున చిక్కియుండిరి. కాని వారు రాను రాను, సామాజిక చైతన్యవాదములు ప్రకటించుచున్నారు. "సలామ్ మఛిలీ షహరీ" మంచి కవి. అతడు హిందీశబ్దములను అందముగా ప్రయోగించును. అతని కవితలో విశిష్టమైన నవీనతకలదు. అతని శిల్పము ప్రత్యేకమైనది. "మేరేనగ్మే", 'వస్అతేఁ' మఱియు "పాయల్" అనునవి అతని ప్రకాశిత కావ్యసంగ్రహములు.

ఈ సంక్షిప్త చరిత్రలో ఆధునిక కాలపు మహాకవులనేకులను గుఱించి వ్రాయుటకు వీలుపడలేదు. స్థలాభావమే ఇందుకు కారణము. వీలైనచో ఈ క్రింద పేర్కొనబడిన వారిని స్మరించవలసియుండెను. అలెఅహమద్ "సురూర్", "వజ్ద్" హైదరాబాదీ, (లహూతరంగ్, (ఆఫ్తాబె_తాజా) 'తాబాఁ', (సాజె_లర్జా) జవాద్ జైదీ, (రగే_సంగ్) "జహీర్" కాశ్మీరీ, (అజ్మతె_ఆదమ్) "ఖతీల్" షిఫాయీ (హర్యాలీ, గజర్) గోపీనాథ్ "అమన్", విశ్వేశ్వర్ ప్రసాద్ "మునవ్వర్", (కుమార్_సంభవ్) అఖ్తరుల్_ఈమాన్, (సబ్రంగ్, తారీక్సయ్యారా) జమీల్ మజ్హరీ, (నక్షె_జమీల్) 'మఖ్మూర్' జాలంధరీ, (జల్వాగాహ్, తలాతుమ్) ఫిక్ర్ తోంస్వీ, (హయూలే) నరేష్కుమార్ 'షాద్' (దస్తక్, ఆహటేఁ) 'అదమ్' (ఖరాబాత్, పేచొఖమ్) షాద్ఆర్ఫీ, నియాజ్హైదర్, ఖలీలుర్రహమాన్ ఆజ్మీ, మాసూమ్రజా "రాహీ", బాఖర్మెహదీ, మసూద్ అఖ్తర్ జమాల్, పర్వేజ్ షాహదీ, ఫారిగ్ బుఖారీ, ఇఖ్తిబా రిజ్వీ, (షోలయే_నిదా) పైన పేర్కొనబడిన వారిని గుఱించియు సంపూర్ణ పరిచయము కాని కావ్యసమీక్ష కాని, సమగ్రముగా చేయబడలేదు.

వెనుకటి కొన్ని పుటలను పరిశీలించినవారికి ఉర్దూ కవితా గమనము భారత దేశములోని అన్యభాషల కవితాగమనము కంటె భిన్నమైనది కాదను సంగతి బోధ పడును. నేడు మానవజాతియొక్క ధార్మిక, నైతిక, మానసిక, రాజకీయ జీవితమును కల్లోలపరచుచున్న విషయము లన్నిటిని ఈ కవులు ఉల్లేఖించిరి. వీరిలో కొందఱు విప్లవభావములు కలవారు. కొందఱు నవ్యతనే అభ్యుదయమని భావించువారు. కొందఱు తమ భవిష్యన్నిర్మాణ దృష్టితో ప్రాచీనశైలిని విడిచి క్రొత్త శైలిని అవలంబించినవారు. మఱికొందఱు ఇంకను నడుమ నిలిచి మార్గాన్వేషణ చేయుచున్న వారు. ఈ కవులలో కొందఱు అస్థిరములగు తాత్కాలిక విషయములను గుఱించి

వ్రాసినవారు. మఱి కొందఱు కవితను శాశ్వతభావముల వఱకే పరిమితమొనర్చిన వారు. కొందఱు మార్క్స(Markx)ఉపాసకులు. కొందరుఫ్రాయెడ్(Freud)శిష్యులు. మఱికొందఱు ఈ యిరువురి భావములను సమన్వయ పఱచుటకై ప్రయత్నించిన వారు. ఈ విధముగా ఉర్దూ కవిత వివిధ శైలులు వివిధ మనస్తత్వములు కలదై బహుముఖముగా సాగుచున్నది. దీని భవిష్యత్స్వరూపమెట్లుండునో ఆ సంగతి ఈ ఈ అధ్యాయాంతమున సూచింపబడును.

కవితయే గాక ఉర్దూలో కథాసాహిత్యము కూడ చాల అభివృద్ధి గాంచెను. పాశ్చాత్య ప్రభావము వలన ఇరువదవ శతాబ్దిలోనే కథారచన ప్రారంభింపబడెనని ఇదివఱకే సూచింపబడినది. వెనుకటి అధ్యాయమున కొందఱు కథారచయితల గుఱించియు వ్రాయబడినది. కాని సామాన్య జీవితమునకు సంబంధించిన కథలు తొలుదొల్త "ప్రేమచందు" ఒక్కడే వ్రాసినాడు. నేడు ప్రజాజీవితపు బహుముఖ సంఘర్షణమును దివ్యరూపమున చిత్రించు కథారచయితలలో ప్రేమచందు అగ్ర గణ్యుడు. ఇప్పటి కథకుల చైతన్య వికాసము కవులకు కలిగినట్లే కలిగినది కనుక, దానిని గుఱించి తిరిగి వ్రాయుట అనవసరము. కథకులు విభిన్నవర్గములకు విభిన్న మనస్తత్వమునకు చెందినవారు. వారి భావనలకు మూలములు కూడ విభిన్నములు. కనుక వారందఱను గుఱించి వ్రాయుట అసంభవము. ఇచట కొందఱు ప్రముఖ రచయితలను గూర్చి సంక్షిప్తముగా వ్రాయబడును.

ప్రేమచందు హిందీ, ఉర్దూ రెండు భాషలలో సమాన ప్రజ్ఞ కలవాడు. అతని పేరు "ధనపతిరాయ్" అతడు క్రీ. శ. 1880 వ సంవత్సరమున బనారసు సమీప మున ఒక పల్లెటూరిలో జన్మించెను. ఒక సామాన్య కాయస్థ కుటుంబమున జన్మించుట వలన అతడు ఉన్నత విద్య నభ్యసింపలేకపోయెను. అయినను స్వయంకృషిచే ఉర్దూ, ఫారసీ భాషల నభ్యసించి ఎంట్రెన్స్ పరీక్షలో ఉత్తీర్ణుడై ఉద్యోగము సంపాదించుకొనెను. క్రమక్రమముగా బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడై "డిప్యూటీ ఇన్స్పెక్టర్" ఆఫ్ స్కూల్స్" పదవి పొందెను. క్రీ. శ. 1921 వ సంవత్సరమున స్వాతంత్ర్యాందోళనము జరిగినప్పుడు అతడు ఉద్యోగము విడిచి సాహిత్య నిర్మాణ మున నిమగ్నుడయ్యెను. అతని ఆరోగ్యము ఎప్పుడును బాగుండెడిది కాదు. అయినను జీవితములో చాల భాగము వ్రాయుట చదువుటలోనే గడపెను. క్రీ. శ. 1898 లోనే అతడు రచన ప్రారంభించెను. "సోజె-వతన" అను అతని మొదటి కథా సంగ్రహము ప్రకాశిత మయినంతనే ప్రభుత్వము దానిపై ఆంక్ష విధించి

కుప్పలు కుప్పలుగా దాని ప్రతులను అతని కనుల యెదుటనే తగులబెట్టించెను. అప్పుడతడు ప్రభుత్వోద్యోగి కనుక ''నవాబ్‌రాయ్'' అను మారుపేరుతో వ్రాయుచుండెను. అయినను ప్రభుత్వ గూఢచారులు ఎట్లో గ్రహించిరి. కొంతకాలము తరువాత అతడు ఆ పేరును కూడ విడిచి "ప్రేమచందు" అను పేరుతో ఉర్దూ, హిందీ భాషలలో వ్రాయసాగెను. ఇతర పత్రికల కొఱకు కొంతకాలము వ్రాసి వ్రాసి తుదకు తానే "హంస" అనుపేర ఒక అభ్యుదయ పత్రిక స్థాపించి ఒక ముద్రణా యంత్రమును కూడ నెలకొల్పెను. ఆర్థిక మాంద్యమును తొలగించు కొనుటకై సినీమా రంగములో కూడ పనిచేసెను. అయినను అతని జీవితములో ఎన్నడును సుఖ సంతోషములు లభింపలేదు. క్రీ, శ. 1936 వ సంవత్సరమున అతడు దివంగతుడయ్యెను.

ప్రేమచందును గూర్చి ఉర్దూలో స్వల్పముగను, హిందీలో అధికముగను వ్రాయబడినది. ఇచట అతని కథలలోని వైశిష్ట్యమును గుఱించియే చర్చింపబడును. అతని కథా సంగ్రహములు పలు తడవలు ప్రకాశితములైనవి. ప్రేమచందు సారస్వత జీవనము ప్రారంభించినంతనే అతని మొట్టమొదటి రచనయే తగులబెట్ట బడెను. అతడు నిమ్న వర్గీయులకు అనుకూలముగా లేని పరిస్థితులను మార్చ దలచెను. ఆ మార్పు స్వాతంత్ర్యము లభింపక సాధ్యమగునదికాదు. ఒక పల్లెటూరి బీదకుటుంబమున జన్మించి కష్ట జీవనము గడపినవాడగుట వలన ప్రేమచందు సామాన్య జనులకు సాహిత్యమున స్థానము కలిగించెను. గొప్ప గొప్ప రచయితలు ఈ పనికి పూనుకొనినవారు కారు. అతనికి కర్షకులు, జమిందారులు, చిన్న చిన్న పరిశ్రమలు చేయువారు, అస్పృశ్యులు, మత సంరక్షకులు మొదలగు వారందఱును పరిచితులు. ఆ పరిచయము అతని అనుభవమును విస్తృత మొనర్చెను. సామాన్య జనుల నతడు సజీవ పాత్రలుగా తన రచనలలో ప్రవేశపెట్టెను. అతడేది వ్రాసినను దానికొక ఉద్దేశ్య ముండును. అట్టిది కళాసృష్టికి ఆటంకమగునని అతడెన్నడును తలంపలేదు. తన సమస్త రచనలలో సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల విశ్లేషణ జరిపి సంస్కారమునకును పరివర్తనమునకును త్రోవ చూపు ప్రయత్నము చేసెను. కనుక కళాసృష్టి ననుసరించి అతడు యథార్థవాదు లందఱిలో సర్వోత్తమ స్థానమునకు అర్హుడు. యథార్థ జీవిత చిత్రములను, మనోభావములను హృదయాంతర్గతమగు సంఘర్షణమును, స్త్రీ పురుషుల హృదయ మర్మములను ప్రేమచందు వలె సుందరముగా విస్పష్టముగా ప్రదర్శించు కథారచయిత లరుదు. అతడు

సంతతమును తన రచనలలో స్వాతంత్ర్య వాంఛను, న్యాయబుద్ధిని, అభ్యుదయ వాదమును ఆదరించెను. కనుక అభ్యుదయ రచయితలు అతనిని గొప్ప కళాస్రష్టయే కాక తమ నాయకుడుగా కూడ భావింతురు. అతని రచనలను చారిత్రక దృష్టితో పరిశీలింతుమేని అతడు సంస్కార వాదమునుండి అభ్యుదయవాదము వైపునకును, గాంధీ వాదపు ఆదర్శములతో యథార్థవాదము వైపునకును అతివేగముగా పురోగ మించుట చూడగలము. అతని చివరి రచనలు అతడు అభ్యుదయ శక్తులతో సహకరించు చుండెనని తెలియజేయును. అతనిలో ఆ కాలపు చైతన్యమునకు సంబంధించిన లోపములును ఉండెననుటలో సందేహములేదు. అప్పుడప్పుడు ఒక విధమైన ఆదర్శవాదము అతని వాస్తవికతను అణచిపెట్టును.

ప్రేమచందు ప్రారంభమున వ్రాసిన దంతయు ఉర్దూలోనే వ్రాసెను. అతని భాష అతిసుందరము, సరళము, భావయుక్తము. అతని శైలిని, భాషను ఉర్దూ సమీక్షకు లందఱును ప్రశంసించిరి. అతడు సందర్భోచితమగు శబ్ద ప్రయోగముచే తన కథల ప్రభావమును ఇనుమడింపజేసెను. అతని రచనలలోని గ్రామ్య జీవనము నకు సంబంధించిన సుందర చిత్రములు ఇంకెవరి రచనలలోను కాన్పించవు. అతనిలోని భారతీయత అప్రతిమానమైనది. "సోజె - వతన్", "ప్రేమ్‌పచ్చీసీ", "ప్రేమ్ - బత్తీస్", "ప్రేమ్ చాలీస్", "వరదాత్", "జాదె - రాహ్", "ఖ్యాబొ - ఖ్యాల్", "ఖాకె - పర్వానా", "ఆఖిరీ - తౌహఫా", "దేహాత్‌కే అఫ్సానే" మఱియు "దూధ్‌కీ ఖీమత్" అనునవి అతని ఉర్దూ రచనల సంగ్రహములు - ఏ సంగ్రహములో ఇంత వఱకు చేరని ఉర్దూ కథలుకూడ కొన్ని కలపు.

ప్రేమచందు స్థాపించిన గ్రామీణ జీవన చిత్రణకు సంబంధించిన సంప్రదాయము త్వరలోనే లోకప్రియమయ్యెను. గ్రామ్య జీవనముతో పరిచయము కల రచయిత లందఱును దాని ననుసరించియే రచనలు చేసిరి. "సుదర్శన్", "ఆజమ్ కరేవీ", అలీ అబ్బాస్ హుస్సేనీ" ఉపేంద్రనాథ "అష్క్" మొదలగు వారిపై ఆ ప్రభావము స్పష్టముగా కాన్పించును. వీరందఱును తమ ప్రత్యేకత కలవారే. అయినను ప్రేమచందుచే ప్రేరణ పొందినవారే.

అలీఅబ్బాస్ హుస్సేనీ గాజీపూర్ నివాసి. కొంతకాలము క్రిందటి వఱకు ఉత్తర ప్రదేశ్ విద్యాశాఖలో ప్రిన్సిపాలుగా పనిచేసి యున్నాడు. అతడు సుమారు ముప్పదియైదు సంవత్సరములనుండి వ్రాయుచు ఇప్పటికి అనేక గ్రంథములు

ప్రకాశింప జేసినాడు. అతడు నాటకములు, నవలలు, సమీక్షలు వ్రాయుటలో ప్రజ్ఞ కలవాడు. అయినను కథారచనలోనే అధిక ప్రతిష్ఠకలవాడు. అతని భాష సరళ సుందరము. ప్రవాహశీలము. హార్దిక భావములను చిత్రించుటలో విశేష నైపుణ్యము కలవాడు. ప్రకాశితములైన అతని గ్రంథములలో "రఫీకె-తన్హాయీ", "బాపీపూల్", "ఐ. సి. యస్'', "కుఛ్-హంసీ నహీహై" మఱియు "మేలా ఘూమ్నీ" అమనవి సువిఖ్యాతమైనవి. "షాయద్-కి-బహార్ ఆయీ" (ఇదియే హిందీలో "కోమలనగరీ'' అనుపేర ప్రకాశితము) అను నవల అతి సుందరమైనది. అతడు "ఉర్దూ నావిల్ కీ తారీఖ్ ఔర్ తఙ్ఖీద్" అను నొక నవలా చరిత్ర ఆలోచనాత్మకముగా వ్రాసెను. అతనిలోని మానవ ప్రేమ మఱియు సహృదయత వలననే అతనిలో అభ్యుదయ వాదము ఉత్పన్నమైనది. "హుస్నేసీ'' తొలుత ఆదర్శ వాదమునకును, సంస్కార వాదమునకును సంబంధించిన కథలే వ్రాసెను. క్రమక్రమముగా రాష్ట్రీయత మఱియు సామాన్య మానవుల ఆర్థిక దుర్దశ అతని కథలలో స్థానము పొందెను. అతనిలో ప్రేమచందులో వలె రాజకీయ చైతన్యము లేదు. కాని అతని సుందరశైలి, మధుర శబ్దావలి అతని నొక గొప్ప రచయితగా చేసెను.

ఈ యుగపు ఇతర రచయితలలో ఆజమ్‌కరేవీ, మజ్నూం గోరఖ్‌పూరీ, అల్ అహ్మద్ అక్బరాబాదీ మొదలగువారు సుప్రసిద్ధులే. కాని వారిని గుఱించి ఇచట వ్రాయుటకు వీలుకాదు.

క్రీ. శ. 1936 వ సంవత్సరమున భారతదేశపు అభ్యుదయ రచయిత లందఱు కలిసి ఒక సంస్థ నెలకొల్పిరి. అంతకు పూర్వమే రాజకీయ జాగృతి అతిశయించుట వలన అంతర్జాతీయ భావములు వ్యాపించుట వలన నవయువకులు అనేకులు సాహిత్యమునందు క్రాంతి కలిగించు ప్రయత్నము చేసిరి. సజ్జాద్ జహీర్, రషీద్ జహాఙ, అహమదలీ, మహమూదు జ్జఫర్ తమ కథలు కొన్ని ''అంగారే" అను పేర క్రీ. శ. 1933 వ సంవత్సరమున లఖ్నోనుండి ప్రకాశింప జేసిరి. ఆ గ్రంథము భారతీయ సమాజమున బాంబువలె ప్రేలెను. ప్రజలు విహ్వలులైరి. ప్రభుత్వము దానిని నిర్బంధించెను. అయినను అది ప్రకాశింపబడిన ఉద్దేశ్యము మాత్రము నెరవేరినది. అందలి కథలలో మత సిద్ధాంతములను ఆచార వ్యవహారములను, నైతికాదర్శములను యౌవన దశకు సంబంధించిన భావములను అసమానమగు శైలిలో బాహాటముగా విమర్శించుట జరిగినది. కథా కథన పద్ధతి నవీనము. దానిపై ఐరోపా ప్రభావము విస్పష్టము. కళాదృష్టితో అందలి కథలలో ఎన్నియో లోపములున్నవి.

సమస్యలను గ్రహించుటకు బదులుగా చారిత్రక సామాజిక కారణముల వలన ఉత్పన్నములైన నెరసులు పరిహసింపబడినవి. ఈ పుస్తకము వలన కలిగిన ప్రభావ మేమన నవ్యరచయితలు ఇందలి కథలలోని నిర్భీకతను, వాస్తవికతను స్వీకరించి తమ రచనలలో జీవిత మర్మములను విడమర్చి చెప్పదొడగిరి. రాజకీయ పరిస్థితులను, ఆర్థిక దుర్దశ వలన ఏర్పడిన పరిస్థితులను అనుసరించి సమస్యల పరిశీలనము చేయసాగిరి.

కొన్నిదినముల క్రిందటివఱకు ఈ రచయితలలో ఒకడగు అహమదలీ చాల ప్రసిద్ధివడసి యుండెను. అతని జన్మభూమి ఢిల్లీ. అచటి వ్యావహారికమును సుందరముగా ప్రయోగింపగలవాడతడు. ఆంగ్లభాషలోను మంచి రచయిత. ఇప్పుడు అతడు పాకిస్తాన్‌లో నివసించుచున్నాడు. సకృత్తుగా వ్రాయుచున్నాడు. "షోలే", "హమారీగలీ", "ఖైద్ ఖానా" అను మూడు కావ్య సంగ్రహములు ప్రకాశితములు. అందలి విషయము సామాజికము. మనస్తత్వ సంబంధము కలదికూడ. అతడు సాధారణముగా ప్రతీకలనే ఉపయోగించును. అప్పుడప్పుడు ఐరోపాలోని ప్రతీక వాదులను అనుసరించును. అతడు కళాదృష్టితో గొప్ప రచయితయే కాని అతని భావములు అప్పుడప్పుడు అస్పష్టములగును.

కొంతకాలము క్రిందట మాస్కోలో మరణించిన డా. రషీద్ జహాఁ అత్యంత లోకప్రియమగు రచయిత్రి. జీవితములోని గుప్తవాంఛలను హృదయ భావములను చిత్రించుటలో ఆమె కృతకృతురాలు. సమాజమును గుఱించి ఆమె విమర్శ అతి నిశితము. మాలిన్యమును దాచుటకంటె అందఱ సమక్షమున ప్రదర్శించిననే ప్రజలు సమాజ దుస్థితిని గ్రహించి క్రాంతికై సంసిద్ధులు కాగలరని ఆమె భావము. ఆమె కథలు వ్యంగ్యాత్మకములైనను మనోహరములు - అవి పతితలను ప్రభావితుల జేయును. మధ్యమవర్గ కుటుంబ జీవితమును చిత్రించుటలో ఆమె వ్రాయుట చాలనే వ్రాసినది కాని "ఔరత్" అను పేర ఒక సంగ్రహమే ప్రకాశితమైనది.

ఈ యుగపు కథానికా రచయితలలో సర్వశ్రేష్ఠుడు కృష్ణచంద్ర. అతడు పంజాబులో జన్మించెను. కాశ్మీరులో బాల్యము గడపెను. లాహోరులో ఉన్నత విద్య పడసెను. కొంతకాలము న్యాయవాద వృత్తి నవలంబించి ఉర్దూలోను ఆంగ్లములోను రచనలు చేసెను. ఆరంభమున కొన్ని హాస్యకథ లల్లి హాస్యరచనలు చేసెను. అవి ప్రజాదరణ పొందెను. అప్పటినుండి అతడు అధికసమయము రచనా వ్యాసంగములోనే గడపెను. అతని మొదటి కథాసంగ్రహము "తిలస్మెఖ్యాల్"

ప్రకాశితమైనంతనే అందలి నవీనతను, మనోహరమగు సరళతను చూచి ప్రజలు ఆశ్చర్యచకితులైరి. అందలి కథలన్నియు ప్రేమకథలే. అయినను రచయిత జీవిత తత్త్వమును మానసిక భావములను బాగుగా గ్రహించిన వాడను సంగతి తెల్లమగుచుండెను. కొలది కాలములోనే అతనికి అశేష ఖ్యాతి లభించెను. ఆనాడు అతని కథలను ప్రచురించని పత్రికయే లేదు. కొంతకాలము రేడియోలో ఉద్యోగముచేసెను. మరల దానిని విడిచి తన సమయమునంతయు సాహిత్య నిర్మాణమున గడుపసాగెను. జీవనోపాధికై కృష్ణచంద్ర సినిమా కథలు కూడ వ్రాయుచున్నాడు.

కృష్ణచంద్ర దరిదాపు పదునెన్మిదేండ్లలో పదునెన్మిది కథా సంగ్రహములు ప్రకాశిత మొనరించెను. ఎన్నియో నవలలు వ్రాసెను. మంచి మంచి రచనల సంకలనములు ప్రకాశింప జేసెను. సినిమాల కొఱకును, రేడియోల కొఱకును అనేక నాటకములు రచించెను. ఇచట అతని కథా సంగ్రహముల గుఱించియే వ్రాయబడును. "నజారే", "జిందగీకే మోడ్ పర్", "టూటేహువే తారే", "అన్నదాత", "తీన్ గుండే", "సముందర్ దూర్ హై", "అజంతాసే ఆగే", "హమ్ వహషీ హైఁ", మై ఇన్తెజార్ కరూంగా" అనునవి అతని ప్రశస్తములగు కథా సంగ్రహములు. కృష్ణచంద్ర అగ్రశ్రేణికి చెందిన రచయిత. జీవితములోని ఎత్తు పల్లములను, కల్పనలను, ఆశలను, స్వప్నములను, దుఃఖములను, వేదనలను సంపూర్ణముగా గ్రహించినవాడు. అతనిది సామాజిక దృక్పథము. స్వతంత్రత, శాంతి మఱియు సుఖ భోగములు ప్రాణులందఱకును ఆవశ్యకములని ఆ దృక్పథ మతనిని గ్రహింపజేసెను. ఆధునిక సమాజములోని వర్గభేదము, ప్రజల ఆర్థిక దుర్దశ, శాసన ప్రబంధముల అత్యాచారము, ధనికుల దోపిళ్ళు చూచి చూచి అతని లేఖిని విషలిప్తమై నడచును. అత్యాచారము చేయువారిపై అతడు వ్యంగ్యాత్మక బాణములను ప్రయోగించును. ప్రజలయెడ ప్రేమ, మానవజాతి భవిష్యత్తుపై విశ్వాసము, అత్యాచారము చేయువారి పట్ల అసహ్య భావ ప్రకటనము. అతని కథలలో ఇతి వృత్తములు. సామాన్య ప్రజానీకపు హక్కులను రక్షించుట, వారి కరుణాజనక జీవితములో అమృతము నన్వేషించి వెలికితీయుట కృష్ణచంద్రునకు ప్రియములగు విషయములు. అతడు రాజకీయములు, సామాజికములు అగు బ్రదుకుబాటలన్నిటి దీపముచేగొని పథ ప్రదర్శనముచేయును. ప్రజలను ఔన్నత్యము వైపు, శాంతివైపు నడపించుటకు ప్రయత్నించును.

కృష్ణచంద్రుని భాష భావమయము. అతి సుందరము – మధురము. మఱియు సజీవము. అతని శిల్పములో ఇంద్రజాల ప్రభావము కలదు. పఠితలు పరవశులై అతని రచనల ననుసరింతురు. కొన్ని యెడల అతని కథలలోని ఉద్దేశ్యము అతని కళను అణచిపెట్టును. కనుక అతని లక్ష్యము సంపూర్ణమగు ప్రభావము చూపజాలదు. అయినను గొప్ప కళావేత్త యగుటవలన అట్టి పట్టులలో కూడ తన ప్రత్యేకత నిలుపుకొనును. అతని కళలో ఎందేని లోపముండినను అతని భావములు సదా ప్రజా కల్యాణమును ఉద్దేశించునట్టివి. ఇదియే అతని లోక ప్రియతకు మూలము.

వర్తమాన యుగపు ప్రఖ్యాత రచయితలలో 'సాదత్ హసన్ మంటూ' ఒకడు. అతడు పంజాబు నివాసి – బాల్యము నుండియు వ్రాయుచున్నాడు. అతని కథలు కొన్నియెడల కళాదృష్టితో కృష్ణచందు మొదలగు ప్రఖ్యాత రచయితల కథల కంటె సమగ్రము లనిపించును. అతని భావములు విషయ వాంఛల వఱకే పరిమితములు. అతని కథలలో అనేకములు అశ్లీలములగుచు కొద్దిలో తప్పి పోవును. ప్రజలను రెచ్చగొట్టుటకే అట్టి కథలు వ్రాయుననిపించును. అశ్లీలముగా వ్రాసినందుకై అతనిమీద ఎన్నియోతడవలు మొకద్దమాలు (కేసులు) జరుపబడినవి. అతని కథలలోని నాటకీయత సామాన్య సన్నివేశములను, సమస్యలను కూడ సజీవముగా ప్రభావసహితముగా రూపొందించును. ఒకే ఒక విషయముమీద ఇట్టి అనుపమశైలిలో అనేక కథలు నిర్మించుట అతనికే చెల్లినది. వాసనలలో మునిగి యున్న యువతీ యువకులను, వేశ్యలను, సంఘ పతితులను చిత్రించుటలో అతనిని మించినవారు లేరు. అతడు చాల వ్రాసెను. ఎన్నడును అతని రచనావేగము మంద గించ లేదు. "ధువాఁ", "మంటూ–కే–అఫ్సానే", "లజ్జతే–సంగ్", "నమ్రూద్–కీ–ఖుదాయీ", "ఖాలీడిబ్బే–ఖాలీబోతల్", "ఠండా గోష్త్", "సియాహ్–హాషియే", "యెజీద్", "చొగద్", "బాద్షాహత్–కా–ఖాతిమా" మఱియు "సడక్–కే–కినారే" అనునవి అతని సుప్రసిద్ధ కథా సంగ్రహములు.

రాజేంద్ర సింహ బేదీ ఆధునిక ఉర్దూ రచయితలలో విశిష్టస్థానము గల వ్యక్తి. "దానా–వొ–దామ్", "గ్రహణ్" మఱియు "కోఖ్–జలీ", అను మూడు కథా సంగ్రహము లతనివి ప్రకాశితములు. అతడు వ్రాసినది తక్కువే. కాని వ్రాసిన దంతయు కళాదృష్టితో పరిశుద్ధము, సమగ్రము – సుఖస్వప్నములను భంగపరచునట్టి ప్రజా జీవన సమస్యలు అతని కథల ఇతివృత్తములు. అతని కథలు సుందరములు, సజీవములు, ప్రభావసహితములు. ఒక్కొక్క శబ్దమును,

ఒక్కొక్క వాక్యమును అతడు తూచి తూచి ప్రయోగించును. కథానికలలో ఏ భావమును ఏ శబ్దమును అనవసరము, అసందర్భము కాకుండ అతడు జాగ్రత్త పడును. కనుకనే ఉర్దూలోని ముగ్గురు నలుగురు ప్రఖ్యాత రచయితలలో అతడును గణనీయుడు. అతడు బొంబాయిలో నివసించి ఫిల్ములకై కథలు వ్రాయుచున్నాడు.

అత్యంతమగు ప్రజాదరణ పొందిన రచయిత్రి "ఇస్మత్-చొగ్తాయీ" ఆమె జోధ్‌పూరు వాస్తవ్యురాలు-అలీగర్‌లో విద్యాభ్యాసము చేసి ప్రస్తుతము బొంబాయి లోని సినీప్రపంచమున జీవితము గడపుచున్నది. ఇప్పటికి పదునేను సంవత్సరముల క్రిందట ఆమె తన తొలి రెండు మూడు కథల వలననే పఠితలను ఆశ్చర్యచకితులను చేసినది. ఏదో చెప్పవలసిన విషయము కలిగి, ఆ చెప్పవలసిన దానిని సురుచిర ముగా చెప్పగలిగిన ఒక రచయిత్రి సాహితీ రంగమున ప్రవేశించినదని ఎల్లరును గ్రహించిరి. ఇస్మత్ మధ్యమవర్గ ముసల్మానుల కుటుంబముల ఆంతరంగిక జీవనముతో ఘనిష్ఠ పరిచయము కలది. ఆ కుటుంబముల నైతిక, ఆర్థిక, మానసిక పరిస్థితులను ఆమె కథలు ప్రత్యక్షము చేయును. ఆమె లేఖిని ఇంద్రజాలము కలది. ఆమెయు తన ప్రారంభిక కథలలో లైంగిక సంబంధములగు కథలు వ్రాసి అశ్లీలతవైపు మొగ్గెను. కాని ఆమెలోని వాస్తవికత అశ్లీలతను కప్పివైచును. స్త్రీల మాటల తీరు, వారి ఆచార వ్యవహారములు, వారి ఇచ్ఛలు కామనలు మొదలగు వానిని గుఱించి ఆమెకంటె చక్కగా వ్రాయగలవారు లేరు. ఆమె యొక్క నిర్భీకత ఆశ్చర్యకరము. తద్వారమున ఆమె సమాజనాయకులను చురకలు పెట్టును. ఆమె ప్రథమ శ్రేణికి చెందిన రచయిత్రి. ఆమె కథలను చదివినవారు ఆమె అభ్యుదయ భావములను, మానవ ప్రేమను ప్రశంసింపకుండ ఉండలేరు. ఆమె నాటకములును నవలలును వ్రాసెను. వానిని గుఱించి వేఱొక చోట వ్రాయబడును. "కలియాఁ" "చోటేఁ" "ఏక్‌బాత్" మఱియు "ఛూయీ-మూయీ", అను కథా సంగ్రహము లామెవి ప్రకాశితములు.

ఉర్దూ-హిందీ భాషలలో సమాన ఖ్యాతి వడసిన వాడు ఉపేంద్రనాథ అష్క్. అతడు ప్రేమచందుచే ప్రేరణ పొంది వ్రాయుట ప్రారంభించి మెల్లమెల్లగా తన ప్రత్యేక శైలిని ఏర్పరచుకొనెను. అతని కథలు విశేషముగా మధ్యమవర్గ జీవితము నకు సంబంధించినవి. మానవ జాతి యొక్క ఆర్థిక స్థితిని సంస్కరించుట, సమాజపు నైతిక దృక్పథమున సవరించుట అతనికి ప్రియములగు విషయములు. అతడు కవి. నాటక కర్త కూడ. నవలలను వ్యాసములను కూడ వ్రాసిన వాడు.

విమర్శకు లందఱును నాటక రచనలో కల నేర్పు అతనికి కథారచనలో లేదందురు. అతని కథా సంగ్రహము లెన్నియో ప్రకాశితములైనవి. వానిలో "కోంపల్", "ఢాంచే", "చట్టాన్" మఱియు "నాసూర్" ప్రఖ్యాతమైనవి.

అఖ్తర్ అన్సారీ గొప్ప సాహిత్యకారుడు. కాని దురదృష్టవశమున అతనికి కలుగవలసిన కీర్తి కలుగలేదు. కొందఱతనిని కవిగా భావించిరి. మఱి కొందఱు విమర్శకు డనిరి. నిజమున కతడు గొప్ప కథకుడు. ఆర్జవము, నిరాడంబరత, కళాత్మక సౌందర్యముతో కూడిన తన ప్రత్యేక శైలిలో అతడు గంభీర సమస్యలను ప్రకటించు కథలు వ్రాసెను. అతని కథలు జీవితములోని చిన్న చిన్న సంఘటనలపై ఆధారపడి యుండును. అతడు కళపట్ల చాల శ్రద్ధ చూపును. ఒక సమయమున ఒకే సంఘటనను ప్రభావ సహితముగా చిత్రించుటకు ప్రయత్నించును. అతని "అంధీ-రున్యా, "ఖూనీ" మఱియు "నాజో" అను మూడు కథా సంగ్రహములు ప్రసిద్ధములు.

అఖ్తర్ హుస్సేన్ రాయెపూరీ క్రీ. శ. 1935 ప్రాంతమున కొన్నియే కథలు వ్రాసి గొప్ప యశమును ఆర్జించెను. అతడు అలీఘర్‌లో చదువుచున్న కాలముననే వ్రాయుట ప్రారంభించెను. సంస్కృతము, హిందీ, బంగ్లా మఱియు ఫ్రెంచి భాషలు తెలిసినవాడు. ఆయా భాషల నుండి ఎన్నియో అనువాదములు చేసినవాడు. అతని అనువాదములలో శకుంతలా నాటకానువాదము "ఖాజీ నజరుల్ ఇస్లామ్" కవితల అనువాదము పేర్కొన దగినవి. కథకుడేకాక అతడు మంచి విమర్శకుడు. అభ్యుదయాందోళనము ప్రారంభమైన కాలమున అతని రచనలవలన నవయువకులకు చాల ప్రేరణ కలిగెను. కాని కొంత కాలమైన పిదప అతడీ ఆందోళనము నుండి వైదొలగి ప్రభుత్వ దృక్పథమును ప్రకటింపసాగెను. ఇప్పుడతడు పాకిస్థాన్‌లో ఒక గొప్ప ప్రభుత్వోద్యోగి. వ్రాయుట చాల వఱకు తగ్గించినాడు. బెంగాలీ మఱియు హిందీ సారస్వతములచే ప్రభావితుడై అతడు వ్రాసిన కథలు ఉర్దూ సాహిత్య క్షేత్రమున నవీనములు, సుందరములు అని ప్రశంసింపబడెను. "మొహబ్బత్-ఔర్-నఫ్రత్" మఱియు "జిందగీ-కా-మేలా" అను రెండు కథా సంగ్రహములు ప్రకాశితములు.

ఇంకొక సుప్రసిద్ధ ఉర్దూ కథా రచయిత "హయాతుల్లా అన్సారీ". అతడు ఈ పదునేను పదునారేండ్ల కాలములో చాల రచనలు చేసినాడు. కాని

"భరే బాజార్‌మే", అనునొక కథాసంగ్రహము మాత్రమే అతనిది ప్రకాశితమైనది. అతడు ప్రసిద్ధ దిన పత్రిక ''ఖౌమీ-అవాజ్'' అను దానికి సంపాదకుడు. అనేక రాష్ట్రీయ సంస్థలలో పాల్గొనినవాడు. కొన్నాళ్ళు గాంధీజీతో ఆశ్రమవాసము కూడ చేసినావాడు. గాంధీ భక్తులలో అగ్రగణ్యు డనదగినవాడు. అతని రచనలలో ఆ విషయము కనుగొననగును. వ్రాసినది చాల తక్కువే అయినను అతడు ప్రముఖ రచయితలలో లెక్కింపదగినవాడు. మనోభావ పరిశీలనములో మఱియు వానిని జీవితములోని ప్రత్యక్ష పరిస్థితులకు అనుసంధానించి చెప్పుటలో అతడు నిపుణుడు. అతని భావములు సతార్కికములగుట ఎచ్చటను కృత్రిమము లనిపించవు. వాస్తవిక జీవితమును అతడు అతి సుందరముగా చిత్రించును. అతని భాష నిర్దుష్టము. సరళము మఱియు సరసము.

అహ్మద్ నదీమ్ కాస్మీ మఱియు బలవంతసింగ్ అను వారిరువురు పంజాబు గ్రామీణ జీవితమును అందముగా చిత్రించువారు. కాస్మీ ప్రారంభమున కవితలవలెనే తన కథలను "రోమాంటిక్" శైలిలో వ్రాసెను. వానిలో ప్రేమైక జీవుల చిత్రములు సజీవముగా కావ్యభాషలో రచింపబడినవి. కాని కొంతకాలము తరువాత అతడు సామాజిక విషయములను స్వీకరించి అభ్యుదయ భావములతో కూడిన బృహద్రచనలు చేసెను. అతని కథలు నిమ్నవర్గముల వారికి, పీడితులకు సంబంధించినవి. అతని భాష సురుచిరము. కథాకథన పద్ధతి సారళ్యమును భావకతయు కలది. అతని కథాసంగ్రహము లనేకములు వానిలో, "చౌపాల్", "బగూలే", "ఆబ్లే". సన్నాట", ఆంచల్" మఱియు "దరో-దీవార్" అనునవి ప్రసిద్ధములు. బలవంతసింగులోను మంచి కథకునిలో ఉండవలసిన గుణములు అనేకములున్నవి. అయినను అతని భావములు అంతటి ప్రభావసంపన్నములు కావు. అతని సామాజిక చైతన్యము పీడిత ప్రజలకు అభ్యుదయపథము ప్రదర్శించునంతటి ఉన్నతిని అందుకొనలేదు. అయినను అతని కథలు అతిసుందరములు. కళాదృష్టితో సమగ్రమైనవి. అతని కథా సంగ్రహములలో "జగ్గా", "తారోపద్", ''సునెహరా-దేశ్" మఱియు "పహెలా-పత్థర్" అనునవి ప్రసిద్ధమైనవి.

'అఖ్తర్ ఓరినవీ', బీహారులోని ప్రముఖరచయిత. అతడు కథలు, నవలలు, నాటకములు మఱియు విమర్శలు వ్రాసెను. అయినను అతనికి కథారచనలో కలిగిన కీర్తి ఇతర సాహిత్యక్షేత్రములలో లభింపలేదు. అతని కథాసంగ్రహములుకూడ అనేకములు ప్రకాశితమైనవి. వానిలో "మంజర్-వ-పస్‌మంజర్" "భూల్‌భులయ్యా",

"అనార్కలీ'', ''కలియాఁ-ఔర్-కాంటే" అనునవి పేర్కొన దగినవి. అతని కథలలో సామాజిక చైతన్యము మనోభావముల ద్వారమున ప్రదర్శితమగును. కనుక అతడు మానవ విజ్ఞానము ననుసరించి జీవితమును చిత్రించు వారిలో లెక్కింపబడును. బీహారులోని ఇంకొక రచయిత 'సుహైల్' అజీమాబాదీ అట్లుగాక సామాజిక విషయములను ప్రేమచందు సంప్రదాయానుసారముగా ఉల్లేఖించెను. బీహారు గ్రామీణజీవనపు సుందరచిత్రములు 'సుహైల్' కథలలో చూడనగును.

ఖ్వాజా అహమద్ అబ్బాస్ సువిఖ్యాతుడగు రచయిత, పత్రికా సంపాదకుడు. సాహితీరంగమున విశిష్టస్థానము కలవాడు. అతని కథలు జీవితములోని సామాన్య సమస్యలను, సన్నివేశములను పురస్కరించుకొని రూపొందినవి. ఒకచో రాజకీయ, సామాజిక చైతన్యానుభవము గోచరించును. వేరొకచో అతిసరళశైలిలో ఒక ప్రేమ కథ చెప్పబడును. అభ్యుదయ రచయితలలోను అతనికి మంచి గౌరవస్థానము కలదు. అని కథాసంగ్రహములో 'ఏక్ లడ్కీ', 'జాఫ్రాన్-కే-ఫూల్', 'మైకౌన్ హూఁ', 'కహ్తేహైఁ జిస్కో ఇష్క్" అనునవి చాల ప్రసిద్ధిగాంచినవి.

ముమ్తాజ్ మఫ్తీ మఱియు మొహమ్మద్ హసన్‌అస్కరీకూడ అవ్యక్తములగు మనోభావముల విశ్లేషణచేయుచు కథలు వ్రాసిరి. చాలవఱకు వారిరువురు అవ్యక్తములును గుప్తములును అగు భావములును వాసనలును చిత్రించిరి. ఈ కథలలో అప్పుడప్పుడు సామాజిక చైతన్యము స్వల్పముగా గోచరించును. అయినను అధికముగా రోగుల అనుభూతులేకాన్పించును. ముమ్తాజ్ మఫ్తీ కథాసంగ్రహములెన్నియో ప్రకాశితములైనవి. వానిలో 'అన్ కహీ', 'చుప్' 'గహమాగహమీ' అనునవి ప్రసిద్ధములు. హసన్‌అస్కరీ కథాసంగ్రహములు 'జజీరే' మఱియు 'ఖయామత్ హమ్ రికాబ్ ఆయే న ఆయే' అనునవి ప్రకాశితములు. అతడు అనేక ఆంగ్ల ఫ్రెంచి కథలను నవలలను అనువదించెను. అతని వచనశైలి సుందరము - సజీవము. అతని భావములు ఫ్రాన్సులోని పతనశీల రచయితలచే ప్రభావితములు. అతడు అభ్యుదయ వాదమున మంచి విమర్శకుడు.

అజీజ్ అహమద్ నవలలే కాక కొన్ని గొప్ప కథలు వ్రాసినాడు. అతని కథలన్నియు అధికముగా లైంగిక విషయములతో, వాసనలతో నిండి అశ్లీలములగుటకు కొద్దిలో తప్పిపోయినవి. అతని కథలలో నొకరీతి మనోవిజ్ఞానమును కనిపించును. ''రక్స్‌నా తమామ్'' మఱియు "బేకార్ దిన్ ఔర్ బేకార్ రాతేఁ" అనునవి అతని ప్రకాశిత కథా సంగ్రహములు.

హంసరాజ్ రహబర్ ఉర్దూ హిందీ రెండు భాషలలో వ్రాయును. అతడు వాస్తవికతను మఱియు మార్క్సు వాదమును అభిమానించువాడు. సరళ శైలిలో సాధారణ జీవనమును చిత్రించుటలో నేర్పరి. "నయా ఉఫఖ్" మఱియు "హమ్ లోగ్" అను రెండు కథా సంగ్రహము లతనివి ప్రకాశితములు. అతడు నవలలును, విమర్శాత్మక వ్యాసములును వ్రాసెను. అతనిది అభ్యుదయ దృక్పథము. పైన పేర్కొనబడిన వారే కాక ఇంకెందఱో కథకులు కలరు. వీరిలో కొందఱు కొంత కాలము క్రిందట గొప్ప ఖ్యాతి గడించిరి. కాని ఇప్పుడు క్రొత్త రచయితలు వారి స్థానము పొందినారు. వీరిలో, ఎమ్. అస్లమ్, అల్. అహమద్, జలీల్ ఖిద్వాయీ, మజ్నూ గోరఖ్‌పూరీ, మీర్జా అదీబ్, హమీదుల్లా అఫ్సర్, హిజాబ్ ఇస్మాయిల్ మొదలగు వారు పేర్కొనదగిన వారు. ప్రతి ఒకరును అనేక సంగ్రహములు ప్రకాశింప జేసినవారే. స్థలాభావము వలన క్రొత్త రచయితలను గుఱించి వ్రాయుటయు అసంభవమైనది. వారందఱును ప్రజాదరణ పొందినవారే. వారి కథలు పోత్సాహముగా చదువబడుచున్నవి. గులామ్ అబ్బాసీ (ఆనందీ) మహేంద్రనాథ్ (చాందీకే-తార్, జహాఁమై రహ్తాహూఁ, మైడార్లింగ్ హోటెల్, నయీ బీమారీ, హిందూస్థాన్ సే పాకిస్థాన్ తక్) హాజరా మస్రూర్ (చర్కే, హాయ్ అల్లాహ్) ఖదీజా మస్తూర్ (ఖేల్, బౌఛార్, చంద్ రోజ్ ఔర్) ముమ్తాజ్ షీరీఁ (అప్నీ నగరియా) ఖురతుల్ ఐన్ (సితారోంసే ఆగే, షీషే-కా-ఘర్) ఖుదురతుల్లా షహాబ్ (నఫ్సానే) అన్వర్ (అగ్‌కీ ఆగోష్‌మే) ప్రేమనాథ్ పర్దేశీ(దున్యాహమారీ) ఇబ్రాహిమ్‌జలీస్(జర్ద్-చెహరే, చాలీస్ కరోర్ భికారీ, తికోణా దేశ్ మొదలగునవి) ఎ. హమీద్ (ఖిజాఁ-కా-గీత్) సిద్దీఖాబేగమ్ (హిచ్కియాఁ, లరజ్తే ఆంసూ, రఖ్సె బిస్మిల్) రజియా సజ్జాద్ జహీర్, శౌకత్ సిద్దీఖీ (తీస్రా ఆద్మీ) ఇంతెజార్ హుస్సేన్ (గలీకూచే) ప్రకాశ్ పండిత్ (మీరాస్) మొదలగు రచయిత లట్టివారు.

ఇట్లు పేర్కొనబడిన వారిలో అనేకులు నేటి ప్రఖ్యాత కథకులలో గణనీయులు. భారతీయ జీవనము, వర్గసంఘర్షణము, మానవుని ఆంతరంగిక భావములు మఱియు దేశపు దుర్దశ ఈ రచయితలకు చాల పరిచితములు. వీరిలో చాలమంది ప్రజాస్వామ్యపు సుందర స్వప్నములను మఱియు కల్పనలను చిత్రించిరి.

ఉర్దూలో నవలాసాహిత్యారంభమును గుఱించి ఇదివఱకే వ్రాయబడినది. కాని నేటికాలపు జీవనమునకు సంబంధించిన సమస్త విషయములను స్వీకరించి తన నవలలలోని నాయక పాత్రలుగా సామాన్యులగు జనులను మొట్టమొదట ప్రవేశ

పెట్టిన వారు ప్రేమచందు. అతని తొలినాళ్ళ నవలలలో ఆనాటి అతని కథలలో నున్నట్టి నిండుతనము కాని నైపుణ్యము కాని కాన్పింపవు. కాని అతని చివరి నవల లలో గంభీరాను భూతులలో కళాత్మక సౌందర్యము సమగ్రరూపమున కననగును. తొలినాళ్ళ నవలలలోని శైథిల్యము చివరి నవలలలో తొలగిపోయినది. విశేషించి అతని చివరి నవలయగు "గోదాన్" లో విషయముతో కళ అతి నిపుణతతో సమన్వయ పరచబడినది. అతడు ఎల్లకాలమును మహారచయితల శ్రేణిలో లెక్కింపబడును.

ప్రేమచందు సుమారు ఒక డజను నవలలు వ్రాసెను. 17, 18 ఏండ్ల ప్రాయమునుండియే అతడు రచన ప్రారంభించెను. "బాజారె-హుస్న్" అను నవల వలననే అతనికి ప్రఖ్యాతి లభించెను. ఈ నవలయే తరువాత "సేవాసదన్" అను పేర హిందీలో ప్రచురింపబడెను. "బేవా", "చౌగానె-హస్తీ", (రంగభూమి) "మైదానె-అమల్" (కర్మభూమి) మఱియు "గోదాన్" అనునవి అతని సుప్రసిద్ధ నవలలు. అతని కథల వంటివే అతని నవలలు కూడ. నవలా రచన ననుసరించి ప్రేమచందు ప్రజా సాహిత్యకారులలో గొప్పవాడు.

మిర్జారుస్వా మఱియు ప్రేమచందులే కాక ఉర్దూ రచయితలు అనేకులు వేశ్యాల కరుణాజనక జీవితమును హృదయ విదారికమగు శైలిలో చిత్రించిరి. ఖారీ సర్ఫరాజ్ హుస్సేన్ నవలలును సజ్జాద్ హుస్సేన్ కస్మండవీ వ్రాసిన "నస్తర్" అను నవలయును ఇందుకు మంచి ఉదాహరణములు. ఆధునిక మనో విజ్ఞానమును, సామాజిక చైతన్యమును అనుసరించి ఈ సమస్యను చర్చించిన రచయిత ఖాజీ అబ్దుల్ గప్ఫార్. అతని "లైలా-కే-ఖుతూత్" అను నవల అనుపమ మైనది. అందు వేశ్యల కరుణాత్మక గాథ సురుచిరమగు శైలిలో రచింపబడినది. ఆ సమస్య తాత్విక పద్ధతిలో పరిశీలించు ప్రయత్నము చేయబడినది. ఈ నవలలో భావుకతతో గంభీరత సమన్వయ పరచబడినది. పఠితలు ఆనందము పొందుచునే ఆ ప్రశ్నయొక్క గంభీరతకు విచారమగ్నులును అగుదురు. అతని భాష సుంద రము. ఖాజీ అబ్దుల్ గప్ఫార్ ప్రఖ్యాత పత్రికా సంపాదకుడు - మంచి రచయిత. అతని అనేక గ్రంథములు ప్రకాశితములైనవి. వానిలో "హయాతె-అజ్మల్", "ఆసారె-అబుల్ కలామ్", ఆసారె-జమాలుద్దీన్ అఫ్గానీ" "అజీబ్" అనునవి ప్రసిద్ధ మైనవి. క్రీ. శ. 1947 నుండి అతడు అంజుమనె-తరక్కీ - ఉర్దూ (హింద్) యొక్క మంత్రి పదవి నిర్వహించు చున్నాడు.

సజ్జాద్ జహీర్ క్రీ. శ. 1939 లో "లండన్-కీ-ఏక్‌రాత్" అను నవల వ్రాసెను. అది క్రొత్త శైలిలో వ్రాసిన మొదటి నవల. సజ్జాద్ జహీర్ చాల కాలము లండనులోను, ప్యారీసులోను గడపి అచటి సాహిత్య ప్రయోగములచే ప్రభావితుడయ్యెను. ఈ నవలలో ఐరోపా శైలులు ప్రయోగించెను. ఈ నవల ప్రసిద్ధివడయుటకు ఐరోపా ప్రభావము కలిగియుండుటయే కారణము కాదు. ఇచటి పరిస్థితుల ననుసరించి భారతీయ యువకుల కల్పనలను, కామనలను చర్చించిన మొట్టమొదటి నవల ఇదియే. మధ్యమ వర్గపు సంపన్న కుటుంబములకు చెందిన యువకులు కొందఱు లండనులో విద్యాభ్యాసము చేయుచు మారుచున్న ప్రపంచ పరిస్థితులచే ప్రోత్సాహితులై తమ మాతృభూమియొక్క దుర్దశను తిలకించి అశ్రువులు రాల్చుట ఇందలి ఇతివృత్తము. నవలలోని పాత్రలు చాలవఱకు స్వప్న జగత్తులో విహరించువారు, ఆదర్శవాదులు మఱియు విషయ వాంఛలలో మునిగిన వారు. అట్టివారు తమ మాతృదేశ దుర్దశను ఊహించి స్వాప్నిక ప్రపంచము నుండి మేల్కాంచి దుర్దశకు కారకులగు ఆంగ్లేయుల పట్ల అసహ్యాభావము ప్రకటింతురు. నూతన నవలా రచనలో ఇదొక సఫల ప్రయత్నము. నవ రచయిత లందఱును ఈ నవలచే ప్రభావితులైరి. సజ్జాద్ జహీర్ జోన్‌పూర్‌లోని ఒక సుశిక్షితమగు ఉన్నత కుటుంబమునకు చెందినవాడు. లఖ్నోలో విద్యాభ్యాసము చేసి ఉన్నత విద్యకై అతడు లండను వెళ్ళెను. బ్యారిస్టరీ పరీక్షలో ఉత్తీర్ణుడై లండనులోనే మల్కరాజ్ ఆనంద్ మొదలగు కొందఱుభారతీయ రచయితలను కలిసి భారతీయుల అభ్యుదయ సంస్థను నెలకొల్పెను. స్వదేశమునకు తిరిగివచ్చి ఇచటి రాష్ట్రీయాందోళనము నందును విప్లవాందోళనమునందును పాల్గొనెను. ఉర్దూ, హిందీ రచయితల సంఘటనకై కృషిచేసెను. కథలే కాక అతడు విమర్శనాత్మక వ్యాసము లెన్నియో వ్రాసెను. విప్లవ రచయితలకును అభ్యుదయ రచయితలకును నాయకు డనబడెను. ప్రస్తుత మతడు కమ్యూనిస్టు భావములు ప్రకటించిన నేరమున పాకిస్తాన్‌లో నిర్బంధ జీవితము గడుపుచున్నాడు.

కథకుల సందర్భమున ప్రస్తావింపబడిన కృష్ణచంద్ర గొప్ప నవలా రచయిత కూడ. ఇప్పటివఱకు అతని "షికస్త్", "జబ్-ఖేత్ జాగే", తుఫాన్-కీ-కలియాఁ", "ఉల్టాదరఖ్" అను నాల్గు నవలలు ప్రకాశితములైనవి. అతని మొదటి నవల యగు "షికస్త్" ప్రచురింప బడినంతనే దాని విశిష్టతను గుఱించి విమర్శకులు అభిప్రాయ భేదమును వెలిబుచ్చిరి. కాని కాశ్మీర జీవనమును అచటి

కర్షకుల జాగృతిని ఇట్లు సజీవముగా చిత్రించిన నవల ఇంకొకటి లేదనుట వాస్తవమే. శిల్పము ననుసరించి ఇందు లోపములున్నను దీనిని చదువుటవలన కాశ్మీర జీవనము పఠితలకు ప్రత్యక్షమగును. అచటి కర్షకుల పట్ల రచయిత ప్రకటించిన సహానుభూతి సముచితమైనది. ''తూఫాన్-కీ-కలియా(" కూడ కాశ్మీర జీవనమును, జాగృతిని సుందరముగా చిత్రించిన నవల. "జబ్ ఖేత్ జాగే" అను నవలలో ఒక సామాన్య కృషిక యువకుని జీవిత చిత్రణము ద్వారమున తెలంగాణా కర్షకుల విప్లవాందోళనమును ప్రదర్శించు ప్రయత్నము చేయబడినది. కృష్ణచంద్రుని వచనము అసాధారణమగు సౌందర్యముగలది. అతి నవీనమైనది.

సుప్రసిద్ధ కథారచయిత్రి "ఇస్మత్ చుగ్తాయీ" "జిద్దీ" మఱియు "టేఢీ లకీర్" అను రెండు నవలాలు వ్రాసినది. జిద్దీ ఇతివృత్తము సాంఘికమే అయినను "రోమాంటిక్" కథవలె నున్నది. అందలి వాస్తవికతలో ఆదర్శవాదము కూడ ప్రస్ఫుటమై తత్ప్రభావమును తగ్గించెను. "టేఢీ లకీర్" నిశ్చయముగా గొప్ప రచన. బాల్య జీవితపు మనస్తత్వమును, ఆంతరంగిక ఘర్షణను ఇంత సుందరముగా మఱియే ఇతర నవలలో చిత్రింపబడలేదు. మధ్యమవర్గ ముసల్మాను పరివారము ఇందు సహజ సుందరముగా చిత్రింపబడినది. దీని ఉత్తర భాగము పూర్వ భాగముతో అతికినట్లు లేదు. ఏలయన ఇందు చర్చింపబడిన రాజకీయ సమస్యలు వాస్తవికములే అయినను అచట అనుచితము లనిపించును. ఇస్మత్‌కు భాషా విన్యాసముపై అసాధారణమగు అధికారము కలదు. ఆమె చిత్రించిన పాత్రల సంభాషణలు యథార్థము లనిపించు నంతటి స్వాభావికములు. అభ్యుదయ రచయితలలో ఆమె ప్రముఖ స్థానము కలది.

వర్తమాన యుగమున చాల ప్రజాదరణ పొందిన రచయితలలో అజీజ్ అహమద్ ఒకడు. అతని నవలలు ఇంతవఱకు ఎన్నియో ప్రకాశితములైనవి. వానిలో "గురేజ్", "ఐసీ బులందీ ఐసీ పస్తీ" "షబ్నమ్" అనునవి ప్రసిద్ధములు. అతని కథలవలె నవలలును కామవాసనలతో నిండినవి. అతని పాత్ర లన్నియు విషయ లాలసమైనవి. నవలా శిల్పమున అతడు మిగుల నేర్పరి. అనేక భాష లెఱిగిన వాడగుట వలన ఐరోపాలోని మంచి మంచి సాహితీ శైలులచే ప్రభావితుడు. అతడు కేవలము విషయవాంఛలనే పరిశీలించును. కాని, జీవితములోని ఇతర ముఖ్య సమస్యలను బొత్తిగా విస్మరించును.

క్రీ. శ. 1947 వ సంవత్సరమున హిందూ ముస్లిముల మత కలహముల కారణమున రక్తము నదులై పారెను. ప్రఖ్యాతులగు ఉర్దూ రచయిత లందఱును ఆ విషయమును పురస్కరించుకొని ఏదో కొంత వ్రాసిరి. ఈ ఇతివృత్తము మీఁదనే అనేక నవలలు రచింపబడినవి. ఇట్టి నవలలలో రామానంద్ సాగర్ వ్రాసిన "ఔర్ ఇన్సాన్ మర్‌గయా",అనునది, ఖుద్రతుల్లా షహాబ్ వ్రాసిన"యాఅల్లాహ్" అనునది మఱియు ఖురతుల్ ఐన్ హైదర్ వ్రాసిన "మేరేభీ సనమ్ ఖానే" అను నదియు చాల ప్రముఖమైనవి. "సాగర్" వ్రాసిన నవల రచయితయొక్క సహృదతను మానవప్రేమను, అత్యాచారముపట్ల అసహ్యాభావమును వెల్లడించును. ఇందులో భావుకత అత్యధికము. మానవుడు దురాచారముల ముందు ఓటమిని అంగీకరించుట తప్ప ఏమియు చేయలేడని "సాగర్" భావము. షహాబ్ రచనలలో అటనట సాంప్రదాయకత గోచరించినను అతనినవల సర్వోత్తమము. ఖురతుల్ ఐన్ హైదర్ "మేరేభీ సనమ్‌ఖానే" వ్రాసి చాల ప్రఖ్యాతి గాంచెను. ఇందు 1947నాటి కలహముల వర్ణన అతిస్వల్పమే అయినను ఉన్నంతవఱకు చాల కరుణాత్మకముగా వ్రాయబడినది. ఆమె "సఫీనయే - గమే - దిల్" అను మఱియొక నవల కూడ వ్రాసినది. అందలి ఇతివృత్తము అంత గొప్పదికాదు. అవధ్‌లోని ఉచ్చవర్గీయులు మఱియు మధ్యమ వర్గపు బుద్ధి జీవుల జీవితవిధానమును ఆచారవ్యవహారములను ఆమె చిత్రించినంత సుందరముగా ఇంకెవరును చిత్రింపజాలరు.

కొంత కాలము క్రిందట డాక్టర్ అహసన్ ఫారూఖీ "షామె అవధ్" అను నొక నవల వ్రాసెను. విప్లవము తరువాతి లఖ్నో పరిస్థితిని అచటి సాంఘిక దుస్థితి చాల వాస్తవికముగా చిత్రించి అంతమొందుచున్న నవ్వాబీ సభ్యతను వర్ణించినాడు. రచయిత ఆ నవలలో కాని అతని రచనలో గాంభీర్యము లేదు. అయినను భాష అందమైనది. పాత్రలు వాస్తవికత కలవి. కనుక అతని నవల కొక ప్రముఖస్థానము లభించినది. డా. అహసన్ ఇంక కొన్ని నవలలు వ్రాసెను. అవి ఇచట వేర్కొన దగినంత విశిష్టత కలవి కావు.

ఈ అధ్యాయమున ఇంకను ఎందఱో మంచి రచయితల వృత్తాంతము వ్రాయ బడలేదు. వ్రాయబడనివారును అనేక రచనలు చేసినవారే. వారి రచనలు ప్రజాదరణ పొందినవే. అయినను వారి రచనలో విమర్శా దృష్టితో చూచినచో విశిష్టత కాన్పించదు. ఎమ్. అస్లమ్, రషీద్ అఖ్తర్ నద్వీ, రయీస్ అహమద్ జాఫరీ, ఖైసీ రాంపూరీ మొదలగువారు ఇట్టివారు. ఫయ్యాజ్ అలీ వ్రాసిన, "షమీమ్" మఱియు

"అన్వర్" అను రెండు నవలలు అనేక పర్యాయములు ప్రచురింపబడి బహుగా చదువబడు చున్నవి. ఇట్లే పండిత్ కిషన్ ప్రసాద్ కౌల్ వ్రాసిన "శ్యామా", "మజ్బూరే - వఫా", "సాధూ - ఔర్ - బేసవా" అను నవలలు చాల ప్రజాదరణ పొందినవే. వానిలో సంస్కార భావములుండుట వలన కొంత విశిష్టత కలిగినవే. ఆదిల్ రషీద్, మహేంద్రనాధ్, ఎ. అహమద్ కూడ కొలది కాలముననే గొప్ప యశము పొంది జీవితములోని వివిధ సమస్యలను పరిశీలించు ప్రయత్నము చేసిరి.

పెట్టుబడిదారీ విధానమును మఱియు క్రొత్త పరిస్థితులందు క్రొత్త మార్గములలో వికసితమగుచున్న సభ్యతను నవల ఎంత సహజముగా చిత్రింపగలదో ఇంకే సాహిత్య రూపమును అంత సహజముగ చిత్రింపజాలదు. కనుకనే ప్రపంచమునందలి జీవద్భాష లన్నిటిలో నవలా రచన ప్రముఖమైనది. ఇప్పుడు ఉర్దూలోని రచయిత లనేకులు నవలా రచనలో నూత్న శైలులను ప్రయోగించుచున్నారు. కొందరి ప్రయోగములు సఫలములు. కొందరివి విఫలములు - అయినను ఉర్దూ సాహిత్య చరిత్రలో త్వరలోనే కొందఱు మంచి నవలా రచయితలు స్థానము పొందగలరనిపించుచున్నది. ఆంగ్ల, ఫ్రెంచి, రష్యన్ నవలలు కొన్ని మంచిమంచివి ఉర్దూలో అనూదితములైనవి. వాని వలన నవ్య రచయితలకు ప్రేరణ లభించినది.

ఉర్దూ నాటక సాహిత్యమున జరుగవలసినంత అభివృద్ధి జరుగలేదు. దీనికి ఎన్నియో కారణములు కలవు. నాటక రచయితలను ఆకర్షించునట్టి రంగస్థలములు లేకపోవుట ముఖ్య కారణము. అదికాక నాటకకర్త లనేకులు రేడియోల కొఱకు ఫిల్ముల కొఱకు వ్రాయుచున్నారు. అయినను ఈ నడుమ కొన్ని యేండ్లనుండి ప్రొ. ముసీబ్, ఇమ్తియాజ్ అలీతాజ్, అష్క్, బేదీ, కృష్ణచంద్, ఇష్రత్, అహమద్ అబ్బాస్, మంటూ, మిర్జాఅదీబ్, రఫీపీర్ మొదలగువారు పెక్కు నాటకములు వ్రాసి ప్రచురింపజేసిరి. వానిని ప్రజలు ఉత్సాహముతో చదువు చున్నారు కూడ. మంచి మంచి వైదేశిక నాటకములు అనువదింపబడినవి. అయినను గమ్యము చాల దూరమున నున్నది. మన నాటకకర్త లింక చాల పురోగమనము చేయవలసి యున్నారు.

ఉర్దూ సాహిత్యమున హాస్యరసప్రధానములగు రచనలు విశేషముగా ఉన్నవి. గద్యములోను పద్యములోను ఉత్తమ శ్రేణికి చెందిన హాస్యమును సృష్టించిన రచయితలు కలరు. వీరిలో కొందఱను గూర్చి వెనుకటి అధ్యాయములలో వ్రాయ

బడినది. మఱికొందఱ గూర్చి ఇచట సంక్షేపముగా వ్రాయబడును. ఈనాడు హాస్య రసపోషకులగు రచయితలు అనేకులున్నారు కనుక, ఈ యుగమును హాస్యరసమునకు స్వర్ణయుగ మనవచ్చును. కొందఱు కేవలము నవ్వుల పువ్వులు కురియింతురు. మఱికొందఱు వానితో వ్యంగ్యబాణములనుగూడ ప్రయోగింతురు. రషీద్ అహమద్ సిద్దీఖీ సర్వోత్తముడగు హాస్య రచయిత. అతనిని గుఱించి వెనుకటి అధ్యాయమున వ్రాయబడినది. ఇతడు కాక అజీమ్ బేగ్ చుగ్తాయీ, పత్రస్ బుఖారీ, షౌకత్ థానవీ, ఇమ్తియాజ్ అలీతాజ్, నాకారా హైదరాబాదీ, హాజీలఖ్ లఖ్, సింద్ బాద్ జహాజీ, కృష్ణచంద్ర, కన్హయ్యాలాల్ కపూర్, షఫీఖుర్రహమాన్ మున్నగువారు చాల ఉచ్చకోటి రచనలు చేసినవారు.

అజీమ్ బేగ్ చూగ్తాయీ క్రీ. శ. 1941 లో అకాల మరణము చెందెను. అతని కథా సంగ్రహములును నవలలును సుమారు ఇరువది. అతడు జోధ్ పూర్ నివాసి. అలీఘర్ లో విద్యాభ్యాసము చేసి జీవికకై న్యాయవాదవృత్తి నవలంబించెను. మొదటి నవల "షరీర్ బీవీ" వ్రాసి నంతనే అతనికి ఘనమైన కీర్తి లభించెను. కొలది కాలములోనే అతడు "కోల్తార్", "ఖానమ్", "చమ్కీ", "కమ్జోరీ", "జన్నత్ కా భూత్" మొదలగు ఎన్నియో గ్రంథములు ప్రచురించెను. ఈ గ్రంథములు ఇప్పటికిని ఉత్సాహముతో చదువబడుచున్నవి. కొన్ని హిందీ మఱియు అన్య భాషలలో అనూదితములైనవి. అతని కథలు సాధారణముగా మధ్యమ వర్గ ముసల్మాను కుటుంబముల జీవన విధానములకు సంబంధించినవి. అతని పాత్రలు అవసరముకంటె అధికముగా చంచల మయినవి. అతని హాస్య కథలలో నాటకీయ విన్యాసము లత్యంత రమణీయములు. అతడు నిరంతర రోగి కనుక శయ్యపై పడి యుండి తన జీవితములోని అలసతను చేతగాని తనమును విస్మరించుటకై తన పాత్రల నంత చంచలములుగా చిత్రించె నందురు.

"పత్రస్" కొన్నియే వ్యాసములుగా వ్రాసినాడు. అతని వ్యాసము లన్నియు "మజామీనె-పత్రస్" అను పేర ప్రచురింప బడినవి. ఈ ఒక్క వ్యాస సంగ్రహము వలననే అతడు ఉర్దూలోని ప్రథమ శ్రేణి హాస్య రచయితలలో లెక్కింపబడును. అతని హాస్యము సాధారణముగా శబ్దాశ్రితము. ఆ శబ్దములు గంభీర మయినవి. అతని వ్యాసములు కథలతో గూడి ఒక క్రొత్తదనము సంపాదించుకొన్నవి. మనో విజ్ఞానము మఱియు సుందర శైలి వలన అతని రచనలు అసమానమగు రామణీయకత పొందినవి.

షౌకత్ థాన్వీవయము ఇంకను ఏబదేండ్లకులోపే. అయినను ముప్పదికంటె అధికముగనే అతని గ్రంథములు ప్రచురింపబడినవి. అతడు కూడ క్రీ. శ. 1932 లో "స్వదేశీరేల్" అను నొక కథ వ్రాసి ఆనాటి నుండియే గొప్ప రచయితలలో లెక్కింపబడెను. "శౌకత్" శబ్దములచేతను వాక్యములచేతను హాస్యము పుట్టించును. హాస్యాస్పదములగు సన్నివేశములు సృష్టించి నవ్వక తప్పని పరిస్థితి కలిగించును. తీవ్రబుద్ధి కలవాడగుటచే అతడు సామాన్య విషయములను కూడ మనోహరము లొనర్చును. "మౌజె-తబస్సుమ్", "తూఫానె - తబస్సుమ్", "జోడ్-తోడ్", "సవతియా-చాహ్", "కార్టూన్", "ససురాల్" మొదలగునవి అతని ప్రసిద్ధ నవలలు. అతడు కవితలు, రేడియోల కొఱకు హాస్యనాటికలు కూడ వ్రాయును. అట్టి నాటికలు అనేక సంగ్రహములుగా ప్రకాశితము లైనవి.

వ్యధాభారమును కొంత తగ్గించును. "షర్వాజ్", "షిగోఫే", "హిమాఖతే(", లహారే మఱియు "కిరణే" మొదలగునవి అతని కథల సంగ్రహములు.

ఉర్దూలోని హాస్యాత్మక గద్యరచనను పందొమ్మిదవ శతాబ్ది చివరి కాలమున "అవధ్ పంచ్" అను పత్రిక ప్రారంభించెను. భారత దేశములో క్రొత్త ప్రాతల మధ్య సంఘర్షణ పెఱిగిన కాలది, నైతిక జీవనము దుర్బలమైన కాలది, రాజకీయ సామాజిక పరిస్థితులు జటిలమైన కాలది వ్యంగ్యమునకు పనికివచ్చు విషయము లెన్నియో ఏర్పడెను. వాస్తవిక జీవనమునకును భావములకును నడుమ చాల అంతర ముండుట చూచి ఉర్దూ రచయితలు ఆలోచించి హాస్యముపట్ల శ్రద్ధ చూపుట అవసరమనుకొనిరి. భారతదేశములోని ఇతర ఆధునిక భాషల ననుసరించి చూడ ఉర్దూలో కూడ హాస్యప్రియ సాహిత్యము విస్తారముగా వర్ధిల్లినది.

వర్తమాన యుగమున అన్నిటికంటె అభివృద్ధి చెందిన సాహిత్య రూపము విమర్శ. ఏదోవిధముగా రాష్ట్రీయమగు అభ్యుదయాందోళనము చేత లేక విశ్వవ్యాప్తమైన అభ్యుదయాందోళనముచేత ప్రభావితులైన నవ్యరచయిత లందఱును విమర్శనము నందును నవీనదృక్పథము కలవారే అని వెనుకటి అధ్యాయముననే తెలుపబడినది. ఈ విమర్శకులు సాహిత్యము సామాజిక జీవనము వలన ప్రభావితమై, జీవనమును ప్రభావితము చేయునని అభిప్రాయపడుదురు. సాహిత్యము యొక్క జనన కారణములను, రచయితయొక్క చైతన్యప్రకారమును గ్రహించుట మఱియు జీవించుటకై సంఘర్షణ చేయునట్టి ఆదర్శముల పరిచయము కలిగి యుండుట విమర్శకునకు ఎంతేనిఆవశ్యకము. రచనాత్మకసాహిత్యమును నిర్మించువారు కూడ ఈ పరిధిలోనేనిలిచి పనిచేయుదురు. కనుక కొందఱు విమర్శకులు తమ బాధ్యతలను గుర్తించి జీవితము మఱియు కళలకు కల సంబంధమునుగూర్చి నొక్కి వక్కాణింతురు. ఇందువలన, యీ లాటి రచనలు ప్రత్యేకముగా నిలిచి తమ వైలక్షణ్యమును నిల్పుకొనుటయేగాక, దానిని మరింత పెంపొందించుటకు కూడ తోడ్పడును.

సాహిత్యమును సాంఘిక పరిస్థితుల ననుసరించి పరిశీలించు పద్ధతి మౌలానా హాలీ నాటినుండియే ప్రారంభమైనది. క్రీ. శ. 1930 వ సంవత్సరము తరువాత భారతదేశపు సమస్త జీవనమున అభ్యుదయాందోళనకు సంబంధించిన చిహ్నములు కనిపించును. సాహిత్యము నూత్నపంథాలలో పురోగమించినది. అట్లే పరిశీలనకు పరిశోధనకు సంబంధించినసిద్ధాంతములును మారిపోయినవి. విమర్శకులకు 'మార్క్స్' వాదము చాల సహాయకారి అయినది. ఈ కాలమున అనగా క్రీ. శ. 1935 లో అఖ్తర్ రాయ్‌పూరీ "అదబ్-ఔర్-జిందగీ" అను నొక ఉత్కృష్ట రచనచేసెను.

నేడు ఆ గ్రంథమున ఎన్నియో లోపములు, దొసగులు కన్పించును. విషయము అపరిపుష్టము. తర్కము అసమంజసము. అయినను ఆ గ్రంథము ఒక క్రొత్త బాటవైచినదనుట సత్యము. "అఖ్తర్" ఇంకను అనేక రచనలు చేసెను. కాని క్రమక్రమముగా ఆతడు మార్క్సు వాదమునుండి విడిపోయెను. అతని విమర్శ నాత్మక రచనలు, "అదబ్-ఔర్-ఇన్ఖిలాబ్" మఱియు "సంగె-మీల్" అను పేర ప్రకాశితములైనవి. భారతదేశమున మొదటినుండియు సమాసవాదమునకు యథార్థ వాదమునకు సంబంధించిన దృక్పథము లేకపోలేదు. అయినను నవీనమగ సామాజిక జాగృతితోను నవీనమగ ఆర్థిక చైతన్యముతోను క్రొత్త విమర్శనావిధానము, అందు ముఖ్యముగా మార్క్సు వాదసంబంధమైన విమర్శనావిధానము నెలకొనెను. అప్పుడే అభ్యుదయరచయితల సంఘము స్థాపింపబడెను. రాజకీయ చైతన్యము పొందిన ప్రజలు జనతంత్ర, సమాజవాదము ఆధారముగాగల స్వాతంత్ర్యమును వాంఛించిన సమయము అదియే. మార్క్సువాదము ననుసరించి సజ్జార్ జహీర్, ముమ్తాజ్ హుస్సేన్, డా. అబ్దుల్ అలీమ్, ఫైజ్, సిబ్తెహసన్, సర్దార్ జాఫరీ మొదలగువారు సాహిత్యము మఱియు జీవనమునకుగల సంబంధమును స్పష్టమొనరింప ప్రయత్నించిరి. విమర్శనమునకు సంబంధించిన ఈ శాస్త్రీయదృక్పథము చాలవ్యాపకమైనది. పూర్వము కేవలము సౌందర్యశాస్త్రము నాధారముగా గొని సాహిత్యమును విమర్శించువారును, తమ మనోభావములనే విమర్శపేర ప్రకటించువారును ఈ క్రొత్త విమర్శనాపద్ధతిని అవలంబించిరి. ఇట్టి విమర్శకులలో ఫిరాఖ్ గోరఖ్‌పూరీ, మజ్నూగోరఖ్‌పూరీ మఱియు డా. ఏజాజ్‌హుస్సేన్ పేర్కొనదగినవారు. ఫిరాఖ్ శృంగార రసప్రధాన ములగు గజలులు వ్రాయుట చాలించి జీవనపు నవచైతన్యము నాదరించెను. అట్లే అతడు తన విమర్శలో సౌందర్యశాస్త్రమునకే కాక సామాజిక పరిస్థితులకును ప్రాముఖ్యము ఈయసాగెను. అయినను మార్క్సువాదమును సంపూర్ణముగా అంగీకరించినవాడుకాడని అతని విమర్శలు స్పష్టముచేయును. అతని ఆలోచన ఎంత నవీనమైనదయినను సౌందర్య శాస్త్రమునకు లోబడినదే. అతని వ్యాసములు "అంధాజే" మఱియు "హాషియే" అను రెండు సంగ్రహములుగా ప్రకాశితము లైనవి. "ఉర్దూ ఇష్కియా షాయిరీ" అను మఱియొక గ్రంథమును ప్రచురింప బడినది. అతడు సాహిత్యము మఱియు జీవనము వద్య భావపూర్ణమును రచనా త్మకమును అగు సంబంధమును వాంఛించును. కాని, మార్క్సువాదులవలె సాహిత్యమును మానవజాతియొక్క ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక జీవనమునకు ప్రతిబింబముగా రూపొందించుటకు ప్రయత్నింపడు.

ప్రతిభాశాలురగు విమర్శకులలో "మజ్నూ" గోరఖ్‌పూరీ ఒకడు. అతడు విశ్వసాహిత్యము నతివేలముగా అధ్యయనము చేసినవాడు. దార్శనిక దృక్పథము కలవాడు. కనుక అతని మాటలెప్పుడును అవిచారమూలకములు కావు. సామాన్యమైనవియు కావు. ఆరంభమున అతడును చాలవఱకు సాహిత్యములో భావమును, సౌందర్యమును అన్వేషించుటకే ప్రయత్నించెను. రచయితల యొక్క వ్యక్తిత్వమునకు ప్రాధాన్యమిచ్చెను. అయినను అతని వ్యాసములు మనోహరమైనవి. సారస్వతానందము పొందుటకు సహాయపడునవి. కాని క్రమక్రమముగా అతడు తన మార్గము మార్చుకొనెను. ఆర్థిక జీవనమున సంఘర్షణపడుచున్న మానవుని ఆత్మకు ప్రతిబింబమే సాహిత్యము అను అభిప్రాయము కలవాడయ్యెను. అతని శైలిసుందరమైనది. కనుక అట్టి అభిప్రాయముతో కూడిన విమర్శలుకూడ సురుచిరముగా, రచనాత్మకముగా ఉండును. అప్పుడప్పుడు అతని విమర్శలో ఒక లోపము కాన్పించును. సిద్ధాంత వివరణ చేయుచునప్పుడతడు మార్క్స్ వాదమును సంపూర్ణముగా స్వీకరించినట్లు తోచును. కాని ఎవరేని రచయితను, లేక కవిని గుఱించి వ్రాయునప్పుడు మాత్రము అతని వెనుకటి దృక్పథమే గోచరించును. "తన్ఖీదీ హాషియే", "అదబ్-ఔర్-జిందగీ" మఱియు "అఫ్సానా" అనునవి అతని వ్యాస సంపుటములు.

డా. ఏజాజ్ హుసేన్ అలహాబాద విశ్వవిద్యాలయమున ఉర్దూ భాషాధ్యక్షుడు. అనేక గ్రంథములు ప్రచురించిన వాడు. ప్రారంభమున అతడును విమర్శనము చేయునప్పుడు హాలీ, ఆజాద్, షిబ్లీ మొదలగు వారిరీతినే అనుసరించెను. ఆంగ్లభాషాధ్యయనము చేసినవాడగుట ఆ రీతిలో కొంత నవీనతకూడ కలిగించువాడు. అతని వ్యాసములలో ఎట్టి రాజకీయ చైతన్యము కాని కాన్పించదు. కాని అభ్యుదయ భావములచే ప్రభావితుడైన తరువాత అతడును సామాజిక పరిస్థితులకు ఆర్థిక పరిస్థితులకు ప్రాధాన్యమిచ్చుచున్నాడు. ఇప్పుడు అతని అభిప్రాయము ననుసరించి సాహిత్యము జీవనసంఘర్షణకు బ్రతిబింబమే. "ఆయీ నయే మారిఫత్" "ముఖ్తసర్-తారీఖె-అదబె-ఉర్దూ", "నయే అదబీ రుజ్హానాత్" అను మూడు గ్రంథము లిప్పటికి ప్రచురింపబడినవి. ఇంకను ప్రచురింపబడవలసిన గ్రంథములు అనేకములు. వానిలో "ఉర్దూ షాయిరీ పర్ మజ్హబ్‌కా అసర్" అనునది చాల గంభీరమైన విమర్శనాత్మక రచన.

కథాసాహిత్యముననూ గావ్యరచన సందర్భముననూ పేర్కొనబడిన "అఖ్తర్" అన్సారీ మంచి విమర్శకుడు కూడ. "ఇఫాదీ అదబ్" అను పేర అతని లఘు

పుస్తకమొకటి ప్రచురింపబడినది. "అదబీ డాయిరీ" అను పేర ఇంకొక గ్రంథము కూడ ప్రకాశితమైనది. అందు విమర్శనాపద్ధతిని గుఱించిన గంభీర భావములు వెల్లడింపబడినవి. "అఖ్తర్" పేరుగల మఱియొక వ్యక్తి పట్నా కాలేజీ అధ్యక్షుడు. అతనిని గుఱించి ఇదివఱకే వ్రాయబడినది. అతడు వ్రాసిన వ్యాసములు అనేకములు. అవన్నియు తన్ఖీదె-జదీద్" మఱియు "తహఖీఖొ-తన్ఖీద్" అనుపేర రెండు గ్రంథములలో ప్రకాశితములైనవి. అతడు మార్క్సువాదముచే ప్రభావితుడైనవాడే కాని కొంత అభిప్రాయభేదము కూడ కలవాడు.

ఈ నాటి గొప్ప విమర్శకులలో "ఆలె అహమద్ సురూర్" ఒకడు. అతడు లఖ్నో విశ్వవిద్యాలయమున ఉర్దూ భాషాధ్యక్షుడు. ఆంగ్ల, ఉర్దూ సాహిత్యములను కూలంకషముగా అధ్యయనము చేసినవాడు. విమర్శనాపద్ధతులను సమగ్రముగా పరిశీలించిన వాడు. శాస్త్రీయమగు దృక్పథము నలవరచు కొనినవాడు. మొదటినుండియు అతని వ్యాసములు గంభీరమైనవి. ఇతర విమర్శకులవలె అతడును క్రమక్రమముగా మార్క్సు వాదమును ఆచరించెను. శాస్త్రీయ దృక్పథము కలవాడైనను అతని విమర్శ రచనాత్మకము. సారస్వతదృష్టి కలదికూడ. అతని భావములు సతార్కికములు. అయినను అతని శైలిలో అటనట భావుకత గోచరించును. ఆతని ఆంగ్ల సాహిత్యజ్ఞానము అతని విమర్శలకు చాల పుష్టి కలిగించినది. అతడు ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యములను శాస్త్రీయమగు విమర్శనా పద్ధతి ననుసరించి పరిశీలించును. అయినను ప్రతి సాహిత్యమొక ప్రత్యేక సంప్రదాయము కలదను సంగతిని విస్మరించువాడు కాడతడు. ఆ సంప్రదాయమును మూలతత్త్వమే లుప్తమైపోవు విధముగా ఉల్లంఘించు రచయిత తన సాహిత్యమును ఉన్నతమొనర్పజాలడు. సుమార్ శైలి సురుచిరము. సారస్వత గౌరవము కలది. అతని వ్యాస గ్రంథము లెన్నియో ప్రకాశితములైనవి. వానిలో "తన్ఖీదీ ఇషారే", "నయే పురానే చిరాగ్", "తన్ఖీద్ క్యా హై", "అదబ్-ఔర్-నజర్యా" అనునవి ప్రసిద్ధములు. ఇవికాక ఇంకెన్నియో గ్రంథములు ప్రచురింపబడనున్నవి.

క్రొత్త విమర్శకులలో గడచిన ఎనిమిది సంవత్సరముల కాలమున అసాధారణమగు ఖ్యాతి పొందెను. అతనిది కేవలము మార్క్సిస్టు దృక్పథము. ఆ దృక్పథము ననుసరించి సాహిత్యమును గ్రహించుటకు ప్రయత్నించినవాడు ఉర్దూ సాహిత్యమున అత డొక్కడే అనవచ్చును. మార్క్సు వాదుల దృష్టి సంకుచితమైనదను దుష్ప్రథ కలదు. కాని ముమ్తాజ్ హుస్సేన్ వ్యాసములు చదివినచో

అతనిలోని ఉదారత మఱియు విస్తృత జ్ఞానము బోధపడును. విజ్ఞానము, దర్శనము, సమాజ శాస్త్రము మొదలగు సమస్త విద్యలలో ప్రావీణ్యము లేనివారు సరియైన విమర్శ చేయలేరను సంగతి అతని వ్యాసములు చదివిన గాని తెలియును. అయినను అతని భాష అక్కడక్కడ అన్వయ కాఠిన్యము కలది. ప్రౌఢమైనది. "నఖ్దె-హయాత్", "నఖూ ఖ్రదే" అను రెండు వ్యాస సంగ్రహము లతనివి ప్రకాశితమైనవి. ఇంకను చాల రచనలు అచ్చులో నున్నవి.

కొన్ని యేండ్లనుండి డా. ఇబాదత్ బరేల్వీ విమర్శనలో చాల పేరు గాంచెను. అతడుకూడ మార్క్సు వాదముచే ప్రేరణ పొందినవాడే. కాని ఆ సిద్ధాంతములను శాస్త్రీయ విధానమున అంగీకరించినవాడు కాడు. సాహిత్యము సమాజ జీవనముపై ఆధారపడినదని భావించును కాని, అది వర్గ సంఘర్షణకు పరిణామ మని భావింపడు. అతడు అనేక సిద్ధాంతములను సమన్వయపరచును. డా. ఇబాదత్ లఖ్నో విశ్వ విద్యాలయము నుండి పి. ఎచ్. డి. డిగ్రీ పొంది ప్రస్తుతము పాకిస్థాన్‌లో ఉర్దూ లెక్చెరరుగా పనిచేయుచున్నాడు. "ఉర్దూ తన్ఖీద్‌కా ఇర్తిఖా", రవాయత్ కీ అహమియత్", "తన్ఖీదీ జావియే" అను మూడు గ్రంథములు ప్రకాశితములైనవి. ఇంక రెండు గ్రంథములు అచ్చులోనున్నవి.

క్రొత్త రచయితలలో డా. మహమ్మద్ హసన్ కొలదికాలములోనే చాల ప్రఖ్యాతిగాంచెను. అతడు నవలలు, నాటకములు, విమర్శలు మొదలగునవి అన్నియు వ్రాయును. కాని అతని అభిమాన విషయము విమర్శనమే. ఇంతవఱకు "అదబీ తన్ఖీద్" అను ఒక పుస్తకమే అతనిది ప్రకాశితమైనది. అతని గంభీర భావములు, విస్తారమగు విజ్ఞత, తీవ్ర బుద్ధి అతని రచనలో చూడనగును. ఇతర విమర్శకుల వలె అతడును మార్క్సు వాదముచే ప్రభావితుడయ్యెను. కాని సంపూర్ణముగా దానిని స్వీకరించినవాడు కాడు. సామాజిక విశ్లేషణతో పాటు మనస్తత్వ ప్రభావములకును అతడు ప్రాముఖ్యము నిచ్చును. అతని వ్యాసముల విషయము సజీవము-సమున్నతము. అతడును లఖ్నో విశ్వ విద్యాలయము నుండి పి. ఎచ్. డి. డిగ్రీ పొంది అలీఘర్‌లో లెక్చెరరుగా పనిచేయుచున్నాడు.

ఉర్దూ విమర్శకులు చాలమంది మార్క్సు వాదముచే ప్రేరణ పొందినవారు. లేదా సాహిత్య వికాసమును చారిత్రక ప్రగతి ననుసరించి పరిశీలించునట్టి సామాజిక దృక్పథము కలవారు. కొందఱు మాత్రము మనస్తత్వము ననుసరించి విమర్శింతు

వారును కలరు. అట్టివారు సాహిత్యమును లేఖకుని వ్యక్తిత్వమునకు ప్రతిబింబముగా భావింతురు. రచనలను నిర్దిష్టములగు శాస్త్ర సిద్ధాంతముల ననుసరించి విమర్శింప ప్రయత్నింతురు. ఇట్టి విమర్శకులలో కలీముద్దీన్ అహమద్, డా. అహసన్ ఫారూఖీ పేర్కొనదగిన వారు. వారు ఐరోపీయ విమర్శనా శాస్త్రముచే ప్రభావితులు. ఉర్దూ సాహిత్యమును కూడ ఆ శాస్త్రము ననుసరించియే విమర్శింప జూతురు. ఇట్టి విమర్శలో సఫలులు కారు. కనుక చీదరించుకొని తమ ఆదర్శముల ననుసరించి ఈ సాహిత్యమున ఏమియులేదని కొట్టివైతురు. ఈ సందర్భమున మొహమ్మద్ హసన్ అస్కరీని కూడ పేర్కొనవలెను. అతని విమర్శనములు కొంత గాంభీర్యము కలవే. కాని అతడు ఏదో రూపమున సాహిత్యములో మానవ ప్రేమను, అభ్యుదయ భావములను ప్రకటించిన రచయితలను, విమర్శకులను నిందించుటయే తన కర్తవ్యమనుకొనును. అతడు ఫ్రాంసులోని పతనశీల, ప్రతీకవాద రచయితలచే ప్రభావితుడు. అట్టి వాదములే సాహిత్యమునకు మూల తత్త్వము లనుకొనును. అతని వ్యాస సంపుటి, "ఇన్సాన్ ఔర్ ఆద్మీ" అనుపేర కొన్ని దినముల క్రిందట ప్రకాశితమైనది.

స్థలాభావము వలన పలువురు మంచి విమర్శకులు ఇందు ప్రస్తావింప బడలేదు. విఖార్ అజీమ్, డా. అబుల్ లైస్ సిద్దీఖీ, ఖ్వాజా అహమద్ ఫారూఖీని గుఱించి వ్రాయవలసి యుండెను. విఖార్ అజీమ్, "అఫ్సానానిగారీ". "హమారే అఫ్సానే", "నయా అఫ్సానా" మొదలగు అనేక రచనలు చేసినాడు. అతని రచన లన్నియు ప్రజాదరణ పొందినవే. అబుల్ లైస్ సిద్దీఖీ, "లఖ్నో కాదబిస్తానే-షాయిరీ" అను గ్రంథమును మఱికొన్ని గ్రంథములను ప్రచురించినాడు. డా. ఖ్వాజా అహమద్ ఫారూఖీ, "క్లాసికీ-అదబ్". "మీర్ తఖీ మీర్" అను గ్రంథములు వ్రాసినాడు. వీరుకాక డా. నూరుల్ హసన్ హాష్మి, అజీజ్ అహమద్, డా. మసూద్ హుస్సేన్ ఖాన్, ముజ్తబా హుస్సేన్ మఱియు "ఖలీలుర్రహమాన్" వ్రాసిన గ్రంథములు కూడ గంభీరమైనవి.

కొందఱు కేవలము విమర్శలే కాక కళలకు, సాహిత్యమునకు, సంస్కృతికి, రాజనీతికి, మఱి యితర వివిధ విషయములకు సంబంధించిన విషయముల గూర్చి వ్రాసినవారున్నారు. డా. జాకిర్ హుస్సేన్, డా. ఆబిద్ హుస్సేన్, ప్రొ. ముజీబ్, ఖ్వాజా గులాము సయిదీన్ మొదలగువారు ఇట్టివారే. ప్రతిభావంతులగు ఈ రచయితల రచన లన్నియు వారి సమగ్ర జ్ఞానమును, మానవప్రేమను, ఉదార

భావములను వెల్లడించును. వీరు కేవలము సాహిత్యక్షేత్రమునందే కాక భారతదేశపు సాంస్కృతిక, సామాజిక జీవనమునను అత్యున్నతమగు స్థానము కలవారు. వీరందఱును ఉర్దూ గద్య వాఙ్మయమును పరిపుష్టము చేసినవారే. డా. ఆబిద్ హుస్సేన్ రచనలు "హిందూస్థానీ ఖౌమియత్ - ఔర్ - ఖౌమీత హాజీబ్"మఱియు"మజామీనె ఆబిద్" అను పేర ప్రకాశితమైనవి. అవి పరిశోధనాత్మకములు - దార్శనికములు. ప్రొ. ముజీబ్ "రూసీఅదబ్", "దున్యా-కీ-కహానీ" మఱియు "తారీఖెఫల్సఫయే సియాసత్"అను శ్రేష్ఠరచనలు చేసినాడు. గులాముస్సయ్యదీన్"రూహె-తహజీబ్" మఱియు "ఉసూలె తాలీమ్" వ్రాసి ఉర్దూ సాహిత్యమును సమృద్ధము చేసెను.

చిట్ట చివర ఈ గ్రంథ రచయితనగు నేను నన్ను గుఱించి కొన్ని పంక్తులు వ్రాసెదను. ఏలయన మంచియో చెడ్డయో నేనును ఉర్దూ సాహిత్యమునకు కొంత సేవ చేసినవాడను. నేను క్రీ. శ. 1912 వ సంవత్సరమున ఆజమ్‌గఢ్ (ఉ - ప్ర) నందలి ఒక గ్రామములో జన్మించితిని. ఆజమ్‌గఢ్‌లోను అలహాబాదలోను విద్యాభ్యాసము చేసితిని. క్రీ. శ. 1932 నుండి వ్రాయుట ప్రారంభించితిని. కథలు, నాటకములు, కవితలు, మఱి ఇతర విషయములను గురించి వ్రాసినాను. కాని విమర్శనమే నాకు అభిమాన పాత్రమైనది. అందే ఏవేని రచనలు చేయవలెనని ప్రయత్నించితిని. సాహిత్యమును గుఱించిన నా భావములు ఈ గ్రంథము చదివిన వారికి స్పష్టమగును. అయినను మార్క్సువాదమే సర్వశ్రేష్ఠమైన దర్శనశాస్త్రమని భావింతును. దాని సహాయముననే జీవితమును మఱియు జీవన రహస్యములను గ్రహింపజేయగల సత్యము నన్వేషించుటలో విమర్శ మఱియు ఆత్మ విమర్శ అను మార్గమున నడచిన కృతకృత్యులము కాగలమని తలంతును. సాహిత్యమును అర్థము చేసికొనుటలో మార్క్సిస్టు దృక్పథమే అన్నిటికంటె ఉపయోగకరమైనదని నా విశ్వాసము. ఇంతవఱకు ప్రచురింపబడిన నా గ్రంథము లివి :— "వీరానే", (కథల సంపుటి) "హిందూస్థానీ లిసానియాత్‌కా ఖాకా" (భాషాశాస్త్రము) "తన్కీదీజావియే", "రవాయాత్ - ఔర్ - బగావత్", "అదబ్ - ఔర్ - సమాజ్", "తన్కీద్ - ఔర్ అమలీ తన్కీద్", "సముందర్ - ఔర్ - సాహిల్" (అమెరికా మఱియు ఐరోపా యాత్రల వర్ణన)

ఇది ఉర్దూ భాషా సాహిత్యముల వికాసముయొక్క సంక్షిప్త చరిత్ర. ఉర్దూసాహిత్యోన్నతి భారతదేశపుసామాజిక, సాంస్కృతికోన్నతితో సంబంధింపబడి యున్నదని ఈ కథను పరిశీలించినవారు గ్రహింపగలరు. ఉర్దూ సాహిత్యమున

లోపములు, దొసగులు ఉన్నవి. భిన్నములగు ప్రగతి శీలభావములును ప్రతిక్రియా వాద భావములును ఘర్షణపడిన ఘట్టము లున్నవి. ఉర్దూ సాహిత్యము చరిత్రలో మార్పు కలిగినపుడెల్ల అట్టి పరిస్థితులను చిత్రించి, మానవుల ఆశలను, వాంఛలను, స్వప్నములను ఉల్లేఖించినది. వివిధజాతులకు మతములకు సంబంధించిన రచయితలు ఉర్దూ సాహిత్య భాండారమును సమృద్ధ మొనరించినారు. ఉర్దూసాహిత్యము సర్వధా దాస్యమునకు విరుద్ధముగా స్వతంత్రతను, అన్యాయమునకు విరుద్ధముగా న్యాయమును సాంప్రదాయకతకు విరుద్ధముగా ఉదారతను కఠోరతకు విరుద్ధముగా సహృదయతను మఱియు అసమానతకు విరుద్ధముగా సమానతను బలపఱచినది. సాధారణముగా అభ్యుదయ పథమున నడచినది. సామ్రాజ్య పతన కాలమున అది మానవప్రేమ మఱియు వ్యక్తి స్వాతంత్ర్య భావనలను గానము చేసినది. నవయుగములో దేశభక్తి, మానవప్రేమ, స్వతంత్రత, జనతంత్రము మఱియు సామాజిక న్యాయమును ప్రబోధించినది. కనుక భారతదేశ సాహిత్యచరిత్రలో ఉర్దూస్థానము ఉన్నతమైనదని నిశ్చయముగా చెప్పవచ్చును. ఎప్పుడేని ఈ దేశపు సంస్కృతీ సభ్యతల చరిత్ర వ్రాయబడునేని అందు ఉర్దూ సాహిత్యము వలన చాల సహాయము లభించును.



# అనుబంధము I

## కొన్ని పారిభాషిక పదములు

1. షేర్:— సమాన మాత్రలు గల రెండు పంక్తులు కలిసి "షేర్" అనబడును. హిందీ దోహాను లేక చౌపాయీని కూడ షేర్ అనవచ్చును. ప్రతి పంక్తిని వేరు వేర "మిస్రా" అందురు. మూడు పంక్తుల ఛందము "ముసల్లిస్" అనబడును. అట్లే నాలుగు పంక్తులది "మురబ్బా", ఐదు పంక్తులది "ముఖమ్మస్" మఱియు ఆరు పంక్తులది "ముసద్దస్" అనబడును. పంక్తుల సముచ్చయమును "బంద్" అందురు. ఇదికాక నిర్మాణము ననుసరించి ఛందములు "ముసమ్మన్", "ముసమ్మత్", "తర్కీబ్‌బంద్" అని మఱికొన్ని విధముల నుండును. ఈ రూపములలో ఏ విషయమును గూర్చియైనను వ్రాయవచ్చును. ఆంగ్లానుకరణమున పదునాల్గు పంక్తుల "సానెట్లు" కూడ ఉర్దూలో వ్రాయబడినవి.

2. నజమ్:— ప్రతి పద్యమును నజము అనవచ్చును. కాని సాధారణముగా గజలుకాక తక్కిన కవిత లన్నిటిని నజము లందురు. ఈ కాలమున ఏదేని విషయమును గూర్చి నూత్న శైలిలో వ్రాయబడిన పద్యములను నజములను చున్నారు.

3. గజల్:— ఈ అరబీ పదమునకు "స్త్రీలతో సంభాషించుట" అను అర్థము కలదు. అయినను గజలు ఇంతవఱకే పరిమితము కాదు. శృంగార ప్రేమము కాక సూఫీ తత్త్వము, దర్శనశాస్త్రము, దేశభక్తి, నీతి, రాజనీతి మొదలగు విషయములు గజలులో సరళములు, సరసములు మధురములు అగు భావమయ శబ్దములతో వర్ణింపబడును. గజలులలో చాల వఱకు ఆంతరంగిక భావములే ఉల్లేఖింపబడును. ప్రియురాలి సౌందర్య వర్ణన చేయబడును. ప్రతి చరణము (షేర్) సమగ్రమగు భావము కలిగియుండును. అప్పుడప్పుడు గజలులో ఆద్యంతము ఒకే భావము సాగదీయ వచ్చును. గజలులో "గుల్" (గులాబి పుష్పము) "బుల్బుల్" (పారసీ కవుల సమయ సంప్రదాయముల ననుసరించి గూలాబి పుష్పములోని మధువు నాస్వాదించుటకై పుష్పవాటికలో నివసించుచు తీయగా పాటలు పాడునట్టిపక్షి విశేషము) "చమన్"(ఉద్యానము) "ఖపస్" (పంజరము–బందిఖానా) మొదలగునవి

ప్రతీకలుగా ఉపయోగింపబడును. గజలులోని మొదటి చరణమును "మత్లా" (ఉదయించుచోటు) అందురు. చివరి చరణమును "మఖ్తా" అందురు. అందు కవి తన పేరు (తఖల్లుస్ అనబడు కలము పేరు) తెల్పుకొనును. ప్రతి చరణమున మొదటి చరణపు అంత్య ప్రాస (రదీఫ్, ఖాఫియా) పాటింపబడును. (మొదటి చరణమగు 'మత్లా' యొక్క రెండు పంక్తులును అంత్యప్రాస నియమము కలవి. తరువాతి చరణములలో మొదటి పంక్తులకు ఆ నియమము లేదు కాని రెండవ పంక్తులకు అవసరము).

దాని స్వరూపమిట్టిది :—

(1) a ............ జో గయా హై (b) .........రోగయా హై

(2) b ............ దిల్ కా జానా (b) .........హోగయా హై

(3) c ............ ఆహిస్తా బోలో (b) .........సోగయా హై

4. ఖసీదా:— ధార్మికవ్యక్తి, రాష్ట్రీయ నాయకుడు, పాదుషా లేక ఎవరేని ఒక మహాపురుషుని ప్రశంసించుచు వ్రాయబడిన కవిత ఖసీదా అనబడును. దీని ప్రారంభమున ప్రస్తావన రూపమున ఏ విషయమును గూర్చి యైనను వ్రాయవచ్చును. కాని దానికి ప్రశంసతో సంబంధము ఉండవలెను. (సాధారణముగా ఋతు వర్ణన లేక ప్రకృతి వర్ణన చేయబడును.) దీనిరూపము గజలు వంటిదే కాని ఇందు భావము క్రమబద్ధమైనది. ఖసీదాల భాష సాధారణముగా కఠినము, ప్రౌఢము మఱియు కృతకము.

5. హజో:— ఒక వ్యక్తిని, లేదా సంస్థను, లేదా సమాజమును నిందించిన పద్యము హజో అనబడును. ఇందు పరిహాసముతోపాటు క్రోధాసహ్య భావములు ప్రకటింపబడును. దీనికెట్టి నియమిత రూపమును లేదు.

6. మస్నవీ :— క్రమబద్ధమగు ఏదేని కథను సుదీర్ఘముగా వర్ణించు కవిత లేదా ఏదేని ఒక విషయమును సుదీర్ఘముగా వర్ణించు కవిత మస్నవీ అనబడును. ఇది హిందీలోని ప్రబంధ కావ్యముతో సామ్యము కలది. (ఇందు ప్రతి చరణములోని రెండు పంక్తులకు అంత్యప్రాస నియమముండును. ఏ చరణమున కాచరణమే ఈ నియమము కలిగి యుండును.)

దీని రూప మిట్లుండును :—

(1) a .......... దర్యాయె హుస్న్ b. .......... దారాయె హుస్న్

(2) a .......... ఇక్ నాజ్ సే b. .......... అందాజ్ సే.

(3) a .......... తమామ్ b. .......... అజ్దహామ్.

7. మర్సియా :— మృతులైన వారిని ప్రశంసించుచు కరుణారస ప్రధానముగా వ్రాయబడిన కవిత మర్సియా. మర్సియాలు ఎవరిని గుఱించి యైనను వ్రాయ వచ్చును కాని, సాధారణముగా ఉర్దూలో ముసల్మానుల ప్రవక్త మనుమడగు ఇమామ్ హుస్సేన్ మఱియు అతని కుటుంబము వీరమరణ మొందిన విషాద గాథను పురస్కరించుకొనియే వ్రాయబడినవి. "యజీద్" సైనికులు అతి కౄరముగా ఇమామ్ ఆప్తులను, పిల్లలను, బంధుగులను మూడు దినముల వఱకు ఆకలి దప్పులకు అలమటింప జేసి అంత మొందించిరి. రాణి వాసమును దోచుకొని బంధించి దాసీలుగా చేసిరి. మర్సియాలలో ఈ విషయములే వర్ణింపబడినవి. ఆరంభమున మర్సియాలకు నియమిత రూప మేదియు లేకుండెను. కాని ఇప్పుడు సాధారణముగా ముసద్దసుల (ఆరు పంక్తుల ఛందము) రూపమున వ్రాయుచున్నారు. కర్బలా దర్ఘటనలను గుఱించి తెల్పునట్టి ఏదేని గ్రంథమును చదివిననే మర్సియాలను గ్రహింపవచ్చును.

8. వాసోఖ్త్ :— ఇట్టి కవితలో ప్రేయసుడు ప్రేమ జీవనపు కష్టములకు బాధలకు జడిసి ప్రేయసిని ఉపాలంభించును. అతడు సాధారణముగా ఇట్లనును. "నీ లోని సౌందర్యమును నేనే అన్వేషించి మొట్టమొదట ప్రేమించితిని. ఇప్పుడు నీవు అన్యాసక్త వయినట్లున్నావు. నేనును ఇంకెవరినైన ఆశ్రయింతును."

9. రేఖ్తీ :—స్త్రీ సహజమైన భాషలో స్త్రీలకు సంబంధించిన విషయముల నుల్లేఖించుట రేఖ్తీ - ఇందు స్త్రీల సాంసారిక జీవనము మఱియు సామాజిక బంధనములు వర్ణింపబడును. ఈ వర్ణన అందందు అశ్లీలమగును. ఇట్టి రేఖ్తీ చదువుట వలన భాషా విషయములు చాల తెలియును. సాధారణముగా ఇవి గజలుల రూపముననే వ్రాయబడును. అప్పుడప్పుడు ఇతర రూపములలోను వ్రాయుట కద్దు.

10. రుబాయీ :—ఒక భావమును నాలుగు పంక్తులలో ప్రకటించిన అది 'రూబాయీ' అగును. ఇందు వివిధ భావములు ప్రకటింపవచ్చును. కాని సాధారణ

ముగా తాత్త్విక భావములే ప్రకటితములగును. 'రుబాయీ' తో సామ్యము గలదే 'ఖితా'. ఇది నాల్గు పంక్తులను మించియు ఉండవచ్చును. రుబాయీ రూపమిది.

(1) .........నజర్ హోతీహై (2) .........ఖబర్ హోతీహై

(3) .........హోంగేఇక్‌దిన్ (4) .........సహర్ హోతీహై

(ఇందు 1, 2, 4 చరణములకు అంత్య ప్రాస నియమము కలదు. 3 వ చరణమునకు లేదు.)

ఖితా రూపము గజలు వంటిది – అప్పుడప్పుడు గజలులోను 'ఖితాబంద్' పంక్తులు రావచ్చును.

11. దీవాన్ :—సాధారణముగా గజలుల సంగ్రహమును 'దీవాన్' అందురు. ఇందు పూర్వము (కొన్నియెడల ఇప్పుడు కూడ) గజలులు అంతిమాక్షరాను క్రమమున వ్రాయబడెను. ఇట్టి అంతిమాక్షరమును 'రదీఫ్' అందురు. ఇట్లు గజలులను దీవానులో అన్వేషించుట సుకరమగును. ఏ కవి దేని సమస్త రచనల సంగ్రహమును "కుల్లియాత్" అందురు. సాధారణముగా ఈ రెండు శబ్దములును ఒకే అర్థమున సుప్రయుక్తము అగుచున్నవి.

12. తజ్కిరా :—కవుల సంక్షిప్త జీవిత చరిత్ర మఱియు వారి కవితల మచ్చు తునకలు కల గ్రంథము "తజ్కిరా" అనబడును. ఈ తజ్కిరాలు విమర్శనాత్మకములు కావు. కాని సాహిత్య చరిత్ర వ్రాయుటకు ఇవి ఎంతయో తోడ్పడును. ఉర్దూ కవుల తజ్కిరాలు చాలవఱకు ఫారసీలోనే వ్రాయబడినవి.



# అనుబంధము - II

## సహాయక గ్రంథములు

ఇది సహాయక గ్రంథముల సంక్షిప్త సూచిక - ఇందు సాహిత్యపు మూల రచనల పేర్లు ఈయబడలేదు.


1. అందాజే ... రఘుపతీసహాయ 'ఫిరాఖ్'గోరఖ్‌పూరీ.
2. అదబ్ ఔర్ జిందగీ ... మజ్నూ గోరఖ్‌పూరీ.
3. అదబ్ ఔర్ ఇన్ఖిలాబ్ ... అఖ్తర్ రాయెపూరీ.
4. అదబ్ ఔర్ నజ్రియా ... ఆలె అహమద్ "సురూర్".
5. అదబ్ ఔర్ సమాజ్ ... ఎహతిషామ్ హుస్సేన్.
6. అదబియాతె ఫారసీ మే హిందు వోంకా హిస్సా ... డా. మ. ము. అబ్దుల్లాహ్.
7. అఫ్సానా ... మజ్నూ గోరఖ్‌పూరీ.
8. అర్బాబె-నస్రె-ఉర్దూ ... సయ్యద్ మొహమ్మద్.
9. ఆబె-హయాత్ ... మో. మొహమ్మద్ హుస్సేన్ 'ఆజాద్'
10. ఇన్తిఖాదియాత్ II Part ... నియాజ్ ఫతెహపూరీ.
11. ఉర్దూకే-అసాలీబె-బయాన్ ... డా. మొహియుద్దీన్ "జోర్".
12. ఉర్దూయె ఖదీమ్ ... షమ్సుల్లాహ్ ఖాదిరీ.
13. ఉర్దూకీ ఇష్కియా షాయిరీ ... రఘుపతీసహాయ 'ఫిరాఖ్' గోరఖ్‌పూరీ.
14. ఉర్దూ గజల్ ... డా. యూసుఫ్ హుస్సేన్ ఖాన్.
15. ఉర్దూ జబాన్-వ-అదబ్ ... స. జామిన్ అలీ.
16. ఉర్దూమే డ్రామానిగారీ ... బాదుషాహ హుస్సేన్.
17. ఉర్దూ తన్ఖీద్ కా ఇర్తిఖా ... డా. ఇబాదత్ బరేల్వీ.
18. ఉర్దూ తన్ఖీద్ పర్ ఏక్ నజర్ ... కాలీముద్దీన్ అహమద్.
19. ఉర్దూమస్నవీకా ఇర్తిఖా ... అబ్దుల్ ఖాదిర్ సర్వరీ.
20. ఉర్దూ షాయిరీపర్ ఏక్‌నజర్ ... కలీముద్దీన్ అహమద్.

21. ఉర్దూ షహపారే ... డా. మొహియుద్దీన్ "జోర్"
22. ఖుతుబాతె గార్సాందతాసీ ... గార్సాం దతాసీ.
23. జదీద్ ఉర్దూ షాయిరీ ... అబ్దుల్ ఖాదిర్ సర్వరీ.
24. తారీఖె-అదబె-ఉర్దూ ... రామ్‌బాబూ సక్సేనా.
25. తారీఖె-జబానె-ఉర్దూ ... డా. మసూద్ హుస్సేన్ ఖాన్.
26. తన్ఖీద్ ఔర్ అమలీ తన్ఖీద్ ... ఎహతెషామ్ హుస్సేన్.
27. తన్ఖీద్ క్యా హై ... అలె అహమద్ "సురూర్".
28. తన్ఖీదీ జాయెజే ... ఎహతెషామ్ హుస్సేన్.
29. తన్ఖీదీ హాషియే ... మజ్నూ గోరఖ్‌పూరీ.
30. తరఖ్ఖీ పసంద్ అదబ్ ... అజీజ్ అహమద్.
31. తరఖీ పసంద్ అదబ్ ... అలీ సర్దార్ జాఫరీ.
32. దాస్తానె-తారీఖె-ఉర్దూ ... హామిద్ హసన్ ఖాదిరీ.
33. దకన్ మే ఉర్దూ ... నసీరుద్దీన్ హాష్మీ.
34. దిల్లీకా దబిస్తానె షాయిరీ ... డా. నూరుల్ హసన్ హాష్మీ.
35. నయా అఫ్సానా ... విఖార్ అజీమ్.
36. నాటక్ సాగర్ ... మొహమ్మద్ ఉమర్ నూర్ ఇలాహీ.
37. నావిల్‌కీ తారీఖ్ ఔర్ తన్ఖీద్ ... అలీ అబ్బాస్ హుస్సేనీ.
38. నయే అదబీ రుజ్హానాత్ ... డా. ఏజాజ్ హుస్సేన్.
39. నయే పురానే చిరాగ్ ... ఆలె అహమద్ సురూర్.
40. మఖాలాతె-గార్సాం ద తాసీ ... గార్సాం-ద-తాసీ.
41. మఖాలాతె-షీరానీ ... హాఫిజ్ మహమూద్ షీరానీ.
42. మదారిస్ మే ఉర్దూ ... నసీరుద్దీన్ హాష్మీ.
43. ముఖ్తసిర్-తారీఖె-అదబె-ఉర్దూ ... డా. ఏజాజ్ హుస్సేన్.
44. ముఖద్దమాతె-అబ్దుల్‌హఖ్
II part ... అబ్దుల్ హఖ్
45. ముఖద్దమయె-షేరో-షాయిరీ ... మౌలానాహాలీ.
46. మువాజినయే-అనీసొ-దబీర్ ... మౌలానాషిబ్లీ.
47. రవాయత్ ఔర్ బగావత్ ... ఎహత్‌షామ్ హుస్సేన్
48. లఖ్నోకా దబిస్తానె షాయిరీ ... డా. అబుల్‌లైస్ సిద్దీఖీ.

49. షేరుల్ హింద్ 2వ భాగము ... అబ్దుస్సలామ్ నద్వీ.
50. హమారీ షాయిరీ ... సయ్యద్ మసూద్ హసన్ రిజ్వీ.
51. హమారే అఫ్సానే ... విఖార్ అజీమ్.
52. హిందూస్థానీ ఖౌమియత్ ఔర్ ఖౌమీ తహజీబ్ ... డా. ఆబిద్ హుస్సేన్.
53. హిందూస్థానీ లిసానియాత్ ... డా. మొహియుద్దీన్ 'జోర్'.
54. హిందూస్థానీ లిసానియాత్ కా ఖాకా ... ఎహతెషామ్ హుస్సేన్.
55. Famous Urdu Poets and Writers ... *Sir Abdul Qadir*:
56. Influence of English on Urdu Literature ... *Dr. Abdul Latif*.
57. Some Characteristic & Tendencie of Modern Urdu Poetry ... *Dr. Mohan Singh 'Diwana'*.
58. Spirit and Substance of Urdu Prose under the Sir Saiyed ... *Dr. S. M. Abdullah*.
59. Urdu Literature ... *Dr. Graham Bailey*.
60. Urdu Literature ... *Dr. Mohan Singh 'Diwanac'*
61. షేరో-షాయిరీ (హిందీ) ... అయోధ్యా ప్రసాద్ గోయలీయ.
62. షేరో-సుఖన్ (హిందీ) ... అయోధ్యా ప్రసాద్ గోయలీయ.